# సంకీర్తనా జ్యోతి

# SANKEERTHANA JYOTHI

(తాళ్ళపాక సంకీర్తనాచార్య రత్నత్రయం)

అన్నమాచార్య - పెదతిరుమలాచార్య - చినతిరుమలాచార్య



డా. పొన్నా లీలావతి

ఎం.ఎ., పిహెచ్.డి.



పొన్నా పబ్లికేషన్స్

పానకం - 517 503

1996

సంకీర్తనా జ్యోతి

పొన్నా పబ్లికేషన్స్—5

ప్రథమ ముద్రణ—1996

వెల : రూ. 100/-



ప్రతులకు :

నవోదయ బుక్ హౌస్
3-3-865
ఆర్యసమాజ్ మందిర్‌కు ఎదురుగా
కాచిగూడ
హైదరాబాదు—600 027

డా. పొన్నా లీలావతి
లెక్చరర్
దేశిసాహిత్యశాఖ
తెలుగు విశ్వవిద్యాలయం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు—533 124

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435,
బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు—500 001

పి. పార్వతి
పానకం గ్రామం—517 503
(వయా) తిరుచానూరు
తిరుపతి (మండలం)
చిత్తూరు జిల్లా

ముద్రణ : త్రివేణి ప్రింటర్స్,
తాడితోట, రాజమండ్రి—3

ముఖపత్ర చిత్రణ : శ్రీ చంద్రశేఖర్ (టి.టి.డి)

ముఖపత్ర ముద్రణ :
బాక్స్ ప్రెస్, రాజమండ్రి.

# అంకితం



చేకొనుమా ఈ జ్యోతి - సంకీర్తనా జ్యోతి ॥

నను కాపాడే నలిన దళేక్షణ
అనుదిన ధ్యానము నీవే కావా ॥

వ్రతములు తపములు నే జేయలేదు
విధియే వ్రతముగ నే జేయుచుంటిని ॥

వెన్నెల పోలిన చల్లని నీ దయ
నాపై కురిసిన చాలును దేవా ॥

శైశవాదిగ నీ శుభనామమే
దురితము బాపెను దశరథ రామా ॥

సత్కృతి చేయ చతురత నొసగుము
వీడని మమతవై మదిలో నుండుము ॥

భారము నీదె భాగ్యము నీదె
జీవన రథమును నడిపే స్వామీ ॥

## శ్రీమతే రామానుజాయ నమః



హరిమతమును ఉద్ధరింప ఆళ్వారుగ జనించిన సౌమిత్రీ
కరుణామృత హృదయ సత్వశోభిత మూర్తీ ॥

ఆసేతు హిమాచలమంతా భక్తితో సంచరించి
విష్ణుపూజలు క్రమముగ కొనసాగించి
భక్తుల నీరాజనాలు ప్రీతిగా స్వీకరించి
మోక్షము దయచేసిన మాన్యశ్రీ రామానుజ స్వామీ ॥

స్త్రీపురుష పక్షము లేక కులగోత్రము భేదము లేక
జనులందరి నాదరించి వాత్సల్యసుధను పంచినారు
మోకాళ్ళకు గుడ్డలుచుట్టి తిరుమలకొండ మెట్లను ఎక్కి
స్వామికి శంఖచక్రా లందించి విష్ణుమూర్తిగ నిరూపించినారు ॥

కంచి వరదుని శ్రీరంగనాథుని ఆదరణకు పాత్రమైనారు
విష్ణుతత్వ గ్రంథాలు వెలయించినారు విష్ణువే విశిష్టుని చాటినారు
గోదాకు సోదరుడై నెలసినారు, సెల్వపిళ్ళనాంచారుల పెండ్లి జరిపినారు
మూర్ఖమతులకు బుద్ధిగరపినారు, మహితతేజము మహిలో నింపినారు॥

ఆచార్యపరంపర కాదర్శమైనారు, అన్నమయ్యచే సంస్తుతి కెక్కినారు
సర్వులకు నామమహిమ చాటినారు, గురువులకే జ్ఞానబోధ చేసినారు
సద్గురుసేవలో వినయము చూపినారు, స్వామిచే మోక్షాధికారము
పొందినారు
ఆళ్వారులలో అగ్రగణ్యులైనారు ఆచంద్రార్కము కీర్తిగాంచినారు



శ్రీమతే గోపాలాచార్యాయ నమః



శ్రీ సద్గురు కుంజమూరు గోపాలాచార్య !
ఆజన్మ బ్రహ్మచర్య శ్రీరామ భక్తశేఖరా !

బ్రాహ్మణ పట్టున మీరు మణిభూషణమై ప్రకాశించి
భక్తజనుల నుద్ధరించ సదో్బధలు చేసినారు
శ్రీరంగనాథ సేవలో మీ జన్మము తరియించెను
రామ భజన యజ్ఞములో మీ గళము పరవశించెను ॥

స్త్రీ పురుష భేదము విడిచి తామసము పరిహరించి
సత్వగుణము నేర్పించి మహిమలెన్నో చూపినారు
జనావళికి ఆర్తుల బాపి ఆహ్లాదము సమకూర్చినారు ॥
జంతు బలులు నిషేధించి కారుణ్యము నెలకొల్పినారు ॥

7

మీ కమలాయత లోచనాలు వెదజల్లును దివ్యదీపు లు
మీ సుమధుర భాషణాలు వెలిగించును జ్ఞానజ్యోతులు
మీ రూపము శాంతి తేజము మీ హాసము కర్పూర పుంజము
మీదర్శనమే మాకు భాగ్యము మీ నిలయమె వైకుంఠ తుల్యము



# వందన హరిచందనం

కీర్తనకు "కృాత సంశబ్దనే" కీర్తించేది కీర్తనం అని, సంకీర్తనకు "సమ్యక్ కీర్తనమ్ సంకీర్తనం" అని వ్యుత్పత్తి. అవాఙ్మానస గోచర మైన దివ్యశక్తిని కీర్తించి పాడేది కీర్తనం లేక సంకీర్తనం అయింది. గేయమానమైన సంకీర్తనమే భక్తుని హృదయాన్ని పరమాత్మ పాద సన్నిధికి సులభంగా తీసుకొనిపోతుంది.

నవవిధ భక్తిమార్గాల్లో కీర్తనం కూడా ఒకటి. ఈ కలియుగ ప్రజలు త్రేతాయుగంనాటి ప్రజల్లాగా పరమాత్మ అనుగ్రహానికి తపస్సులు, యజ్ఞ - యాగాదులు, ద్వాపరయుగంనాటి ప్రజల్లాగా క్రతువులు, కర్మకాండలు చేయనక్కరలేదు. ఏ ప్రయాసలు, తపనలు, ఖర్చులు లేకుండా ఆదిదేవుడు, యుగదైవం అయిన శ్రీహరిని చిత్త శుద్ధిగా నామసంకీర్తన చేస్తే చాలు. అందుకే "నామ సంకీర్తనమ్ యస్య సర్వపాప వినాశనమ్" అనే సూక్తి ప్రసిద్ధిగాంచింది.

ఈ సంకీర్తనా వాఙ్మయాన్ని లక్షణ బద్ధంగా రచించిన తొలి తెలుగు సంకీర్తనాచార్యుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. శృంగార, అధ్యాత్మ పరంగా స్వామి లీలల్ని కీర్తిస్తూ వేలాది సంకీర్తనా జ్యోతులను వెలిగించిన పరంజ్యోతి స్వరూపుడు అన్నమయ్య.

మానవులకు మేలైన రుచులను ఇవ్వడానికి, జన్మబంధాల్ని తొలగించడానికి, వేలాది నరక కూపాల నుంచి బయటపడటానికి, దారిద్ర్యదోషం పోవడానికి, కల్మషమైన కటిక చీకట్లు పారద్రోల డానికి హరినామ సౌఖ్యమనే అమృతం, హరినామమనే బంగారు పర్వతం, హరినామమనే దీపం, శ్రీ వేంకటేశ్వరుడనే భూలోక కల్ప వృక్షం, ఆ స్వామి దాసుల కరుణ ఇది ఒక్కటి చాలదా అంటూ—

చాలదా హరినామ సౌఖ్యామృతము దమకు
చాలదా హితవైన చవులెల్లనొసఁగ ॥
ఇది యొకటి హరినామ మింతైనఁ జాలదా
చెదరకీ జన్మముల చెఱలు విడిపించ
మది నొకటె హరినామ మంత్రమది చాలదా
పదివేలు నరక కూపముల వెడలించ ॥ (1-52)

అనే సంకీర్తన వెలయించాడు. అన్నమయ్య హరినామాన్ని స్తుతిస్తూ వ్రాసిన సంకీర్తనలు తామర తంపరలుగా కనిపిస్తాయి. సంకీర్తన పరబ్రహ్మమయింది. బాధలనుతొలగిస్తుంది. సంతోషమయింది. సంతాపాన్ని పోగొట్టుతుంది. ప్రాణుల్ని రక్షిస్తుంది. గజరాజును రక్షించింది. సామవేదంకన్నా అధికమయింది. అందరికీ సన్నిహితమయింది. యముని బాధనుండి విడిపిస్తుంది. సమతా బుద్ధిని కలిగిస్తుంది. బ్రహ్మముఖంలోనిది, హైమవతి స్మరించేది నాలుకకు చల్లనయింది. శాశ్వత సంపదల నిస్తుంది. ఏదీ సాటిలేనిది అయిన వేంకటేశ్వరుని సన్నుతించే సంకీర్తనం సామాన్యమయింది కాదని, ఎల్లప్పుడూ స్మరించండి. వేగంగా తలవండి అంటూ-

చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడఁగించు సంకీర్తనం ॥
సంతోషకరమైన సంకీర్తనం
సంతాపమణఁగించు సంకీర్తనం
సంతతముఁ దలఁచుఁడీ సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం ॥ (1-343)

అనే సంకీర్తన రచించి లోకానికి నామసంకీర్తనను, విష్ణుభక్తిని చాటాడు. అన్నమయ్య పన్నెండవ శతాబ్దంలో వెలసిన ఆళ్వారుల

విశిష్టాద్వైత మత సిద్ధాంతాల్ని, విష్ణుభక్తి తత్త్వాన్ని, సర్వమానవ సమతా వాదాన్ని సంకీర్తనల్లో పొందుపరచాడు.

అన్నమయ్య కుమారుడు పెదతిరుమలయ్య తండ్రిగారి అడుగు జాడల్లో నడిచి ఆయన ఆదేశం మేరకు శ్రీ వేంకటేశ్వరుని ముద్రాంకితంగా శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. పెదతిరుమలయ్య కుమారుడు చినతిరుమలయ్య తాత-తండ్రుల రాజమార్గంలోనే పయనించి శృంగార, అధ్యాత్మ సంకీర్తనల్ని స్వామి ముద్రాంకితంగానే రచించాడు. పెదతిరుమలయ్య, చినతిరుమలయ్యలు అన్నమయ్యవలె వేలాది సంకీర్తనలు రచించకపోయినా భావుకత్వంలో, భాషారీతిలో, రచనా విధానంలో, శైలీ రమ్యతలో అన్నమయ్య సంకీర్తనల సాదృశ్యాన్నే కలిగివున్నాయి.

'పన్నగ పెద తిరుమలయ్య పదమున తెలుగున్" అని పెదతిరుమలయ్య తెనాలి రామకృష్ణ వికటకవిచే ప్రశంసింపబడివుండటం విశేషం. చినతిరుమలయ్య అష్టభాషల్లో దండకం వ్రాయడంవల్ల అష్టభాషా చక్రవర్తిగా ప్రసిద్ధిగాంచాడు. అన్నమయ్య సంస్కృత భాషలో రచించిన సంకీర్తన లక్షణ గ్రంథాన్ని ఈ చినతిరుమలయ్యే తెలుగులోకి అనువాదం చేశాడు. అందులో అన్నమయ్య సంకీర్తనలను వేదాలుగా; పురాణాలుగా, సరస్వతీ వీణానాదాలుగా కీర్తించి, వాటిని విన్నంతనే పాపరాసులు పటాపంచలౌతాయని ఫలశ్రుతిఫలాన్ని కూడా పేర్కొన్నాడు. ఒకే కుటుంబంలో మూడు తరాలవరకు స్వామిసేవ, సాహిత్యసేవ చేసిన భాగ్యం ఒక్క తాళ్ళపాక వంశానికే దక్కింది. తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిక్కమ్మ కూడా అన్నమయ్య అర్ధాంగియే కావడం మరో విశేషం. అత్యంత భక్తి శ్రద్ధలతో, కోట్లాదిగా ఖర్చు చేసి ఈ పుణ్యమూర్తుల రచనల రాగి రేకుల్ని వెలికి తీయించి, శుద్ధిచేయించి, పండిత శ్రేష్ఠులచే పరిష్క

తింపజేసి, గ్రంథాల కెక్కించి, వివిధ కార్యక్రమాలద్వారా దేశ, దేశాంతరాల్లో వ్యాపింపజేస్తున్న ఘనత శ్రీ తిరుమల తిరుపతి దేవ స్థానం వారికే దక్కింది. అన్నమయ్య సంకీర్తనలకు మొట్టమొదటి సారిగా విశ్వవిద్యాలయ స్థాయిలో పాఠ్యాంశబోధనపరిశోధనా మహా భాగ్యాన్ని కలిగించి మాలాంటి విద్యార్థులకు సంకీర్తనాభ్యాస దివ్య వరాన్నిచ్చి వివిధ విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకులు కాగల్గిన అపూర్వ ఘనత శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తెలుగు అధ్య యనశాఖ మాజీ అధ్యక్షులు, మాజీ ఉపాధ్యక్షులు భక్తి జ్ఞాన సంప న్నులు, వాత్సల్య హృదయులు, సంగీతాభిలాషులు ఆచార్య జి.యన్. రెడ్డిగారికే దక్కింది.

తాళ్ళపాక కవుల సంకీర్తనల్ని చదవడం వేద-శాస్త్ర-పురాణ-రామాయణ-భారత-భాగవత-భగవద్గీతాది పవిత్ర విజ్ఞానగ్రంథాల్ని సులభరీతిలో అధ్యయనం చేయడం లాంటిది. అదొక పూర్వ జన్మ సుకృత ఫల విశేషం, అందుకే నా తండ్రి అత్యంత పట్టుదలతో, ఆసక్తితో నాముందుకు తీసుకొని వచ్చిన అధికార, హోదాల్ని చేకూర్చే ఐ.ఎ.యస్. విద్యావకాశాన్ని కూడా పట్టుదలగా నిరాక రించి ఇహపర సుఖశాంతుల్నిచ్చే సంకీర్తనా వాఙ్మయాన్ని ప్రీతితో స్వీకరించాను.

బాల్యంలో తాత తండ్రులు సంకీర్తనా శ్రవణం, ఎం.ఎ.లో సంకీర్తనాభ్యాసం, పిహెచ్.డి.లో సంకీర్తనా పరిశోధన చేసిన నాకు అప్పుడప్పుడూ దైవానుగ్రహం వల్ల సంకీర్తనల్లోని సాహితీ విశేషా లకు సంబంధించిన కొన్ని అంశాలు తళుకులల్లా స్ఫురిస్తుంటాయి తీరిక సమయాల్లో, మనసు ప్రేరేపించిన వేళల్లో, తప్పనిసరిగా వ్రాయ వలసిన పరిస్థితుల్లో ఆ అంశాలకు సంబంధించిన వ్యాసాలు వ్రాస్తుం టాను. పూర్తిచేసిన ఒక్కొక్క వ్యాసమే స్వామికి వెలిగించిన

ఒక్కొక్క దివ్యజ్యోతిగా అక్షర హారతిగా భావన కలుగుతూంటుంది. అందువల్ల ఈ వ్యాస సంపుటికి "సంకీర్తనా జ్యోతి" అని నామకరణం చేశాను. వర్తమాన, భావితర విద్యార్థులకు, పరిశోధకులకు, సంకీర్తనా సాహిత్యాభిమానులకు, భక్తి సంగీత ప్రియులకు ఆరని అఖండ జ్యోతిలా నిత్యనూత్న భక్తిజ్ఞాన కాంతుల్ని ప్రసరింప జేయాలని, చిత్తశాంతి చేకూర్చాలని నా అభిలాష.

ఇందులోని వ్యాసాలు వివిధ పత్రికల్లో వివిధ సందర్భాల్లో ముద్రించబడినవి కొన్ని ఆకాశవాణి కేంద్రాల నుంచి ప్రసారం అయినవి కొన్ని, విశ్వవిద్యాలయ జాతీయ సదస్సుల్లో సమర్పించినవి కొన్ని ఉన్నాయి. ఆయా పత్రికా సంపాదకులకు, ఆకాశవాణి అధికారులకు. విశ్వవిద్యాలయాధికారులకు, సాహితీ సభలకు ఆహ్వానించే వివిధ ప్రాంతాల సాహితీ సంస్థల పెద్దలకు, భక్తి, జ్ఞాన సంపన్నులకు, సహృదయ పాఠకులకు, సహృదయ శ్రోతలకు సదా కృతజ్ఞురాలిని.

గతంలో నా పిహెచ్ డి. సంపుటికి, అన్నమయ్య సంకీర్తనల్లో స్త్రీ ధర్మాలు అనే గ్రంథానికి, పదకవితా వైజయంతికీ టి.టి.డి. వారి ఆర్థిక సహాయం లభించడంవల్ల పనులు సులభసాధ్యమయ్యాయి. రెండుసార్లు గ్రంథ ముద్రణకు ఆర్థిక సహాయం పొందినవారికి తిరిగి ఆర్థికసహాయం పొందే అవకాశం లేదంటూ టి.టి.డి. వారు, ఒక్కసారి ఆర్థిక సహాయం పొందిన తర్వాత తిరిగి ఐదు సంవత్సరాల వరకు దరఖాస్తు చేయడానికి వీలులేదంటూ తె.వి. వారు ఇటీవల కొత్త నిబంధనలు ప్రవేశపెట్టడం వల్ల ఈ జ్యోతికి ఇరువైపుల నుంచీ ఆర్థిక సహాయ భాగ్యం లభించలేదు.

ఏ పనికైనా వ్యక్తి ప్రయత్నమే కాక దైవానుగ్రహం కూడా వుండాలి. ఏమి చేయాలో తోచక, గ్రంథ ముద్రణను ప్రక్కకు నెట్టడం మనస్కరించక "కిం కర్తవ్యమ్" అంటూ సుదీర్ఘాలోచన సాగ

రంలో మునిగివున్న నాకు "అనుభవిస్తున్నది మాత్రం అరవింద నేత్రుని ఆస్తి కాదా" అని నా అంతరాత్మ హెచ్చరిక చేసింది. సంకల్ప బలం, దైవ ప్రేరణావల్ల అంతదాకా ఆపి వేయబడిన జీతం ఎరియర్స్ దాచిపెట్టిన ధనంలా విడుదలై నా ముందుకు వచ్చింది.

ఆలస్యం చేస్తే ఐహిక లంపటాలకు ఈ ధనం ఖర్చు అయిపోతుందంటూ ఆరితేరిన పెద్దల్లా మా చెల్లాయిలు హెచ్చరిక చేసి వెంటనే గ్రంథ ముద్రణా సత్కార్యానికి వన్ను పూనించారు. గతంలో మూడు గ్రంథాలు ముద్రించడం వల్ల ఆ కష్టం ఎంతటిదో బాగా తెలిసివచ్చింది. "పెండ్లి చేసి చూడు, ఇల్లు కట్టి చూడు" అనే పెద్దల లోకోక్తి గుర్తుకు వచ్చింది. దానికి "పుస్తకం ప్రింటు చేసి చూడు" అనే పంక్తి కూడ జోడిస్తే పరిపుష్టిగా వుంటుందనిపించింది. పుస్తక ముద్రణా యజ్ఞ కార్య భారకులుగా నా సోదరీ ద్వయం పార్వతీ భారతీలు అహర్నిశలు శ్రమించారు. స్వస్థలం నుంచి జననీ జనకులు, ఇంకా వున్న సోదర సోదరీ బృందం ప్రోత్సాహక లేఖలు వ్రాస్తూ నాకు సరికొత్త బలాన్ని చేకూర్చుతూ నాలోని కార్య దీక్షా రేఖను కుంటుపడనివ్వకుండా చక్కగా సాగించారు. ఇలా సంకీర్తనా జ్యోతిని గ్రంథరూపంగా వెలిగించడానికి దోహదకారులైన నా కుటుంబ సభ్యులపై ఆ వైకుంఠనాథుని కరుణామృతపు దృక్కులు నిరంతరం ప్రసరించాలని, ఆ స్వామివారి మంగళాశీస్సులు సదా లభించాలని నా సంప్రార్థన.

సంకీర్తనా వాఙ్మయంపై నేను సాగిస్తున్న పరిశోధనకు ముగ్ధులై ఎంతో వాత్సల్య - మమకార - ప్రేమలతో ఎందరో సహృదయులు, ఎందరో పండిత-పరిశోధక-విమర్శకాగ్రేసరులు, అన్నమయ్య సంకీర్తనా సంగీత - సాహిత్య - భక్తిప్రియులు ముఖాముఖిగాను, ఓర్పుతో ఉత్తరాలద్వారాను, నాలోని పరిశోధనాసక్తిని ఉద్దీపింప

చేశారు. అక్షర మాలలతో ఆనంద బాష్ప నేత్రను, పులకిత గాత్రను చేశారు. ఆ పుణ్యమూర్తులందరికీ పేరు పేరునా వినమ్ర హృదయనై కృతజ్ఞతాంజలి సమర్పిస్తున్నాను.

ఈ సంకీర్తనా జ్యోతికి ఆశీస్సుల్ని అభ్యర్థించగానే ఎన్నో అధికారమైన కార్యకలాపాల్లో అవిశ్రాంతంగా వుంటున్నా ఎంతో వాత్సల్యంతో "ముందుమాట" దయచేసిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షురాలు, సమున్నత సహృదయిని, సాహితీ విదుషీమణి ఆచార్య నాయని కృష్ణకుమారి గారికి,

బహుముఖ కార్యాల్లో నిర్విరామంగా నిమగ్నమై వుంటున్నా అవ్యాజమైన అభ్యుదయాభిలాషతో "అభినందన" ప్రసాదించిన ఆంధ్ర ప్రదేశ్ సార్వత్రిక తెలుగు విశ్వవిద్యాలయాల మాజీ ఉపాధ్యక్షులు, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, పద్మభూషణ్, సౌమ్యహృదయులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి,

ఆర్ద్ర మనస్సుతో ఎంతో ఆప్యాయంగా "శుభాశంసన" సమకూర్చిన భాషాసాహిత్య వేత్త, కరుణాహృదయులు ఆచార్య ఎల్.బి. శంకరరావుగారికి,

శ్రేయోభిలాషతో, ఎంతో ఆప్యాయంతో "నీరాజనం" అందించిన సాహిత్యాభిలాషులు, సాహితీ ప్రజ్ఞావంతులు, సౌజన్య హృదయులు శ్రీ సన్నిధానం నరసింహశర్మ గారికి,

ఈ గ్రంథాన్ని సకాలంలో ముద్రించి ఇచ్చిన త్రివేణి ప్రింటర్స్ ప్రొప్రైటర్ శ్రీ ఎ. భవానీ ప్రసాద్ గారికి, భక్తిమనస్సుతో, సుమధుర భావనతో ముఖపత్రాన్ని రమ్యంగా, హృదయోల్లాసంగా చిత్రించి ఇచ్చిన కళాకారులు శ్రీ చంద్రశేఖర్ (టి.టి.డి. తిరుపతి)

గారికి, ముఖపత్రాన్ని సకాలంలో ముద్రించి ఇచ్చిన బాక్స్ ప్రెస్ వారికి,

ఇంకా ఎందరెందరో శ్రేయోభిలాషులకు అందరికీ నా వందన మారిచందనాలు.

హన్నా లీలావతి

ఆచార్య నాయని కృష్ణకుమారి
ఎం.ఎ.పిహెచ్.డి.
వైస్ చాన్సలర్
తెలుగు విశ్వవిద్యాలయం
లలితకళాక్షేత్రం
పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాదు-4

తేది 19-2-1995

# ముందుమాట

అన్నమాచార్యులమీద ఎంతో సాహిత్యం ఈ నాటికే వెలుగులోకి వచ్చిన విషయం అందరికీ తెలుసు. డా. హాన్నా లీలావతి "సంకీర్తనాజ్యోతి" అనే పేర దాదాపు ౪౪ వ్యాసాలను పుస్తకరూపంలో ఒకచోట చేర్చి సాహితీపరుల చేతిలో ఉంచడం అభినందించదగిన విషయం.

అన్నమయ్య భక్తి, ఆధ్యాత్మికత, జ్ఞానప్రబోధం, పురుష సందేశం, మానినీ ధర్మం, సాంఘిక దురాచారం వంటి అంశాలను రచయిత్రి వెలుగులోనికి తేవడం బాగున్నది. అంతేగాక ఆయన శృంగార సంకీర్తనల్లోని మధురిమ, భావరమ్యత, చమత్కృతి వంటి కవితా ధర్మాలను ప్రస్ఫుటితం చేయడం ఆమోదయోగ్యమైన విషయం.

డా. శ్రీమతి లీలావతి "అన్నమయ్య సర్వస్వం" అనదగిన ఈ గ్రంథాన్ని ప్రచురించినందుకు అభినందనయోగ్య. ఈ గ్రంథాన్ని సహృదయుల మధ్యకు ఆహ్వానిస్తున్నాను.

నాయని కృష్ణకుమారి

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్　　తేది 10-1-1996
**డా. సి. నారాయణరెడ్డి**, ఎం.ఎ., పిహెచ్.డి., డి.లిట్.
ఫోన్ నం. 248451
ప్లాట్ నం. 48, రోడ్ నం. 6, ఫిల్మ్ నగర్,
జూబ్లీహిల్స్, హైదరాబాదు-500033

# అభినందన

సంకీర్తనాచార్యులు అన్నమయ్య ఎంతటి సంగీత నిధులో అంతటి సాహిత్య వార్నిధులు. ఆయన కృతుల్లో రాగ వైవిధ్యంతో పాటు భావ వైపుల్యం అత్యంత గణనీయం. కీర్తనలకు కవితా ప్రౌఢి సంతరించిన విశిష్ట ప్రతిభ అతనిది.

లోగడ అన్నమాచార్యులను గురించి, వివిధ సంకీర్తనా చార్యులను గురించి పరిశోధన చేసి చక్కని గ్రంథాలు రచించిన డా. పొన్నా లీలావతి వెలిగించిన "సంకీర్తనాజ్యోతి" ఇది. ఈ గ్రంథంలో తాళ్ళపాక అన్నమయ్య, పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య కృతులను గురించి ఆమె రచించిన సమీక్షా వ్యాసాలను పొందుపరచారు. ఆయా కృతుల్లోని భక్తిపారమ్యంతో పాటు మానవీయాంశ ప్రతిఫలించిన పాదాలను వివరణాత్మకంగా పేర్కొన్నారు.

తెలుగు విశ్వవిద్యాలయం సాహిత్యపీఠంలో అధ్యాపకవృత్తిలో వున్న డా. లీలావతి పఠన పాఠనాలతో పాటు వ్యాసరచనా పాటవాన్ని కూడా తెరమరుగు కానీయకుండా ఎప్పటికప్పుడు ప్రచురిస్తున్నందుకు ఆమెను అభినందిస్తున్నాను.

సినారె

ఆచార్య లింగంనేని బసవశంకరరావు
తెలుగుశాఖ, ప్రెసిడెన్సీ కళాశాల, మద్రాసు. తేది 6-1-1996

# శుభాశంసన

శ్రీమన్నారాయణుని ఖడ్గమైన నందకాంశమే అన్నమాచార్యులని భాగవతోత్తములు భావిస్తారు. అన్నమయ్య మధురభక్తి పూరిత హృదయాంతరంగుడు. శ్రీనివాసుని త్రికరణశుద్ధిగ విశ్వసించిన భక్తాగ్రేసరుడు. ద్వాత్రింశత్ సహస్ర సంకీర్తనల్ని సంతరించిన పుణ్యాత్ముడు. ఈ కీర్తనల్లో శ్రీ వేంకటేశ్వరుని మనోజ్ఞమైన లీలల్ని అమందానంతో అభివర్ణించాడీ అన్నమయ్య. అన్నమయ్య సంకీర్తనల సుధారసధారలచే తడవని సాహిత్యవటువు మృగ్యం.

ఇతని సంకీర్తనలు ఆంధ్రభాషా సరస్వతికి అమూల్యాభరణాలు. రసనిష్యందులైన ఈ సంకీర్తనలు సంగీత సాహిత్య సంభరితాలు. అయినా ప్రాచీన పండితులు అనాదర భావంతో ఈ కీర్తనల్ని 'వెన్నెలకంట' చూడక చిన్నచూపే చూశారు. కీ శే. వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ మొ॥ ప్రసిద్ధ పండిత పరిశోధకులు అన్నమయ్య సంకీర్తనా సౌరభాల్ని ఆంధ్రసాహిత్య లోకంపై వెదజల్లారు. అప్పటి నుండి అన్నమయ్యపై జరిగినంత పరిశోధన మరే ఇతర ప్రాచీనకవులపై జరగలేదనడం అతిశయోక్తి కాదు. ఏ ప్రాచీన మహాకవిపై రానన్ని పరిశోధక సిద్ధాంత గ్రంథాలు అన్నమయ్య రచించిన వేలాది సంకీర్తనలపై రావడం ఆశ్చర్య దాయకం, ఆనందదాయకం, ఈ రచయిత్రి డా. పొన్నా లీలావతి కూడా అన్నమయ్య సాహిత్యాన్ని ప్రత్యేక పాఠ్యాంశంగా చదివి, ఆయన సాహిత్యపై పరిశోధించి డాక్టరేట్ పట్టాన్ని పొందిన సుప్రసిద్ధురాలు.

సిద్ధాంత గ్రంథరచనతో పరిశోధన ఆపకుండా అన్నమయ్యను మరవకుండా "ఉదకవితా వైజయంతి" అనే వ్యాస సంపుటిని ప్రచురించి అన్నమయ్య సంకీర్తనలకు అశేషమైన సేవచేసింది. ఇప్పుడు ఈ సంకీర్తనా జ్యోతిని వెలిగించి ఆంధ్ర సాహిత్యలోకానికి అందిస్తోంది. రచించడం ఒక ఎత్తు అయితే ప్రచురించడం మరో ఎత్తు. కష్టనష్టాల కోర్చి ఆ వ్యాస సంపుటిని ప్రచురించి అన్నమయ్య సాహిత్యంపై తనకున్న అపారాభిమానాన్ని వ్యక్తంచేసుకుంటుంటోంది. అన్నమయ్య ఆజన్మాంతం శ్రీనివాసుని వేనవేలు విధాలుగా సంకీర్తించి దిగంత వ్యాప్తి పొంది తరించాడు. మరి ఈ లీలావతి ఆ సంకీర్తనల్లోని సాహిత్య పరిమళాల్ని పెక్కు విధాలుగా వింగడించి అనేక వ్యాసాలు విరచించి ఆంధ్రలోక దిగంత కీర్తి నార్జించి తరిస్తోంది. అన్నమయ్య భక్తితో శ్రీనివాసుని కీర్తిస్తే, ఈమె ఆయన సంకీర్తనల్ని రక్తితో శోధిస్తోంది. అన్నమయ్య ఎంత మధురంగా పాడేవాడో మనకు తెలియదుగాని ఈ లీలావతి మాత్రం ఆయన సంకీర్తనల్ని తన్మయత్వంతో వీనుల విందుగా గానంచేస్తుంది.

ఈ "సంకీర్తనాజ్యోతి"లో ముప్పది మూడు వ్యాసాలున్నాయి. ఇరవైనాలుగు వ్యాసాలు అన్నమయ్యను గురించినవే. నాలుగు వ్యాసాలు మాత్రం పెద తిరుమలయ్యపైన మరో ఐదు వ్యాసాలు చిన తిరుమలయ్యపైన విరచితమయ్యాయి. అన్నమయ్య సంకీర్తనల్లో కనబడే అవ్యాజభక్తిని, అధిక్షేపాన్ని, ఉపదేశాన్ని, గురుభక్తి ప్రబోధాన్ని, జ్ఞాన ప్రబోధాన్ని తరచిచూసి ఆ లోతుల్ని బేరీజు వేయడానికి ప్రయత్నించి సఫలురాలయింది. దాదాపు ఈ వ్యాసాలన్నీ వివిధ సాహిత్య పత్రికల్లో, దినపత్రికల్లో ప్రచురించబడినవే.

డా. లీలావతి అన్నమయ్య సంకీర్తనల్లో మునిగి తేలుతూవుంది. సముద్రాన్ని ఈదవచ్చేమోగానీ సంసారసముద్రాన్ని ఈదలేమంటారు

పెద్దలు. సంసార సముద్రాన్నికూడా సాధించి ఈదవచ్చేమోగాని అన్నమయ్య సంకీర్తనా సముద్రాన్ని ఈదడం, లోతుల్ని తెలుసుకోవడం అత్యంత కష్టసాధ్యమే అవుతుంది. అలాంటి అసాధారణ ప్రయత్నం అవిరళంగా చేస్తున్న ఈ రచయిత్రి అభినందనీయురాలు. ఈ వ్యాసాలు అన్నమయ్య సాహిత్యపిపాసులకు, విద్యార్థులకు, పరిశోధకులకు సుధారసధారల్ని అందజేస్తాయని, వినూత్న భావనల్ని ప్రభవింపజేస్తాయని ఆశిద్దాం. ఈ వ్యాసాల్లోని రచన సుబోధకంగా సరళంగా వుండటమే కాకుండా చదివించే గొప్పగుణంకూడా వుండటం పేర్కొనదగింది. ఈ రచయిత్రి ఇలాగే అన్నమయ్య సంకీర్తనల్ని రసాస్వాదనచేస్తూ వుండాలని నా శుభాశంసన. ఈ వ్యాస సంపుటిని శ్రీనివాస అన్నమయ్యల భక్తాంఘ్రి రేణువులు ఆదరిస్తారని నా ప్రగాఢ విశ్వాసం.

ఎల్.బి. శంకరరావు

శ్రీ సన్నిధానం నరసింహశర్మ
శ్రీ గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయం
రాజమహేంద్రి

తేది 14-1-1996

# నీరాజనం

తెలుగు పదకవిత్వ కారణజన్ముడు అన్నమయ్య. ఆయన పదాల చెంత భక్తిప్రపత్తులతో వ్యాస "సంకీర్తనాజ్యోతి"ని వెలిగించిన డా. పొన్నా లీలావతిగారు ధన్యులయ్యారు. ఎం.ఎ.లో ఐచ్ఛిక పాఠ్యాంశంగా, పిహెచ్.డి.లో పరిశోధనాంశంగా వరించబడిన అన్నమయ్య కవిత్వం అంతటితో ఆగక, ఆమె జీవితంలో సింక్ అవడంచాలా మందికి అబ్బని, అబ్బురమైన ఒక అదృష్టం, తపోఫలం.

"పానీయంబులు త్రాగుచున్ గుడుచుచున్ భాషించుచున్" అన్నట్లు శ్రీమహావిష్ణుపద ధ్యానంతో ప్రహ్లాదుడే విధంగా తన్మయుడయ్యాడో అదివో...అల్లదివో అదేవిధంగా నేడు లీలావతిగారు అన్నమయ్య పదధ్యానాధ్యయన తన్మయత్వాన్ని పొందుతున్నారు. అది ఆత్మీయ సాహిత్యానుభవ సంబంధమయింది. ఆ లీలావతిగారే సమాజానికి ఆ రచనా విశేషాల్ని అందించే సందర్భంలో బాధ్యతాయుతంగా పరిశోధించి, విమర్శించి నిగ్గులు తేల్చి చెప్పటం ప్రశంసనీయం. వేలాది సంకీర్తనల్లోని విష్ణుభక్తి-శృంగార-తాత్త్విక చింతనల ప్రాధాన్యాన్ని, అందులో నిక్షిప్తమైవున్న సామాజికాంశాల్ని ఆధునిక దృక్పథంతో మరొక అడుగు ముందుకువేసి మరీ చెప్పారు వంటలు, క్రీడలు, సూక్తిసంపద వంటి వ్యాసాలు వస్తువైవిధ్యంతో అందగించాయి. మానవ మనస్తత్వం, శృంగార సంకీర్తనల్లో పుంగ-ధర్మాలు, శృంగార సంకీర్తనల్లో భావరమ్యత వంటి ఎన్నోవా

రచయిత్రి పరిశోధనా పాటవానికి సాక్షీభూతాలు. సంకీర్తనాజ్యోతిర్దర్శనంలో అన్నమయ్య ఆత్మను వివిధ కోణాల్లో దర్శింపజేశారు.

అన్నమయ్య కౌటుంబిక సంకీర్తనాచార్యుల సహితీ పరిమళాల విశేషాల వ్యాసాలు 234వ పుటనుండి సాగి ఈ గ్రంథం గొప్పతనం ఇబ్బడి ముబ్బడి అయింది. అన్నమాచార్య కవిత్వమంటే - అది ఒక తీరరహితమైన పెద్ద తీపికడలి. కడలేని కడలినుండి వ్యాసాల పాత్రలతో ఎంతగానో శ్రమపడి సాహిత్య మాధుర్యాన్ని మన కందించారు, మన లీలావతిగారు. ఇది ప్రశంసనీయ సాహితీసేవ. సంకీర్తనాజ్యోతి ఒక అవిస్మరణీయ సాహితీ నీరాజనం. ఈ గ్రంథాన్ని కళ్ళకద్దుకుందాం. తనివితీరా చదువుకుందాం.

సన్నిధానం నరసింహశర్మ

# విషయసూచిక

# అన్నమయ్య అవ్యాజ భక్తి

ప్రథమ సంకీర్తనాచార్యుడు, పదకవితా పితామహుడు అయిన తాళ్ళపాక అన్నమయ్య ప్రత్యక్ష దైవమైన తిరుపతి శ్రీ వేంకటే శ్వర స్వామితో అవ్యాజమైన, అనన్యమైన అనుబంధం కలిగిన పరమ భాగవతోత్తముడు. అన్ని వర్గాల, అన్ని వయసుల ప్రజలకు శాశ్వత మైన సత్యమైన విష్ణుభక్తిని, మానవతా ధర్మాలను అలతి, అలతి తేటతెలుగు పదాలతో, వివిధ గేయ రీతులలో అందించిన ప్రజాకవి.

మహావిష్ణువు ప్రతి యుగంలోనూ దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం, ధర్మోద్ధరణకోసం భూమిపై అవతరిస్తూంటాడు. త్రేతా యుగంలో శ్రీరాముడుగా, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా అవత రించి భూలోకాన్ని రక్షించినట్లుగా ఈ కలియుగంలో శ్రీనివాసుడుగా తిరుపతి వెంకటాచలంపై వేంచేసి యున్నాడు. అన్ని దేశాల వారూ, అన్ని ప్రాంతాలవారూ, అన్ని మతాలవారూ, అన్ని కులాలవారూ కోటానుకోట్లుగా తిరుపతి శ్రీనివాసుని దివ్యదర్శనంకోసం వెడుతుం టారు. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరుని నందకావతారం. ఆయన స్వామిపై తదేక ధ్యానంతోనే పెరిగి, పెద్దవాడై, ముప్పైరెండువేల శృంగార ఆధ్యాత్మిక సంకీర్తనలకు కర్తయై నేటికీ సకల జనావళిచే నీరాజనాలందుకుంటున్న ఘనుడు.

లోకంలో అన్ని మతాలలో అనేక మంత్రాలున్నాయి. "నదీనాం సాగరోగతిః" అన్నట్లు అన్ని మంత్రాలు శ్రీహరిలో లీనమవుతాయి. విష్ణువుకు సహస్ర నామాలున్నవి. వాటిలో ఎవరెవరికి ఏయే పేర్లు నచ్చుతాయో ఆయా పేర్లతో వారు జపి

స్తారు. నారదుడు నారాయణ మంత్రాన్ని, ప్రహ్లాదుడు నారసింహ మంత్రాన్ని, విభీషణుడు రామమంత్రాన్ని ధ్రువుడు వాసుదేవ మంత్రాన్ని, అర్జునుడు కృష్ణమంత్రాన్ని శుకుడు విష్ణుమంత్రాన్ని జపిస్తే తనకు వేంకటేశ మంత్రం వెన్నతో అబ్బిందని ఇదే పర బ్రహ్మమంత్రమని తనను రక్షించడానికి తన గురువు ఈ మంత్రాన్ని ప్రసాదించాడని, ఈ మంత్రం వెన్నలవలే చల్లనయినదని. తనకు శ్రీవేంకటేశ్వరనామంతో ఉన్న అనుబంధాన్ని—

"అన్ని మంత్రములు నిందేయావహించెను
వెన్నతో నాకు గలిగె వేంకటేశు మంత్రము ॥

అనే సంకీర్తనలో తెలియజేశాడు, ఐహిక బాంధవులందరూ అశాశ్వతమని, వీరెవ్వరూకడతేర్ప లేరని, ఒక్క భగవంతుడే శాశ్వత మని, ఆయనే సర్వశక్తిమంతుడని అన్నమయ్య బాల్యంలోనే గ్రహించాడు తన చిత్తంలోనే పురుషోత్తముడైన శ్రీనివాసుడు తనను కాపాడిన కులదైవమని, వెనకటి పెద్దలు వివేచించి ఇచ్చిన నిధిఅన్ని, దప్పికతీర్చే నీలమేఘమని, తమకు వశమైన పారిజాత పుష్పమని, గట్టిగా రక్షించిన చింతామణి అని, కోరిన కోరికలుతీర్చే కామధేనువుపని, చెడిపోకుండా బ్రతికించే సిద్ధమంత్రమని, రోగాల్ని పోగొట్టి రక్షించే దివ్యౌషధం అని, తమను వదలిపెట్టని ప్రాణబంధు డని పరిపరి విధాలా మనసారా, నోరారా కీర్తించటం, తనను వదలి వుండవద్దని వేడుకోవడం.

"తాడగంటిమయ్య మిమ్ము పురుషోత్తమా, మమ్ము
నెడయకు వయ్య కోనేటిరాయడా ॥

అనే సంకీర్తనలో కనిపిస్తుంది,

అన్నమయ్య తన స్వామిని ప్రేయసీ ప్రియభావమైన మధుర భక్తి రీతిలో కూడా ఆరాధించి తనివిచెందిన రసమూర్తి.

"ఏలరాఁడమ్మ యింతిరో వా
డేలరాఁడమ్మ నన్నేలినవాఁడు"

అనే సంకీర్తనలో మన్మథ జనకుడు, పీతాంబరాన్ని ధరించిన సుందరాంగుడు, విరించి జనకుడు, శేషశయనుడు, తెల్లని కన్నుల తెలివైనవాడు అయిన తన ప్రియుడు ఇంకా ఎందుకు రాలేదంటూ తన విరహబాధను చెలికత్తెకు మొరపెట్టుకోవడం కనిపిస్తుంది.

అలాగే తన ప్రియుని కలవాలనే కోరికతో ఎక్కడికో వెళ్ళిన ప్రియునికోసం మేడపైకెక్కి ఎదురుచూచి, ఎంతకూ రాకపోయేసరికి నిట్టూర్పు చెందడం, అతను తిరిగిరాగానే తన ప్రేమనంతటినీ వ్యక్తం చేస్తూ, విరబూసిన చెట్టుపై కోయిల కూస్తే అది తన ప్రియుని కంఠమని భ్రమచెంది తన దగ్గరకు రమ్మని పిలిచాననడం, తనలో పులకలెత్తిన తన ప్రియునిమీది ప్రేమను మాటల్లో చెప్పలేననడం, తన ప్రాయాన్ని అతని కొఱకే అంకితమిచ్చానని, తనను వదలకుండా ఇంటిలోనే ఉండమనడం, ముమ్మాటికీ తన ప్రియుని ప్రమాణాలనే నమ్మానని, కమ్ముకున్న చీకట్లు తొలగిపోయేలాగా తనపై కరుణను కుమ్మరించమని వేడుకోవడం—

'మేడలెక్కి నినుఁ జూచి-కూడేననియాసతోడ
వాడుదేరివున్నరందురా- వెంకటేశ
యాడనుంటి విందాఁకానురా ॥ (13-223)

అనే ఏల పాటబాణీల్లోని సంకీర్తనలో వ్యక్తమవుతుంది.

శ్రీ వేంకటేశ్వరునిపై అన్నమయ్యకున్న అవ్యాజభక్తిని నిరూపించే ఇలాంటి సంకీర్తనా రత్నాలు ఆయన సంకీర్తనా లహరిలో కోకొల్లలు. భుక్తి ఆలోచననే తప్ప ముక్తిఆలోచన లేని నేటి కాలానికి అన్నమయ్య భక్తి సంకీర్తనలు అత్యంతావశ్యకాలు.

సమాచారమ్ (7-4-1994)



౫

# అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో అధిక్షేపం

తెలుగు సాహిత్యంలో "అధిక్షేపం" ప్రాచీనకాలంనుంచీ కనిపిస్తుంది. ఈ పదాన్ని లోకంలో "తిట్టడం"అనే అర్థంలో ఎక్కువగా వ్యవహరించడం జరుగుతోంది. అధిక్షేపం అనేది "క్షిప"అనే ధాతువుకు "అధి"అనే ఉపసర్గ చేరగా ఏర్పడిన రూపం. ఈ పదానికి సూర్యరాయ నిఘంటువులో దూఱుట, నిందించుట, త్రోసిపుచ్చుట, తిరస్కరించుట, స్థాపనము, పురికొల్పుట, ప్రేరణము అనే అర్థాలు, శబ్దరత్నాకరంలో దూఱుట, బెదరించుట అనే అర్థాలు చెప్పబడ్డాయి.

సమాజంలోని సమకాలీన రాజకీయ, సాంఘిక, నైతిక, మత పరిస్థితుల్ని గమనించి అందులోని అస్తవ్యస్తాలను, వ్యక్తుల అక్రమ చర్యలను, అవినీతి ప్రవర్తనను, మూర్ఖత్వాన్ని ఖండిస్తూ వాటిని ఎత్తి చూపే రచనల్ని అధిక్షేపరచనలని చెప్పవచ్చు. ఇందులో కవి తనకు నచ్చని వాటిని, వ్యక్తికి, సమాజానికి కీడుచేసే విషయాలను అవహేళన చేస్తు నిందించడం జరుగుతుంది. అధిక్షేప రచనలు చేసే కవులకు ధైర్యసాహసాలు, నీతి, నిజాయితి ఎంతైనా అవసరమై వుంటుంది. ఆధునిక సాహిత్యంలో అధిక్షేపధోరణులు అనే గ్రంథంలో శ్రీ రెంటాల వెంకటేశ్వరరావు ఈ అధిక్షేపం లోకంలో మూడు కారణాలవల్ల ఏర్పడుతుందని చెప్పారు. 1) ఆత్మోన్నత్య ప్రతిష్ఠాపనం, అంటే తమకన్నా సాంఘికంగా, నైతికంగా, బౌద్ధికంగా తక్కువస్థాయిలో ఉన్న వ్యక్తులను అధిక్షేపించడం. ౨) ప్రతీకార వాంఛ. అంటే తనకు పరాభవం జరిగినప్పుడు కారణభూతులయిన వారిని అధిక్షేపించి తన అహాన్ని సముదాయించుకోవడం. ౩) సంస్కరణాభిలాష. అంటే తాము అభిమానించే వ్యక్తుల్లో ఉన్న లోపా

లను, దోషాలను తొలగించి వాళ్ళను ఉత్తములుగా తీర్చిదిద్దడానికిచేసే ప్రయత్నం.

సాహిత్యం మానవ జీవిత ప్రతిబింబం కాబట్టి మానవ జీవితంలో అధిక్షేపం ఉన్నట్లే సాహిత్యంలో కూడా అధిక్షేపం వ్యక్తమవుతుంది. ప్రాచీన కావ్యాల్లో ఈ లక్షణాలు కల్గిన అధిక్షేప ధోరణులు ఎక్కువగా చాటువులు, కావ్యాలు, శతకాల్లో కనిపిస్తాయి. ప్రాచీనకాలంలో అధిక్షేప సాహిత్యాన్ని సాగించిన ఉద్దండ కవులుగా వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, తెనాలి రామకృష్ణుడు ధూర్జటి, అడిదము సూరకవి, కూచిమంచి తిమ్మకవి, వేమన, కుందవరపు కవి చౌడప్ప మొదలైన ప్రముఖులను పేర్కొనవచ్చు. ఆధునిక కాలంలో ఈ అధిక్షేపం తిరుపతి వేంకటకవులు, కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, పానుగంటి లక్ష్మీనరసింహం, అనంతపంతుల రామలింగశాస్త్రి, గజ్జెల మల్లారెడ్డి, సోమసుందర్, దాశరథి, శ్రీశ్రీ, కాళోజీ, సి. నారాయణరెడ్డి, పేర్వారం జగన్నాథం మొదలైన ప్రముఖ కవుల రచనలలో కనిపిస్తుంది.

ఇలా ప్రాచీన సంప్రదాయ సాహిత్యంలో ఫరిడవిల్లి అర్వాచీన సాహిత్యంలో కూడకొనసాగుతున్న అధిక్షేపం ఆలనాటి అన్నమయ్య పదసాహిత్యంలోకూడా కనిపించడం గమనించదగినవిషయం. సాధారణంగా అన్నమయ్య అనగానే కేవలం భక్తి పారవశ్యంలో తేలియాడే ఒక సనాతనభక్తుడని, ఆయన సంకీర్తనలనగానే అవి కేవలం శ్రీవేంకటేశ్వరుని కీర్తించే భక్తిరసాత్మకమైనవని, అవి విని ఆనందించి తరించడానికిమాత్రమే పనికివస్తాయని, సామాజిక వాస్తవజీవితానికి విభిన్నమైన పని సామాన్యుల హృదయాలలో నాటుకొనిపోయింది. ఈ దృష్టితోనే కొందరు ప్రసిద్ధ పండిత పరిశోధక విమర్శకులుకూడా అన్నమ

య్యేను,అన్నమయ్య సంకీర్తనలను కేవలంసనాతనమైనవిగానేభావించు కోవడంవల్ల అందులో కనిపించే ఆధునికమైన సామ్యవాదం, స్త్రీ వాదం, దళితవాదం, ప్రేమతత్త్వం మొదలైన వివిధ సాహిత్య దృక్పథాలను సోదాహరణంగా ఎత్తిచూపినా వాస్తవాన్ని అంగీక రించలేక ఏదో అపకారం, అన్యాయం జరిగిపోయినట్లు వికృత విమ ర్శలు విసురుతుంటారు. దీనికి కారణాలు అన్నమయ్య సంకీర్తనలపై వారికి అవగాహన, అధ్యయనం, సత్యాన్ని సమ్మతించే సహృద యం లేకపోవడమే.

అన్నమయ్య సంకీర్తల్ని కేవలం భక్తి, సంగీతం దృష్టితోనే కాక అందులో కనిపించే సామాజికాంశాలవైపు, ఆధునికంగా కని పించే వివిధ సాహిత్య దృక్పథాలవైపు కూడా బుద్ధిని సారించడంవల్ల అన్నమయ్య దీర్ఘ దర్శిత్వం, నేటి సమాజానికి ఆయన సంకీర్తనల ఆవశ్యకత ఎట్టిదో మనకు వ్యక్తమవుతుంది. అన్నమయ్య శ్రీవేంక టేశ్వరుని భక్తుడే అయినా, ఆ స్వామితోడి జీవనమే ఆయనకు ఊపిరి అయినా సమాజంలో తానూ ఒక వ్యక్తి అనే విషయం ఆయన విస్మరించలేదు. అన్నమయ్య పద్యరచన స్వీకరించక గాన యోగ్యమైన, సుబోధకమైన పదరచనల్ని స్వీకరించాడంటే దానిని బట్టే అన్నమయ్య ప్రజలను ఉద్ధరించడానికి అవతరించిన పుణ్యపురుషు డని, ప్రజాకవి అని మనం గుర్తించవచ్చు. అన్నమయ్యకు అట్టడు గున జీవించే సామాన్యప్రజలు మొదలుకొని, అత్యున్నత సింహాస నాన్ని అలరించే అధిపతులవరకు అన్నిరకాల, అన్నివర్గాల, అన్ని వృత్తుల వారితో సన్నిహిత సంబంధం వుంది. చివరకు ఆయన కొండ కోనల్లో ఆకులు-అలములు, కాయలు, పండ్లు తిని జీవించే బోయీలు, చెంచులతోకూడా సంబంధాలు వదలలేదు. వారందరినీ జ్ఞానులుగా ఉత్తములుగా తీర్చిదిద్దుకోసం తన గానం నాటి సమాజంలో దురా

చారాల్ని కులభేదాల్ని, రాజుల్ని, నాస్తికుల్ని, వితండవాదుల్ని, కుకవుల్ని, అజ్ఞానుల్ని నిరసిస్తూ వారిలో కనిపించే అహంకృతిని, అవినీతిని అక్రమాన్ని ఎత్తిచూపుతూ శ్రేయోభిలాషతో అధిక్షేపిస్తూ కొన్ని సంకీర్తనలు రచించాడు. వీటివల్ల ఆనాటి సాంఘిక, రాజకీయ, నైతిక, మత పరిస్థితులు, తెలియడమే కాక నేటి సమాజం అభ్యుదయ మార్గంలో పయనించడానికి, మానవుడు ఉత్తమ వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోవడానికి దోహదం కలుగుతుంది.

సమాజంలో ఆయా కులమతాలకు వేరు వేరు ఆచార వ్యవహారాలుంటాయి. సామాన్య ప్రజలు భగవద్భక్తికన్నా ఆచారాలకే ప్రాముఖ్యం ఇస్తూ ప్రయాసతో కాలం గడుపుతుంటారు. అన్నమయ్య అలాంటి వారిని అధిక్షేపిస్తూ హరిభక్తి కలిగివుండటమే ముఖ్యమని తక్కిన ఆచారాలన్నీ వృథా అంటూ—

"హరిభక్తి కలిగితే అన్నియు ముఖ్యముగాక
విరిహాచారము లెల్లవృథావృథా"

అనే సంకీర్తన రచించాడు.

దేవదేవుడయిన శ్రీహరి వుండగా ప్రజలు క్షుద్రమైన దేవతలను పూజించి జంతుబలుల్ని ఇవ్వడం అన్నమయ్య అధిక్షేపిస్తూ—

మొక్కరో మీరు మోసపోక-మీకు
దిక్కుదెసైన ఆదిదేవునికి ॥

సిడిదల లియ్యవద్దు జీవాలఁ జంపవద్దు
బడి బడి పగ్గాలఁ బారవద్దు
సిడిమీఁద బిత్తరపు చిమ్ములు చిమ్మగవద్దు
కడనుండి దారి గన్నఁ జాలు॥

అనే సంకీర్తనలో అన్యదేవతలను నమ్మి మోసపోకుండా ఆది దేవుడైన విష్ణుమూర్తికి మొక్కమని, జంతువుల్ని బలులిచ్చి వాటి కాళ్ళు చేతుల్ని, గుండెల్ని నైవేద్యం పెట్టనక్కరలేదని, కష్టపడి అగ్నిగుండాలలో దూకవద్దని కేవలం భగవంతునికి మనస్సును అంకితం చేసి మేము మీ వారమని అంటే చాలునని ప్రజలకు తెలియజేశాడు.

ప్రజలు కులభేదాల్ని పాటిస్తూ ఒకరి నొకరు న్యూన పరచు కోవడం చూచి సహించలేక వారిని అధిక్షేపిస్తూ—

"ఏ కులజుఁడేమి యెవ్వఁడైననేమి
ఆకడ నాఁతడె హరి నెఱిఁగిన వాఁడు
నిర్మలుఁడై యాత్మ నియతి గలుగువాఁడే
ధర్మతత్పర బుద్ధిఁ దగిలిన వాఁడు
కర్మమార్గములు గడవని వాఁడే
మర్మమై హరిభక్తి మఱవని వాఁడు (1-292)

"విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల కదియే జాతి॥ (2-383)

అనే సంకీర్తనల్లో ఏ కులస్థుడు? అనేది ముఖ్యం కాదని ఆత్మ నిగ్రహం, ధర్మబుద్ధి, హరి భక్తి గలిగినవాడే గొప్పవాడని జాతి భేదాలు శరీరానికి సంబంధించినవని, శరీరంతోనే జాతికూడా నశిస్తుం దని, ఆత్మ పరిశుద్ధం, నిర్దోషమున్ని, హరికి దాస్యం చేయడమే మంచి జాతి అని తెలియజేస్తూ రకరకాల జాతులన్నీ వ్యర్థమని, అజామి ళుడు మొదలైన వారందరూ అధిక కులంవల్ల కాక హరినామస్మరణ వల్లనే తరించారని, వారందరికి అది ఏ జాతి? అని ప్రజలను నిలదీసి అడుగుతూ విజ్ఞానాన్ని బోధించాడు.

అన్నమయ్య సంకీర్తనల ప్రసిద్ధిని విని ఆనాటి రాజులు మొగలుకొని ప్రజల వరకు తమపై సంకీర్తనలు వ్రాయమని విసిగించడం వల్ల అన్నమయ్య వారి అజ్ఞానాన్ని అధిక్షేపిస్తూ నారాయణునికి అంకితమైన తన శరీర అవయవాలు ఇంకెవ్వరినీ కొలువవని తెలియచేశాడు.

తలఁగరో లోకులు తడవకురో మమ్ము
కలిగినదిది మాకాఁపురము ॥

నరహరికీర్తన నానిన జిహ్వ
పొరులనుతింపఁగ నోపదు జిహ్వ
మురహరు పదముల మొక్కిన శిరము
పరుల వందనకుఁ బరగదు శిరము (2-144)

"తావులేలే రాజులకు దయకొంత పుట్టదాయె
కావరమే ఘనమాయె"

అనే సంకీర్తనలో రాజులలోని దురహంకారాన్ని, నిర్దయను ఎత్తి చూపుతూ అధిక్షేపించడం కనిపిస్తుంది.

భగవంతుడు లేడని వాదిస్తూ భక్తుల్ని దూషించే వారు నాస్తికులు. వీరి మాటల ధోరణి, ప్రవర్తన చాలా వికృతంగా, అసంబద్ధంగా ఉంటుంది. అన్నమయ్య ఇలాంటి నాస్తికులపట్ల కలత చెంది వారి తీరు తెన్నులను అధిక్షేపిస్తూ—

"ఇట్టి నాస్తికుల మాట యేమని నమ్మేడి దీక్ష
పట్టి సములంటానే భక్తుల దూషింతురు

అనే సంకీర్తనలో నాస్తికులు ఒకవైపు వేదాలు చదువుతూ కూడా విశ్వమంతా కల్ల అంటారని, తాము ఉండి కూడా అంతా

మాయ అంటారని, జీవత్వంలేదు అంటూనే స్త్రీలను అనుభవిస్తారని, ఇండ్లలో దేవతా పూజలు చేస్తూ తామే దైవం అంటారని, పురుష సూక్తానికి అర్థం చెప్పుతూ అంతా నిరాకార మంటారని, శ్రీవేంకటే శ్వరునికి దాసులుకాకుండా రాక్షస మతంలో నడుస్తారని నాస్తికుల్ని నిరసించాడు.

"పురుషుండని శ్రుతి వొగడీనట ఆ పురుషుఁడు
నిరాకారమట
విరసవాక్యము లాండోంటికి నివి వింటేన
సబంద్ధములు (2-252)

"ఏఁటి మాటలివి విన నింపయ్యీనా నుది
నేఁటవెట్టి దాసుఁడోటిది సరియా (2-67)

అనే సంకీర్తనలోను వితండవాదుఁల్ని అధిక్షేపిస్తు, జీవుడే దేవు డని చెప్పే కొందరిని దేవుని మహిమలన్నీ మీా కున్నాయా అని నిలదీసి ప్రశ్నిస్తూ అన్నమయ్య వారిని అధిక్షేపించడం కనిపిస్తుంది.

కవులలో సుకవులున్నట్లే కుకవులు కూడా ఉంటారు. ఒకరు చెప్పినవాటిని అపహరించి తమ పేర్లు తగిలించుకొని కవులుగా చెలా మణీ అయ్యేవారు కుకవులు. అలాంటివారు అన్నమయ్య దృష్టిలో వెట్టివారు. ఒకసారి ముడిచి వేసిన పువ్వును తిరిగి తలపై ధరించడానికి యోగ్యం కాదని. ఒకసారి తిని పారవేసిన పుల్లి ఆకులో తిరిగి తిన కూడదని, అలాగే ఒకరు చెప్పిన అంశాల్నే తాను చెప్పినట్లుగా తిరిగి చెప్పితే అది శ్రీహరికి సమర్పించడానికి యోగ్యం కాదని, ఉమ్మి వేసిన తాంబూలంలో కొంత కర్పూరం కలుపుకొని రుచిగా చప్పరించినట్లు ఇతరులనుండి దోచుకున్న విషయాలకు ఏవో కొన్ని మాటలు కలుపుకొని కవిత కూర్చితే భగవంతుడు నవ్వడా! అని కుకవుల్ని అధిక్షేపిస్తూ—

వెట్టులాల మీకు వేడుక గలిగితేను
అట్టువంచి తడు కల్లంగరాదా
ముడిచివేసిన పువ్వు ముడువ యోగ్యముగాదు
కుడిచివేసిని పుల్లె కుడువంగాం గాదు
బడి నొకరు చెప్పిన బ్రతి చెప్పం బోతేను
అడరి శ్రీహరికది అరుహము గాదు ॥

పుమిసిన తమ్మలో నొక కొంత కప్రము
సమకూర్చి చవిగొని చప్పరించనేల
అమరంగ ఛాయాపహారము సేసుక
తమ మాట గూర్చితే దైవము నగండా" (2-494)

అనే సంకీర్తన రచించినాడు.

సమాజంలో అన్ని రంగాలలోను జ్ఞానులు, అజ్ఞానులు అందరూ ఉంటారు. మతం విషయంలో, చదువుల విషయంలో వేదాంతం విషయంలో కొందరు అజ్ఞానులు వితండంగా వాదిస్తూ మూర్ఖంగా ప్రవర్తిస్తుంటారు. ఇలాంటి వారిని అన్నమయ్య అధిక్షేపిస్తు అనేక సంకీర్తనలు రచించాడు.

కొందరు అత్యున్నతుడైన శ్రీహరిని సకల దేవతలలో ఒకడుగా భావించి పూజించడం అన్నమయ్యను కలచివేసింది. ఇలా ఉచితానుచితాలు గమనించకుండా విష్ణుమూర్తి ఆధిక్యతను గుర్తించని వారిని అధములని అధిక్షేపిస్తూ

"అంతెరు మాలిన యట్టి అధములాల
పొంత సంత కూటమి పారిచూపుగాదా ॥

కనకమిత్తడితోడ కలయ సరిదూఁచితే
అనువవునా అది దోషమవుఁగాక
ఘనుఁడైన హరితోఁ గడు హీన దేవతల
ననిచి సరివెట్టితే నయమవునా భువిని' (2-17)

అనే సంకీర్తనలో బంగారాన్ని ఇత్తడితో కలిపి సరితూచడం దోషమని అలాగే మహోన్నతదైవమైన హరితో హీన దేవతల్ని కలిపి చూడటం అనుచితమని అన్నమయ్య తెలియజేశాడు.

"అన్నిటాను హరిదాసులధికులు
కన్నులవంటివారు కమలజాదులకు ॥

అందరును సమమైతే నరుహానరుహాము లేదా
అందరిలో హరియైతేనౌఁగాక
బొందితో విప్రునిఁదెచ్చి పూజించినట్టు వీరే
పొందుగాని శునకముఁ బూజించఁదగునా" (2-170)

అనే సంకీర్తనలో వివేక శూన్యులైన వారిని అధిక్షేపిస్తూ ఏ విధంగా చూచినా అన్ని విషయాలలో హరికి దాసులైన వారే గొప్పవారని, అందరిలో నారాయణుడున్నా విప్రుని పూజించిన విధంగా కుక్కను పూజించడానికి తగదుకదా అని అన్నమయ్య వివేకాన్ని తెలియజేస్తున్నాడు.

మానవుడు ఎన్ని చదువులు చదివినా, ఎన్ని శాస్త్రాలు నేర్చినా మనసును అదుపులో పెట్టుకోలేక పోతున్నాడు. అలాంటి చదువు కున్న అజ్ఞానిని గుడ్డి కుక్కతో పోల్చి అధిక్షేపిస్తు విజ్ఞానాన్ని బోధిస్తు—

"తనకేడ చదువులు తనకేడ శాస్త్రాలు
మనసు చంచల బుద్ధి మానీనా ॥

అనే సంకీర్తనలో మూర్ఖుడైన మానవుడు చదివేసరికి దురాశ పెంచుకొంటున్నాడే కానీ ఆశవదలుకోవడం లేదని అతని తీరు గ్రుడ్డి కుక్క సంతకుపోయి తిరిగి దుడ్డుకర్రదెబ్బలుతినివచ్చినట్లుగా ఉందని అన్నమయ్య తెలియజేశాడు. (1-198)

సాటి మానవుల మనస్సులకు బాధకల్గిస్తు, ఇతరుల ఉన్నతిని చూచి సహించలేక వారికి కీడుచేసే దుష్టులను ఈ కడుపెంత? తాను తినే తిండి ఎంత? ఇంతమాత్రానికే ఇన్నిపాట్లుపడి పొర్లాడట మెందుకు? అని నిలదీసి ప్రశ్నిస్తు, దుష్టత్వాన్ని అధిక్షేపిస్తు—

"కడుపెంత తాఁగుడుచు కుడుపెంతదీనికై
పడని పాట్లనెల్లఁపడి పొరలనేలా ॥

అనే సంకీర్తన రచించాడు.

సమాజంలో అన్నిరంగాలలో కనిపించే ఒడిదుడుకులకు వాటికి కారకులైన వారిని గమనించి వ్యక్తి శ్రేయస్సుకోసం, సమాజప్రగతి కోసం ప్రజలను అధిక్షేపించిన అన్నమయ్య తాను సదసద్వివేకి, మహాజ్ఞాని, పరమభక్తుడు అయినా తననుతాను న్యూనపరచుకుంటూ పురుషాధముడు, అజ్ఞాని (2-52), అతిపాతకుడు, కడు అధముడు (1-282) మూఢులలో అగ్రేసరుడు, గర్వపర్వతం, నీచుడు (3-48) తామసుడు, ఘాతకుడు, రాతిబొమ్మ, హీనజంతువు, మానిబొమ్మ, కూళుడు, తోలుబొమ్మ (1-286) మొదలైన పదాలతో తనను అధిక్షేపించుకోవడం సంకీర్తనల్లో కనిపిస్తుంది. ఇది అన్నమయ్య వినమ్రతకు తార్కాణం. దీనివిబట్టి అధములుగా, అజ్ఞానులుగా,

దుష్టులంగా బ్రతుకున్న వారు తమను తాము ఆత్మపరిశీలన చేసుకొని పశ్చాత్తప్తులై సజ్జనులుగా మారాలని మనం అర్థం చేసుకోవాలి. అన్నమయ్య సంకీర్తనా సాగరంలో సమాజ సంబంధమైన అధిక్షేపాత్మక సంకీర్తనలు విశేషంగా కనిపిస్తాయి. ఇవి నాటికీ నేటికీ ఎప్పటికీ మానవజాతికి రత్నజ్యోతులై వెలుగునిస్తాయి.

సాహితీమేఖల

మాసపత్రిక — (చౌటుప్పల్‌-నల్గొండ జిల్లా)

ఏప్రిల్ — 1994



# అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో ఉపదేశం

తెలుగు సాహిత్య రంగంలో పదిహేనవ శతాబ్దంలో లక్షణ బద్ధమైన పద ప్రక్రియా రచనకు నాంది పలికిన వాగ్గేయకారుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఇతడు శ్రీ వేంకటేశ్వరుని కృపచే జన్మించి ఆ స్వామి అనుగ్రహంతోనే ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు రచించి ఆ స్వామికే అంకితమిచ్చిన పరమ భాగవతోత్తముడు. సాహిత్యంలో ప్రక్రియారచన పరమార్థం ప్రధానంగా ఉపదేశం కాబట్టి ప్రజల్లో అన్నివర్గాల వారికి ఉపదేశం చేయడానికి, భవబంధ విముక్తులను చేయడానికి సుబోధకమైన సంగీతాత్మకమైన రచనా విధానాన్ని చేపట్టాడు. తిరుమల తిరుపతి దేవస్థానం వారి అమోఘమైన నిరంతర కృషివల్ల, శ్రద్ధాసక్తులవల్ల సార్వజనీనమైన, సార్వకాలికమైన అన్నమయ్య సంకీర్తనలు వెలువడ్డాయి. నేడు అన్నమయ్య సంకీర్తనలు ఒక ప్రాంతానికి, ఒక దేశానికి పరిమితం కాక విశ్వవ్యాప్తంగా ప్రాచుర్యంలో ఉన్నాయి. అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో అలనాటి వేదవాఙ్మయం నుంచి నేటి ఆధునిక సాహిత్యం వరకు అన్ని ప్రక్రియల్లోను కనిపించే భక్తి, జ్ఞాన, వైరాగ్య, నీతి బోధలు, సమత, మమత మానవతా ధర్మాలు కనిపిస్తాయి. విష్ణు భక్తితత్పరతలో ఎక్కువగా పోతన భావాలు, సామాజిక నీతి జ్ఞాన విషయాల్లో వేమన భావాలు ద్యోతకమవుతుంటాయి.

హిందూమతస్థులకు ముప్పై మూడు కోట్ల దేవతలున్నారు. కానీ అందరికీ ఆద్యుడు, ఆధారభూతుడు, దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడు,

యుగదైవం అయిన శ్రీహరినే కీర్తించాలని అన్నమయ్య ఉద్దేశం. వేదాలు ఎవ్వరిని వెతుకుతుంటాయో, చైతన్యాత్మకుడు ఎవ్వరో, ఎక్కడ చూసినా ఎవ్వరుంటారో, చివరిదశలో శరీరాన్ని వదలివేసే టప్పుడు ఎవ్వరిని స్మరిస్తారో, సర్వరక్షకుడు ఎవ్వరో, ఈ సృష్టి అంతా ఎవ్వరితో నిండివుందో, ఎవ్వరిని తృప్తిపరచడానికి పితృదేవత లకు సంతర్పణలు చేస్తారో, సమస్తలోకాలవారు ఎవ్వరిని పూజిస్తారో అలాంటి ఆ దేవుడైన శ్రీవేంకటేశ్వరుని కీర్తించి, సేవించి తరించమని అన్నమయ్య ప్రజలకు భక్తి బోధచేశాడు.

"వేదం బెవ్వని వెదకెడిని
ఆ దేవుని గొనియాడుఁడీ ॥

అలరిన చైతన్యాత్మకుఁడెవ్వఁడు
కలఁడెవ్వఁడె చట గలఁడనిన
తలఁతు రెవ్వనిని దను వియోగదశ
యిలనాతని భజియించుఁడీ ॥ (1-5)

మహావిష్ణువు నరసింహావతారం ధరించి భక్తుడైన ప్రహ్లాదుని రక్షించి దుష్టుడైన హిరణ్యకశిపుని గోళ్ళతో చీల్చి సంహరించాడు. అన్నమయ్య ఈ అవతార విషయాల్ని సూచిస్తూ స్వామిని వగ సింహము అని చమత్కరించి కీర్తిస్తు ఆయన మితిమీరిన మాయలు గలవాడు. ఆదిపురుషుడు, అహోబలంపై నెలకొన్నవాడు. బ్రహ్మాది దేవతలు, ఉపనిషత్తులు కూడా ఆ స్వామిని తెలుసుకోలేరు. నిప్పులు చిందించే కళ్ళతో తేజరిల్లుతున్నాడు. పాలసముద్రంలో పుట్టిన లక్ష్మిని కౌగిలిలో చేర్చుకున్నాడు. రాక్షసుడైన హిరణ్యకశిపుని తన అంకంలో ఉంచుకొని సంహరించాడు. నేడు వేదగిరి అయిన వేంకటాచలంపై ప్రశాంతంగా వెలసియున్నాడు. ఆ వగ సింహాన్ని

రెప్పపాటు లేకుండా కనులారా చూడమని జనులకు విష్ణుభక్తిని బోధించాడు.

"మలసీ జూడరో మగసింహము
అలవిమీరిన మాయల సింహము ॥

అదివో చూడరో ఆదిమపురుషుని
పెదయాథళము మీఁది పెనుసింహము
వెదకి బ్రహ్మాదులు వేదాంతతతులు
కదిసి కానగలేని ఘనసింహము ॥ (1-13)

ఎన్ని విద్యలు నేర్చినా ఎంతటివారైనా శ్రీహరిని ధ్యానించక పోతే వారికి ప్రశాంతత కలుగదు. కామక్రోధ లోభమోహాది అంతశ్శత్రువుల్ని జయించినవారు, ఉపవాసవ్రతాలు చేసినవారు, మహాతపస్వులు, పుణ్యాత్ములు, మతిమంతులు, మతిహీనులు, ఎవ్వరైనా బ్రహ్మకు తండ్రి అయిన అచ్యుతుని కీర్తించకపోతే పుణ్యశ్రేష్ఠులు కారనీ, ధన్యులు కారనీ, ముక్తిమార్గానికి అర్హులు కారని హరిభక్తిని బోధించాడు.

"ఎంతటి వారలు నెవ్వరును హరి
జింతించక నిశ్చింతులుగారు ॥ (1-32)

అన్నమయ్య స్వామినే కాక ఆ స్వామికి స్థావరమైన వేంకటాచలాన్ని కూడా అద్భుతంగా కీర్తించాడు. ప్రాభవమైన వేంకటాచలం పదివేల శేషుల పడగలతో ఒప్పినట్లుంది. అది మహోన్నతమయింది. బ్రహ్మాది దేవతలకు అపురూపమయింది. సమస్త మునులకు స్థిరనివాసం. దివిలోని దేవతలకు నిజమైన నివాసం. అది మన ముంగిలిలోని మూలధనం వంటిది. బంగారు శిఖరాలతో తేజరిల్లుతున్న పరమాత్మమయం.

అదే మోక్ష నిలయం. శ్రీనివాసునికి అత్యంత వైభవం. సమస్త సంపదల స్వరూపం పవిత్రతకే పవిత్రం అని స్తుతిస్తూ అలాంటి వేంకటాచలాన్ని చూసి తరించమని ప్రజలకు ప్రబోధించాడు.

"అదివో అల్లదివో హరివాసము
పదివేల శేషుల పడగలమయము ॥

తిరుమల కొండ కోనేటియందు నివసించువాడు, ఐశ్వర్యానికి స్థానమైనవాడు, ఆదిదేవుడు. అధవుడు, సామవేదగానలోలుడు, నేర్పరి, సాత్త్విక తత్త్వవేత్తలకు ఆధారమైనవాడు, దేవదేవుడు, సకల భావాలకు అతీతమైనవాడు అయిన శ్రీవేంకటేశ్వరుని సేవించమని తెలియజేశాడు.

"కొలువుడీ భక్తి గొండల కోనేటి
నిలయుని శ్రీనిధియైనవాని ॥ (1-44)

అన్నమయ్య మానవులకు విష్ణుభక్తి ప్రబోధించినట్లే సద్గుణాలను, సత్ప్రవర్తనను కూడా ఉపదేశించాడు.

అనుమానంగా బ్రతకడం, మనసుకు ఇష్టంలేని పొందు చేయడం, అపనిందలు పొందడం, ఉపాయంతో జయించగలనని ఇతరులకు ముప్పు కలిగించడం, విరుద్ధతత్త్వంతో ప్రవర్తించడం, స్త్రీల ముందు పట్టి ప్రగల్భాలు పలికి విర్రవీగడం, ఈ లోకంలో మహావిష్ణువే గతి అని భావించక పోవడం, శ్రీ వేంకటేశ్వరుని నిర్విరామంగా కొలువక పోవడం మొదలైన వన్నీ హేయమైనవని తెలిపాడు.

"అనుమానపు బ్రదుకది రోఁతాతన
మనసైనయని కూటమి మరిరోఁతా ॥

తనగుట్టెల్లా నెరిఁగిన వారల ముందట
తనమెచ్చులు చెప్పకొనుట రోఁత

వనితల ముందట పదరుచు పదరుచు
కను గవ గానని గర్వము రోఁత॥ (1-26)

మానవుడు ఎన్ని చదువులు చదివినా, ఎన్ని విషయాలువిన్నా చింతను వదలుకోవడంలేదు. సుఖ సంపదలు పొందడం లేదు. మానవుడు ఇతరుల్ని నిందించడం మానినప్పుడు, అతి కాముకుడు కానప్పుడు, చంచలత్వం, అసత్యం, విరుద్ధ ప్రవర్తన, కోపం వదలినప్పుడు, పరధనాన్ని ఆశించనప్పుడు, ఇతరులవల్ల నిందలు పడనప్పుడు, శ్రీ వేంకటేశ్వరుని మనసులో తలచినప్పుడు మానవుడు సద్గతులను పొంది సుఖశాంతులతో ఉండగలడని ఉపదేశించాడు.

"ఎంత చదివిన నేమి వినిన తన
చింతయేల మాను సిరులేల కలుగు॥

ఇతరదూషణములు యెడసిన గాక
అతికాముకుఁడు గానియప్పుడుగాక
మతి చంచలము గొంత మానిన గాక
గతియేలకలుగు దుర్గతులేల మాను॥ (1-62)

ఇది "ఎంతచదువు చదివియెన్ని విన్న నుగాని హీనుడవగుణంబు మానలేడు" అనే వేమన పద్యాన్ని తలపింపచేస్తుంది.

కృత. త్రేత, ద్వాపరయుగాల్లో తపసు, యజ్ఞయాగాదులు, క్రతువులచే కలిగే సమస్త శుభాలు ఈ కలియుగంలో కేవలం హరి నామ స్మరణతోనే కలుగుతాయని జ్ఞానులు చెబుతారు. అన్నమయ్య కూడా ఈ భావాన్నే వ్యక్తం చేస్తూ - కుమ్మరివానికి కుండలు తయారుచేయడం ఒక సంవత్సరకాలం పట్టితే వాటిని పగలగొట్టడానికి కర్రకు ఒక్కరోజు పట్టినట్లు విష్ణు నామస్మరణంవల్ల మాన

వుని అసంఖ్యాకమైన పాపాలు నశించిపోతాయని, గొఱ్ఱెలలోకి పులి చొచ్చినట్లు, కొండలమీద పిడుగుపడినట్లు, సమస్తదోషాలు, దుష్కర్మలు పటాపంచలవుతాయని, ఈ నమ్మకం అందరికీ కలగదని, పుణ్యాత్ములకే కలుగుతుందని అన్నమయ్య విష్ణునామస్మరణ ఫలితాన్ని సామెతల ద్వారా వివరించడం వ్యక్తమవుతుంది.

"ఈ విశ్వాసంబు యెవ్వరికి దోఁపదిది
పావనుల హృదయమున బ్రభవించు గాని॥ (1-64)

ఈ సంకీర్తన మొదటి చరణంలో కుమ్మరివాడు ఒక సంవత్సరం రోజులు కష్టపడి తయారుచేసిన కుండల్ని కర్ర ఒక్కరోజులో పగలగొట్టగల్గిన విధంగా ఎంతో కాలంనుంచి మానవుడుచేసినపాపాల్ని ఒక్క విష్ణునామం పోగొట్టుతుందని అన్నమయ్య పోల్చి చెప్పాడు. కుండలు చేయడం సత్కర్మ. పాపాలు చేయడం దుష్కర్మ. కర్రతో కుండల్ని పగలగొట్టడం దుష్కర్మ. విష్ణునామంతో పాపాల్ని పోగొట్టడం సత్కర్మ. ఈ రెండింటికీ పోలికలతో పొంతనలేదు. ఇందులో నశింపజేయడం అనే సమానధర్మం మాత్రమే పొసగుతుంది. భక్తుని పారవశ్యంలో దొర్లిన భావజాలంలో ఔచిత్యానౌచిత్యాలను గమనించక మొల్ల పేర్కొన్నటు" "-ఇహ పంసాధన మిమ్మహాత్మ చరిత్ర, తప్పులెంచకుడు బుధుల్" అన్నట్లు భక్తుని ప్రధానోద్దేశ్యాన్ని మాత్రమే గ్రహించడం మన ధర్మంగా భావిస్తున్నాను.

మానవుడు ఎన్ని సత్కార్యాలు, ఎన్ని తపస్సులు చేసి-, ఎన్ని సార్లు పాండిత్య వాదాల్లో గెలిచినా విష్ణువే దైవమని తెలుసుకొని మనస్సును ఆ స్వామిపై లగ్నం చేయకపోతే అధికుడుకాడని, మోక్షాన్ని పొందలేడని విష్ణుభక్తి మహిమనుగూర్చి తెలిపాడు.

ఎంత చేసిన తనకేది తుద
చింత శ్రీహరిపై జిక్కటే చాలు ॥

ఎడపక పుణ్యాలెన్ని చేసినా
గడమే కాకిఁకఁగడ యేది
తడ బడ హరియే దైవ మనుచుమది
విడువక వుండిన వెరవే చాలు ॥ (1-98)

కాలం ప్రభావంవల్లనో, లోకంతీరువల్లనో, మంచితనం అదుపు తప్పి సామ్యత్వం తగ్గిపోయిందని, ధర్మం, సత్యం, శాంతం, విజ్ఞానం, వివేకం లోకంలో మందుకోసం వెతికినా కనిపించడం లేదని, ఇక సంసారం, బ్రతుకులు కష్టమై పోతున్నాయని అన్నమయ్య సమాజపరంగా సామాన్య సహజరీతిలో ఆ వేదన చెందుతూ మానవు లందరిలో సద్గుణాలు పెంపొందాలని ప్రబోధించాడు.

కాలవిశేషమో లోకముగతియో సన్మార్గంబుల
కీలువదలె సౌజన్యము కిందయి పోయినది ॥

మఱియుఁక నేఁటివిచారము, మాలిన్యం బై పోయిన
వెఱుకలు, సంతోషమునకు నెడమే లేదాయ
కొఱమాలెను నిజమంతయు, కొంచలకేఁగెను సత్యము
మఱఁగై పోయను వినుకులు, మతిమాలెను తెలివి ॥

తమకిఁక నెక్కడిఁబ్రదుకులు, తపఁబడె నాచారంబులు
సమమైపోయిన నప్పుడె జాతి విడఁబములు
తిమిరంబింతయు బాపఁగ తిరువేంకటగిరిలక్ష్మీ
రమణుడు గతి దప్పను కలరచనేమియు లేదు ॥ (1-63)

మానవుడు పుట్టడం గిట్టడం కోసమే. కాని బ్రతికినంతకాలం సత్ప్రవర్తనతో ధార్మికుడుగా బ్రతకాలి. ఈ విషయాన్ని అన్నమయ్య అనేకరకాల సూక్తులతో లోకోక్తులతో సులభంగా అర్థమయ్యే రీతిలో వివరించాడు. చదవడం మంచిని తెలుసుకోవడం కోసమే. బ్రతకడం ధర్మార్థకామమోక్షాలను పొందడంకోసమే. చిగురుగా పుట్టడం కొమ్మగా మారడం కోసమే. ఈ లోకంలో కర్మలు చేయడం పరలోకం కోసమే. పరలోకానికి వెళ్ళడం మళ్ళీ ఈ లోకానికి రావడం కోసమే. ఇదంతా శ్రీవేంకటేశ్వరునిలో లీనం కావడం కోసమేనని మానవ ప్రవర్తనను, జీవిత సత్యాలను గూర్చి తెలిపారు.

తలఁచిన విన్నియు దన కొరకే వెలి
దెలియుట దనలో దెలియుట కొరకే ॥

ఉదయమందుట భవముడుగుట కొరకే
చదువుట మేలు విచారించుకొరకే
బ్రదుకుట పురుషార్థపరుఁడౌట కొలకే
యెదిరి గనుట తన్నెఱుఁగుట కొరకే ॥ (1-70)

స్త్రీని ప్రకృతి స్వరూపం అంటారు. ప్రకృతిలోని సోయగాలన్నీ స్త్రీ శరీరంలో పొడచూపుతాయి. ప్రకృతి సౌందర్యానికి మానవుడు ముగ్ధుడౌతున్నట్లే స్త్రీ రూపానికి చపలుడౌతుంటాడు. చివరికి ఆచపలత్వం జీవిత పతనం వరకు దారితీస్తుంది. అందువల్ల స్త్రీ వ్యామోహ విషయంలోను ఇతరమైన విపరీత కాంక్షల విషయంలోను అప్రమత్తంగా ఉండాలని అన్నమయ్య సందేశం ఇచ్చాడు. చూపులు ఎంతో సుందరంగా ఉంటాయి. కాని వాటికి వ్యసనం చెందితే ప్రాణ సంకటం కలిగిస్తాయి. మితిమీరిన కోరికలవల్ల బాధ అధికమవుతుంది, సంసారంవల్ల దుఃఖ భారం పెరుగుతుంది. శ్రీవేంక

ఈశ్వరుని దయవల్లనే. దేవుడొక్కడే అనే జ్ఞానం వస్తుంది. హృదయం పరిపక్వం చెందితే మోక్ష సుఖం కలుగుతుంది. ఈ ఉపదేశాన్ని

"ఎణ నయనల చూపు లెంత సొబగైయుండు
ప్రాణ సంకటములగు పనులు నట్లుండు ॥

ఎడలేని పరితాపమే రీతి దానుండు
అడియాస కోరి కెలునటువలెనె యుండు
కడలేని దుఃఖ సంగతియెట్ల దానుండు
అడరు సంసారంబు నట్లనే వుండు ॥ (1-99)

అనే సంకీర్తనలో ప్రశ్నోత్తర రీతిలో వ్యక్తం చేశాడు.

ఈ విధంగా అధ్యాత్మ సంకీర్తనల్లో అన్నమయ్య భక్తి జ్ఞాన మానవ ప్రవర్తనలకు సంబంధించిన వివిధ అంశాలను వివిధ రీతుల్లో ఉపదేశించి సాహిత్య పరమార్థాన్ని చేకూర్చాడు.

కోస్తావాణి
14-6-89



# అన్నమయ్య అభివర్ణించిన శ్రీకృష్ణసంకీర్తనలు

అన్నమయ్య మానవజీవితానికి సంబంధించిన సమస్త విష యాలను తన శృంగార అధ్యాత్మ సంకీర్తనల్లో పొందుపరచాడు. ఆచార వ్యవహారాలు, మనస్తత్వాలు, భక్తి ప్రపత్తులు, సామాజిక పరిస్థితులు, నోములు, వ్రతాలు, పండుగలు మొదలైనవాటినిగూర్చి విస్తారంగా వర్ణించాడు. వాటిలో శ్రీకృష్ణాష్టమి ఒకటి. ఇదే హిందు వులకు తొలిపండుగ అని కూడా పెద్దలు చెబుతుంటారు. శ్రీ మహా విష్ణువు దుష్టశిక్షణ శిష్టరక్షణకోసం దేవకీ వసుదేవులకు అష్టమసం తానంగా శ్రీ కృష్ణుడుగా అవతరించిన పర్వదినం కృష్ణాష్టమి. శ్రీ కృష్ణుడు భాద్రపదమాసం కృష్ణపక్షం, రోహిణీనక్షత్రంలో శ్రావణ బహుళాష్టమినాడు జన్మించాడు. కాబట్టి ఈ పర్వదినాన్ని బహుళాష్టమి, శ్రావణ బహుళాష్టమి, కృష్ణాష్టమి, గోకులంలో జన్మిం చాడు కాబట్టి గోకులాష్టమి అని, శ్రీకృష్ణ పరమాత్మ జన్మదినం కాబట్టి శ్రీకృష్ణ జయంతి అని ఇలా ఈ పర్వదినాన్ని రకరకాలుగా అభిభాషిస్తారు. ప్రతి సంవత్సరం మన హిందువుల పండుగలు ఈ పర్వదినంతోనే ప్రారంభమవుతాయి.

ఈ శ్రీకృష్ణ జన్మకథ బ్రహ్మ, విష్ణు, బ్రహ్మాండ బ్రహ్మ వైవర్త భాగవత, కూర్మ పద్మ మార్కండేయ పురాణాల్లోను వర్ణించ బడింది. ప్రత్యేకించి బ్రహ్మాండ పురాణంలో బ్రహ్మనారద సంవా దంలో శ్రీకృష్ణాష్టమి వ్రతకథ, వ్రతం చేసే విధానం కూడా చెప్ప బడింది. ఈ వ్రతాన్ని "శ్రీకృష్ణ ప్రీత్యర్థం సపరివార శ్రీకృష్ణ పూజాం కరిష్యే" అని సంకల్పం చేసుకొని—

"పర్యంకస్థాం కిన్నరాద్యైర్యుక్తాం ధ్యాయేత్తు దేవకీమ్
శ్రీకృష్ణ బాలకం ధ్యాయేత్ పర్యంకే స్తన పాయినమ్"

అని దేవకీ సహిత శ్రీకృష్ణ ధ్యానం చేసి పుష్పాక్షతలతో సుగంధ పరిమళాలతో అర్చనచేసి, ప్రార్థనతో పూజను పరిసమాప్తం చేస్తారు. శ్రీకృష్ణాష్టమి వ్రతం చాలా శ్రేష్ఠమయిందని, తాను ఈ వ్రతాన్ని చేసి ఈ దేవుని అనుగ్రహంవల్ల లోకసృష్టి చేయగల్గుతున్నానని, సూర్యచంద్రులు ఈ స్వామివల్లనే గతి తప్పక తిరుగుతున్నారని, హరిశ్చంద్రుడు ఈ వ్రత మహాత్మ్యం వల్ల దుఃఖ విదూరుడై తిరిగి సంపదలు పొందగల్గాడని, సనక సనందనాది యోగులు సర్వజ్ఞులు కావడానికి ఈ వ్రత మహిమే కారణమని, ఈ వ్రత ప్రభావాన్ని వ్యాసమహర్షి తనకు ఉపదేశించినట్లుగా బ్రహ్మదేవుడు తన మానసపుత్రుడైన నారదునికి ఈ వ్రతకథ తెలిపాడు.

ఇంతటి సర్వోత్కృష్టమైన శ్రీకృష్ణ జన్మకథను లీలాశుకుడు సంస్కృతంలో శ్రీకృష్ణ కర్ణామృతంలోను, నారాయణ తీర్థులు కృష్ణలీలా తరంగిణిలోను, అనేక సందర్భాల్లో పేర్కొన్నారు. పోతన భాగవతం - దశమ స్కంధంలోను, తరిగొండ వెంకమాంబ శ్రీకృష్ణ మంజరిలోను, పురందరదాసు తన సంకీర్తనల్లోను భక్తిరసామృతంగా ముగ్ధమనోహరంగా వర్ణించారు. ఇలా ఎందరో రచయితలు, కవులు శ్రీకృష్ణ కథను కావ్యాలుగా, గేయాలుగా, కీర్తనలుగా, నాటకాలుగా, సంగీత రూపకాలుగా అనేక ప్రక్రియల్లో అభివర్ణించి పునీతులయ్యారు. ఎందరో కళాకారులు తమ కళా విశేషాలతో ఈ కథను ప్రచారం చేసి చరితార్థులయ్యారు.

తాళ్ళపాక అన్నమార్యులు వేదవేదాంగాలు, పురాణాలు, భారత రామాయణాది సమస్త కావ్యాలను క్షుణ్ణంగా పఠించి అందు

లోని విష్ణులీలావిశేషాలను, శ్రీవేంకటేశ్వర ముద్రాంకితంగా ముప్పై రెండువేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలుగా రచించాడు. తిరుమల తిరుపతి దేవస్థానంవారి అవిరళ కృషివల్ల నేడు పద్నాలుగువేల సంకీర్తనలు లభించాయి. వీటిలో సుమారు 140 సంకీర్తనలు శ్రీ కృష్ణావతార సంఘటనలకు సంబంధించినవి. ఇందులో ఉద్దగిరి కృష్ణుడు, మాడుపురి చెన్నకేశవుడు, విజయనగరం కృష్ణుడు వంటి క్షేత్రముద్ర కలిగిన శ్రీకృష్ణ సంకీర్తనలు మొదలైనవి కనిపిస్తాయి.

"ఉవిదలాల చూడరే వుద్దగిరి కృష్ణుఁడు
చేరి అందెలమోఁతతో చెన్నకేశవా
యీ రీతి మాడుపురిలో నిట్లాడేవా"

"వేడుక కాఁడు గదమ్మ విజయనగరములోన
వేడ పెట్టీ సతులను వెన్నముద్ద కృష్ణుడు"

మొదలైనవి. శ్రీకృష్ణ జయంతిని నిర్దేశిస్తూ వ్రాసిన సంకీర్తనలు —

"భూమిలోనఁ గొత్తలాయ పుత్రోత్సవమిదివో
నేమపు కృష్ణ జయంతి నేఁడే యమ్మా"

"శిష్ట రక్షణమును దుష్ట నిగ్రహమును
సృష్టించెనొక్క వేళనే శ్రీ జయంతినాఁడు"

"హరికర్ఘ్యము లీరో జయంతి పండుగ సేయరో

మొదలైనవి. శ్రావణ బహుళాష్టమి పేరును నిర్దేశిస్తూ వ్రాసిన సంకీర్తనలు —

ఉదా॥ "కొడుకై జన్మించినాఁడు కూరిమి శ్రీకృష్ణుడు
నడురేయినిదె శ్రావణ బహుళాష్టమి"

"గోవిందుఁడు జనించె గోకులాష్టమిదె నేడు"

"అందమై మధురలోన నదివో కృష్ణావతార
మందెను శ్రావణ బహుళాష్టమి నేఁడు

మొదలైనవి. ఉట్ల పండుగకు సంబధించిన శ్రీకృష్ణ సంకీర్తనలు —

"బాలులతో వీథులలోఁ బారాడువాఁడు
కోల లెత్తుక వుట్లు కొట్టేఁజుండీ"

"పైకొని చూడరో వుట్లపండుగ నేఁడు
ఆకడ గొల్లెతలకు నానందము నేఁడు"

మొదలైనవి. శ్రీకృష్ణుడు శ్రావణ బహుళాష్టమి రోజున చల్లని చంద్రోదయ వేళలో అర్ధరాత్రి సమయాన దేవకీ వసుదేవులకు జన్మించడం, అప్పుడు దేవతలు సంతోషించగా, రాక్షసులు భయపడడం, దిక్కులలో దేవదుందుభులు మ్రోగడం, వసుదేవుడు మధురా నగరం నుంచి ఆ రాత్రే చిన్నికృష్ణుని ఎత్తుకొని యమునానదిని దాటి రేపల్లెకు వచ్చి యశోద ప్రక్కలో పరుండబెట్టి ఆమెకు పుట్టిన ఆడబిడ్డను ఎత్తుకొని మధురానగరికి రావడం, ఆమె కోపోద్రిక్తురాలై కంసుని శపించడం, రేపల్లెలో గోపికలు బాలకృష్ణునికి పుణ్యస్నానం చేయించి ముద్దులాడటం, ఆనాటి శ్రీకృష్ణుడే ఈనాడు శ్రీనివాసుడుగా అవతరించి జగన్మాత పద్మావతికి భర్తయై వెలసి లోకాల్ని రక్షిస్తున్నాడని తెలియజేస్తూ అన్నమయ్య—

"సురలు సంతోషించి రసురలెల్లానడఁగిరి
తొరలి దిక్కుల దేవ దుందుభులు మొరసి (8-509)

అనే సంకీర్తన రచించాడు.

అన్నమయ్యపై అంశాలన్నిటిని ఒక సంకీర్తనలో లలితమైన పదజాలంతో అందరికీ అర్థమయ్యే రీతిలో వర్ణించడం విశేషం. ఈ అంశాలనే అన్నమయ్య మరో సంకీర్తనలోకూడా పొందుపరచాడు.

"వింటిరటే చెలులాల వేడుక సంతోష వార్త
యింటనింట పూరనెల్ల యిదే సుద్ది
కోమలి దేవకిదేవి కొడుకుఁగంటే రేపల్లె
ప్రేమతో వసు దేవుఁడు పంచఁబెట్టివచ్చెనట
గామిడై యశోద కూఁతుఁగంసునికిఁ జూపెనట
ఆ మగువ కంసుని నద్దలించినదట (24-27)

ఇందులో ఒక గోపిక సాటిగోపికలతో కృష్ణావతరణ వార్తను గూర్చి తత్సంబంధమైన విషయాలను గూర్చి చెబుతున్నట్లు వర్ణించబడింది.

ఇంకా అన్నమయ్య సంకీర్తనల్లో పోతన భాగవతం దశమ స్కంధంలోని బాల్యవిశేషాలు, ఎర్రన హరివంశంలోని దివ్యలీలా వైభవ విశేషాలు వర్ణించబడ్డాయి. పూతన, శకటాసుర, తృణావర్త కంసాదుల సంహారం, ఉలూఖల బంధనం, కాళియమర్దనం, గోవర్ధనోద్ధారణం యశోదలాలనలు, గోపికల మురిపాలు మొదలైన ఘట్టాలకు సంబంధించిన విషయాలు తెలుపబడ్డాయి.

చన్నుదాగి రాకాసిప్రాణముహరించితివి 10-171

భూభారమణచె ధర్మము పరిపాలించె (8-112)

మాయరోలఁగట్టువడి మద్దులు విరిచి వేసి
ఆయతమై యున్న యట్టి యాతడీతఁడా (24-301)
గోవర్ధనమెత్తినట్టి గోవిందుఁడితఁడు (10-180)
గాలి రక్కసునిముఁగఁగమోఁది (11-234)
అచ్చపు బాలుఁడై శకటాసురు మర్ధించినాడు (8-235)
హరిమామ కంసుమద మడఁచెనేడు (10-179)

పాడరో ధర్మము నిల్చె భారమణచె
వోడించెఁగౌరవ దానవుల కంసాదులఁజంపె (9-172)

కృష్ణావతార ఘట్టాలకు సంబంధించిన ఇలాంటి సంకీర్తనలు అన్నమయ్య సంకీర్తనలో విరివిగా కనిపిస్తాయి.

అన్నమయ్య జానపదగేయ బాణీలలో కూడా శ్రీకృష్ణావతార విశేషాలను అభివర్ణించాడు. జానపదులలో బాలకృష్ణునికి సంబంధించిన గేయాలే ఎక్కువగా ప్రచారంలో ఉన్నాయి. ఎందుకంటే విష్ణుమూర్తి బాల్యక్రీడా విలాసాలను బహుభంగిమలతో సాగించింది శ్రీకృష్ణావతారం లోనే. అన్ని అవతారాల్లోకన్నా పుట్టింది మొదలు దుష్టశక్తుల్ని సంహరిస్తూ, శిష్టభక్తుల్ని సంరక్షిస్తూ వచ్చింది ఈ అవతారంలోనే, అన్నమయ్య జానపదులు పాడుకొనే మేలుకొలుపు, లాలి, జోల, సువ్వి, ఉగ్గు, గొబ్బి, జోబూచి, కూగూగువంటి జానపద గేయ బాణీలలో అచ్చమైన తేటతెనుగు భాషలో సంకీర్తనలు రచించాడు.

జానపద తల్లులు తమ బిడ్డల్ని బాలకృష్ణునిగా భావించి లాలి, జోలపాటలు పాడుతుంటారు. శ్రీకృష్ణుని సల్లక్షణాలను తమ బిడ్డలకు ఆరోపిస్తూ ఈ బిడ్డకు లాలిపాట పాడండి, ఇతడు లక్ష్మి విలా

సుడు ఇతనికి పాదంలో చక్రముద్ర ఉన్నది. వేదాంతాలు తెలిసిన వాడు. ఈ బిడ్డ వేణునాదంతో వేదాలను పాడుతాడుఅని వివరిస్తూ పాడే—

'లాలనుచు పాడరమ్మా ఈ బిడ్డ లక్ష్మీవిలాసుడమ్మా
పాదమున చక్రమమ్మా ఈ బిడ్డ వేదాంత వేద్యుడమ్మా

అనే లాలిపాట జానపదులు పాడుకలో ప్రసిద్ధమయింది. అన్నమయ్య ఈ కోవలోనే—

"లాలనుచునూ చేరులలన లిరుగడల
బాలగంధవరగోపాల నిను చాల"

అనే సంకీర్తన రచించాడు. జానపదులపాడుకలోని—

జో అచ్యుతానంద జో జో ముకుందా
రార పరమానంద రామ గోవిందా

అనే శ్రీకృష్ణ జోలపాట రీతిలోనే అన్నమయ్య—

"జోవచ్యుతానంద జో జో ముకుందా
రావె పరమానంద రామగోవింద

అనే సంకీర్తన రచించాడు. అన్నమయ్య రేపల్లెలోని యువతులు బాలుని బంగారు ఊయల తొట్టెలో వేసి ఊపే విధానాన్ని—

ఉయ్యాలా బాలునూఁ చెదరుఁ కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు

అనే సంకీర్తనలో మనోహరంగా వర్ణించాడు. దేవకీదేవి శ్రీకృష్ణుని సాధారణ తల్లిలా ఏడుస్తూ అరస్తూ కాకుండా నవ్వుతూ ప్రసవించిందని చెప్పడం, ఆ శుభసమయంలో చంద్రోదయం

కావడం, నలుదిక్కులలోని దేవతల బాధలు నశించడం, కలువలు వికసించడం, కంసుడు భయపడటం, గాడిద అరచినప్పుడు శిశుదేవుడు దానినోరు మూయడం, మొదలైన శ్రీకృష్ణ జనన వేళ జరిగిన సంఘటనల్ని —

"సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకినందనుఁగనియె

అనే సంకీర్తనలో పొందుపరచి జానపదులు పాడుకొనే సువ్వి పాట రీతిలో రచించారు.

తల్లులు పసిపిల్లలకు ఉగ్గుపెట్టిన తర్వాత అది బాగా జీర్ణం కావడానికి బిడ్డ చేతులు కాళ్ళను ముందుకు వెనుకకు వంచుతూ—

"చేయూ చమ్మా చేయూ చూ
సంతకు బోదాం చేయూ చు"

అనే పాట పాడుతారు, ఈ పాట రీతిలోనే అన్నమయ్య—

"ఉగ్గు వెట్టరేవో యమ్మా చె
య్యొగ్గీని దె శిశువో యమ్మా"

అనే సంకీర్తన రచించాడు. ఇందులో తల్లి యశోద తన దివ్య శిశువుపై గారాబంతో గోపికలను ఈ బిడ్డ ఉగ్గుకోసం చేయి చాస్తున్నాడని, ఉగ్గు పెట్టండని, పెట్టిన తర్వాత వేగంగా ఊచకండి అని, కడుపులోవున్న లోకాలన్నీ కదలిపోతాయి అంటూ హెచ్చరిక చేయడం కనిపిస్తుంది.

సంక్రాంతి పండుగ దినాల్లో బాలికలు గొబ్బి తట్టుతూ పాటలు పాడుతారు. ఆ పాటలు ఎక్కువగా గారమ్మకు, శ్రీకృష్ణునికి

సంబంధించి ఉంటాయి. అన్నమయ్య కూడా శ్రీకృష్ణుడు చేసిన చిలిపి చేష్టల్ని, సాహస కృత్యాన్ని కీర్తిస్తూ—

"కొలని దోపరికి గొబ్బిళ్ళో యదు
కుల స్వామికిని గొబ్బిళ్ళో"

అనే సంకీర్తన రచించాడు. ఇందులో గోపికలు కొలనులో జలకాలాడుతుంటే వారి వస్త్రాలను దొంగిలించడం, కొండను గొడుగుగా పట్టి గోవులను రక్షించడం, కంసుడు, శిశుపాలుడు మొదలైన దుష్టులను సంహరించడం మొదలైన విషయాలు చెప్పబడ్డాయి.

తల్లులు చిన్న పిల్లల ఏడుపు మాన్పించడానికి అదిగో బూచి వాడు వస్తున్నాడు అంటూ భయపెట్టే వాక్యమే వేగంలో అద్దో బూచి, దోబూచి అనే సంక్షిప్తపదం అయింది. ఆమాట ఊతపదంగా ఏర్పడి గేయంగా రూపుదాల్చింది. అన్నమయ్య దోబూచి పాట రీతిలో—

"బండి విరిచి పిన్న పాపలతోనాడి
దుండగీడు వచ్చె దోబూచి॥

అనే సంకీర్తన రచించాడు. ఇందులో చిన్నికృష్ణుడు శకటాసుర సంహారం గావించడం, రేపల్లెలో పొరుగిండ్లలో పెరుగు వెన్నలను దొంగిలించడం వంటి బాల్య క్రీడా విశేషాలు వివరించబడ్డాయి.

పల్లెటూళ్ళలో బాలురు ఆడుకొనేఆటలలో "కూగూగు" ఒకటి. ఒక బాలుడు చెట్టుపై కెక్కి కొనకొమ్మపై దొంగలా దాగుకుంటాడు. ఆ దొంగను తోటి బాలురు కనిపెట్టేటప్పుడు "అదిగో దొంగ" అంటూ ఒకరికొకరుచూపుకొంటూ అనేమాట సంక్షిప్తమై అగ్గొగ్గో గూగూగు, కూగూగు గా మారిందని తెలుస్తుంది. కాలక్రమేణా ఆ

మాట ఊతపదంగా మారి గేయంగా పరిణమించి "కూగూగు" పాటగా మారింది. అన్నమయ్య ఈ గేయరీతిలో చిన్నికృష్ణుని బాల్యలీలలను వర్ణిస్తూ—

గురుతెరిగిన దొంగ కూగూగువీఁడె
గుడిలోనె దాఁగీని కూగూగు"

అనే సంకీర్తన రచించాడు.

సర్వాంతర్యామి అయిన శ్రీకృష్ణ భగవానుని బిడ్డగా కన్న దేవకీదేవి ఎంతటి భాగ్యవంతురాలో, ఆ దివ్యబాలుని పురిటిప్రాయం నుంచీ పెంచి వాత్సల్య భక్తితో సేవలుచేసి ఆ బిడ్డ తేనెలొలుకు తొక్కుపలుకులలో, వింత వింత చేష్టలలో పారవశ్యులైన యశోద అంతకన్నా అదృష్టవంతురాలు. రేపల్లె గోపికలు ధన్య చరితలు. అన్నమయ్య వీరుపొందిన అనుభూతుల్ని రమ్యంగా వర్ణించి కళ్ళ ఎదుట దృశ్యమానం చేశాడు.

చిన్నికృష్ణుడు తోటి బాలురతో ఎక్కడో ఆడుకొంటూ పాలు త్రాగడంకూడా మరచిపోయాడని, ఆ ముద్దుబిడ్డ ఎక్కడున్నాడో వెదకి తెచ్చి కడుపునిండా పాలుపొయ్యండని యశోద బిడ్డపైనున్న అవ్యాజ ప్రేమతో గోపికలను హెచ్చరిస్తున్న విషయం—

"ఇట్టి ముద్దులాడు బాలుఁడేడ నున్నాడో
వాని పట్టి తెచ్చి పొట్టనింప పాలుపొయ్యరే"

అనే సంకీర్తనలో వర్ణించాడు. ఇలాగే గోపికలు చిన్నికృష్ణుని సౌందర్యాన్ని చూచి—

"చిన్ని శిశువూ చిన్ని శిశువూ
యెన్నడుం జూడమమ్మ యిటువంటి శిశువూ"

అంటూ ఆశ్చర్యపడటం. చిన్నికృష్ణుని అల్లరి చేష్టల్ని గూర్చి గోపికలు యశోదకు మొరపెట్టుకోగా యశోద తన బిడ్డపై వున్న మమకారంతో తిరిగి వారినే—

"కానరటె పెంచరటె కటకటా బిడ్డలను
నేను మీవలెనేకంటి నెయ్యమైన బిడ్డని"

అంటూ తూలనాడటం, గోపికలు చిన్నికృష్ణుని అల్లరి చేష్ట లకు బాధపడి, విసుగుచెంది కొట్టతుంటే ఒక గోపిక—

"ముత్తవు రెయమ్మలాల ముద్దులాడు వీడె
ముత్తెమువలె నున్నాడు ముద్దులాడు"

అని అంటూ ముద్దుగా, ముత్యంలావున్న ఈ బిడ్డను కొట్ట వద్దని అడ్డుపడటం మొదలైన విషయాల్ని అన్నమయ్య సుమనోహ రంగా వర్ణించాడు.

ఈ విధంగా పరమ విష్ణుభక్తుడు సకల వేదశాస్త్ర పారంగతుడు అయిన అన్నమయ్య అలనాటి శ్రీకృష్ణావతార అద్భుతలీలావిలాసా లను సహృదయ పాఠకులకు ప్రత్యక్షీకరింప జేశాడు.

విష్ణుమూర్తికి సంబంధించిన అవతారాలలో శ్రీకృష్ణావతారం పరిపూర్ణమయింది. భగవంతునికి ఉండవలసిన చతుషష్టి గుణాలన్నీ శ్రీకృష్ణునిలో మాత్రమే ఉన్నాయని, "కృష్ణస్తు భగవాన్ స్వయం అని పెద్దల ప్రవచనం. జగద్గురువు, కరుణా హృదయుడు, దుష్టశిక్ష కుడు అయిన శ్రీకృష్ణపరమాత్మ జన్మదినం సమస్త సాధుజనులకు ఆహ్లాదకరమయింది. ఆయన జన్మించింది మొదలు నిర్యాణం వరకూ ప్రదర్శించిన అద్భుత లీలల్ని తెలుసుకొని, కొనియాడి తరించడం లోక కర్తవ్యం.

సమాజానికి, దేశానికి, ప్రపంచానికి వివిధ రూపాలలో, వివిధ కార్యాలలో విశిష్టసేవలందించిన పుణ్యపురుషుల జయంతులను జరుపుకోవడం మన సంప్రదాయం, మన కర్తవ్యం. అలాగే అలనాడు బ్రహ్మాది దేవతలుకూడా ఆనందోత్సాహాలతో భక్తి శ్రద్ధలతో కృష్ణాష్టమి జరుపుకొని అనంత పుణ్యఫలాలను పొందినట్లుగా మనం కూడా ఈనాడు కృష్ణాష్టమి పర్వదినాన్ని జరుపుకొని ఆయన అద్భుత లీలల్ని స్మరించుకొని ఆయన అనుగ్రహం పొంది మానవ జన్మను సార్థకం చేసుకోవడం మన ధర్మం.

కోస్తావాణి
10-8.1993



# అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో గురుభక్తి ప్రబోధం

భగవంతుడు సృష్టించిన ఈ విశాలమైన అందాల ప్రకృతిలోని జీవరాశుల్లో మానవుడు ఉత్తమజీవి. అందుకే "జీవానాం మనుజ శ్రేష్ఠః" అనే ఆర్యోక్తి వచ్చింది. ఆహార నిద్రా భయ శోకాదులు అన్ని జీవరాశులకూ సమానమే అయినా వివేచన, భాష, శరీరావయవ సౌఖర్యం వంటి ఉత్కృష్ట లక్షణాలను భగవంతుడు మానవునికే ప్రసాదించాడు. ఈ లక్షణాలద్వారా మానవుడు తన జీవితాన్ని సార్థకం చేసుకొని పరమాత్మలో కలసిపోవాలి. మానవ జీవితం సార్థకం కావాలంటే తనకున్న మౌలికమైన ఆలోచనా శక్తి అభివృద్ధి చేసుకోవాలి. అందుకు విద్య నభ్యసించాలి. మానవుని సకల జీవరాశులనుండి వేరుచేసేది ఈ విద్య ఒక్కటే. "విద్" అనే ధాతువుకు "ల్యప్" ప్రత్యయంచేరడంవల్ల "విద్య" అనే రూపం ఏర్పడింది. విద్య అంటే తెలుసుకోవడం అని అర్థం. దీన్ని గూర్చి తెలుసుకోవడం అంటే వేద, వేదాంగ, వేదాంత, పురాణ, రామాయణ, భారత, భాగవతాది సకల ఉద్గ్రంథాలను, అవి ప్రతిపాదించిన భగవంతుని, ఇంకా ప్రకృతి విషయ పరిజ్ఞానాన్ని మొదలైన వాటిని గూర్చి తెలుసుకోవడమని అర్థం.

మానవునిలో తెలివితేటలు పెరిగే సరికి అతనిలో ఒక విలక్షణమైన తేజస్సు, సౌమ్యత్వం, సంస్కృతి కూడా పెరుగుతూ వస్తుంది. కాబట్టి ప్రతి మానవుడు విద్య నభ్యసించాలి. పోతన భాగవతంలో హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో—

చదువని వాఁడజ్ఞుండగు
చదివిన సదసద్వివేక చతురత గలుగున్
చదువఁగ వలయును జనులకు
చదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ

చదువుకుంటే సదసద్వివేకం కలుగుతుందని, జనులందరికీ కూడా చదువులు తప్పనిసరి అని, చదువు లేని వాడు అజ్ఞాని అని చదువుల ప్రాధాన్యాన్ని తెలియజేశాడు. విద్య లేనివాడు వింత పశువు అనే లోకోక్తి కూడా ప్రసిద్ధమయింది. భర్తృహరి సుభాషిత త్రిశతిలో—

విద్యని గూఢగుప్తమగు విత్తము రూపము పురుషాళికిన్
విద్య యశస్సు భోగకరి విద్య గురుండు విదేశ బంధుఁడున్
విద్య విశిష్ట దైవతము విద్యకు సాటిధనమ్ము లేదిలన్
విద్య నృపాలపూజితము విద్య నెఱుంగనివాడు మర్త్యుఁడే

అని విద్య విలువను అనేక విధాలుగా చాటి విద్య లేనివాడు మరణించినవానితో సమానమని చెప్పాడు అలాగే

రూపయౌవన సంపన్నాః విశాలకుల సంభవాః
విద్యాహీన నశోభంతే నిర్గంధా ఇవకింశుకాః

అనే శ్లోకాన్నిబట్టి విద్యలేనివానికి కులం, రూపం, ధనం యౌవనం అన్నీ ఉన్నా వాసనలేని మోదుగపుష్పంలా అవి వృథా అని తెలుస్తుంది. ఇలా విద్య విలువను గూర్చి అనేక కవులు, పండితులు ఎన్నో విధాలుగా జనులకు బోధించారు.

అయితే విజ్ఞానం సంపాదించిన విద్యావంతులందరూ సదసద్వివేకం, సత్యభాషణ, దయ, త్యాగం, క్షమ, నమ్రత, నీతి వంటి

సంస్కార లక్షణాలను కలిగివున్నారా అని ప్రశ్నించుకుంటే అవి సంశయాస్పదమనే చెప్పవచ్చు. కానీ విద్యావంతులు తప్పనిసరిగా ఈ సులక్షణాలను పుణికి పుచ్చుకొని అవలక్షణాలను వదలిపెట్టాలి లేకపోతే—

విద్యచే భూషితుండయి వెలయుచున్న
దొషరి వర్జింపగు జుమీ దుర్జనుండు
చారు మాణిక్య భూషిత శస్త్రమస్త
కంబైన పన్నగము భయంకరముగాదె

అని భర్తృహరి చెప్పిన నీతి ప్రకారంగా అందమైన మాణిక్యంతో అలరారుతున్న పడగ గల్గిన విషసర్పం మానవులకు ఎంత భయంకరమో, అలాగే దుర్జనుడైన విద్యావంతుడు కూడా వర్జనీయుడే అవుతాడు. విద్య ఉండి కూడా వివేకంలేని మానవులను భాస్కర శతక కారుడు మారద వెంకయ్య కవి—

చదువది యెంత గల్గిన రసజ్ఞత యించుక చాలకున్ననా
చదువు నిరర్థకంబు గుణ సంయుతు లెవ్వరు మెచ్చరెచ్చటన్
పదనుగ మంచి కూరనల పాకము చేసిననైన నందు నిం
పొదవెడు నుప్పు లేక రుచి పుట్టగ నేర్చునటయ్య భాస్కరా

అని తెలియ జేసినట్లు రకరకాల పదార్థాలను ఉపయోగించి ఎంతో చాకచక్యంగా మంచి వంటకం తయారుచేసి అందులో ఉప్పు వేయకపోతే ఎలా రుచించదో అలాగే మానవుడు ఎన్నో చదువులు నేర్చి గొప్ప విద్యావంతుడైనా అతనిలో వివేకం లేకపోతే ఆ వ్యక్తిని గౌరవించరు. కాబట్టి మానవులందరూ విద్యావంతులు కావాలి, విద్యావంతులందరూ సంస్కారవంతులు కావాలి. అప్పుడే విద్య సార్థకం అవుతుంది. సమాజం దేశం సుఖ శాంతులతో వర్ధిల్లుతుంది.

లౌకిక విద్య నేర్చుకోవాలన్నా, అలౌకిక విద్య నేర్చుకోవాలన్నా గురువు అవసరం. ఎన్నో సంవత్సరాలు శ్రమించి నేర్చుకున్న విద్యను, సంపాదించుకొన్న జీవితానుభవాలను గురువు శిష్యులకు త్యాగం చేస్తాడు. గురుముఖంగా కాకుండా స్వయంగా గ్రంథాలు చదివి తెలుసుకోవడం కష్టసాధ్యం. అయినా ఒక్కసారి అందులోని గూఢార్థాలు స్ఫురించవు. అందుకే గురుముఖతః నేర్చుకున్న విద్యే చక్కగా రాణిస్తుంది. 'గు' అంటే చీకటిని, 'రు' అంటే పోగొట్టువాడని అర్థం. శిష్యుని మనస్సులోని అజ్ఞాన అంధకారాన్ని తొలగించి అతని బ్రతుకులో నిత్యం వెలుగును నింపగలవాడే సద్గురువు. "శిష్యుని శాశ్వతానందుని చేయడం కోసం శిష్యునికి తాత్కాలిక క్రోధాన్ని కలిగించేది అయినా సత్యజ్ఞానాలనే గురువు బోధించాలి. లౌకిక విద్యలకన్నా అధ్యాత్మ విద్యలు క్లిష్టమైనవి. ఎంతటి మేధావికైనా గురువు లేకుండా అధ్యాత్మ విద్య సాధించడం సాధ్యం కాదని శ్రీ శంకరాచార్యులు మాండూక్యోపనిషత్‌లో పేర్కొన్నారని శ్రీ సుందర చైతన్యానంద (సర్వ జ్ఞాన దాత గురువు — కోస్తావాణి 23-7-1989) పేర్కొన్నారు.

అధ్యాత్మ గురువు భగవంతుడితో సమానం అంటారు అందుకే—

గురుః బ్రహ్మ గురుః విష్ణుః గురుదేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః

అనే ఆర్యోక్తి బాగా ప్రసిద్ధమయింది. గురువును బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులతో సమానమైనవాడు. సాక్షాత్ పరబ్రహ్మ అని భావించాలి.

గురుశిష్య సంప్రదాయం సనాతన మయింది. దీని వ్యవస్థాపకుడు గురువులకు గురువైన వేదవ్యాసమహర్షి. అందువల్ల ఆ మహర్షి

జన్మించిన ఆషాఢపూర్ణిమ దినాన్ని గురుపూర్ణిమ పర్వదినంగా భావించి దేశంలో వెలసిన గురుదేవు లందరికి పూజచేయడం జరుగుతుంది. వ్యాసుని వదలిపెట్టి సనాతన ధర్మవాఙ్మయాన్ని మనం ఊహించలేము. వేదాలను సంగ్రహించి, సంస్కరించి, సన్నిధాన మొనర్చిన వేదవ్యాసుడు వేదాలను విభజించి ఋగ్వేదాన్ని సుమంతునికి, యజుర్వేదాన్ని వైశంపాయనునికి, సామవేదాన్ని జైమినికి, అధర్వణ వేదాన్ని పైలునికి బోధించాడు. వాస్తవానికి ఈ విశ్వానికి కంతటికీ గురువు మహావిష్ణువే. అందుకే "కృష్ణం వందే జగద్గురుమ్" అనే స్తుతి లోకప్రసిద్ధమయింది. అన్నమయ్య శ్రీవేంకటేశ్వర శతకంలో పద్మావతిని స్తుతించే పద్యంలో 'పల్లవపాణి విశ్వగురు భామిని' అని శ్రీ వేంకటేశ్వరుని 'విశ్వగురువుగా' పేర్కొన్నాడు. స్వల్పాయుష్కులు, బుద్ధిహీనులు, బలహీనులు అయిన మానవుల కోసం జగద్గురువైన శ్రీమన్నారాయణుడు సత్యవతీ (మత్స్యగంధి) పరాశరుల పుత్రుడుగా జన్మించి అనంత వేదాలను నాలుగుభాగాలుగా విభజించాడు. కాబట్టి వ్యాసభగవానుడు సాక్షాత్తు విష్ణుమూర్తి కావడంవల్ల—

వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
తిమోవై బ్రహ్మనిధియే వాసిష్ఠాయ నమోనమః

విష్ణురూపుడైన వ్యాసుడు, వ్యాస రూపుడైన విష్ణువు బ్రహ్మనిధి అయిన వశిష్ఠపాత్రునకు నమస్కారం అంటే వ్యాసుని ప్రార్థించడం భారతీయ సంప్రదాయం. వేద విజ్ఞానాన్ని గ్రహించలేని మానవులకోసం వేదవ్యాసుడు పురాణ ఇతిహాసాలను కూడా రచించాడు.

భక్తి రసప్రధానమైన శ్రీమద్భాగవతాన్ని వ్యాసుడు తన కుమారుడు, శిష్యుడు అయిన శుకమహర్షికి బోధించాడు. బ్రిహ్మ

సూత్రాలను రచించడం వల్ల ఆచార్యుని జ్ఞాన శక్తి అవతారంగా సర్వులు కీర్తిస్తున్నారు. ఈ గురుభక్తికి సంబంధించిన విషయాలు అన్నమయ్యకు పూర్వాపర కవుల రచనల్లో కూడా కనిపిస్తాయి. కృష్ణ శతకంలో నృసింహాకవి భగవంతుడే గురువని చెబుతూ "నీవే గురుడవు దైవము" అని పేర్కొన్నాడు. గురుభక్తి కలిగివుంటే సకల శాస్త్రాలను తరచి చూడవచ్చని సమస్త ప్రయోజనాలు చేకూరుతాయని కవికులాలంకార, కవిరాజహంసలైన సుప్రసిద్ధ జంట కవులు శ్రీ వేంకటపార్వతీశ్వర కవులు

"గురుభక్తి కళారత్నా
కరతరణ వశిష్ఠ జీవికాపరణంబున్
గురుభక్తి కలుగు వారల
కరుదే సకలార్థ సిద్ధియగుట ధరిత్రిన్"

అని ప్రబోధించారు.

గురుశిష్య కర్తవ్యాలకు, ధర్మాలకు సంబంధించి వేదాంతుల గ్రంథాల్లోను, శ్రుతుల్లోను కూడా అనేక అంశాలున్నాయి. "నిరంతర ప్రసారమే కిరణానికి జీవగుణం" అన్నట్లు విద్యార్థి మెదడుకు జవాన్ని, జీవాన్ని యిచ్చి పదును పెట్టే నిత్యనూతన విద్యార్థి గురువు. (పి. యం. రామకృష్ణారెడ్డి, ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగు లెక్చరర్ - 'స్వధర్మ' సెమినార్ వ్యాసం) స్వామి వివేకానందుడు - "ఎవరు విద్యార్థి స్థాయికి దిగివచ్చి తన ఆత్మ (జ్ఞానాన్ని) ను విద్యార్థి ఆత్మలోకి బదిలీ చేస్తాడో అతడే నిజమైన గురువు" అని సందేశమిచ్చాడు. పింగళి సూరన కళాపూర్ణోదయంలో నారదుడు అన్నట్లు 'నీటిలోలది తామరలా', 'ఎప్పటికెయ్యది ప్రస్తుతమో' అంతే మాత్రమే ప్రదర్శించేవాడు ఉత్తమ గురువు. శత సహస్ర సంఖ్యలో విద్యార్థుల, సామాజికుల కళ్ళు అనుక్షణం తనను అనుసరిస్తుంటాయి.

గమనిస్తుంటాయి కాబట్టి గురువు ప్రవర్తన ఉన్నతోన్నతంగా భాసించాలి. 'యద్యదా చరితా శ్రేష్ఠః తత్తదేవేతరోజనః అన్నట్లు శ్రేష్ఠులైన వారిని లోకం అనుసరిస్తుంది కాబట్టి తన నడవడిక లోకానికి మార్గదర్శకం కావాలి.

విద్యార్థి తన జీవిత కాలంలో పొందే జ్ఞానంలో పాతికవంతు మాత్రమే ఆచార్యుని వల్ల పొందగలుగుతాడు. పాతిక వంతు శిష్యుడు తన మేధస్సుతో, మరో పాతికవంతు సహాధ్యాసకులతో, ఇంకో పాతికవంతు కాలక్రమంలో పొందగల్గుతాడని—

ఆచార్యాత్ పాదమాదత్తే. పాదం శిష్యమేధయా
పాదంసబ్రహ్మ చారిభ్యః పాదం కాలక్రమేణచ

అనే శ్లోకంవల్ల తెలుస్తుంది. కానీ ఇందులో సహాధ్యాసకుల వల్ల పాతిక వంతు పొకదగల్గుటమనేది సందేహాస్పదమే. సహాధ్యాస కులలో పోటీ ఉంటుంది కాబట్టి అందరూ విశాలదృక్పథంతో తమకు తెలిసిన విషయాలు ఇతరులకు చెప్పరు. కాబట్టి గురుముఖతః కొంత, స్వయం కృషితో మరికొంత, కాలక్రమంలో ఇంకొంత తెలుసుకొనే అవకాశం ఉంది. ప్రహ్లాదుడు తన తండ్రి ఏమేమి చదివావు అని అడిగినప్పుడు—

చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు
నే జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ

అని సమాధానమిస్తాడు. కాబట్టి శిష్యుడు గురువు చెప్పినంత వరకేకాక స్వాంతప్రయత్నంతో ఎన్నో గ్రంథాలు చదివి విషయాలు తెలుసుకోవాలి.

విద్యార్థి కల్పతరువులో ఆచార్యుడు విద్యార్థికి బోధించే త్రివిధ దీక్షలు పేర్కొనబడ్డాయి.

దృగ్దీక్ష : చేప నీటిలో గ్రుడ్లు పెట్టి ముందుకు సాగుతూ వెనుకకు తిరిగి చూస్తుందట. ఆ చూపుతో వెంటనే గ్రుడ్లు పిల్లలగా మారుతాయట. అట్లే గురువు తన దృష్టి ప్రసారంతోనే శిష్యుడిని తనంత వాడిగా చేసుకొంటాడట.

వాగ్దీక్ష : భ్రమరం ఒక పురుగును పట్టుకొని, గూటికి అతికించి "నీవు నాలాగే తయారవుతావు" అని చాలాసార్లు ఆ కీటకం ఊది తనలాగే తయారు చేసుకొంటుందట. దీనినే భ్రమర కీటక న్యాయం అంటారు. గురువు కూడా తన జ్ఞానాన్ని శిష్యునికి చెప్పి తనస్థాయికి తెచ్చుకొని ఆనందపడతాడట.

స్పర్శాదీక్ష : పక్షి గ్రుడ్లను గూటిలో పెట్టి తన ఆచ్ఛాదనచే పొదిగి పిల్లలను చేస్తుందట. గురువు కూడా శిష్యుడిని తన చేతితో స్పర్శిస్తూ, ధైర్యాన్ని చెప్పి తనంత వాడుగా తయారుచేసి ఉప్పొంగిపోతాడట. ఇలాంటి దీక్షల్ని ఉత్తమ గురువే పాటిస్తాడు.

సదహగాహన, అన్యోన్య గౌరవం, ఆదరాభిమానాలున్న ఉత్తమ గురుశిష్యులు తేజస్వరూపుడైన భగవంతుని—

ఓం సహనావవతు - సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై - తేజస్వినావధీతమస్తు
మావిద్విషావహై - ఓం శాంతిః శాంతిః శాంతిః

ఓంకార శాంతిరూపుడైన పరమాత్మ మనలనిద్దరిని కాపాడుగాక! మనం కలసి అనుభవింతుముగాక! మనం శక్తిసంపన్నులవుదము

గాక! విద్యవల్ల తేజస్వులమవుదుముగాక! మనం పరస్పరం కలహించు కుందుముగాక! అని ప్రార్థిస్తారని చెప్పబడింది. (తైత్తరీయోపనిషత్)

మన పురాణేతిహాస గ్రంథాల్లో ఇలాంటి ఆదర్శప్రాయులైన ఉత్తమ గురు శిష్యుల జంటలు కనిపిస్తారు. సూర్య-హనుమంతులు, విశ్వామిత్ర-రామలక్ష్మణులు, ద్రోణాచార్య-అర్జునులు, పరశురామ-భీష్ములు, పరతంతు-కౌత్స్యులు, శుక్రాచారి-కచులు, రామకృష్ణ-వివేకానందులు, రామానుజాచార్య-కుమారత్తాళ్వారులు, శొంఠి వేంకటరమణయ్య-త్యాగరాజులు, సోక్రటీసు-ప్లేటోలు మొదలైన ప్రసిద్ధులు. ద్రోణాచార్య మృత్తికరూపాన్ని ఏర్పరచుకొని తపోధ్యానంతో పరోక్షంగా శిష్యరికం చేసి, చివరికి గురుకోరికపై తన అంగుష్ఠాన్నే సమర్పించి నేర్చిన విలువిద్యలన్నీ కోల్పోయిన ఏకలవ్య శిష్యుని చరిత్ర తలచుకొంటేనే కళ్ళు చెమ్మగిల్లని సహృదయు లుండరు. ఆ త్యాగమూర్తి పేరుమీదగానే పరోక్ష శిష్యులకు ఏకలవ్య శిష్యులనే పేరు లోకంలో స్థిరపడింది.

ద్రావిడదేశంలో పన్నెండవ శతాబ్దంలో వైష్ణవ భక్తిప్రచారాలకోసం ఆళ్వారులు విష్ణుమూర్తి అంశతో జన్మించారు. వారిలో రామానుజాచార్యులు విశిష్టాద్వైతమత స్థాపకులు. వీరు ఆది శేషావతారులని ప్రసిద్ధి. వీరు ఆచార్యాభిమానం, ఆచార్యసేవ, ఆచార్య విధేయం కలిగినవారు. వీరు అంతిమోపాయ నిష్ఠులు. అంటే ఆచార్యాభిమానమే ఉత్తారకరమని నమ్మినవారు. వీరు ఆచార్యుని దైవంగా, అంతకన్నా అధికంగా కూడా భావిస్తారు. శ్రీరామానుజుల వైష్ణవ సిద్ధాంతాలను, భక్తి ప్రపత్తులను లోకంలో కొనసాగింప జేయడానికి తాళ్ళపాక అన్నమాచార్యులు పదిహేనవ శతాబ్దంలో అవతరించాడు.

అన్నమయ్య తిరుమల శ్రీనివాసుని దివ్యావతారం. బాల్యం నుంచీ తల్లిదండ్రుల పట్ల, గురువుల పట్ల, పెద్దల పట్ల, ఇరుగు పొరుగు వారి పట్ల, నమ్రతతో మెలగేవాడు. అందువల్ల ఆయన వ్రాసిన వేలాది సంకీర్తనల్లో అక్కడక్కడా ఆచార్య సేవ, గురుభక్తికి సంబంధించిన సంకీర్తనలు కనిపిస్తాయి. ప్రతివ్యక్తికి తల్లి, తండ్రి, గురువు ఆరాధ్యనీయులు. వీరిని సేవించనదే దైవకృప దొరకదు. అందుకే మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అని శ్రుతులు పలికాయి. తల్లి బిడ్డకు తండ్రిని చూపిస్తే, తండ్రి బిడ్డకు గురువుని చూపిస్తాడు. ఆ గురువు జ్ఞానబోధ చేసి దైవాన్ని చూపిస్తాడు. ఈ విషయాన్నే పోతన భాగవతంలో "కుంభినీదవు జెప్పు గురుడు గురుడు అని తెలియజేశాడు.

అన్నమయ్య పుట్టుకతో స్మార్త బ్రాహ్మణుడైనా స్వామిచే ఆజ్ఞాపితుడైన ఘన విష్ణువనే యతీంద్రునిద్వారా పంచ సంస్కారాలు పొంది వైష్ణవ దీక్ష పుచ్చుకొని పరమ వైష్ణవాచార్యుడయ్యాడు. ఆచార్యుడంటే నేటి కాలంలో వలె డిగ్రీలుపుచ్చుకొని పట్టభద్రుడై పదవులు అలంకరించినవాడని ఆనాటి అర్థం కాదు. వేదాలు, శాస్త్రాలు పఠించి, వ్యాఖ్యానం చేసి ఆచరించేవాడని అర్థం. అన్నమయ్య పుట్టుకతోనే ప్రతిభావంతుడైనా, వెన్నునివరంతో సర్వవిద్యలు జిహ్వారంగ సీమపై నర్తించినా, శాస్త్రోక్తంగా, లోకమర్యాదగా విద్య నభ్యసించాడు. అన్నమయ్య మనుమడు చిన్నన్న వ్రాసిన అన్నమాచార్య జీవిత చరిత్రలో—

నిరతమై గురుఁడు పనీతు గావించి
నయ వేదినధ్యయనటు సేయించె

అని చెప్పబడింది. అన్నమయ్య వివాహితుడైన తర్వాత అహోబల నారసింహ భక్తుడైన వేదాంతదేశికుడైన శఠకోపమునీం

్రుని వద్ద సకలవేదాంత పఠనం గావించాడు. గురువుపట్ల భక్తి ప్రపత్తులు ప్రదర్శించి, శుశ్రూష చేసి గురువు అనుగ్రహానికి పాత్రు డయ్యాడు. అందువల్ల అన్నమయ్య తన సంకీర్తనల్లో గురుభక్తికి సంబంధించిన అనేక విషయాలను తెలియజేశాడు. అన్నమయ్య యోగీశ్వరుల పద్ధతులను గూర్చి తెలియజేస్తూ యోగీశ్వరులు (నిశ్చల మనస్కులు) వివేకులను గూర్చి స్మరించుకుంటారని, విజ్ఞాన దాయకమైన కథలు వింటారనికి భయ భక్తులతో ఆచార్యసేవ చేస్తా రని తెలిపాడు.

పరమయోగీశ్వరుల పద్ధతియిది
ధరణిలో వివేకులు దలపోసుకొనుట ॥

..................................

నడుమనడుమ విజ్ఞానపు కథలు వినుట
చిడుముడి నాచార్యసేవసేయుట (3-212)

..................................

జ్ఞానవంతులైతే ఎవరైనా ముక్తి పొందుతారని, కాలం దైవ సృష్టి అని, కలిమి అన్యుల భాగ్యమని, వీటినిగూర్చి చెప్పజాలమని, ఈ విలాసాలన్నీ శ్రీవేంకటేశ్వరునివని, ఆచార్యుడు ఓర్పుతో చెప్పగా విని నడుచుకోవడమే సుజ్ఞానమని అన్నమయ్య హితబోధ చేయడం తెలుస్తుంది.

ఇట్టె జ్ఞాన మాత్రమున నెవ్వరైన ముక్తులే
పుట్టుగులు మరిలేవు పొందుదురు మోక్షము ॥

..................................

కాలము దైవము సృష్టికలిమనుష్యులభాగ్యము
వాలాయించి యెవ్వరికి వచింపరాదు
యీలీలలు శ్రీవేంకటేశ్వరునివి ఆచార్యుఁడు
తాలిమి జెప్పగావిని తలచుఁటే సుజ్ఞానము ॥ (3-211)

అన్నమయ్య ఎన్నో గొప్ప గ్రంథాలు తరచిచూచి ఎన్నో విషయాలు తెలుసుకున్నాడు. ఆ విషయాలు - వైరాగ్యం కన్నా మించిన లాభం లేదని, విజ్ఞానం కన్నా మించిన సుఖం లేదని, సద్గురువు కన్నా గొప్ప రక్షకుడు లేడని, సంసారం కన్నా మించిన వైరం లేదని తెలిపాడు.

కంటినిదే యర్థము ఘనశాస్త్రములు దవ్వి
వంటున నిందుకంటె నునాలెమోందూలేదు ॥

మేటి వైరాగ్యముకంటే మిక్కిలి లాభము లేదు
గాటఁపు విజ్ఞానము కంటే సుఖము లేదు
ఘనుఁడైన గురువు కంటే మీఁద రక్షకుఁడు లేఁడు
బాట సంసారముకంటే పగ లేదు ॥ (1-443)

లోకంలోని తీరులన్నీ దైవం కల్పించినవే. దైవభక్తులైన వారు తగిన విధంగా ప్రవర్తిస్తారు. ప్రశాంతచిత్తునికి పాపంరాదు. ఓర్పు కలిగినవానికి భయం లేదు. గురుసేవ యందు ఆసక్తి కలిగిన వానికి కోపంరాదు. సత్యవంతునికి దోషంలేదు అని వ్యక్తంచేశాడు.

దేవ నీవు గల్పించిన తెరువులివి
నీవారైన వారి నేరుపులివి ॥

పరమ శాంతునకు బాపము రాదు
విరతి గలవానికి వెరపులేదు

గురుసేవారతునకు గోపమురాదు
ధర సత్యవిదునకు దప్పులేదు ॥    (2-307)

భగవంతునిపై భక్తి కలిగినవారు భ్రమలలో పడరు. దయా సాగరుడైన భగవంతుడుండగా, తిరుమంత్రమే తనకు దిక్కయి వుండగా, ఆచార్యుడు తనకు అండదండయి వుండగా, తపస్సు చేసి కష్టపడనక్కరలేదని తెలిపాడు.

నీవారైన వారికి నీపై భక్తే కాక
భావించనేరక వట్టి భ్రమ బడవలెనా ॥

కరుణానిధి నీవు గలిగి వుండఁగాను
తిరుమంత్రమే నాకు దిక్కయి వుండఁగా
వరుస నాచార్యుడు వహించుక వుండఁగాను
పరగ దపము చేసి బడలఁగవలెనా    (3-219)

అన్నమయ్య సంకీర్తనల్లో గురుభక్తి, గురుసేవకు సంబంధించిన విషయాలు చాలా వున్నాయి. ఈ సంకీర్తనలు నేటి విద్యార్థులకు ఎంతో స్ఫూర్తిని, సద్భావనను కలిగిస్తాయి. గురువులపట్ల సముఖుల్ని చేస్తాయి. విద్యార్థుల్లో వినయ వివేకాలను ఉద్దీపింపజేసి జ్ఞానవంతులుగా తీర్చిదిద్దుతాయి.

కోస్తావాణి
19-3-1993



# అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో జ్ఞాన ప్రబోధం

అన్నమయ్య కలియుగ ప్రత్యక్ష దైవమయిన శ్రీనివాసుని ఖడ్గావతారం. ఈ కలికాలంలో అజ్ఞానులై సంచరిస్తున్న మానవులకు భక్తి, జ్ఞాన వైరాగ్య బోధలుచేసి వారిని తరించడానికి అవతరించిన పరమ భాగవతుడు అన్నమయ్య ప్రతి మానవునికి ఈ ఐహిక సంబంధమైన విషయాలలో శాశ్వత సుఖంలేదని తెలిసినా పామరులై సంసార లంపటాలలోపడి అలమటిస్తుంటారు. ఇలాంటి వారికి సుల భంగా జ్ఞానబోధ చేయడానికి సంగీతాత్మకమైన సంకీర్తనలను శ్రీ వేంకటేశ్వరుని ముద్రాంకితంగా రచించాడు. ఈ సంకీర్తనలు పామ రులు, పండితులు, పిన్నలు, పెద్దలు, స్త్రీలు, పురుషులు అనే తార తమ్యం లేకుండా అందరికీ సులభంగా అర్థమయ్యేలా ఉన్నాయి. ఈ సంకీర్తనలు మానవ మనుగడకు ఆముష్మిక చింతనకు కరదీపికలుగా తోడ్పడతాయి.

ఈ భూలోకంలో శాశ్వతమైనవి రెండు విధానాలున్నాయి. ఒకటి జలజాక్షుడైన మహావిష్ణువు. రెండవది అతనికి శరణాగతి చేయ డం. ఈ భూమిలో అనేకచోట్ల ఎంతోమంది మానవులున్నారు. కానీ హరిదాసులు చాలా అరుదుగా కనిపిస్తారు. ఆకాశంలో దేవత లెంతో మంది ఉన్నారు. కానీ ఉత్కృష్టమైన మోక్షాన్ని ఏలే శ్రీపతి ఒక్కడే ఉన్నాడు. ఈ భూమిపై మంత్రా లెన్నో ఉన్నాయి. కానీ హరినామ మొక్కటే శ్రేష్ఠమయింది. దుర్బుద్ధి మానవులు చేసేవి కోటి పూజలున్నా భక్తుని సంకీర్తనా భక్తియే అధికమయింది. ఈ విశ్వంలో భోగించడానికి ఎన్నో సుఖాలున్నాయి. కానీ మోక్షమనే

సుఖమే సారవంతమయింది అని అన్నమయ్య మానవులకు ఏది ముఖ్యమో తెలియజేశాడు.

కలవి రెండే భూమి కామనిధానంబులు
జాలజాక్షుండు నతని శరణాగతియును ॥

నరులు లేరా భూమి నానా దిక్కులలోన
హరిదాసుఁ డొక్కండే యరుదుగాక
సురలు లేరా మింట సోదించ ఘనుడొక్కండే
పరమ పదమేలు శ్రీపతియే కాక ॥ (3-412)

మానవుడు తన అంతరంగాన్ని శ్రీహరికి అప్పగించకపోతే రకరకాల బంధాలు వీడవు. మనుజుడై పుట్టినందుకు ఫలం జ్ఞానవంతుడు కావడం, శరీరం ధరించినందుకు దయ, ధనికుడైనందుకు ధర్మం, చదివినందుకు శాంతం, పెదవి విప్పినందుకు ప్రియవాక్కులు, మనస్సున్నందుకు మాధవుడైన ఆ విష్ణుమూర్తిని భజించడం, పవిత్రుడైనందుకు భక్తితో వుండటం, జీవించినందుకు చింత వదలడం ఫలమని శ్రీ వేంకటేశ్వరుని ప్రత్యక్షం చేసుకోవడం అన్నిరకాల ఫలమని అన్నమయ్య ప్రజలకు జ్ఞానబోధ చేశాడు.

అంతరంగమెల్లా శ్రీహరి కొప్పించకుండితే
వింత వింత విధముల వీడునా బంధములు ॥ (1-437)

దైవం ఎవరు? అనే విషయంలో ఒక్కొక్కరు ఒక్కొక విధంగా వాదోపవాదాలు చేస్తుంటారు, ఈ విషయాన్ని గూర్చి అన్నమయ్య-కొంతమంది జీవుడే దేవుడంటుంటారు. అయితే దైవం చేసే చేష్టలు ఈ జీవుడికి వున్నాయా? కొందరు కర్మము, బ్రహ్మము అంటుంటారు. అయితే రావణాసురుడు మొదలైనవారు గట్టెక్కారా? కొంత

మంది దైవమే లేడంటారు. అయితే ఈ ప్రపంచమంతా తన చేష్టలా? భగవంతుడు నిరాకారుడంటారు అయితే పురుషసూక్తం మాటేమిటి? భగవంతునికి ఎనిమిది గుణాలే అంటారు కానీ తక్కినవి తమవా? ఇవన్ని ఎందుకు? హరిదాసులైన వారే శాశ్వతం అని తెలుసుకో వాలి అంటూ అన్నమయ్య విషయ విశ్లేషణ చేసి జ్ఞానబోధ చేశాడు.

ఏఁటి మాటలివి విననింపయ్యీనా మది
నేఁట పెట్టిదాసుఁ డోటిది సరియా॥ (2-67)

ప్రజలు హింసాత్మకమైన భక్తితోను, మూఢభక్తితోను అలమటించడం వృథా అని ఎండలలో పొరలడం, చలిలో కొండ గుహాలో ఉండకుండా హరిని ఆత్మలో తలచుకుని పండిన పసిడి బ్రతుకు బ్రతకాలని, అడవులలో అలసిపోకుండా, ఆకు అలములు తిని కడుపులు కాల్చుకోకుండా విష్ణుమూర్తికి దాసులై బ్రతికి గొప్ప పదవులు పొందాలని, కాళ్ళలో పుండ్లు లేచే విధంగా దిక్కులంతటా దిరగకుండా శ్రీవేంకటేశ్వరునిపై ఒక్క మనసుతో ఉండి బ్రతకాలని అన్నమయ్య ప్రజలకు వివేచించి చెప్పాడు.

ఏఁటికిఁ దలఁకెదరిందరును
గాఁటపు సిరులివి కానరొ ప్రజలు॥

పొక్కేటి కాళ్ళ పుండ్లు రేఁగఁగ
దిక్కుల నంతటఁ దిరుగక
గక్కన తిరువేంకటగిరిపతిఁగని
వొక్క మనసుతో నుండరొ ప్రజలు॥ (1.101)

ప్రజలకు గొప్ప వైరాగ్యం కన్నా మించిన లాభంలేదని, విజ్ఞానం కన్నా మించిన సుఖంలేదని, మంచి గురువుకన్నా మించిన

రక్షకుడు లేడని, సంసారం కన్నా మించిన పగలేదని, పరులను పీడించడం కన్నా మించిన పాపంలేదని. పరోపకారంకన్నా మించిన పుణ్యం లేదని, శాంత గుణం కన్నా మించిన స్వీయ ధర్మం లేదని, హరిదాసుడు కావడం కన్నా మించిన వేరేగతి లేదని, కర్మసంబంధాలు వదలుకోవడంకన్నా మించిన తేజస్సు లేదని, కోరికలు వదలుకోవడంకన్నా మించిన బుద్ధిలేదని. శ్రీవేంకటేశ్వరుని శరణువేడి నిర్మలంగా ఉండటంకన్నా మించిన నిశ్చయం లేదని:స కల శాస్త్ర సారం ఇదేనని అన్నమయ్య ప్రజలకు వివేకం బోధించాడు.

కంటెనిదేయర్థము ఘన శాస్త్రములు దవ్వి
నంటునవిందుకంటెను నాణెమొందూలేదు ॥

మేటి వైరాగ్యముకంటే మిక్కిలి లాభములేదు
గాటపు విజ్ఞానముకంటే సుఖములేదు
మీటైన గురువుకంటే రక్షకుడు లేడు
బాట సంసారము కంటే పగలేదు ॥

కర్మ సంగము మానుకంటే దేజములేదు
అర్మిలిఁ గోరికమానే యంతకంటే బుద్ధిలేదు
ధర్మపు శ్రీవేంకటేశుఁ దగిలి శరణు చొచ్చి
నిర్మలాననుండు కంటే నిశ్చయము లేదు ॥ (1-443)

ఈ విధంగా అన్నమయ్య తాను రచించిన అధ్యాత్మ సంకీర్తనలలో ప్రజలకు యుక్తాయుక్త వివేచనా జ్ఞానాన్ని బోధించాడు. మానవులు ఈ విధమైన జ్ఞానాన్ని సంపాదించుకున్నట్లయితే ఏ మానవుడి వల్ల ఏ మానవుడికీ ఏవిధమైన కీడు జరుగకుండా జనులందరూ

సుఖశాంతులతో జీవించడానికి వీలు కలుగుతుంది. మానవజన్మ తరిస్తుంది. ఈ విధమైన అన్నమయ్య జ్ఞానబోధ లోకజనులందరికీ అత్యావశ్యకమయింది.

సమాలోచన
జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక
1-3-1993.



# అన్నమయ్య సంకీర్తనల్లో ఆధునికత

ఆధునికత అనేది కాలాన్ని బట్టి కాక గుణాన్ని బట్టి చూస్తే అలనాటి అన్నమయ్య సంకీర్తనలు అధునిక భావసౌరభంతో ఒప్పారుతున్నయని చెప్పవచ్చు. కవిత్వం పండితవర్గానికే కాక ప్రజలందరి, సొత్తు కావాలనే దృష్టితో అన్నమయ్య తనకు ముందు కవులవలె పద్యరచన కొనసాగించకుండా ఆ బాలగోపాలాన్ని ఆనందింపజేసే గాన యోగ్యమైన పదరచనను చేపట్టి పదాలను ఒక ప్రక్రియగా రూపొందించాడు, పదప్రక్రియ లక్షణాన్ని నిర్దేశిస్తూ సంకీర్తన లక్షణ గ్రంథం వ్రాశాడు. తదనుకూలంగా శ్రీ వేంకటేశ్వర ముద్రతో సంకీర్తనలు రచించాడు. ప్రక్రియా నిర్మాణంకోసం పటిష్టతకోసం కొన్ని లక్షణాల్ని నియమించుకొన్నా అట్టడుగున వున్న ప్రజల వ్యావహారికభాషకు కూడా సంకీర్తనల్లో అగ్రస్థానమిచ్చాడు ఆడ, ఈడ ఏడ, ఏనిగె, నాలిక సుక్కురారము, బుద్దివంటి గ్రామ్యపదాల్ని, జలధికన్నె, పాలజలనిధివంటివైరి సమాసాల్ని విస్తారంగా ప్రజలకోసం వినియోగించాడు.

సమాజంలో స్త్రీ-పురుష, కుల-మత-వర్గ భేదాలుండకూడదని, పరపీడ, అణచివేతవుండకూడదని ఆర్థిక, సాంఘిక, రాజకీయ, మతపరమైన అన్నిరంగాల్లో అందరికి సమాన ప్రాతినిధ్యం, స్వాతంత్ర్యం, స్వేచ్ఛ ఉండాలని, సమసమాజంతో కూడిన నవసమాజాన్ని కాంక్షించడం ఆధునికత అని చెప్పుకుంటే ఈ లక్షణాలు అన్నమయ్య సంకీర్తనల్లో పుష్కలంగా కనిపిస్తాయి. ఇప్పటికి ఐదు శతాబ్దాలు గడచిపోయినా అన్నమయ్య సంకీర్తనలు నేటిఆధునికు లందరిని అలరించ గలుగుతున్నాయంటే, నాస్తికుల్ని సహితం శిరసూగించ

గలుగుతున్నాయంటే అందులోని ఆధునిక ధోరణి, భక్తి, సంగీతం కారణాలుగా చెప్పవచ్చు.

ప్రకృతి ప్రజలందరిపట్ల సమానంగా ప్రవర్తిల్లుతుంది. భూమి, నీరు. అగ్ని, గాలి, ఆకాశం ఇవి జంతువులపట్ల మానవులపట్ల సమానత్వం కనబరుస్తాయి. ఆహార, నిద్రా, భయ, మైథునాల్లో సర్వజీవకోటి సమానమే, అలాంటిది మేధస్సు, ఆలోచన కల్గిన మానవులమైన మనలో ఈ తారతమ్యాలు, వైషమ్యాలు ఉండకూడదని ఉద్ఘాటిస్తూ— "తందనాన ఆహి-తందనానపురే" అనే సంకీర్తనలో

"నిండారరాజు నిద్రించు నిద్రయు నొకటే
అంటనే బంటు నిద్ర అదియు నొకటే
మెండైన బ్రాహ్మణుడు మెట్టు భూమియొకటే
చండాలుడుండేటి సరిభూమియొకటే"

అని తెలియజేశాడు. మానవత్వాన్ని ప్రబోధిస్తూ— "పరపీడన సేయుటకంటె పాపము మరెందు లేదు" "పరుల మనసునకు నాపదలు కలుగగజేయు పరితాపకరమైన బ్రదుకేలా'వంటి సంకీర్తనలు రచించాడు.

సమాజంలో కొంతమంది ధన, ధాన్య సౌభాగ్యాలతో విలాస జీవితం గడుపుతుంటే కొంతమంది కనీస జీవితావసరాలుతీరక దుర్భరమైన జీవితాలతో ఆవేదన పడుతుంటారు. ఆర్థికపరమైన ఈ అసమానతలకు కారణం ఎవ్వరు? సమాజమా, లేక ప్రజలేనా, అని నిలదీసి, అన్నమయ్య ఎంతో విచారం చెంది—

కొందరు సుఖులై కొదలేక మెలగగ
కొందరి దుఃఖపు కొరత యెవ్వరిది"

అనే సంకీర్తనలో కనిపిస్తుంది. "మారు చేతులీయవద్దు మారుగాళ్ళీయవద్దు

సిడిదలలియ్యవద్దు జీవాలఁ జంపవద్దు" వంటి సంకీర్తనల్లో అన్నమయ్య అహింసావాదాన్ని, జీవకారుణ్య తత్వాన్ని ప్రబోధించాడు.

మానవులందరూ పుట్టుకతో సమానులే. అందరిలోను దేవుడున్నాడు. కొందరు అధికులుగా. కొందరు అల్పులుగా కొందరు సేవకులుగా ఉంటున్నా పంటపై గాలి సమానంగా వీచినప్పుడు గట్టి గింజలు నిలుస్తాయి. పొల్లుగింజలు కొట్టుకొనిపోతాయి అని బలహీనులను గూర్చి సాంఘిక అసమానతల పట్ల ఆవేదనపడుతూ—

"అందరిలో దేవుఁడుండు అందధికులు గొందరు
కొందరు హీనులై కుందుదురింతే ।
చెంది వీచేగాలొకటే చేసి పంటానొకటే
పొంచి గట్టి కొలుచుండి పొల్లు కడఁబడును
పుట్టుగందరికొకటే భూమిలో నేలికలును
వెట్టిబంట్లుఁ గొందరై వీఁగుదురింతే"

అనే సంకీర్తన రచించాడు. అలాగే 'విజాతులన్నియు వృథా వృథా", "ఏకులజుఁడేమి ఎవ్వడైననేమి"అని సమాజానికి కులభేదాలు తగవని బోధించాడు.

సమాజంలో స్త్రీ పురుష వ్యత్యాసాలుండకూడదని, స్త్రీకి పురుషునితోపాటు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, సమానత్వం. హక్కులు వ్యక్తిత్వం ఉండాలని అభిలషించడం, అందుకు కృషి చేయడం నేటి స్త్రీ వాద సిద్ధాంతంలో మౌలికాంశం అన్నమయ్య సంకీర్తనల్లో ఈ దృక్పథం కూడా కనిపిస్తుంది. "పొలఁతులు జీవులే పురుషులు జీవులే"

అనే సంకీర్తనలో స్త్రీ పురుషులిద్దరూ జీవులేనని, ఒకరికి స్వతంత్రం, ఒకరికి పరతంత్రం ఉండకూడదని ఆక్షేపిస్తూ స్త్రీ పురుష సమానత్వం కోరడం కనిపిస్తుంది అలాగే స్త్రీ అభ్యుదయాన్ని, రాజ్యపాలనను ఆకాంక్షిస్తూ-"ఆఁటది రాజ్యమేలితే మంచిదేకాదా" అని హితోక్తి చెప్పడం గమనించదగిన విషయం.

లోకంలో సహజంగా స్త్రీలకే అన్ని విషయాల్లోను అందరూ నీతి బోధలు చేస్తారు. పురుషుడు ఏమి చేసినా సహించాలని ఉపదేశం చేస్తారు. కానీ అన్నమయ్య అలా కాక స్త్రీలతో పాటు పురుషులకు కూడా 'గుట్టుతో నుండనీవయ్య గుణవంతుడవు నీవు" కోపము పనికి రాదు కొమ్మల యెడలను అని నీతిబోధచేయడం అన్నమయ్య పాటించిన స్త్రీ పురుష సమానత్వానికి తార్కాణంగాను ఆధునికత్వానికి నిదర్శనంగాను చెప్పవచ్చును. ఈ విధంగా ప్రక్రియ, భాష, మానవత్వం, స్త్రీవాదం, కులతత్వం మొదలైన అనేకాంశాల్లో ఈనాటి ఆధునిక దృక్పథాన్ని, హేతువాదాన్ని, సమసమాజ నిర్మాణాన్ని ఐదువందల సంవత్సరాలక్రితమే అభిలషించడం, ప్రబోధించడం గమనించదగిన, ప్రశంసించదగిన విషయం. అందుకే అన్నమయ్య సంకీర్తనలు ఎప్పటికీ సొగసువాడని, పరిమళం వీడని పారిజాత పుష్పాల్లా నవనవోన్మేషంగా ఉల్లాసపరుస్తూనే ఉంటాయి.

విశాలాంధ్ర (దినపత్రిక)
15-6-1995



# అన్నమయ్య వర్ణించిన శ్రీరామచరిత

విష్ణుమూర్తి పురుషోత్తముడై చైత్రశుద్ధ నవమి. పునర్వసు నక్షత్రం, కర్కాటకం లగ్నం, మధ్యాహ్నం పన్నెండు గంటలకు అభిజన్ముహూర్తంలో అయోధ్యలో కౌసల్యా దశరథ చక్రవర్తులకు శ్రీరాముడుగ అవతరించాడు. ఈ పరమ పుణ్యదినాన్నే 'శ్రీరామ నవమి' పండుగగా ఆనాటినుంచి మన హిందువులు, భారతీయులు ఉత్సవాలు జరుపుకొంటున్నారు. ఈ శ్రీరామపట్టాభిషేకం జరగడం విశేషం. శ్రీరాముని దివ్యరూపం విశ్వమోహనమయింది. ఆయన సుగుణాలు, సత్ప్రవర్తన, ధార్మిక పరిపాలన విశ్వమానవ జాతికంతటికి ఆదర్శమయింది. అందుకే రామాయణం ఒక్క భారతీయ సాహిత్యంలోని కాక ప్రపంచ సాహిత్యంలోకూడా విశిష్టస్థానం అలంకరించింది.

శ్రీరామచంద్రమూర్తిని హనుమంతుడు, విభీషణుడు, అహల్య, గుహుడు, శబరి, సుగ్రీవుడు, వాల్మీకి, తులసిదాసు, కృష్ణమాచార్యులు, మొల్ల, పోతన, రామదాసు, త్యాగయ్య మొదలైన దైవ మానుష మహనీయు లెందరో కీర్తించి తరించారు. తెలుగుసాహిత్యంలో శ్రీరామచరిత్ర కమనీయ కావ్యాలుగా, ప్రబంధాలుగా, నాటకాలుగా, యక్షగానాలుగా, శతకాలుగా, హరికథలుగా, బుర్రకథలుగా జానపదకథలుగా, గేయాలుగా, స్త్రీల పాటలుగా, సంకీర్తనలుగా వెల్లివిరిశాయి.

సంకీర్తనా రచనకు ఓంకారం చుట్టినవరసుభక్తుడైన అన్నమయ్య కాడా అత్యంత ప్రీతితో రామచరిత్రను కావ్యంగా వెలయిం

చినట్లు అన్నమయ్య మనుమడు చిన్నన్న రచించిన అన్నమాచార్య చరిత్రంలోని.

ఘనతర సకలభోగంబులుగాఁక
మనుచు వాల్మీకి రామాయణ మెల్ల
రాగంబుతో ననురాగంబుతోఁడ
బాగుగా గంధర్వ బాగుగా జదివి"

అనే ద్విపదపాదాల్ని బట్టి తెలుస్తుంది కానీ నేడు ఇది అలభ్యం. అయినా అన్నమయ్య రచించిన వేలాది సంకీర్తనల్లో శ్రీరాముని, శ్రీరామ చరిత్రను కీర్తించిన రసవత్తర సన్నివేశాలతో కూడిన సంకీర్తనలు విశేషంగా కనిపిస్తుంటాయి. అన్నమయ్య ప్రత్యేకించి శ్రీవేంకటేశ్వర భక్తుడైనా, ఆ స్వామి ముద్రతోనే సంకీర్తనలు రచించినా వేంకటేశ్వరుని పూర్వరూపాలన్నింటిని సంప్రీతితో వర్ణించారు.

శ్రీరాముడు వరబ్రహ్మమైన విష్ణుమూర్తి అతని చరిత్రే రామకథ. అది శతకోటి విస్తరం, సకల పుణ్యఫలం అని కొనియాడుతూ శ్రీరామ జననం, సీతారాముల కళ్యాణం, సీతారామలక్ష్మణులు అరణ్యవాసం వెళ్ళడము, అక్కడ అసహ్యంగా ప్రవర్తించిన శూర్పణఖ ముక్కు చెవులు ఖండించడం ఖరదూషణాదుల్ని సంహరించడం, వాలిని చంపి సుగ్రీవుని కిష్కింధకు రాజును చేయడం, వానరుల సహాయంతో వారధి కట్టి సముద్రం దాటడం, రావణకుంభకర్ణాది రాక్షసుల్ని చంపడం విభీషణుని లంకకు రాజునుచేయడం, సీతమ్మతో తిరిగి అయోధ్యకు రావడం, లక్ష్మణ భరతశత్రుఘ్నులు సేవించగా రాముడు పట్టాభిషిక్తుడై రాజ్యం పరిపాలించడం, శూరులైన కుశలవుల్ని పుత్రులుగా పొందడం మొదలైన సన్నివేశాల్ని బాలకాండమొదలు ఉత్తరకాండవరకు ఉన్న సంపూర్ణ

రామాయణకథనంతా సంగ్రహించి మూడు చరణాల్లో నిబంధించి చివరగా ఆ శ్రీరామచంద్రుడే ఈనాడు శ్రీవేంకటాచలంపై శ్రీమంతుడైన శ్రీనివాసుడుగా వెలశాడని—

"ఇతఁడే పరబ్రహ్మమిదియె రామకథ
శతకోటి విస్తరము సర్వపుణ్యఫలము ॥

ధరలో రాముడు పుట్టెధరణిజఁబెండ్లాడె
అరణ్యవాసుల కెల్లా నభయమిచ్చె
సారిది ముక్కు చెవులు చుప్పనాతిని గోసె
ఖరదూషణులను ఖండించివేసె ॥

అనే సంకీర్తనలో తెలియజేశాడు. ఇలాగే 'ఎంతని నుతి యింతు రామరామా అంటూ రామచంద్రుని "సీతకపడుము దోసిటి పాలమగడు" అని, సీతమ్మను 'సింగారబొమ్మ" అని అచ్చు తెనుగు పదాల్లో సరస సుందరంగా అభివర్ణించిన సంకీర్తనలు విరివిగా ఉన్నాయి.

శ్రీరామునికి శరణంటే రక్షిస్తాడు. రాక్షసులారా ఎందుకు ఇంక విచారిస్తారు. రామబాణం అమోఘమయింది. పంతంతో తాటకిని చంపింది. మారీచసుబాహులను వేసింది. పరశురాముని ఓడించింది. మాయామృగం అయిన మారీచుని, వాలిని సంహరించింది. సముద్రాన్ని బంధించింది. కుంభకర్ణుని తలను తుంచివేసింది. రావణాసురుని సంహరించింది. అనాటి రామబాణమే నేడు శ్రీవేంకటేశ్వరుని అమ్ములపొదిలో ఉంది. అని రామబాణాన్ని వర్ణిస్తూ, అలాంటి రామబాణం కలిగిన శ్రీరాముని శరణువేడమని దైత్యులకు బోధిస్తూ, అనాటి శ్రీరాముడే ఈనాటి శ్రీనివాసుడని తెలియజేస్తూ—

రామునికి శరణంటె రక్షించే బిరుదకరో
యేమిటికి విచారాలు యికదైత్యులాల ॥

మాయామృగముల మీఁద మరి వేసిన బాణము
చేయి చాచి వాలి నేసిన బాణము
తోయధిమీఁదఁనటు తొడిగిన బాణము
చాయలు దేరుచున్నది చనరో దైతేయులు ॥

అనే సంకీర్తన రచించాడు.

అన్నమయ్య తన ప్రియదైవమైన శ్రీవేంకటేశ్వరునిలో పెక్కటి అవతారమూర్తు లందరినీ దర్శించాడు. ఆనాటి రఘువీరుడు రామచంద్రుడు ఇతడేనని, ఇతడు అందరికీ కోరిన కోర్కెల నిస్తాడని చెబుతూ రామావతార ఘట్టాల్ని తెలియజేశాడు. గౌతమముని భార్య అహల్యపాలిటి కామధేనువు. కౌశికుడైన విశ్వామిత్రుని పాలిటి కల్పవృక్షం. సీతమ్మ పాలిటి చింతామణి, అలాగే దాసులకు ఇహపరదైవం, సుగ్రీవునికి పరమ బంధువు, హనుమంతునికి సర్వస్వం, విభీషణునికి పెన్నిధి, జనక మహారాజుకు గొప్ప పారిజాతవృక్షం, శబరికి తత్వరహస్యం, గుహునికి ఆదిమూలం, ఉన్నాడనుకొన్న వారికి ప్రత్యక్షమూర్తి అని—

రామచంద్రు డితఁడు రఘువీరుఁడు
కామితఫలములియ్య గలిగె నిందరికి ॥

గౌతము భార్యపాలిటి కామధేనువితఁడు
ఘాతల గౌశికుపాలి వృక్షము
సీతాదేవి పాలిటి చింతామణితఁడు
యీతఁడు దాసులపాలి యిహపరదైవము ॥

రామాయణములోని ఏ ఒక్క అక్షరాన్ని ఉచ్చరించిన మహా పాతకాలు నశిస్తాయంటూ—

చరితం రఘునాథస్య
శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం
మహా పాతక నాశనమ్

అని పెద్దలు రామాయణ వైశిష్ట్యాన్ని ప్రశంసించారు. దీన్ని అన్నమయ్య సరళమైన పదజాలంతో పదాలుగా రూపకల్పనచేసి మాన్యులకు, సామాన్యులకు అందరికీ అందించాడు. రామచంద్రుని జన్మదిన మహోత్సవం భారతీయు లందరికీ పరమానందకరం.

సమాచారమ్
20-4-1994



# అన్నమయ్యా సంకీర్తనల్లో పురుష సందేశం

శృంగారీ చేత్కవిః కావ్యేజాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసంజాతమేవతత్

అని ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో చెప్పినట్లు కవి శృంగార మనస్కుడైతే అతను సృష్టించిన కావ్యంకూడా రసమయం అవుతుంది. ఆ కవే వైరాగ్యమనస్కుడైతే అతను సృష్టించిన కావ్యం కూడా నీరసంగా వుంటుంది అన్నమయ్య దైవాదేశంవల్ల ఇద్దరాం డ్రకు ముద్దుల మగడుగా గృహస్థ జీవనం గడిపిన శృంగారప్రియుడు. (బహుభార్యాపాణిగ్రహణం ఆనాటి సమాజంలో నిషేధం కాదు). అలాగని ఆ భాగవతుడు అదేశాశ్వతం అనుకోలేదు ఏనాటికైనా ఈ ఐహిక జీవితమంతా ఒక బూటకమవుతుందని, పరమాత్మ పాద సన్నిధియే సత్యమని ఆయన బాల్యంలోనే గ్రహించాడు. ఈ పరిజ్ఞానంతో అన్నమయ్య ప్రజలకు ఐహిక ఆముష్మిక ఆనందాల్ని జ్ఞానాన్ని అందివ్వడంకోసం ముప్పై రెండువేల శృంగార అధ్యాత్మ, సంకీర్తనల్ని రచించి కలియుగ ప్రత్యక్షదైవం, తల్లి, తండ్రి, గురువు, దైవం, దాత, ప్రియుడు, సుఖుడు, సర్వస్వం అయిన ఆ ఏడుకొండల శ్రీనివాసునికే అంకితమిచ్చాడు. తిరుమల తిరుపతిదేవస్థానం వారి నిరవధిక కృపివల్ల, అపార శ్రద్ధాభక్తులవల్ల నేటికి పదిహేనువేల సంకీర్తనలు లభిస్తున్నాయి.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు అలమేల్మంగా శ్రీనివాసులు. వీరు లోకాతీతమైన దివ్య ప్రేయసీ

ప్రియులు దివ్యసతీపతులు. వీరి సర్వాంగ సౌందర్యం, ప్రణయం, కలహం, సఖీజనహితవచనం మొదలైన సన్నివేశ వర్ణనల్లో అన్నమయ్య లోక సాధారణమైన నాయికానాయకుల చేష్టల్ని మన స్తత్వాల్ని వారికి ఆరోపించి నవరసభరితంగా శృంగార సంకీర్తనల్ని రచించాడు. ప్రేయసీ ప్రియులు లేదా దంపతులు అయిన స్త్రీ పురుషులు అన్యోన్య ప్రేమానురాగాలతో వర్ధిల్లుతుంటారు. జీవితంలో ఎలాంటివారికైనా ఎప్పుడూ సుఖాలు ఎప్పుడూ కష్టాలు వుండవు.

"సుఖస్యానంతరం దుఃఖం, దుఃఖస్యానంతరం సుఖం సుఖం తర్వాత దుఃఖం, దుఃఖం తర్వాత సుఖం ఇలా చక్రంలాసుఖదుఃఖాలు తిరుగుతుంటాయి. స్త్రీపురుషులకు పరస్పరం ప్రేమకలిగినట్లే ద్వేషం కూడా కలుగుతుంటుంది. అలాంటి సందర్భాల్లో హితులు. ఆప్తులు, మిత్రులు అయిన వారు ఓదార్పు చెబుతుంటారు. అప్పుడు వారిలో కోపతాపాలు కొంత చల్లారి మళ్ళీ ఐక్యమవుతుంటారు. జీవితంలో సంయోగ వియోగాలు ఇలా రంగుల రాట్నంలా తిరుగుతుంటాయి.

సాధారణంగా స్త్రీ పురుషుల్లో స్త్రీలకే పుట్టింటివారుగాని, మెట్టింటివారుగాని. అన్ని విషయాలలో ఆయావ్యక్తులపట్ల ప్రవర్తించవలసిన తీరునుగూర్చి హితోపదేశాలు, నీతులు, ధర్మాలు బోధిస్తుంటారు. పొరపాట్లు స్త్రీలో కనిపించకపోయినా పురుషుడు పెడుతున్న హింసల్ని, బాధల్ని సహించవలసిందిగా స్త్రీకే ఓదార్పు చెబుతారుగానీ దుర్గుణాల్ని, దుష్టచేష్టల్ని వదలుకోమని పురుషుడికి మాత్రం బోధించరు. ఇది చాలావరకు లోకంలో జరుగుతున్న వాస్తవం. అన్నమయ్య భార్యాభర్తల్లో, ప్రేయసీ ప్రియుల్లో. స్త్రీ పురుషుల్లో ఈ విధమైన వ్యత్యాసాలు, న్యూనతాధిక్యతలు వుండకూడదని హితబోధ చేశాడు.

ఒక భర్త తన పట్ల భార్య ఎలా ప్రవర్తించాలని, ఎలా సేవ చేయాలని కోరుకుంటాడో—

"కార్యేషుదాసీ కరణేషు మంత్రీ

అనే శ్లోకంలోలాగా తానుకూడా తనభార్యపట్ల అలాగే ప్రవర్తించాలని, సేవ చేయాలని అన్నమయ్య తెలిపాడు. భర్త మహోన్నతుడైతే భార్య ఎంతగా సంతోషిస్తుందో, ఎన్ని విధాలుగా సపర్యలు చేస్తుందో ఆవిధంగానే భార్య మహోన్నతురాలైతే అంతగా సంతోషించాలని సపర్యలు చేయాలని అన్నమయ్య స్త్రీపురుషులకు సమ ప్రాధాన్యం ఇస్తూ రచనగావించాడు. స్త్రీ సమర్థవంతురాలై రాజ్యమేలినా అది మంచిదేనని ఆమె పీటపై కూర్చొనివున్నా ప్రియుడు నిలబడి మాట్లాడటం, ఆమె పవ్వళించి వుంటే ప్రియుడు ఆమెపాదాల దగ్గర కూర్చొని ఆకుమడచి అందివ్వడం మంచిదేనని. ప్రియురాలికి ఎంతసేవ చేస్తే ప్రియుడికే అంతలాభమని అన్నమయ్య ఒక చెలికాడుగా శ్రీ. వేంకటేశ్వరునికి చెబుతూ తద్వారాలోక పురుషులకు ప్రబోధించాడు.

'అంటది రాజ్యమేలితే అది మంచిదేకాదా
చాటువగా మాకు నిన్ను సాధించనేటికి ॥'

(అన్నమయ్య అంటది, ఆకె, ఈకె, కాగిలి, చింక, "ఎసగె, కానికెవంటి రూపాల్ని విశేషంగా ప్రయోగించాడు)

భౌతికంగా స్త్రీ పురుషుల్లో భిన్నత్వం వున్నా మానసికంగా, మేధస్సుపరంగా, ప్రేమపరంగా సమానత్వం వుండాలని అన్నమయ్య ఆలోచన అందుకే—

ఆంటులు జీవులే పురుషులు జీవులే (2-78)

అనే సంకీర్తనలో స్త్రీలైనా, పురుషులైనా జీవులేనని, కేవలం భావభేదాలు తప్ప ఇంకేమీ లేదని, ఒకరు స్వతంత్రంగా, మరొకరు పరతంత్రంగా వుండకూడదని స్త్రీ పురుష సమతాభావాన్ని అభిలషించాడు.

కొంతమంది పురుషులు తమ భార్యల ఔన్నత్యాన్ని చెప్పుకోవడానికి, ఆమె చెబుతున్న సందేశాలు వినడానికి, ఆచరించడానికి ఇష్టపడరు. అలా ప్రవర్తిస్తే తమ పురుషత్వానికి భంగం కలిగినట్లుగాను, సమాజంలో గౌరవం క్షీణించినట్లుగాను తక్కువ భావంతో ఆలోచిస్తారు. అది అసమంజసమని అన్నమయ్య భావన.

సతి విరహవేదనతో ఎన్ని తిట్లు తిట్టినా సరసుడు, నేర్పరి అయిన భర్త వాటిని సహించాలంటూ—

సరసుఁడ విన్నిటాను జాణవు నీవు
వొరసె నిందాఁకా సతి వోరుచుకోవయ్యా॥

మనసొక్కటైనదాఁకా మాటలు సూటిబడవు
యెనయకుండితే నన్ని యెరవెరవే
నినుఁబాసి విరహాన నెలఁత యెంతదూరెనో
వొనరితివిఁక నవి వోరుచుకోవయ్యా (29-203)

అని చెలికత్తె నాయకునికి బోధిస్తుంది. ఇక్కడ చెలికత్తె బోధిస్తోంది అంటే అన్నమయ్యే చెలికత్తెగమారి హితబోధ చేస్తున్నాడని భావించాలి.

అలాగే మరో సంకీర్తనలో ప్రేయసి పరిహాసాలకు ఏమన్నా కూడా బుజ్జగించాలి కానీ కోపగించుకో కూడదని, ప్రేమతో ప్రేయసి పంతాలాడినా ప్రియుడు అలగకూడదని, ప్రేయసి ప్రశ్న

దానికి నవ్వినా దయతోవుండాలిగానీ తప్పులెంచకూడదని అన్న
మయ్య ఒక సఖుడు రూపంలో సందేశమిస్తూ—

చాలు చాలు నూరకుండు సతులెల్లా నవ్వేరు
కేలుచాచి తిట్టేటి పేలరేడు గలఁడా ॥
మెగసక్కెలకుఁ జెలులేమైనా నాడుదురు
పగటున బీరములు పచరింతురు
పొగరున నీవందుకు బుజ్జగించవలెఁగాక
మగువతోఁ గోపగించే మగవాఁడు గలఁడా (29-402)

సహజంగా స్త్రీలలో ఎక్కువమందికి మనస్సు ఆర్ద్రమయిం దిగా వుంటుంది పురుషుని దృష్టిలో చిన్న విషయం, చిన్న మాటే అయినా అది స్త్రీకి మిక్కిలి బాధకలిగించవచ్చు. ఆ బాధ తట్టుకో లేక కొంతమంది స్త్రీలు తిండి, నిద్రమానేసి పడుకొని బాధపడుతూ చిక్కిపోతుంటారు. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో నాయిక అయిన అలమేల్మంగ కూడా తన విభుడైన శ్రీనివాసుడు అనిన మాటలకు, చేష్టలకు నొచ్చుకొని నిద్రాహారాలుమాని మంచం పట్టింది. అప్పుడు చెలికత్తె నాయకుని గుణగణాల్ని ప్రశంసిస్తూనే హితవాక్యాలు పలుకుతూ—ఎప్పుడూ కోపగించుకొనిన నీవు నేడు ఏమి చేయబోయి ఏమిచేశావో ఏమో! ఆమె ముఖం వివర్ణమై వింతగా తోస్తోంది. ఇంతమాత్రం పనికి ఎంతపనిచేశావు! నిన్నటి నుండి ఆమె కన్నుమూయడం లేదు. ఎన్నిసార్లు చెప్పినా దిగు లుతో, తినే పళ్ళెం కూడా ముట్టడం లేదు. మంచంపై పడుకొనే వుంది. తలకొప్పుకూడా వీడిపోయివుంది. తలనొప్పిగా వుంది అంటూ పైకి కూడా లెయ్యడం లేదు. ఆమెకు నీవు తప్ప ఇంకెవ్వరున్నారు! పూలపానుపుపై పడుకొనివున్నా ఆమె దేహం వేడెక్కిపోతుంది. అని నాయిక పరిస్థితిని నాయకునికి తెలియజేసింది.

ఎన్నడును కోపగించవిందుముఖినీవిట్లా
విన్నని వదనమెల్లా వింతలాయనిపుడు ॥

ఇంతలోని పనికిఁగా నెంత చేసినాఁడవు
కాంతనిన్నటి నుండి కనుమూయ దాయను
బంతికూటి సతులెల్లాఁ బలుమారు నేఁపగా
చింతతోఁబళ్ళెము మీద చెయి చాఁచదాయెను ॥

(12-41)

ప్రేయసీ ప్రియులకు ఒకరిపై ఒకరికి మనస్తాపాలు కలిగినపుడు ఇద్దరూ సమీపాన కూర్చున్నా కలిసిమెలసివుండరు, ఒకరు పలకరించినా ఇంకొకరు పంతంతో మౌనంగా వుంటారు. ఇక్కడ ప్రియురాలు పిలుస్తున్నా ప్రియుడు పలకడం లేదు. తలెత్తి చూడటం లేదు. అలా ప్రేయసిపై అలిగియున్న ప్రియుడితో చెలికత్తెలుమాటిమాటికి ఎన్ని సార్లు చెప్పాలి? ఆమెతో అనురాగంగా కలసిమెలసి వుండవచ్చుకదా అంటూ అనునయ పూర్వకంగా—

ఇద్దరుఁగదిసినారు యెదురు బడినున్నారు
పొద్దు పొద్దునకు మిమ్ము బోధించవలనె ॥

పిలిచీ నూఁకొనరాదా ప్రియురాలు నిన్ను నిట్టె
తలయెత్తి చూడరాదా దండనున్నది
బలిమి పెనగరాదా పంతములే నెరపీని
చెలులముగ ననేము చెప్పకుండరాదు

అని ఆప్తవాక్యాలుచెబుతున్నారు.(సాధారణంగా చదువురాని తెలుగు ప్రజలు మహాప్రాణాక్షరాల్ని అల్పప్రాణాక్షరాలుగానే ఉచ్చరిస్తారు. అన్నమయ్య వారి ఉచ్చారణా ధోరణిలోనే కొన్నిచోట్ల బోదించు, బుద్ది, సాదించు మొదలైన పదాల్ని వాడాడు.)

తన ప్రియుడు పరస్త్రీ వ్యామోహంతో వుంటూ తనను నిర్ల క్ష్యం చేసినందుకు ప్రేయసి అతనితో— ఈ పొందే నీకు ఇష్టం. ఇక చాలుపో. స్వచ్ఛమైన గుట్టుతో వుండవయ్యా, అతిశయించి ఈ కాలం నిజం చెప్పడం వృథా. నీకు పైపై ప్రేమచూపేవాళ్ళే ఇష్టం. నిన్ను ఇంక ఏమన్నా నీకు కోపమే వస్తుంది. ఈ కాలం ఇంట్లోని చెట్టు మందు కాకుండా పోయింది. నీ వెంట తిరుగులాడే వాళ్ళే నీకు వినోదం. నేర్పరివై నీకు ఏమి చెప్పినా న్యాయంగా తోచదు అని మానసికంగా దిగులుపడుతూ నీతి చెబుతోంది.

చాలుఁ బో యీ పొందే చవులు నీకును
ఆలించి యేమిసేసినా ఆయము సోఁకీని ॥

అచ్చపు గుట్టున నుండవయ్య నీవు । నీతో
హెచ్చి నిజమాడరాదు యీ కాలము
ఇచ్ఛకము లాడువారే ఇతవు నీకు । నినుఁ
బచ్చిగా నేమన్నాను పసురు వేసీని ॥

అంటి ముట్టి సరసాలేలయ్యా నీవు
యింటి చెట్టు మందుగాదు యీ కాలము
వెంటఁ దిరుగాడు వారే వేడుక నీకు నిన్ను
దంటవై నేనేమన్నాఁ దగవు దప్పీని ॥ (12-163)

నాయికకు నాయకునిపై ప్రేమాభిలాష వుండటం చెలికత్తె గమనించి సిగ్గుపడుతున్న నాయకునితో— నా మాట విను. నీవు సిగ్గుపడటం ఎందుకు? ఆమెకు ఎన్ని కోరికలున్నాయో అని విన్నవించి, ఆమె చెంతకు అతను వెళ్ళడానికి ప్రోత్సహిస్తోంది.

"చిత్తగించవయ్య నీకు సిగ్గులు వడఁగ నేల
కొత్తగాను తనలోని కోరికెంత గలదో ॥ (12-217)

తనను పంతంగా సాధిస్తున్న తన భర్తకు తగిన విధంగా బుద్ధి చెప్పమంటూ—

"చెలులాల విభునికిఁ జెప్పరే బుద్ధి
చలపట్టి తను నింత సాదించ వచ్చునా" ॥ (32-236)

అని ఒక సతి తన సఖులతో చెబుతోంది.

ప్రేయసిపై అలిగి వున్న ప్రియునికి చెలులు - మా మాటలు మన్నించి ఆమెను దయతో ఏలుకో, యౌవనవతి అయిన ఆమెను సైగలతో బెదిరించవద్దు. అతిశయించి నిన్ను మోహించిన స్త్రీని పంతంతో లెక్కించకూడదు, బాధపెట్టకూడదు. పిలువకనే వచ్చిన ప్రియురాలిని ఆయాసపెట్టకూడదు, కోరికను విరచకూడదు అని హిత వచనం చెప్పాడు.

మన్నించు మా మాటలు మగువను దయనేలు
సన్నల రావు సేయకు జవరాలిని
చలపట్టి యెంచరాదు సకిఁ బెట్టఁ గారాదు
చెలరేఁగి కడు మోహించిన కాంతను
అలయఁ బెంచగ వద్దు ఆస చెరుచఁదగదు
పిలువకే వచ్చిన ప్రియురాలిని ॥ (32-270)

స్త్రీలలో చాలామందికి మనస్సు మృదువుగా వుంటుంది. ప్రియుడు అతిశయించి సరసమైన మాటలు చెబుతుంటే చనువు గల్గిన స్త్రీలు కొంతసేపు కొసరి బెదిరించినా మళ్ళా పంతాలు తీరిన తర్వాత వాళ్ళే వచ్చి వేడుకుంటారు. కర్పూరం పూసుకున్న చల్లనైన సువాసన గల్గిన పెదవులిచ్చి కౌగిలించుకుంటారు. కాబట్టి స్త్రీలను తప్పులు పట్టడం ఎందుకు అని చెలికత్తె నాయకుని ప్రశ్నిస్తూ, స్త్రీ సున్నిత మనస్తత్వాన్ని గూర్చి తెలియజేస్తోంది.

తప్పులు వట్టఁ గనేల తరుణులను
కప్పురము మోవినిచ్చి కాఁగిలింతురు ॥

పెనఁగుచు రమణుఁడు ప్రియములు చెప్పినాను
చనవుగల సతుల జంకింతురు
తనిసి తమ తమ పంతము లీడేరిన మీఁద
వెనక నప్పటి మరి వేఁడుకొందురు ॥ (32-271)

కొందరు పురుషులు తమ భార్యలు ఎంత వినయంగా ప్రవర్తిస్తున్నా, దురహంకారంతో మితిమీరి మాట్లాడుతూ, దురుసు చేష్టలు చేస్తూ బాధ పెట్టుతుంటారు. అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో ఈ విధమైన మనస్తత్వం వున్న నాయకుని చెలికత్తె సున్నితంగా ప్రశ్నించి మందలిస్తూ— నీవు అన్నింటిలోను నేర్పరివైతే ఔదువు గానీ కనిపించిన ప్రతిచోట ఆమెను దూషించవద్దు. ఎందుకు పంతాలాడి ఆమెను కష్టపెట్టుతావు? ఇలాంటి వాటికంతా ఆమె సహించగలదా, సిగ్గుతో తలదించుకొనివున్నా కూడా నీచస్త్రీలతో మాట్లాడినట్లు ఈమెతో మాట్లాడుతున్నావు. అలా మాట్లాడవద్దు. విచిత్రమైన చేష్టలు ఎందుకు చేస్తావు? మితిమీరి ఎందుకు నవ్వుతావు? (చులకనగా నవ్వడం ఎందుకని కాబోలు) ఇంత బాధపెట్టితే ఆమె ఈ గోలను భరించగల్గుతుందా! మాసిన ముత్యంలాగా మానంగా వున్న ఈమెను నిందితుల్లా లెక్కించవద్దు. ఎందుకు ఆలస్యం చేస్తున్నావు? పంతంగా ఎందుకు సాధిస్తున్నావు? ఈ విధంగా చేస్తే పద్మావతి నిన్ను ఇష్టపడుతుందా? శ్రీవేంకటేశ! ఆమె నిన్ను భక్తితో కలిసింది. వేశ్యాస్త్రీలలాగా ఆమెను చూడవద్దు అని నీతి ప్రబోధం చేస్తోంది.

అన్నిటా జాణఁడవైతే నాదువుగాని
కన్నచోట నెల్లాను కాంతను దూరకుమీ ॥

పంతము లేలాడేవు బయ లేలీదించేవు
యింతేసికి నోపునా యీపె నీతోను
చెంతమోవి వంచుకొని సిగ్గువడి నున్న నింత
జంతల నాడినయట్టు సకియ నాడకుమీ ॥ (32-273)

ఆధునిక కాలంలో సంఘసంస్కర్తలు, మహానుభావులు అయిన శ్రీ రాజారామమోహనరాయలు, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు, శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, మహాత్మాగాంధి మొదలైనవారిలోని నవీన భావజాలం, వారు ఆశించిన స్త్రీజనాభ్యుదయం, వ్యక్తిత్వం పదిహేనవ శతాబ్దం నాటి అన్నమయ్య సంకీర్తనల్లో కూడా కనిపించడం గమనించదగిన అంశం. మానవత్వం. దయ మొదలైన సుగుణాలున్న పుణ్యపురుషులు ఏ కాలంనాటి వారైనా వారి దృక్పథం ఒకటిగానే వుంటుందని ఇలాంటి ఆధారాలవల్ల చెప్పవచ్చు. స్త్రీకి పురుషునితో పాటు సమానత్వం. స్వాతంత్ర్యం ఉండాలని, స్త్రీ పురుషుడికి బానిస కాదని, పురుషుడు స్త్రీ ద్వారా సేవల్ని పొంది సుఖపడుతున్నట్లే తాను కూడా స్త్రీకి సేవలుచేసి సుఖపెట్టడం మంచిదేనని, దానివల్ల సమాజంలో పురుష గౌరవానికి లోటేమీ రాదని, పైగా అత్యంత అనురాగాన్ని పొందగలడని అన్నమయ్య తన శృంగార సంకీర్తనల్లోని నాయికా చెలికత్తెల పాత్రల ద్వారా అన్నమయ్య దివ్యనాయకుడైన శ్రీవేంకటేశ్వరునికి నీతి చెబుతున్న నెపంతో ఈ లోకంలోని పురుష ప్రపంచానికి సందేశమిచ్చాడు. అన్నమయ్య సంకీర్తనల్ని నిశితంగా పరిశీలించేకొలది. అనర్ఘరత్నాల్లాంటి వినూత్నాంశాలు ఎన్నో వెలువడుతుంటాయి.

"ఆనందం" — మాసపత్రిక
అక్టోబరు, 1995

# అన్నమయ్య బోధించిన మానినీ ధర్మం

అన్నమయ్య భక్తి జ్ఞాన వైరాగ్య ధర్మాలను మానవాళికి బోధించడానికి అవతరించిన విష్ణ్వంశ సంభూతుడు. వేద-వేదాంత-పురాణ-రామాయణ - భారత - భాగవతాది పవిత్ర గ్రంథాలలోని అంతస్సారం అన్నమయ్య అమృత గళంలో గానయోగ్యమైన సంకీర్తనా సాహిత్యంగా పరిణమించింది. సంకీర్తనా సాహిత్యం సర్వజనులను చైతన్యవంతులుగా, ఐహిక ఆముష్మిక చింతనా పరులుగా మార్చగల మహత్తర శక్తి కల్గింది. మానవులలో స్త్రీలు, పురుషులు, వారిలో మంచి చెడులు అనేవి మాత్రమే ప్రధాన భేదాలుగా చెప్పుకోవచ్చు. ప్రాచీన కాలం నుంచి నేటికీ కూడా కుటుంబంలోను, సమాజంలోను స్త్రీకి చాలామంది నీతిబోధలు చేస్తుంటారు. ఒకవైపు "యత్రనార్యస్తుపూజ్యంతే రమంతే తత్ర దేవతా!", "కలకంఠి కన్నీరొలికిన సిరియింట నుండనొల్లదు.", "ఎచట స్త్రీలెలమినైయె వర్తింతురచట నిల్చులక్ష్మియనవరతము" అని స్త్రీకి అత్యున్నత స్థానం ఇస్తూనే చేష్టలలో మాత్రం కొంతమంది తగినంత గౌరవం ప్రదర్శించలేక పోతున్నారు. "పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అన్నట్లు కందుకూరి, గురజాడ మొదలైన సంఘసంస్కర్తలు, మహిళాభ్యుదయవాదుల కృషిఫలితంగా నేటి స్త్రీ విద్యావంతురాలై అనేకరకాలైన కుటుంబ, సామాజిక పరమైన అడ్డంకుల ముళ్ళపొదల్ని ధైర్యమనే ఖడ్గంతో ఛేదించుకొంటూ పురుషులతో సమానంగాను, అంతకన్నా అధికంగాను కళ, విద్య, వైద్య, వైజ్ఞానిక, సాంకేతిక మొదలైన అన్ని రంగాల్లోను ముందంజ వేస్తోంది. అయినా భారతీయ స్త్రీ

కట్టు, బొట్టు, జుట్టు మొదలైన వేషధారణా విధానంలోను' సంభాషణా శైలిలోను, ప్రవర్తనా తీరు తెన్నుల్లోను, నీతి నియమాల్లోను సాంప్రదాయబద్ధమైన ఒక విలక్షణను, సంస్కృతిని కలిగివుంది. ఇదే భారతీయ స్త్రీకి పాశ్చాత్య స్త్రీకి ఉండే తారతమ్యం.

అభిమానంతో జీవించే స్త్రీని మానవతి అని, మానిని అని అంటారు. తిమ్మన పారిజాతాపహరణంలో సత్యభామ పాత్ర ద్వారా స్త్రీలకు మానమె ఆభరణమని. ప్రాణానికన్నా గొప్పదని, గౌరవానికి మూలమయిందని అంతటి విలువైనది పోయిన తర్వాత బ్రతుకు వ్యర్థం అంటూ—

"మానంబెతొలంగవు సతులకు
మానమె ప్రాణాధికంబు
మానమఖిల సమ్మానములకు మూలంబగు
మాన రహితమైన బ్రతుకు మానినికేలా"

అని పలికిస్తాడు దీన్ని బట్టి అతివకు అభిమానం ఎంత ముఖ్యమో తెలుస్తుంది.

అన్నమయ్య తాను రచించిన శృంగార, అధ్యాత్మ సంకీర్తనలో ఎన్నో రకాల భక్తి నీతి జ్ఞానబోధలు చేశాడు. ముఖ్యంగా శృంగార సంకీర్తనల్లో సంసారపరంగా స్త్రీ పురుషులకు ఉపయుక్తమైన సందేశాలు తెలియజేశాడు. శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు పద్మావతీ శ్రీనివాసులు అందులో వారి ప్రణయం, విరహం, కోపం, సౌందర్యం మొదలైనవి వర్ణించాడు. నాయకునికీ, నాయికకు మధ్యలో ఎప్పుడైనా పొరపొచ్చాలు కలిగితే వాటిని పోగొట్టడానికి చెలికత్తె పాత్రను కూడా అన్నమయ్య సృష్టించాడు. సంకీర్తనల్లో నాయికా నాయక పరంగా చేసిన నీతి బోధలన్నీ

కట్టు, బొట్టు, జుట్టు మొదలైన వేషధారణా విధానంలోను సంభాషణా శైలిలోను, ప్రవర్తనా తీరు తెన్నుల్లోను, నీతి నియమాల్లోను సాంప్రదాయబద్ధమైన ఒక విలక్షణను, సంస్కృతిని కలిగివుంది. ఇదే భారతీయ స్త్రీకి పాశ్చాత్య స్త్రీకి ఉండే తారతమ్యం.

అభిమానంతో జీవించే స్త్రీని మానవతి అని, మానిని అని అంటారు. తిమ్మన పారిజాతాపహరణంలో సత్యభామ పాత్ర ద్వారా స్త్రీలకు మానమె ఆభరణమని. ప్రాణానికన్నా గొప్పదని, గౌరవానికి మూలమయిందని అంతటి విలువైనది పోయిన తర్వాత బ్రతకటమే వ్యర్థం అంటూ—

"మానంబెతొలఁగవు సతులకు
మానమె ప్రాణాధికంబు
మానమఖిల సమ్మానములకు మూలంబగు
మాన రహితమైన బ్రతుకు మానినికేలా"

అని పలికిస్తాడు దీన్ని బట్టి అతివకు అభిమానం ఎంత ముఖ్యమో తెలుస్తుంది.

అన్నమయ్య తాను రచించిన శృంగార, అధ్యాత్మ సంకీర్తనలో ఎన్నో రకాల భక్తి నీతి జ్ఞానబోధలు చేశాడు. ముఖ్యంగా శృంగార సంకీర్తనల్లో సంసారపరంగా స్త్రీ పురుషులకు ఉపయుక్తమైన సందేశాలు తెలియజేశాడు. శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు పద్మావతీ శ్రీనివాసులు అందులో వారి ప్రణయం, విరహం, కోపం, సౌందర్యం మొదలైనవి వర్ణించాడు. నాయకునికీ, నాయికకు మధ్యలో ఎప్పుడైనా పొరపొచ్చాలు కలిగితే వాటిని పోగొట్టడానికి చెలికత్తె పాత్రను కూడా అన్నమయ్య సృష్టించాడు. సంకీర్తనల్లో నాయికా నాయక పరంగా చేసిన నీతి బోధలన్నీ

'ఇందాకా రాఁడంటా నేల సాదించేవు
ముందుగా నీవతనికి మోవి ఇయ్య గదవే ॥

పిలువఁగ బిలువఁగ బిగిసేవు పతితోను
చెలపల చెమటలు చెక్కుల వడియఁగ
చలమరి తనమేలే సతికి
అలముచు బెనఁగీ నతని జూడఁగదే ॥ (31-38)

అలాగే—

'కట కటా మామాట కాదందురా
కుటిల కుంతలివి యీ గుణమే టికే నీకు ॥

చాలు చాలు చలము నీకు పతినింత
నాలి బెట్టుట నాయమా
వాలు జూపులు వంచ గదవే అతనిపై
నేలే అలుకలు యింత లోనకు ॥ (26-181)

అనే సంకీర్తనలో ఎంత చెప్పినా వినని స్త్రీని కుటిలకుంతల అని పేర్కొంటూ అందులో వంకర గుణాన్ని ధ్వనింపజేస్తూ, పతిని ఇంతగా బాధపెట్టడం న్యాయమేనా? అతనిపై శృంగార చూపులు ప్రసరింప జేయమని, అలగడం ఎందుకని సానునయంగా ప్రశ్నిస్తూ నీతిగౌరవం కనిపిస్తుంది అన్నమయ్య సంకీర్తనా సాహిత్యానికివాడిన భాష రాయలసీమ, ముఖ్యంగా కడపజిల్లా మాండలిక భాష. ప్రజా జాగృతి కోసం వ్రాసిన సంకీర్తనలు కాబట్టి ఇందులో వ్యాకరణ బద్ధం, వ్యాకరణ విరుద్ధం రెండు విధాలైన పద జాలం చోటుచేసు కొనివుంది. అక్కడక్కడా మహాప్రాణాక్షరాలకు బదులు అల్పప్రాణా క్షరాలను కూడా వాడినట్లు కనిపిస్తోంది.

పురుషులందరు దుష్టులు కారు. స్త్రీలందరు శిష్టులు కార ఇక్కడ స్త్రీ, పురుష అని కాక ఎవరు జ్ఞానవంతులైతే వారిని అను రించి ప్రవర్తించడం సతీపతుల ధర్మం. భర్త అన్ని విధాల సద్గు సంపన్నుడు, దయార్ద్రహృదయుడు అయినప్పుడు భార్య అతనికి అన్నిం లోను అనుకూలవతిగా మెలగాలి. అప్పుడే సంసారం చక్కగా ని బడుతుంది. కాపురం కమనీయంగా కొనసాగుతుంది. అలా సంసా మనే నౌక సవ్యంగా, సురుచిర సుందరంగా సాగిపోవాలంటే స ఎలాటిదై వుండాలో—

"సతి యిట్టిదైతే సంసారఫలము
కతలన్ని నీయందే కలవే వో చెలియా ॥

చెప్పిన బుద్ధులు విని చిత్తములోన మెలఁగి
తప్పక సేవ సేసేదే తరుణి
ముప్పిరి నితవుతోడ ముచ్చటలచ్చటలాడి
యెప్పుడూ బాయ కుండేది ఇల్లాలు ॥ (28-524

అనే సంకీర్తనలో భర్తచెప్పినవిధంగా చిత్త శుద్ధిగా ప్రవర్తించి సేవ చేస్తూ అతను కోరినవిధంగా ప్రేమగా సరస సల్లాపాలాడి అతన్ని వదలకుండా వుంటూ, అతనిపై అనురక్తి చూపుతూ, ఇంటి పనులు చక్కగా నిర్వహించుకొంటూ, భర్త మనసెరిగి ప్రవర్తిస్తూ, నిర్మ మైన సుగుణాలతో అతిశయించాలని చెలికత్తె పాత్ర ద్వారా అన్న మయ్య మానినీ ధర్మాన్ని బోధించాడు.

పతిపై రోషంగా ఉంటున్న సతిని ఉద్దేశించి - "స్త్రీలకు ఈ స్వభావం ఎన్నో అనర్థాలకు దారితీస్తుంది. అనుకూల్యంగా నడచు కుంటేనే సంసార జీవితం ఫలిస్తుంది. భర్త పట్ల వినయంగా ఉండటం సరసమాడే సమయంలో బిగువుగా లేకుండా ఉంటే అదే పెద్దరికం

అని, భర్త ఎంత స్వేచ్ఛగా మాట్లాడినా స్త్రీ సిగ్గుతో ఉండటమే అందమని, భర్త ఎంత వేడుకగా నవ్వినా స్త్రీమాత్రం గుట్టుతో ఉండటమే నేర్పరితనమని. భర్త తలపెరిగి మెలగడమే తెలివి అని చెలికత్తె ద్వారా అన్నమయ్య స్త్రీలకు సందేశమిచ్చాడు.

కొమ్మలకు నిట్టివోజ కోటి సేసును
సమ్మతిగా నడచుటే సంసారఫలము ॥

ననుపెంత గలిగినా నాయకుని యెడాటాన
వినయములే వన్నె వెలదికిని
చనువెంత యిచ్చినాను సరసమాడేటివేళ
వెనగకుండుటే కడు బెద్దరికము ॥ (30-288)

దైవ సృష్టిలో ఏనుగు అతి పెద్ద సంతువు. అంతటి ఏనుగునే మానవుడు తన తెలివి తేటలతో వశం చేసుకుంటాడు. అలా వశం చేసుకొని ఎక్కిన వానికి ఏనుగు చిన్నదే అవుతుంది. అలాగే భార్యను వశం చేసుకున్న భర్తకు భార్య లోకువే. మగవానిని ఆరడి చేయ కూడదని, మనసు, మర్మం తెలుసుకొని మాట్లాడాలని, బెదిరించ కూడదని, ప్రియమైన మాటలు చెప్పి లాలించాలని, మాటకు మాట బదులు పలకకూడదని, సమయం చూచి అతన్ని బ్రతిమాలుకోవా లని, మితి మీరకూడదని అన్నమయ్య చెలికత్తె ద్వారా హితం చెప్పాడు.

ఎంతైనా నెక్కిన వానికేనుఁగు గుజ్జేకాదా
పంతమున మొగవాని బచ్చిసేతురటవే ॥

మనసు మర్మ మెఱిగి మాటలాడవలె గాక
చనవు గద్దంటా బతి జంకింతురటే

చెనకితే ప్రియములు చెప్పిలాలింతురుగాక
కినిసిమారుకు మారు గేలి సేతురటవే ॥ (27-406)

ఇలాగే మరోచోట "వట్టి మాటలు ఎంతసేపైనా ఎందుకు మాట్లాడుతావు. స్త్రీలకు సిగ్గే మూలధనం. తలవంచుకోరాదా, మగవాడు ప్రతిసారి నవ్వినా ఇల్లాలు మారు నవ్వు నవ్వవచ్చా? స్త్రీలకు కోపమే సింగారం, కనుబొమలతో బెదిరించరాదా? నీవు తిరిగేవాడివి. నీవు పైకొనిసైగ చేస్తే స్త్రీలు ఆగడాలు చేయవచ్చా? స్త్రీలకు గుట్టే చక్కదనం. స్త్రీలు నియమంతోనే ఉండాలి. పురుషుడవైన నీవు సమీపిస్తే పెండ్లికూతురు పెనగులాడ కూడదని నాయకునితో వనితా ధర్మాన్ని గూర్చి తెలిపాడు.

ఏఁటి మాటలాఁడేవు యెందాఁకానైనా
వాఁటమై నిన్ను గాదనేవారు లేరంటానా ॥

చెలుఁల కిందరికిని సిగ్గే మూల ధనము
తలవంచుకోరాదా తరుణికిని
చలి వాసిన వాఁడవు సారె నవ్వితేను
మలసి యిల్లాలికి మారు నవ్వ దగునా ॥ (27-238)

భర్తపట్ల భార్య మెలగవలసిన తీరును చెబుతూ "నీవు మంకు బుద్ధి మానేస్తే నీ భర్తే ప్రేమచూపడా? తమాషా కోసం ఏదో ఒక మాట నీ భర్త అన్నంత మాత్రాన తోటి స్త్రీలందరికి చెప్పడ మెందుకు? నీవు ప్రేమ చూపితే అతడు నీవు చెప్పినట్లు చేయకుంటాడా? అతడు నిన్ను పట్టుకునంత మాత్రాన ఎందుకు తిట్లాలను కుంటావు? శయ్యపై ఏమి చేసినా ఆతను నీకు లోబడకుంటాడా? అతను నిన్ను కలసినందుకు ఎందుకు సిగ్గుపడతావు? అని అన్నమయ్య చెలికత్తె ద్వారా ఓదార్పుగా హితబోధ చేశాడు.

మానగదె ఇంతట నీమంకు విద్యలు
యీనెపాన నాతఁడన్ని నియ్యకొనడా ॥

నవ్వులకు నొకమాట నాయకు డాడినందుకు
ఇవ్వల సతుల తోడ నేమి చెప్పేవే
జవ్వని నేకతమున సాదించితే నాతఁడు
చివ్వన నీ చెప్పినట్టు సేయకుండీనా ॥ (26-434)

ఇంకా ఇలాంటి సంకీర్తనలు తామరతంపరలుగా ఉన్నాయి. సంకీర్తనల నుంచి వేరుచేసి ప్రత్యేకంగా చెప్పదగిన స్త్రీలకు సంబంధించిన అనేక రకాలైన సూక్తుల్ని కూడా అన్నమయ్య సంకీర్తనల్లో విస్తారంగా ప్రవేశపెట్టాడు. వీటిని మనం సందర్భాను సారంగా గ్రహించవచ్చు—

"ఇంతుల చేతకు లోనేయెప్పుడును మగవాడు"
"జంతగాని తరుణి యే జాతైన నదె చాలు"
"నవ్వే మూలధనము నాతులకు"
"మగువల మాటలు మంచి చక్కెరతీపులు"
"వయసు కల్పవృక్షము వనితలకు"
"మనసే పరుసవేది మగువలకు"

ఆనాడు అన్నమయ్య బోధించిన మానినీ ధర్మాలు, సూక్తులు, నేటి స్త్రీలకు కూడా అవసరం. అయితే విద్యా ఉద్యోగాలలో, కుటుంబ బాధ్యతలలో, సమాజ కార్యకలాపాలలో నిర్విరామంగా కృషిచేస్తూ తలమునకలుగా సతమతమవుతున్న స్త్రీలు అన్నమయ్య బోధించిన మానినీ ధర్మాలను ఎంతవరకు స్వీకరించగలరనేది వివా

దాత్మక మయింది. కానీ ఆ వివాదాల్ని విస్మరించి ఆ భాగవతోత్తముడు బోధించిన స్త్రీ ధర్మాలు ఇవి అని తెలుసుకోవడం, వీటైనవి ఆచరించడం వరకే వనితా లోకం కర్తవ్యం.

రోటరీ ఇంటర్నేషనల్
సావనీర్, 5-6-1994,
రోటరీక్లబ్, నరసరావుపేట,
గుంటూరు జిల్లా.



# అన్నమయ్య వర్ణించిన వంటకాలు

మానవ జీవితానికి ప్రతిబింబం సాహిత్యం. సాహిత్యంలో మానవ సంస్కృతికి సంబంధించిన ప్రతి అంశం చోటుచేసుకొంటుంది. మానవ సంస్కృతిలో వంటకాలు ఒక భాగం. మానవునికి ఆహారం ప్రాథమిక అవసరం. ఆ అవసరంతీరనిదే మానవుడు ఏపనీ చేయలేడు. బ్రతకలేడు. ఆహారం కోసం పని, పనికోసం ఆహారం అన్నంత అవినాభావ సంబంధంగా పని, ఆహారం కలిసిపోయాయి. అందుకే కోటి విద్యలు కూటికొరకే" అనే సామెత ఏర్పడింది. కానీ మానవుడు అవసరం తీరడంతోనే తృప్తి చెందలేదు. అవసరదశనుంచి కళాత్మక దశవరకు ఎదిగాడు. అందం, ఆనందం కోరుకున్నాడు. అందమె ఆనందం, ఆనందో బ్రహ్మ అని వేదాంతులు ప్రవచించారు. మానవుడు ఏ వస్తువునైనా అవసరం దృష్టితోనే కాక కళాత్మక దృష్టితో కూడా తయారు చేస్తాడు. అలాగే వంటకాన్ని కూడా కేవలం తినడానికే కాక జిహ్వకు రుచికరంగా కూడా తయారు చేసుకుంటాము. అందమైన వస్తువును చూచినప్పుడు, అందమైన వ్యక్తిని చూచినప్పుడు మనసుకు ఎంతో ఉల్లాసం, ఉత్సాహం కలుగుతుంటుంది. అలాగే కమ్మని సువాసనలు వెదజల్లే రుచికరమైన వంటకాలు తింటుంటే కోపతాపాలు, విసుగు, విరక్తులు పోయి మనసుకు అపురూపమైన ఆనందం కలుగుతుంటుంది. అందువల్ల బంధుమిత్రాదులు వచ్చినప్పుడు, పండుగ రోజుల్లోను, రకరకాల నుంచి వంటకాలు తయారు చేస్తుంటారు.

తరతరాల నుంచి గృహసంబంధమైన కార్యకలాపాలు, వంటవార్పులు స్త్రీలే చేస్తున్నా చక్రివర్తుల కొలువులో చేరి వంటకాల చేసిన చక్రవర్తులకే నలపాకం, భీమపాకం అనేపేరు ప్రఖ్యాతుల

రావడం విశేషం. వంటింట్లో వంటకాల తయారీని చిన్నచూపుచూసి స్త్రీలకే పరిమితం చేయకుండా పురుషులు కూడా చేస్తే బాగుంటుందని ఇదొక నిదర్శనంగా చెప్పవచ్చు. కళలు మానవుని ఆనందం కోసం సృష్టించబడ్డాయి. వంటకాల తయారీని గూర్చి ప్రసిద్ధ నవలాకారిణి శ్రీమతి మాలతీచందూర్ గారు, సుప్రసిద్ధ సినీ కళాకారిణి శ్రీమతి సూర్యకాంతంగారు, గృహవిజ్ఞాన ప్రవీణురాలు, హోంలైబ్రరీ నిర్వాహకురాలు, కళాహృదయిని శ్రీమతి చింతల పద్మావతిగారు మొదలైనవారు గ్రంథాలు రచించి తెలుగు జాతికి అందించారు. ఇవి తెలుగు వారికేగాక తెలుగు వంటకాలపై ఆసక్తి వున్న ఇతర రాష్ట్రీయులకు కూడా ఉపయోగపడతాయి. మహాకవుల గ్రంథాలలో వంటకాల ప్రసక్తులు, వాటి వివరాలు కూడా చోటుచేసుకోవడం గమనించ దగిన విషయం.

కూర లన్నింటిలో ప్రత్యేకించి వంకాయకూర ఘనతను పేర్కొంటూ వంకాయ లాంటి కూర, సీతవంటి భార్య, శంకరుని వంటి దైవం, శ్రీరాముని వంటి రాజు లేడని చాటే—

"వంకాయ వంటికూరయు
పంకజముఖి సీతవంటి భామామణియున్
శంకరునివంటి దైవము
లంకాధిపు వైరివంటి రాజుంగలడే"

అనే పద్యం, అలాగే "ఎక్కడైనా బావగానీ వంగతోటలో బావకాదు" అనే సామెత కూడా ప్రచారంలో వున్నాయి.

శ్రీమతి చింతల పద్మావతిగారు రచించిన "ఇంటింటా మంచి వంట" అనే పుస్తకాన్ని ఆవిష్కరించి ప్రముఖ జానపద విజ్ఞానవేత్త

డా॥ ఆర్వీయస్ సుందరంగారు ప్రాచీన సాహిత్యంలోని వంటకాల్ని గూర్చి చెబుతూ నన్నయ భారతం, శ్రీనాథుని కాశీఖండం, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యం, శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద వంటి గ్రంథాల్లో వంటకాల ప్రసక్తులు, వాటి వివరాలున్నాయని తెలియజేశారు. కాశీఖండంలో వివాహ వేడుకలో సరసంగా వడ్డించడాన్ని గూర్చి వివరించారని, శ్రీనాథుని రచనలద్వారా ఇడ్డెన తెలుగువారి వంటకమేనని తెలుస్తుందని, అలాగే కాళహస్తి మాహాత్మ్యంలో ఆహారపదార్థాలు చెడిపోకుండా ఉండటానికి తీసుకోవలసిన జాగ్రత్తల్ని గూర్చి, ఆముక్తమాల్యదలో ఆయా ఋతువుల్లో తినవలసిన వంట కాల్ని గూర్చి పేర్కొన్నారని ఆనాటి సభలో వివరించారు.

ఇలా తెలుగు సాహిత్యంలో ప్రాచీన కాలంనుంచీ వంటకాల ప్రాశస్త్యం కనిపిస్తున్నట్లే అన్నమయ్య సంకీర్తనల్లో రకరకాల వంటకాల పేర్లు కనిపిస్తాయి. అన్నమయ్య శ్రీనివాసుని పరమాత్మగా, ప్రాణ బంధువుగా, ప్రియసఖుడుగా, భర్తగా, ప్రియుడుగా, బిడ్డగా అనుభూతి చెందాడు. ఇందిరాదేవి అనేక రకాల వంటకాల్ని తయారు చేసి వడ్డించిందని, ప్రేమగా, ఆనందంగా ఆరగించమని స్వామివారికి విన్నవించుకొంటూ అన్నమయ్య వ్రాసిన—

"ఇందిర వడ్డించ నింపుగను
చిందక యిట్టే భుజించవో స్వామి"

అనే సంకీర్తనలో అక్కాళాలు, పాయసాలు, అప్పాలు, వడలు, పేణులు, చక్కెర, తజానెయ్యి, మిరియాల తాళింపు, కమ్మనికూరలు, పచ్చళ్ళు, పిండివంటలు, పెరుగులు మొదలైన వంటకాల్ని పేర్కొన్నాడు. ఇందులో అక్కాళాలు అనే పదం వ్యవహారంలో అక్కాళ్ళు గాను తర్వాత అక్కాళుగా రూపాంతరం చెంది వుండవచ్చని చెప్ప

వచ్చు. అలాగే పాళాలు అంటే పాయసానికి వికృత రూపంగా చెప్పవచ్చు. పేణులు అంటే అన్నమయ్య కాలంనాటి ఒక రకమైన పిండివంటకమని చెప్పాలి.

చిన్న చిన్న పనులుచేసే మానవుడే రకరకాల పిండివంటల్ని అపరిమితంగా కోరుకుంటాడు. మరి సర్వలోకాల్ని సంరక్షించే శ్రీని వాసుడు ఇంకెన్ని విధాలుగా ఘనరుచుల్ని కోరుకుంటాడో మనం ఊహించుకోవచ్చు. భక్తుడు మానవ చర్యలన్నింటిని భగవంతునికి ఆరోపించి ఆనందం అనుభవిస్తుంటాడు. ఆ స్వామిని రకరకాలుగా వర్ణించి మురిసిపోతుంటాడు. శ్రీనివాసుడు తన దేవేరి అలమేలుమంగ వడ్డిస్తూవుండే ఎప్పుడూ పదివేల రుచులతో తింటూనే ఉంటాడని, ఆ స్వామి ఆరగించే వంటకాలు ఎంతెంత పరిమాణం కలిగినవో, అవి చూడటానికి ఎంత రమణీయంగా ఉన్నాయో తెలియజేశాడు.

"ఏపొద్దుచూచిన దేవుఁ డిట్లాన యారగించు
రూపులతో పదివేలు రుచులైనట్లుండెను ‖

ఇందులో స్వామి ఆరగిస్తున్న ఇడ్డెనలు మేరుపర్వతం, మంధర పర్వతంవలె మెరుస్తున్నాయని, భోజనంచేసే పళ్ళేలు సూర్యచంద్రుల ఉన్నాయని, బంగారు, వెండి గిన్నెలు రకరకాల సముద్రాల వలె ఉన్నాయని, వెన్న ముద్దలు కొండలంతేసి ఉన్నాయని, పాలు పంచ దార కలసిన పదార్థం వెన్నెల రసం అందించినట్లుగా ఉందని, పచ్చళ్ళు, కూరలు పండిన పంటల్లా ఉన్నాయని, వీటిని శ్రీనివాసుడు తిని మిగి లినవాటిని దండిగా తన భక్తులకోసం దాచినట్లుగా ఉందని అన్న

మయ్య మనోహరంగా వర్ణించాడు. అన్నమయ్య సంకీర్తనా సాగరంలో ఇలాంటి సంకీర్తనా రత్నాలు చాలా ఉన్నాయి.

ఈ విధంగా అన్నమయ్య తనకాలంనాటి వంటకాల్ని సంకీర్తనా సాహిత్యంలో పొందుపరచాడు. దీనివల్ల, మన తెలుగువారి సంస్కృతిలో వంటకాల వైశిష్ట్యం వ్యక్తమవుతుంది. అన్నమయ్య సంకీర్తనావళి అచ్చమైన తెలుగు సంస్కృతీ వైభవానికి నివాళి.

కోస్తావాణి

21-5-1993



# అన్నమయ్య సంకీర్తనల్లో సాంఘిక దురాచార నిరసన

అన్నమయ్య సంకీర్తనలు అనగానే చాలామంది అవి కేవలం భక్తి, సంగీతాత్మకమైనవని, విని ఆనందించడానికి మాత్రమే పరిమితమని భావిస్తారు. కానీ అందులో సమాజసంబంధమైన అనేక అంశాలు చెప్పబడ్డాయి. అన్నమయ్య ఎంతటి పరమభక్తుడైనా సమాజంలో ఒక వ్యక్తిగానే జీవించాడు. ఆనాడు సమాజంలో కనిపించిన అస్తవ్యస్తాలను, సాటి మానవుల కష్టాలనుచూచి ఎంతో ఆవేదనపడ్డాడు. నాస్తికుల్ని, కులభేదాల్ని మతభేదాల్ని, జంతు బలుల్ని, దురాచారాన్ని అమానుషత్వాన్ని, స్త్రీ పురుషవ్యత్యాసాన్ని నిరసిస్తూ సమాజ శ్రేయస్సుకోసం అనేక రకాలుగా భక్తి జ్ఞాన నీతి బోధలు చేశాడు. ప్రస్తుతం దురాచార నిరసనకు సంబంధించిన సంకీర్తనల్ని పరిశీలించడం జరుగుతుంది.

ఆచారాలు, అలవాట్లు కాలాన్నిబట్టి మారుతుంటాయి. ప్రతి మతానికి, ప్రతి కులానికి ప్రత్యేకించి కొన్ని ఆచారాలుంటాయి. విద్యావంతుల్లో కొందరు, సామాన్య ప్రజల్లో అనేకులు భక్తికన్నా ఆచారాలకే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంటారు. ఎంతటి వ్యయ ప్రయాసాలకైనా సహించి ఆచారాలకోసమే బ్రతుకుతున్నట్లు భావిస్తారు. ఆచారాలు మానవ కల్పితాలనే సత్యాన్ని విస్మరిస్తుంటారు. ఆచారం అంటే ఆచరణ యోగ్యమయిందని, అది మానవునికి శ్రేయస్సును చేకూర్చేదిగానే ఉండాలని ఆలోచించరు.

అన్నమయ్య భక్తే ముఖ్యమయిందని, అందులో హరిభక్తి శాశ్వతమయిందని, చెడనిదని అన్నమాచార్యులు పోతనవలె ఉద్ఘాటించాడు.

"హరిభక్తి గలిగితే అన్నియు ముఖ్యముగాక
విరహాచారము లెల్ల వృథా వృథా ॥

పులులు గుహల నుంటె పోలింపఋషులా
యెలుగు గడ్డము పెంచు నింతలోనే యోగ్యుడా
పక్షులాకాశాన కేగితే దేవతలా
పొలసికోతి యడవి నుంటే వనవాసమా ॥

మాకులు మాటలాడవు మానవ్రతములా
కోకగట్టరు బాలులు కోరి దిగంబరులా ॥

అనే సంకీర్తనలో అన్నమయ్య హరిభక్తి కలిగివుంటే అన్నీ ముఖ్యమేనని, అదిలేకుంటే ఇతరమైన ఆచారాలు వ్యర్థమని తెలియజేస్తూ పులులు గుహల్లో ఉన్నంతమాత్రాన ఋషులవుతాయా? పక్షులు ఆకాశంలో ఎగిరినంతమాత్రాన దేవతలా? కోతి అడవిలో ఉంటే అది వనవాసమవుతుందా? చెట్టుమాట్లాడనంతమాత్రాన అది మానవ్రతం చేస్తున్నట్లా? పిల్లలుబట్టలుకట్టుకోనంతమాత్రాన దిగంబర యోగులవుతార? అని ప్రజలు తమకుతాముగా ఆలోచించుకొనేలా జ్ఞానబోధాత్మకంగా ప్రశ్నించడం కనిపిస్తుంది,

ఆనాడు శక్తి పూజలు. గ్రామదేవతల పూజలు చేసేవారు అధికంగా ఉండేవారు. వారు దేవతా ప్రీతికోసం జంతువుల్ని బలిచ్చేవారు. మహమ్మదీయులు అగ్నిగుంటాల్లో దూకి తమభక్తిని

ప్రదర్శించుకోనేవారు, అదిచూచి అన్నమయ్య ఆవేదన చెంది దేవతలను తృప్తిపరచవలసింది జంతువుల్ని బలి ఇచ్చి కాదని, నిశ్చలమైన భక్తికలిగివుంటే చాలని బోధించి ఈ దురాచారాన్ని ఖండించాడు.

"మొక్కరో మీరు మోసపోక
మిక్కుటిక్కు డైన ఆదిదేవునికి ॥

మీరు జేతులేయవద్దు మీరుగాళ్ళీయవద్దు
బీరాన గుండెలు కోసి పెట్టవద్దు
గోలపడి చిచ్చులోన గుండాలు చొచ్చి వద్దు
వూరకే మీవారమని వున్న చాలు"

అన్నమయ్య దృష్టిలో అసలైన ఆచారం అంటే శ్రీవేంకటేశ్వరునికి శరణాగతి చేయడమే. ఈ విషయాన్ని తెలిపాడు.

'చెలఁగినా కిందుకే గింతయ్యాని
తెలిసినదాకానిది దిష్టమయ్యానా ॥

హరిపుట్టించిన దేహి హరి నేకొలువక
నరులగొలుచుట అన్యాయమయ్యా

..........................

అరిది శ్రీవేంకటేశు డంతరాత్మయి వుండఁగాను
శరణన కుండుట ననాచారమయ్యా"

శ్రీవేంకటేశ్వరుని శరణు వేడకపోవడమే అనాచారమని అన్నమయ్య ఇందులో స్పష్టం చేశాడు.

ప్రజలు సాంఘిక దురాచారాలను మూర్ఖంగా పాటిస్తూ కష్టాలపాలుకావడం చూచి అన్నమయ్య ఎంతో విచారించాడు.

"కాలవిశేషమో లోకముగతియో సన్మార్గంబుల
కీలువదలె సౌజన్యము కిందయి పోయినది
...................................
తమకిక నెక్కడి బ్రదుకులు, తమబడె నాచారంబులు'
'ఏఁటి విచారము యెక్కడి యాచారము
మాటున జీవుఁడింతేసి మాయల'

మానవుని చిత్త భ్రాంతికి తెగతెంపులేక బ్రతుకు దుర్భరమై పోతోందని. సదాచారం నశించిపోతుందని ఆవేదనపడ్డాడు.

"తెగదెంపు లేని భ్రాంతికి జిక్కి యాచార
మెగసి గొందులు దూరె నేఁటి బ్రతుకు"

ఎప్పుడూ దురాచారం పాటించే ఛాందసులకు సత్సంగతుల్ని కూర్చి తెలియ జెప్పినా తెలిసికోలేరని, సత్కర్మలు వదలి వేసిన వారికి సహజమైన సదాచారం జరగదని తెలిపాడు.

"సతత దురాచార జడునకు బుణ్య సం
గతి దలపోసిన గలిగీనా
విహిత కర్మములు విడిచిన వానికి
సహజాచారము జరిగీనా"

పాపాత్ముడైన మూర్ఖుడు ఎన్ని ఆచారాలు పాటించినా అతనికి దయరాదని—

"ముప్పిరి బాతకుడైన మూఢుడెన్ని యాచారాలు
తప్పకెంత నేసినాను దయ యేలకలుగు"

అనే సంకీర్తనలోను, మానవుడు లౌకిక మాయల్లో పడిపోయి సదాచారం వదిలేస్తున్నాడని ఇంక విచారించి ఫలితమేమిటని అజ్ఞానులపై విరక్తి చెందడం—

'ఏఁటి విచారము యెక్కడి యాచారము
మాటున జీవు డింతేసి మాయల బొరలును'

అనే సంకీర్తనలోను, మానవుడు విష్ణుభక్తికి అర్హత కావా లంటే ఎల్లప్పుడు దయ అనే ఆచారసంపద కలిగివుండాలని—

"సతత దయాచార సంపన్నుడై మతికదా
అతిశయ వైష్ణవాన కరుహు డౌట"

అనే సంకీర్తనలోను వ్యక్తం చేశాడు.

సాంకేతికంగా, వైజ్ఞానికంగా ముందంజవేస్తూ, హేతువాద దృక్పథం ప్రబలుతున్న ఈ ఆధునిక కాలంలో కూడా ప్రజల్లో మూఢ విశ్వాసాలు ఇంకా నిలిచేవున్నాయి. అన్నమయ్యకాలంలో మూఢవిశ్వాసాలు పాటించే ప్రజలు ఇంకా అధికసంఖ్యలో ఉంటారు. దయ్యాలు, భూతాలు సోకాయని భూతవైద్యం చేయించడం, వాటి వికృత రూపాలు, చేష్టలు, భయంకరమైన అరుపులు మొదలైనవి అన్నమయ్యను కలచివేశాయి. అన్నమయ్యకు ఇలాంటివాటిపై విశ్వాసం లేదు. ఆయన దృష్టిలో మదమాత్సర్యాలు, ధనం, మాయ మొదలైన దుర్గుణాలే భూతాలు, దయ్యాలు, ప్రజల్లో మూఢత్వం పోవాలని కాంక్షించి, నారాయణ నామమంత్రంవల్లనే ప్రజల్లో ఈ భ్రమ తొలగిపోతుందని విశ్వసించి ఆదైవాన్ని ప్రార్థిస్తూ—

"నారాయణుఁడ నీనామము మంత్రించివేసి
పారేటి యీ జంతువుల భ్రమ విడిపించవే॥

అనే సంకీర్తనలో ప్రజల అజ్ఞానాన్ని విన్నవించి, వారికి జ్ఞానం కలిగించమని అన్నమయ్య స్వామిని వేడుకొన్నాడు.

వ్యక్తి మరణించినప్పుడు కర్మకాండ పూర్తి అయ్యేవరకు ప్రతిరోజు అన్నంతో పిండాలుచేసి కాకులకుపెట్టుతారు. పితృదేవతలు కాకులరూపంలో వచ్చి ఆ పిండాలను తిని సంతృప్తిచెంది చాలా కాలంవరకు వస్తులులేకుండా ఉంటారని హిందువుల విశ్వాసం. వేమన కూడా ఇది మూఢవిశ్వాసమని ప్రజలను అధిక్షేపించాడు.

'నరులకు నరులే పరలోకక్రియలు
సిరిమోహాచారాలు జేతురుగాక
తరుపాషాణ పశుతతుల కెవ్వరు సేసే
ర రయఁగ భ్రమ గాక-అవివస్తులున్నవా"

ఎంతో డబ్బు ఖర్చుచేసి ఆచారాలకోసం మనుష్యులకు మను షులు పరలోక కర్మలు చేస్తున్నారు. మరి చెట్లకు, రాళ్ళకు, పశు లకు, జంతువులకు కర్మకాండ ఎవరుచేస్తున్నారు? అలా చేయనంత మాత్రాన అవి వస్తులున్నాయా? అని ప్రశ్నిస్తూ అంతా మన భ్రమే అంటూ అన్నమయ్య ప్రజల్లో హేతువాద దృష్టిని కలుగ జేస్తున్నాడు.

ఈ విధంగా అన్నమయ్య ప్రజల్లోని దురాచారాల్ని మూఢ విశ్వాసాల్ని నశింపచేయడానికి, నిశ్చలమైన విష్ణుభక్తి పెంపొందించ డానికి అనేకరకాలైన సంకీర్తనలు రచించాడు. అలనాటి అన్నమయ్య సంకీర్తనలు ఈనాటి ప్రజలకే కాక భావితరాల వారికి కూడా జ్ఞాన దీప్తిని కలిగిస్తాయి.

ఉదయం దినపత్రిక,
19-10-1994



# అన్నమయ్య సంకీర్తనల్లో క్రీడా విశేషాలు

ప్రజల్లో విష్ణుభక్తి తత్వాన్ని, మానవతా ధర్మాలను ప్రబోధించి ప్రజలను తరింపజేయడానికి అప్పని వరప్రసాదిగా అవతరించిన పుణ్యపురుషుడు ఆచార్య అన్నమయ్య. అన్నమయ్య రాజాస్థాన సన్మానాలను, ఉద్దండ పండిత గౌరవాలను, కీర్తికాంతను కోరుకోలేదు. కేవలం ఆబాల గోపాలాన్ని పరమ-భక్తులుగా. సత్యతత్పరులుగా, కరుణాహృదయులుగా తీర్చిదిద్దడమే ఆయన ఆశయం. అందుకు సంగీతాత్మకమైన పదకవితలే పరమ సాధనాలను భావించాడు. పదకవితకు కొన్ని లక్షణాలు ఏర్పరచి సంకీర్తనలక్షణం అనే గ్రంథాన్ని రచించాడు. తదనుగుణంగా ముప్పై రెండువేల శృంగార, అధ్యాత్మ సంకీర్తనలు రచించి తన ప్రియదైవమైన తిరుమల శ్రీనివాసునికే అంకితమిచ్చాడు. తనకు పూర్వం రాజాస్థానాల్లో, పండిత సభల్లో క్షుద్రకవితలుగా నిరసింపబడుతున్న పదాలకు పట్టం కట్టి, కావ్య గౌరవం కల్పించి పదకవితాపితామహుడుగా, సంకీర్తనాచార్యుడుగా, ద్రావిడాగమసార్వభౌముడుగా కీర్తికెక్కిన పదకవితావైతాళికుడు అన్నమయ్య.

తిరుమల తిరుపతి దేవస్థానం వారి శ్రద్ధాసక్తులవల్ల, నిరంతర కృషివల్ల నేడు పదమూలుగువేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు లభిస్తున్నాయి. అన్నమయ్య సంస్కృత పండితుల్ని మెప్పించడానికి సంస్కృతభాషలోను, శిష్టులను తృప్తిపరచడానికి శిష్టవ్యావహారికంలోను, పామరులను అలరింపజేయడానికి పామరభాషలోను, జానపదులను రంజింపజేయడానికి జానపదభాషలోను సంకీర్తనలు రచించాడు.

ఇలా భాషలోనే కాకుండా ప్రజలందరి మనస్తత్వాల కనుగుణంగా వైవిధ్యంతో కూడిన సంకీర్తనలు రచించాడు. సరసహృదయుల కోసం శృంగార సంకీర్తనలు, వైరాగ్యచిత్తులకోసం తాత్విక సంకీర్త నలు, భక్తి తత్పరులకోసం భక్త్యాత్మక సంకీర్తనలు, జానపదుల కోసం జానపదగేయ ఫణితులు, సంఘ సంస్కార ప్రియులకోసం సామాజిక ప్రబోధ సంకీర్తనలు, ఆయావృత్తులవారికోసం వృత్తిపర మైన సంకీర్తనలను గిరిజనులకోసం గిరిజన సంకీర్తనలను రచించి తన సంకీర్తనల్లో విలక్షణతను, వైవిధ్యాన్ని ప్రదర్శించాడు. అన్నిరకాల సంకీర్తనల్లోను శ్రీనివాసుని భక్తిని పొందుపరచాడు. ప్రస్తుత వ్యాసం అన్నమయ్య సంకీర్తనలలో కనిపించే క్రీడావిశేషాలను గూర్చి ప్రస్తావించడం జరుగుతుంది.

ఆటలు, క్రీడలు, వినోదాలు లేక వేడుకలు అనేవి ఒకదాని కొకటి పర్యాయ పదాలుగా వాడబడుతున్నా సూక్ష్మదృష్టితో పరిశీ లిస్తే అవి వేరు వేరు అర్థాలలో ప్రయోగించబడటం కనిపిస్తుంది. ఆటలకు సాధారణంగా నియమ నిబంధనలంటూ ప్రత్యేకించి వుండవు. దాగుడుమూతలు, గుజ్జెన గూళ్ళు, బొమ్మరిండ్లు, బొమ్మల పెండ్లిండ్లు, కోతికొమ్మచ్చి మొదలైనవాటిని అటలుగానే పేర్కొన వచ్చు.

అన్నమయ్య సంకీర్తనలలో "కూగూగు" అనే పాదాంత ఆ వృత్తి పదంతో కూడిన ఒక సంకీర్తన కనిపిస్తుంది. బాలలు కోతి కొమ్మంచులాట ఆడేటప్పుడు చెట్టుకొమ్మంచున దాగివున్న బాలుని పట్టుకొనేటప్పుడు 'అదిగదిగో' అనేమాటే ఉచ్చారణా వేగంలో 'అగ్గొగో', ఆపైన "కూగూగు"గా మారిందని చెప్పవచ్చు. అన్న మయ్య తనకాలంలో బాలలు ఆడుతున్న ఈ ఆటను గమనించి వారు ఉచ్చరించే 'గూగూగు' అనే మాటనే కూగూగుగా స్వీకరించి

ఆ పదం ఆవృత్తితో కూగూగు పాటవ్రాసి వుండవచ్చు. ఈపాటలో దొంగ అల్లరికృష్ణుడు. సాధారణంగా దొంగను గుర్తుపట్టడం చాలా కష్టం. కానీ కృష్ణుడనే దొంగను పట్టడం మాత్రం చాలా సులభం అని, ఆయన గురు తెరిగిన దొంగ. గుడిలో దాగుకొన్న దొంగ. అంటూ శ్రీకృష్ణుని బాల్యక్రీడలను వర్ణిస్తూ—

గుఱు తెఱిఁగిన దొంగ కూగూగు వీఁడె
గుడిలోనె దాఁగీని కూగూగు ॥ (4-51)

అనే సంకీర్తన రచించాడు. ఇందులో శ్రీకృష్ణుడు, గోపికలు జలక్రీడలాడుతున్నప్పుడు వారి వస్త్రాలను దొంగిలించడం, ఎత్తైయిన ఉట్లపై వుంచిన పాలు త్రాగివేయడం మొదలైన చేష్టలను అన్నమయ్య వర్ణించాడు. శ్రీకృష్ణునికొలసిదరిని దొంగ, కొండమీరిన దొంగ, గొల్లెతల దొంగ, గోవులలో దొంగ, కోవిదుడగు దొంగ అని చమత్కరించి. కలియుగ ప్రత్యక్ష దైవమైన శ్రీనివాసునతో అభేదం చెప్పాడు,

అన్నమయ్య బాల్యంలో శ్రీకృష్ణుడు ఆడిన రకరకాల ఆటలను పేర్కొంటూ—

చేరి యందెల మోఁతతో చెన్నకేశవా
యీ రీతి మాఁడు పూరిలో నిట్లాడేవా ॥ (3-179)

అనే సంకీర్తన క్షేత్రముద్రతో మాడుపూరులో వెలసిన చెన్నకేశవునిపై రచించాడు. ఇందులో శ్రీకృష్ణుడు యశోద దగ్గర గునిసి గునిసి ఆడటం, రేపల్లె వీధులలో పిల్లదీపులాట, యమునలో రాసక్రీడ, గోపికల పైటలు లాగుతూ చెట్టాపట్టాలాట, ఋష్యశృంగుని తండ్రి అయిన విభాండకునితో దాగిలి మువ్చులాట, మిక్కిలి ప్రతాపంతో బండి విరిచాట ఆడాడని తెలియజేశాడు. ఈ

ఆటలన్నీ అన్నమయ్య కాలంలో బాలలు ఆడివుంటారు. వాటికి) చిన్నికృష్ణునికి ఆపాదిస్తూ అన్నమయ్య వర్ణించాడు.

అలాగే—

విచ్చిన విడిన యాడీ వీడె కృష్ణుడు
వొచ్చము లేని వాఁడు వుద్దగిరి కృష్ణుఁడు ॥ (10-172

అనే సంకీర్తనలో బాలకృష్ణుడు గజ్జెలు మ్రోగగా పిల్లగోట్లాట, వీథులలో చెలరేగుతూ చెండులాట, గోపాలురతో కూడి సముద్ర బిల్లాట, మిక్కిలి ప్రయాసతో చెమటకారే విధంగా సిరిసింగవత్తి ఆట, పరుగులు తీస్తూ గచ్చకాయలాట మొదలైనవి ఆడాడని అన్నమయ్య వివరించాడు.

అన్నమయ్య సంకీర్తనల్లో ఉపమానాలుగా ప్రయోగించబడిన కొన్ని రకాల ఆటలు కూడా కనిపిస్తాయి. మానవ జీవితం బొమ్మలాట వంటిది. అశాశ్వతమయింది. ఒక్క వేంకటేశ్వరుడే శాశ్వతం అనే విషయం తెలియజేస్తూ అన్నమయ్య—

"పోరో పోరో యమ్మలాల బొమ్మలాట వారము
యీరసాన మమ్ము నిట్టె నేమి సేసేరు॥
గాటమైన తిరు వేంకటగిరి నిలయుని
నాటకమే నిజమని నమ్మికె నున్నారము॥ (1-73)

అనే సంకీర్తన రచించాడు. అలాగే మరో సంకీర్తనలో ఈ సంసారం బొమ్మరిండ్ల ఆటవలె ఒకప్పటికి చెదరిపోయేదే అని చావుపుట్టుకలు దాగిలి ముచ్చు లాటలని ఉద్యోగాలు చిన్నపిల్లల ఆటల వంటిదని తెలియజేస్తూ—

"మరిగిన సంసారము బొమ్మరిండ్ల యాటలివి
నిరతి మా యజ్ఞానంబు నీకే నవ్వులయ్యా"
చావులఁ బుట్టుగులాడెడి సరిదాఁగిలిముచ్చిములు
భావపు టారంభములు బాలలీల గతులు (1-445)

అనే సంకీర్తన రచించాడు.

అన్నమయ్య శృంగార సంకీర్తనలలో కొన్ని ఆటలను నాయికా - నాయక పరంగా ఉపమానాలుగా ప్రయోగించాడు. శృంగార సంకీర్తనలలో నాయికా నాయకులు అలమేల్మంగా శ్రీనివాసులు. వీరి అందచందాలు, ప్రేమ, వలపు, విరహం, అలుక మొదలైనవి ఇందులో వర్ణించ బడ్డాయి.

నాయిక యొక్క పొడవైన తలవెంట్రుకలు నాయకునికి దాగిలి ముచ్చులాట వంటిదని, ఆమె కుచగిరులు అచ్చన గండ్లాట వంటిదని, ఆమె ముఖం వెన్నెల పులుగులాట అని, శరీరంమీది చెమటలు చిమ్మనగోవాటలని, ఆమె ఎర్రటి పెదవులు గుజ్జనగూళ్ళాట అని పోల్చి వర్ణించాడు.

ఘనుఁడ నీకీయ్యాట గలిగెఁ జాలు తొల్లి
యెవనిఁ పొందిన సతు లెట్టుండిరేమొ॥

తరుణి తురుము నీకు దాగిలి ముచ్చులాడ
నిరవాయ రమణుఁడ యిదివో నీకు
అరిదిఁ గుచగిరులు అచ్చనగండ్లాడ
వొరపాయ నిదివో నీకున్న వేవిూ నేల॥ (29-573)

నియమ నిబంధనలు, గెలుపు ఓటములు కలిగిన ఆటలను క్రీడలనవచ్చు. అన్నమయ్య సంకీర్తనలలో జూదం, చదరంగం, పగడసాలు, మొదలైన క్రీడా విశేషాలు కూడా కనిపిస్తాయి.

శ్రీనివాసుడు శృంగార శ్రీనివాసుడుగా ప్రఖ్యాతిగాంచాడు. ఆయన దక్షిణ నాయకుడు. ఆయనపై కొంతమంది వనితలు అలిగి వున్నప్పుడు సహనవతి అయిన ఒక ప్రేయసి, ప్రియుడైన శ్రీనివాసునితో - నీ కెందుకు వాళ్ళపై అంత మమకారం! ప్రేమతో మనం జూద మాడుకుందాము రా, నీకు పొద్దుపోకుంటే హాయిగా చదరంగ మాడుకుందామురా అని లాలనగా పిలవడం కళ్ళకు కట్టి మనోహరంగా చిత్రిస్తూ అన్నమయ్య —

మానినులమీఁద నేల మదములు చల్లేవు
అనుకొని జూజా లెల్లానాడుదము రమ్మా ॥

వలపులెల్లా రేఁచి వాడల సతులఁ జూపి
చలము పుట్టింతురా సతుల కింత
పొలసి పొద్దులు నీకుఁ బోకుంటేఁ గనక నేఁడు
అలవోక చదరంగా లాడుదము రమ్మా ॥ (27-244)

అనే సంకీర్తన రచించాడు. అన్నమయ్య తన కాలంలో బాగా వాడుకలోనున్న అనేకరకాలైన క్రీడావిశేషాలను తన సంకీర్తనలలో పొందుపరచి ప్రజలకు మిక్కిలి సన్నిహితుడయ్యాడు.

తిరుమల శ్రీనివాసుడు తృప్తితీరని అమృతస్వరూపుడు. ఆ పాత్ర మధురం, ఆలోచనామృతం అయిన అన్నమయ్య సంకీర్తనలు అమృత బిందువులు. అందుకే అన్నమయ్య సంస్కృతభాషలో రచించిన సంకీర్తన లక్షణ గ్రంథాన్ని తెలుగుభాషలోకి అనువదించిన అన్నమయ్య పెద్దమనుమడైన చినతిరుమలయ్య—

సారంబులు హరికరుణా
సారంబులు విబుధ నికర సంపూర్ణసుధా

హారంబులు బహుదేశవి
హారంబులు తాళ్ళపాకయన్నయ పదములో

అని అన్నమయ్య సంకీర్తనలను సంస్తుతి చేశాడు.

సెమినార్ వ్యాసం
మార్చి, 1993, పునశ్చరణ తరగతులు
తెలుగు విశ్వవిద్యాలయం
సాహిత్యపీఠం
రాజమండ్రి ప్రాంగణం
బొమ్మూరు - 533 124.



# అన్నమయ్య సంకీర్తనల్లో సూక్తి సంపద

తెలుగులో పద్య సాహిత్య రచనకు శ్రీకారం చుట్టిన ఆదికవి శబ్దశాసనుడు అయిన నన్నయ భారతాంధ్రీకరణ చేస్తూ ఆదిపర్వంలో తన కవితా గుణాల్ని గూర్చి చెప్పిన "సారమతింగవీంద్రులు" అనే పద్యంలో "నానారుచిరార్థ సూక్తినిధి" అని తననుగూర్చి చెప్పు కున్నాడు. దీనికి అనేకమైన, రుచిరమైన అర్థాలు కల్గిన సూక్తులకు నిధివంటివాడని అర్థం. సూక్తి అంటే మంచి మాట, నీతిమాట, సుభాషితం అని అర్థాలు. నన్నయ తన భారతంలో సర్వకాల, సర్వ జన యోగ్యమైన, అనేక రకాల చమత్కార యుక్తమైన నీతి వాక్యాల్ని చొప్పించాడు. నన్నయ తర్వాత నన్నెచోడుడు తన కుమారసంభవంలో సదుక్తుల్ని, చతురోక్తుల్ని ప్రశంసించాడు. శ్రీనాథుడు కాశీ ఖండంలో—

"పరిభవింతుఁబ్రబంధ పరమేశ్వరుని రేప
సూక్తి వైచిత్రి నోర్కొక్క మాటు"

అని సూక్తి వైచిత్రిని తన కవిత్వలక్షణాల్లో ఒకటిగా పేర్కొన్నాడు.

సూక్తులు కావ్యంలో ఇతి వృత్తంతో నిబంధింపబడినా అవి ప్రత్యేకంగా పేర్కొనడానికి స్వతంత్ర యోగ్యత కలిగి వుంటాయి. యుగాలు గడిచినా కవిని గుర్తుపెట్టుకొనేలా చేసేవి సూక్తులు మాత్రమే. ఇవి ప్రజల నాలుకలపై నర్తిస్తూ సందర్భానుసారంగా ప్రయోగించబడతాయి. సూక్తులు కవి ప్రజ్ఞావిశేషాలకు నిదర్శనాలు.

సంస్కృతాలంకారికులైన దండి కావ్యలక్షణాల్ని గూర్చి చెబుతూ "ఇష్టార్థవ్యవచ్ఛిన్న పదావళీ అని, జగన్నాథుడు "రమణీయార్థం" అని రాజశేఖరుడు విద్ధసాల భంజికలో సూక్తి అనే పదాన్ని "సుందరోక్తులు" అనే అర్థంలోను ప్రయోగించారు. దేశి కావ్యాల్లో సూక్తులకే అగ్రితాంబూలమని దండి అభిమతం.

దేశి సాహిత్యంలో పదప్రక్రియ విశిష్టమయింది. పదప్రక్రియకు ఓంకారం పలికిన అన్నమయ్య సంకీర్తనా సాహిత్యం "అద్భుత క్షీరసాగరం" అని సంగీతరత్న, సాహిత్యవేత్త శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, 'పరిశోధకులపాలిట బంగారు గనులు" అని ప్రఖ్యాత భాషాశాస్త్రవేత్త, సంగీతప్రియులు, పాలనా ధురంధరులు ఆచార్య జి. యస్. రెడ్డిగారు, "అన్నమయ్యసాహిత్యం అష్టమ సముద్రం" అని సాహితీ తపస్వి ఆరుద్రగారు, "అన్నమయ్య ఒక విజ్ఞాన సర్వస్వం" అని జానపద విజ్ఞానవేత్తగా ప్రసిద్ధులైన డా. ఆర్వీ యస్ సుందరంగారు. "అన్నమయ్య కృతేమన సంస్కృతి"అని జ్ఞానపీఠ అవార్డు గ్రహీత ఆచార్య సి. నారాయణరెడ్డిగారు మొదలైన సాహితీ నిష్ణాతులు కొనియాడుతున్న అన్నమయ్య సంకీర్తనాంబుధిలో సూక్తి రత్నాలు విశేషంగా కనిపిస్తాయి.

అన్నమయ్య సంకీర్తనలు ముక్తరచనలు. శ్రీ వేంకటేశ్వర ముద్రితో శృంగార, అధ్యాత్మ అనే రెండు విభాలుగా ఉన్న సంకీర్తనలతో అనేక రకాల సూక్తులు కనిపిస్తాయి. సామాన్యులు మొదలు కొని మాన్యులవరకు అందరికీ విష్ణుభక్తిని, నీతిజ్ఞాన వైరాగ్య ధర్మాల్ని సుబోధకం చేయడానికే అన్నమయ్య పదరచనలుచేశాడు. కొన్ని సంకీర్తనలు అక్కడక్కడ పూర్తిగా సూక్తిమయంగానే కనిపిస్తాయి. కొన్ని సంకీర్తనలలో సూక్తులుగా చెప్పదగిన రమ్యమైన

నీతివాక్యాలు కనిపిస్తాయి. అన్నమయ్య సూక్తుల్ని విషయ సౌలభ్యం కోసం సంసారం, భార్యాభర్తలు, మనసు, వలపు, కోపం, శాంతం, గుట్టు, స్త్రీలు, పురుషులు, అరిషడ్వర్గాలు, వైరాగ్యం, భక్తి అనే విభాగాలుగా విశ్లేషించవచ్చు.

సంసారం: సంసారం గృహస్థ జీవనానికి సంబంధించింది. ఇందులో భార్యాభర్తలు, పిల్లలు, పెద్దలు అందరూ ఉంటారు. వీరికి సంబంధించిన అనేకరకాల కష్టాలు, సుఖాలు, నష్టాలు దైనందిన జీవితంలో ఎదురవుతుంటాయి. సంసారులు దుఃఖాల్లో కుంగిపోతుంటారు. అందుకే యోగివేమన "ఇంటిలోని పోరు ఇంతింతకాదయా" అని సంసార జీవితం ఎంత బాధాకరమయిందో పద్యంలో వ్యక్తంచేశాడు. సంసారం నిస్సారమయిందని, మాయాంధకారమయిందని వేదాంతులు ప్రవచిస్తుంటారు. అన్నమయ్యకూడా ఎలాంటిది? ఇది ఎలా ఉంటే సవ్యంగా సాగుతుంది అనే విషయాలకు సంబంధించిన పేర్కొన్నాడు.

అప్పులేని సంసారమైన పాటేచాలు (1–114)
చనవులు నెరపితే చవులు పుట్టు కాపురము (24-99)
చమురు దీసిన దివ్వె సంసారము (1-199)
చలువలోపలి వేడి సంసారము (1-199)
జట్టిగా నొనగూడితే సంసారమే ఫలము (2-362)
జడధిలోపలియీత సంసారము (1-199)
జము నోరిలో బ్రతుకు సంసారము (1-199)
జలపూత బంగారు సంసారము (1-199)

భార్యాభర్తలు: సంసారమనే రథానికి భార్యాభర్తలు చక్రాల వంటివారు. సంసారం ఒడిదుడుకులు లేకుండా సుఖంగా సాగాలంటే

భార్యాభర్తలు ఒకరినొకరు అవగాహన చేసుకొని, వారివారి ఉన్నతాభిప్రాయాల్ని గౌరవిస్తూ అన్యోన్యంగా మెలగాలి. వీరికి సంబంధించిన నీతుల్ని ఈ విభాగంలో చేర్చడం జరిగింది.

అనుమానమైన చోట నంటదురతి (30-499)

ఆరని కాకలకును అటిన కాగిళ్ళు జోడు (27-143)

ఏకాంతంబున నుండిన పతిని యెనసి రమించుటే
సతిధర్మంబు (1-386)

ఉల్లము గలయుదాకా వూరకుండుటే మేలు (22-8)

ఒలసీ నొల్లని పతినొగి కాగిలించుకంటే
పొలసి మాను గాగిలించుటే మేలు (22-237)

ఓరుచుకొంటేను వొద్దికాను సరసము (24-99)

చలపట్టిన వానితో సరసమాడుటకంటే
కెలసి రాయి కాగిలించుటే మేలు
పాలించే మగడు గల పడతికేడ చింత (2-237)

పంతపురమణు మోవి పంటి చవడగు కంటె
పొంత చెఱకు పిప్పి తీపులే మేలు (22-37)

పలుకులు సమ్మతైతే బలిమారతి (28-358)

మంచముపై రతులకు మంతనాలే జోడు (27-143)

మంచి మాటాడితే పతి మనసు కరగుగాక
ఇంచుక నిష్ఠూరమైన ఇయ్యకోలౌనా (30-449)

మగవాడు మెత్తనైతే మరియపకీర్తిగాదా (24-502)

మేరమీరే చిత్తాలకు మేనులే జోడు (27-943)

వసముగాని విభుని వంక చూచుట కంటె
సుసరానమునిగోడచూచుటే మేలు (22-237)

మనసు : మనసు చాల సున్నితమయింది. అయితే మర్కటం వలె చంచలమయింది. ఏ పని అయినా మనసును నియంత్రించి చేస్తే అది సమర్థవంతం అయి సఫలమవుతుంది. మనసును అదుపులో పెట్టుకో లేకపోతే మనిషి ఏ పనీ చేయలేడు. మనసుకు బానిస అయిన వ్యక్తి కొరగానివాడై జీవితాన్నే కోల్పోయి అపకీర్తిపాలవుతాడు. ఈ మనసు స్వభావాన్ని, ప్రాముఖ్యాన్ని తెలిపే సూక్తులు కనిపిస్తాయి.

ఇట్టెవదలితేను యెందైనా పారు మనసు (2-341)
కాముకపు మనసునకు కడమొదలు లేదు (1-323)
మనసు నమ్మిక యైతే మంతనములింపులౌను (30-391)
మనసొక్కటైతే చాలు మాటలు వేరేతోచవు
(27-128)
పారకుమీ ఓమనసా పంతము విడువకు మీ మనసా
(1-183)
మనసొక్కటైతేను మాటలూ నొక్కటే యౌను
(30-317)
మనసు నిర్మలమైతే మాట వినవింపౌను (22-8)
మనసు లెనసితేను మాటలు ప్రియములౌను (30-546)
మనసు గలియుదాకా మరులు వంటిది తమి (25-575)
విడిచితే నిటులానే కడకు పారు మనసు (2-23)

వలపు : వలపు అంటే కోరిక, కామము, ప్రేమ అనే అర్థాలను చెప్పుకోవచ్చు. ఇది ఎక్కువగా భార్యాభర్తలు, ప్రియసీ ప్రియుల మధ్య ప్రవర్తిల్లుతుంది. ఈ వలపు కలగడానికి, వలపు

స్థిరంగా ఉండడానికి సంబంధించిన సూక్తులు ఇందులో వ్యక్త మవుతాయి.

ఇగిరించి కలిమి తే మొరగదీ వలపు (3-400)
తలపోతల చేత దట్టమవును వలపు (24-228)
తనువు సోకులను తగులౌను వలపు (24-228)
తప్పక చూచితేనే తలకొను వలపు (24-228)
నెలకొని నవ్వితేను నిలుకడౌ వలపు (24-228)
పలుకుల గొసరితే బదనెక్కు వలపు (24-228)
పట్టరానిది వయసు పంచరానిది వలపు (30-549)
ప్రియమే వలపులకు పెనుబోది (24-237)
మట్టు పెట్టరానిది వలపు అణచరానిది చూపు (24-200)
ముప్పిరి వినయముల ముంచుకొను వలపు (24-228)

కోపం :- అంతశ్శత్రువులలో, క్రోధం కూడా ఒకటి. "తనకోపమే తనకు శత్రువు" అని సుమతీ శతక కారుడు బద్దెన లోకానికి బోధించాడు. మానవుడు ఎన్ని చదువులు చదివి ఎంత జ్ఞానాన్ని సంపాదించినా కోపాన్ని జయించలేక ఎన్నో దుష్కార్యా లకు ఒడిగట్టుతుంటాడు. చెడును అణచడానికి కొన్ని సమయాల్లో కోపం అవసరమే కాని నిష్కారణమైన కోపం మాత్రం అందరికీ కీడు చేస్తుంది. కాబట్టి కోప స్వభావాన్ని మానుకోవాలని అన్నమయ్య కొన్ని నీతుల్ని తెలియజేశాడు.

కోపము పనికిరాదు కొమ్మలయెడను (27-350)
కోపము మానితేనే కోటి జపాలు సేయుట
కొంచి కొంచి చూడవచ్చు,కోపగించు కొనరాదు
(28-221)

కోమలుల కెల్లాను కోపమే సింగారము (27-238)
గురుసేవా రతునకు కోపము రాదు (1-167)

గుట్టు :- లోకంలో "ఇంటి గుట్టు, రోగం రట్టు" అనే సూక్తి బాగా ప్రసిద్ధమయింది. ఇంటి విషయాల్ని గోప్యంగా ఉంచుకొంటేనే ఆ కుటుంబానికి విలువ ఉంటుందని. రోగం లక్షణాల్ని మాత్రం వెల్లడిచేస్తేనే ఆరోగ్యానికి మంచిదని ఈ సూక్తికి అర్థం. అన్నమయ్య సంకీర్తనల్లో కూడా ఈ "గుట్టు"కు సంబంధించిన సూక్తులు కనిపిస్తాయి. గుట్టులేని బ్రతుకు వ్యర్థమని, వ్యక్తులు గుట్టుగా ప్రవర్తించడం వల్ల గౌరవం పొందుతారని అన్నమయ్య సూక్తుల సారాంశం. వీటికి సంబంధించిన సూక్తుల్ని పొందుపరచడం జరిగింది.

కూటము లొద్దికలైతే గుట్టు చెల్లును (30-391)
కొత్తయిన రతికాంక్ష గుట్టుసేయదు (22-60)
కోమలులకెల్లాను గుట్టే చక్కదనము (27-238)
గుట్టు చెడిమనుకంటే కొంచెపు మేలైన జాలు(1-114)
గుట్టుతో నుండే యప్పటి కొసరులే ఇంపు (30-551)
గుట్టుతో మెలిగితేను గుణములు హెచ్చును(30-546)
గుట్టుతోడ పొందుసేసే గుణమే మేలు (24-191)
గుట్టుతో నుండనీవయ్య గుణవంతుడవు నీవు (27-409)
గుట్టుతో నుండుటే మేలు గుణవంచురాలికి (30-253)
గుట్టుతోడ మరిగించుకొని కూడుటే మేలు (24-253)
తనగుట్టెల్లా నెరిగిన వారలముందట
తనయెమ్మెల చెప్పుకొనుట రోత (1-27)

స్త్రీలు :- సహజంగా సిగ్గు, బిడియం, వినయం, అణకువ మొదలైన లక్షణాలు స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తాయి. స్త్రీలందరిలో సాధారణంగా కనిపించే సమానధర్మాలను, కుటుంబంలో వారి ప్రాముఖ్యాన్ని, వారి ప్రవర్తనను సంబంధించిన విషయాలను అన్నమయ్య సూక్తుల ద్వారా తెలియజేశాడు.

అటదానికిచ్చకమే యమరుగాక చీటికి మాటికి
అట్టు చేయవలెనా (30-573)
మగవానితో బలిమి మగువల కమరునా (28-511)
మగువ యెంతటిదైనా మగవానికిరుదే
చనువుగల సతులు సాధించితేనమరు
చెలులకు నెడనెడ సిగ్గులే సింగారము (28-130)
చలమే ముందరి పౌజు సతులకెల్లాను (27-93)
జంతగాని తరుణి యేజాతైన నదెచాలు (1-114)
పంతమే పెట్టని కోట పడతుల కెల్లాను (27-93)
తరుణి గల ఫలము వేదనల బొరలుటెకాని
నెరసు లేని సుఖము నిమిషంబులేదు (1-340)
నవ్వే మూలధనము నాతులకు
మగువల మాటలు మంచి చక్కెరతీపులు (24-54)
మనసే పరుసవేది మగువలకు (24-54)
మానిని నవ్విన నవ్వు మరుని బాణపుపూవు (30-82)
వనిత యాడిన మాట వంచిన పూదేనే వూట(30-82)
వయసు కల్పవృక్షము వనితలకు (24-54)
వలపు కామధేనువు వనితలకు (24-54)

సిగ్గులే మూలధనము చెలులకెల్లా (27-93)

పురుషులు : కుటుంబంలో, సమాజంలో పురుషుడు ఆధిపత్యం వహిస్తుంటాడు. సహజంగా పురుషుడు తాను స్త్రీకన్నా అధికం అనుకుంటాడు. కానీ మానసికంగా స్త్రీ విషయంలో చాంచల్యం కలిగి వుంటాడు. అందుకే కవులు చాలమంది పరస్త్రీల విషయంలో పురుషుని హెచ్చరిక చేశాడు. నాదబ్రహ్మ త్యాగయ్యకూడా 'ఎంత నేర్చిన ఎంత జూచిన - ఎంత వారలైన కాంత దాసులే' అని తెల్పి చెప్పాడు. అన్నమయ్య కూడా స్త్రీ విషయంలో పురుష స్వభావం ఎలా ఉంటుందో, ప్రేమించిన స్త్రీపట్ల ఎలా ప్రవర్తిస్తాడో, సమర్థుడైన పురుషుడు ఎలా మెలగుతాడో అనే విషయాల్ని తన సంకీర్తనల్లో సూక్తి ప్రాయంగా వ్యక్తంచేశాడు.

ఇంతుల చేతకు లోనే యెప్పుడును మగవాడు (24-92)
కాంత దలచుకొంటేనే కామోద్రేకము పుట్టు (2-224)
మొగమోటగల వాడు మోనాన నూరకుండు
తగ వెరిగినవాడు దయదలచు
తగులమి గలవాడు దండ బాయకుండును
వలచిన వాడు కైవసమై మచ్చిక సేసు
తలపోకలైన వాడు దాటడు మాట
సన్న యెరిగినవాడు సరసుడై మెలగును (30-547)
సతిలేని వానికి జరిగిన దేమూలు (2-63)

అరిషడ్వర్గాలు : బాహ్యశత్రువుల కన్నా మిక్కిలి బలీయమైనవి అంతశ్శత్రువులు. ఈ ఆరు శత్రువుల్ని జయించిన మానవుడే జ్ఞాని. వీటిని సంసారులు జయించడం చాలా కష్టం. అయినా సాధన చేసి వాటిని అణచుకున్నప్పుడే మానవునికి మనశ్శాంతి ఉంటుంది.

కామ క్రోధ లోభ మోహాదులు ఎంతటి నీచమైనవో వాటిని వదలు కొన్నప్పుడు మనసుకెంత ఆనందంగా ఉంటుందో అన్నమయ్య సూక్తుల్లో తెలియజేశాడు.

అజ్ఞానహేతువు లాసలు (3-109)

మచ్చరము లేకున్న మనసే రామరాజ్యం (2-362)

మాలతనము వంటిది మతి దగులు కామము
అలరి ముట్టు వంటిది అంటు క్రోధము
కనుచూపు లోక్కటే కాంతులే వేరు (3-238)

కేలి నోదిగించు నెంగిల వంటిది మచ్చరము
చుట్టి మద్యము వంటిది చొక్కించు మోహము
వట్టి మాంసము వంటిది వయోమదము
పుట్టిన భ్రమ వంటిది పొదిగిన మచ్చరము
పరమశాంతునకు పాపమురాదు (1-167)

గట్టియైన మానికి కలహమే లేదు (1-167)

సమచిత్తునకు చంచలముగాదు (2-307)

యెచ్చుకుందు లేకున్న నెక్కడైనా సుఖమే (2-314)

తొట్టిన సుజ్ఞానికి దుఃఖము లేదు (1-167)

భక్తి: ఐహిక సంబంధమైన విషయాలు అశాశ్వతమని, భగవంతుడొక్కడే శాశ్వతమని నమ్మి, ఆ భగవంతుని యందే అనురక్తి కలిగివుండటం భక్తి. ప్రతి యుగంలోను దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం, ధర్మ సంస్థాపనకోసం భూలోకంలో అవతరించి ప్రజలను కాపాడే దేవుడు విష్ణుమూర్తి. ఈ స్వామిని నమ్ముకుంటే సుఖశాంతులు కలుగుతాయి. జీవితం చరితార్థమవుతుంది. ఈ భక్తికి సంబంధించిన సూక్తులు ఇందులో చెప్పడం జరిగింది.

ఏపున హరికథ కేగిన కాళ్ళు
పాపుల యిండ్లకు బారవు కాళ్ళు (2-144)

ఉపకారి దేవుడు అపకారి కాడు
దిక్కులేనివారికెల్లా దేవుడే దిక్కు (3-291)

దేవుడు గలవారికి దిగులు చింతయు లేదు
దైవమే కారకుడు ధరణి రక్షించుటకు (3-453)

దైవకృత మెవ్వరికి దప్పింపరాదు (12-134)
దైవము కృతమెంతయును గడపంగ నెవ్వరికిని రాదు (12-356)

నళినాక్ష నీకు నమస్కరించిన ఫలము
పొగడ బ్రహ్మకు వశమా
పన్నిన దైవమియ్యనిది పరులిచ్చేరా (1-389)

పరము గలవానికి భ్రాంతులు లేవు (2-254)

మొక్కరో మీరు మోసపోక మీకు
దిక్కు దైనైన ఆది దేవునికి

దేవుడుగలవారికి దిగులు చింతయు లేదు
బలిమి లేనివారికి పరమాత్ముడే బలమి (3-291)

సకల శాంతికరము సర్వేశనీపై భక్తి (3377)
సదానందము సర్వేశ్వరా నీ పాదారవిందముపై భక్తి.

ఈ రకమైన సూక్తులే కాక జీవితంలో అనేక అంశాలకు సంబంధించిన సూక్తులు చాలా వున్నాయి.

ఆనినబద్ధులకు దేహమే దైవము (1-498)

ఆహారమొక్కటే రుచులే వేరు (3-238)

ఉదయ మందుట భవముడుగుటకొరకే
అంచల నాస్తికునకు నాచారమే లేదు (3-121)

ఉదుటున కొందరికి సంసారమే
వున్నత సుఖమై తోచును (3-372)
ఎట్ట నెదుటగలదీ ప్రపంచము (3-576)
ఎదిరిగనుట తన్నెరుగుట కొరకే (1-70)

ఒడలిలోని హరినొనరగ మతిలో,
దడవని జీవమె తనకు వృథా (1-217)

కడలుడిపి నీరాడగా దలచువారలకు,
కడలేని మనసుకు గడమ యెక్కడిది (1-226)
కడుపెంత తాగుడుచు కుడుపెంత దీనికై
పడని పాట్లనెల్ల బడి పొరలనేలా (1-302)
కట్టకడపటిది కైవల్యము (3-576)
కలిమి లేని యట్టి గర్వమేలా (2-414)
కాని పని చేయకుంటె కాయమే సుఖము (?-144)
కులమెంత గలిగెనది కూడించు గర్వము (3-322)
కొందరు స్వర్గముకోరి సుఖింతురు
కొందరు నరకాన గూలుదురు (2-87)
కోరకుండగా కూడినయర్థము
అరయగైకొనుటది సుఖము (3-545)
కోరివాకరినడిగి కొంచెపడకుంటె మేలు (3-447)
కైకొన్న రతి యెక్కడే కందువలే వేరు (3-238)
గతిలేని కూటికి గన్నదే కూడు (2-63)

గాలిబోయే మాటలు లోకములోని సుద్దు లెల్లా (2-244)

గురుతయిన యాసలకు గోరికలు జీవనము (1-251)

గురువుగలవానికి గొఱత యేమియు లేదు (2-254)

గోడపై సున్నంబు కొదలేని మెఱుక
పాడారిలో బ్రతుకుపాపకర్మ బుద్ధి (1-104)

చంచల చిత్తునకు నిశ్చయమే లేదు (3-121)

చదువుట మేలు విచారించుకొరకే (1-70)

చలమెంత గలిగెనది జగడమే రేచు (3-322)

చెప్పినట్టు సేసితేను చేరి దేహమే చుట్టము (2-362)

చేరి నేరమి చేసేది జీవునికి స్వభావము (3-515)

జోక నాకార మొక్కటే సొరిది రుచులే వేరు (3-238)

తగిలి సంపదలచే దనిసిన వారు లేరు (3-343)

తగు చుట్టరికాలలో ధనమే చుట్టఱికము (3-551)

తప్పులు లేనిదైతే ధర్మమే సొమ్ము (2-362)

తాను గలిగిన ఫలము దయసేయగలుగుట (1-236)

తనివియు నొక్కటే తనువులే వేరు (3-233)

తాడుపై తపసు తమ ధనము ప్రాణులకు (1-104)

దురితంబులకు నెల్ల దొడవు మమకారంబు (1-251)

ధరలో యాచకునకు ధర్మాధర్మము లేదు (3-121)

నట్టనడిమి పని నాటకము (3-575)

నిహిత జ్ఞానము నిజముక్తి (3-32)

నెట్టికొని నడచితే నిజమే మూలధనము (2-362)

పరమపాతకునకు భయమించుకా లేదు (3-121)

పట్టినదే వ్రతమైతే భవమే మేలు (2-362)

పరపీడగావించి బ్రదుకు బ్రదుకటకంటె
పరహితముచేయు నాపదలె మేలు (12-212)

పరులవనుకు నాపదలు కలుగగ జేయు
పరితాపరకమైన బ్రదుకేలా (1-302)

పెంచి అజ్ఞానతమము పెద్దల నెరగనీదు (3-30)
పొదిగొన మూర్ఖునకు బుద్ధేలేదు (3-121)
బ్రతుకుట పురుషార్థపరుడౌటకొరకే (1-70)

మంచితనమేవలె మాటలాడే యపుడెల్లా
కొంచి కొంచి యుండవలె కోపపువేళ (3-238)
మనసూనొక్కడే లోని మర్మాలేవేరు (3-228)
మానవనికాములకు మగువలే దైవము (1-498)

మానుషముగాదు మరి దైవికముగాని
రానున్న అది రాకున్నా బోదు (1-6)
మదించిన సంసారికి మరి తనివే లేదు (3-121)
మానుషము గల ఫలము మంచివాడౌట (1-236)
మానమున నుండితేను మరులైనా సుఖము (3_414)

మూలనెంత ధనమున్నా ముంచి దాన ధర్మములు
తాలిమితో నిచ్చినదే దాపురమై నిల్చును (2-260)
మించిన కృతఘ్నునకు మేలెన్నడును లేదు (3-121)
మేను గలిగిన ఫలము మేలెల్ల గనుట (1-236)
మేలుగా బండిన భూమికి గరువు లేదు (2_254)
లోకమును నొక్కటేలోను వెలుపల వేరు (3_238)
వలపులధికము సేయు వైభవములు (1-146)
వాకులొక్కటే భావల వరుసే వేరు (3-238)
వినయపు మాటలు విద్య సాధించితే మేలు (3-447)

శరణాగతి యొక్కటే జాతులేవేరు (3-238)
నిరులంగాముకునికి సిగ్గులేదు (3-121)
సొరిది నితరుల మేలుఁ జూచి సైపఁగలేక
తిరుగుచుండేటి కష్టదేహమిది యేల (1-302)

సంపద తాత్కాలికమైన అవసరాలు తీర్చుతుందేకానీ శాశ్వతమైన ఆనందాన్ని, మనశ్శాంతిని ఇవ్వదు. అది ఏనాటికైనా తరిగి పోయేదేకానీ నిలువదు. సూక్తి సంపద శాశ్వతమయింది. జీవిత సత్యాన్ని తెలుసుకోవడానికి, సద్గుణాలను పెంపొందించుకోవడానికి, సత్ప్రవర్తన అలవరచుకోవడానికి సూక్తులు తోడ్పడతాయి. ఆపత్కాలాల్లో ఒక మంచి మాట మనిషిని ఎంతో ఉత్తేజ పరుస్తుంది. కర్తవ్యోన్ముఖం చేస్తుంది. ఇలాంటి మంచి మాటలు చెప్పే మహనీయులు కాలం ముందుకు సాగేకొలది కరవై పోతన్న ఈరోజుల్లో ఈ సూక్తులే సజీవమూర్తులై హిత బోధచేస్తాయి. ప్రజలకోసమే అవతరించి ప్రజలకోసమే సంకీర్తనలు వెలయించి సుచరితుడైన అన్నమయ్య విరచితమైన సూక్తులు మనసుకెంతో ఉల్లాసాన్ని వివేకాన్ని కలిగించి ముందుకు నడిపిస్తాయనడంలో సందేహం లేదు. అన్నమయ్య సూక్తులు సహృదయ సుమధురోక్తులు. జనరంజక సరసోక్తులు. కవి పండిత కమనీయోక్తులు. విశ్వజనీన చతురోక్తులుగా అభిభాషించవచ్చు.

సమాలోచన
(జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక
16-12-'994 - 1-1-1995.



# అన్నమయ్య సంకీర్తనల్లో భావనా సౌందర్యం

అన్నమయ్య విష్ణు భక్తి తత్వాన్ని సరళరీతిలో సహజ వర్ణనలతో చెప్పడమే కాక శృంగార సంకీర్తనలలో మహాకవిగా అద్భుతమైన భావుకత్వాన్ని ప్రదర్శించాడు. ఈ జగతిలో సుందరమైన ఏ వస్తు దర్శనమైనా, ఏ జీవి సందర్శనమైనా మనస్సుకు ఉల్లాసాన్ని కలిగిస్తుంది. అందువల్ల మానవ మనస్సులను భగవంతుని పాదారవిందాల చెంతకు మృదు మధురంగా తీసుకొనివెళ్ళడానికి అన్నమయ్య జగన్మాతా పితరులైన పద్మావతీ శ్రీనివాసుల దివ్య సౌందర్యాన్ని మిక్కిలి చాతుర్యంగా సహేతుకంగా వర్ణించాడు. కొన్ని చోట్ల పద్మావతీ స్థానంలో లక్ష్మీదేవి సౌందర్య ప్రణయవర్ణన కనిపిస్తుంది.

ఒక చెలికత్తె సాటి చెలికత్తెలతో పద్మావతీ దేవి సౌందర్యాన్ని తిలకించమని చెబుతూ - ఆమె కురులు తనను కలసిన శ్రీనివాస విభునికాంతివలె ఉన్నాయని, చంద్రుడు తన తోడపుట్టువే కాబట్టి ఆమె ముఖం చంద్రునివలె ఉందని, అమృతం తన ఇంటిసొత్తే కాబట్టి ఆమె నవ్వు అమృతాన్ని పోలివుంతని, సముద్రుడు ఆమెకు తండ్రికాబట్టి ఆమె గుణం సముద్రాన్ని పోలివుందని, గుండు చేపలు తన ఇంటివారివేకాబట్టి ఆమె కన్నులు చేపలను పోలివున్నాయని, కల్పవృక్షం తన వెనకటిబలమే కాబట్టి ఆమె పాదాలు కల్పవృక్షం యొక్క చిగురువలె వుందని, ఆమె సరసుడైన శ్రీవేంకటేశ్వరుని పెండ్లాడినందువల్ల అతని క్రమపద్ధతినే పోలివుందని ముచ్చటించి

లక్ష్మీదేవి శారీరక, గుణ సౌందర్యాల్ని సహేతుకంగా చమత్కరించాడు.

చూడరమ్మ చెలులాల సుదతి చక్కదనాలు
కూడు కొన్న పతి కాంతి గురుతే పోలెను ॥

మొగము చందురు బోలె ముంచిన యీ యిందిరకు
తగిన తోడ బుట్టుగా తడేకనక
నగపమృతము బోలెనలినాక్షి కదియును
తగిన పుట్టిన యింటి ధనమే కనక ॥ (26-197)

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని ఆత్మబంధువుగా చూసుకున్నాడు! ఆ స్వామి పట్ల ఎంతో చనువుగా, సరసంగా వ్యవహరించిన తీరు సంకీర్తనలలో గోచరిస్తుంది. లక్ష్మీ నారాయణులు సౌందర్య సుగుణాలలో సమతుల్యులు. అన్నమయ్య ఈ జంటను చూచి లక్ష్మీనారాయణ యోగంలా పెండ్లి సంబంధం వీరిద్దరికి ఎలా సమకూరింది అని ఆశ్చర్యచికితుడయ్యాడు. అ తర్వాత ఆలోచించి కారణాలు వూహించి స్వామివారితో సరసంగా - ఆమె పద్మాలయ, నీవు పద్మ నేత్రుడవు అందువల్లనే ఇద్దరికి మైత్రి కుదిరింది. ఆమె పెద్దవైన జక్కవపిట్టలవంటి స్తనాలు కలది. నీవు సొగసైన చక్రాయుధం కలవాడవు, అందువల్ల మీ ఇద్దరికీ తగింది. ఆమె నల్లని కురులు కలది. నీవు నల్లని రంగువాడవు' ఆమె బంగారు వన్నె కలది నీవు పసుపు వర్ణవస్త్రం గలవాడవు. కాబట్టి క్రమంగా మీ ఇద్దరికీ ఐక్యత కలిగింది. ఆమె పాలకడలిలో పుట్టింది. నీకు పాలకడలి యే నివాసం కాబట్టి మీ ఇద్దరికి మేనరిక వరుస అయింది. శ్రీవేంకటేశ ఈ విధంగా నీవు సతిని కలిశావుకాబట్టి ఆనందంగా మాకు శోభన తాంబూలం ఇవ్వవచ్చు కదా అని పలికాడు.

"ఎట్టు కూడె బెండ్లి యోగమిద్దరికి నీవేళ
అట్టె లక్ష్మీనారాయణ యోగము ॥

నెలఁత కమలవాసి నీవు కమలాక్షుఁడవు
పొలఁతికి నీకు గూడె పొంతనాలు
పలుద చక్రవాకాలు వనిత కుచాలునీవు
యెలమి జక్రాయుధుఁడ విద్దరికి దగును ॥ (26-201)

చెలికత్తెలు పద్మావతీ శ్రీనివాసుల జంటనుచూచి శ్రీనివాసునితో మీ ప్రేమలను గూర్చి చెప్ప శక్యం కాదు, చిగురు చేగైనట్లుగా మిక్కిలి దృఢంగావుంది. నీవు చెలిని చూచావు. ఆమెకూడా నిన్ను చూచింది. అప్పుడు కలువలు తామరలు కలిసినంత సౌందర్యంగా వుంది. నీవు ఆమెతో పలికావు, అమె కూడా నీతో మాట్లాడింది అప్పుడు చిలుకలు, కోయిలలు కలసి రేగినట్లుగా అహ్లాదకరంగా వుంది. నీవు ఆమెతో నవ్వావు, ఆమె నీతో నవ్వింది. అప్పుడు కర్పూరాలు, వెన్నెలలు కలసినట్లు మనోజ్ఞంగా ఉంది. నీవు ఆమెపై చేయివేశావు, ఆమెకూడా నీపై చేయిపెట్టింది అప్పుడు బంగారు పర్వతం, నీల పర్వతం కలిసినట్లుగా అద్భుతంగా ఉంది. నీవు ఆమెను నీ వక్షస్థలంపై పెట్టుకున్నావు అప్పుడు ఆమె నిన్ను పెండ్లాడినట్లుగా నిలిచింది అని వివరించాడు.

"చెప్పరాదు మీ పొందులు చిగురుచేగైనట్టు
ఇప్పుడే మెచ్చితిమి నేమిద్దరి జూచి ॥

చెలిఁ జూచితివి నీవు చెలియు నిన్నిటుచూచె
కలువలు దామరలు గలసినట్టు
పలికితి వింతితోడ పడతియు మాటలాడె
చిలుకలు గోవిలలు చిమ్మిరేగినట్లు ॥ (26-292)

అన్నమయ్య తన ప్రియదైవమైన శ్రీనివాసునితో ముచ్చటించే విధంగానే తన ప్రియదేవత అలమేల్మంగమ్మతో కూడా సంభాషిస్తూ వుంటాడు. అమ్మా! నీవు అందగాడైన మన్మథుని కన్న తండ్రికి తగినదానవు. ఎందుకంటే అమృతం నీమోవిలోనే ఉంది కాబట్టి. నీయౌవన పరిమితి లేనిదే ఎందుకంటే ప్రేమతో అంతకంతకు పెరుగుతోంది కాబట్టి. ఇంపైన నీ సౌందర్యం ఇంత అని చెప్పలేము ఎందుకంటే పలుమార్లుగా నీచూపు పొంగి పొరలుతోంది కాబట్టి. నీరాపిడులు తులతూచి చెప్పలేము ఎందుకంటే సొంపైన నీకొప్పు ఎత్తుగా ఉంది కాబట్టి. నీ అందాలు ఇక్కడ అని చెప్పలేము ఎందుకంటే అక్కడ నీకటిభాగానికి పరిమితి లేదుకాబట్టి. నీ భావాన్ని ఇంక వర్ణించి చెప్పలేము, ఎందుకంటే నీపాదాలు చిగురాకులు కాబట్టి, నీ అదృష్టాన్ని తలచడానికి వీలుకాదు. ఎందుకంటే ఘనుడైన శ్రీవేంకటేశ్వరుని కలిశావు కాబట్టి అని ఆమెలోని ఔన్నత్యానికి, సౌందర్యానికి హేతువుల్ని తెలిపాడు.

"తగుదుపమ్మ నీ వందవు మరు తండ్రికి
మొగి దచ్చి అమృతము మోవి నుందిగాన ॥

కోమలి నీజవ్వనము కొలఁది వెట్టఁగరాదు
ప్రేమమున మీఁదమీఁద బెరిగీఁగాన
ఆమని నీసింగార మంత యింత యనరాదు
వేమారు నీ చూపు వెల్లివిరిసేగాన ॥ (26-205)

మధుర భక్తి ధోరణిలో రచించిన శృంగార సంకీర్తనల్లో అన్నమయ్య శ్రీసతి శ్రీనివాసుల సౌందర్యాన్ని మిక్కిలి రమణీ

యంగా వర్ణించాడు. వీటిని చదువుతున్న కొలది అల్పచనామృతం జాలువారుతున్నట్లు, హృదయారవిందం భావపరిమళాలను వెదజల్లుతున్నట్లు అనిపిస్తుంది. ఈ సౌందర్యవర్ణనా సంకీర్తనలు భగవంతునిపై భక్తునికి ప్రేమ భక్తిని ఉద్దీపింపజేస్తాయి.

ఆంధ్రభూమి (దినపత్రిక)
3-5-1993



# అన్నమయ్య సంకీర్తనల్లో చరణ శిల్ప వైవిధ్యం

తెలుగు సాహిత్యంలో లక్షణ బద్ధమైన సంకీర్తనా రచనకు పదిహేనవ శతాబ్దంనాటి తాళ్ళపాక అన్నమాచార్యుడు మూల పురుషుడు. తెలుగు సాహిత్య జగత్తులో పదిహేనవ శతాబ్దానికి ఒక విశిష్టమైన స్థానం వుంది. ఒకప్పుడు అంటే పదకొండవ శతాబ్దానికి పూర్వం తెలుగులో సాహిత్యరచన జరగలేదంటే దానికి ప్రధాన కారణం తెలుగుభాషలో సాహిత్య రచన చేస్తే ఆనాటి సంస్కృత కవి పండితులు, రాజులు గౌరవం చూపక, ఆదరించకపోవడమే. కానీ పదకొండవ శతాబ్దిలో ఆంధ్ర ప్రజల పుణ్యవృక్షం ఫలించినట్లుగా రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహం సంస్కృతాంధ్ర పండితుడైన నన్నయ్య భట్టారకునికి లభించింది. ఆ ఉత్సాహంతో నన్నయ వ్యాస భారతాన్ని తెలుగు భాషలోకి అనువాదం చేశాడు. ఆంధ్ర శబ్ద చింతామణి అనే లక్షణ గ్రంథాన్ని కూడా రచించాడు. అందుకే నన్నయ శబ్దశాసనుడని, ఆదికవి అని ప్రసిద్ధి గాంచాడు. పదకొండవ శతాబ్దంలో నన్నయ వల్లనే తెలుగుభాషా సాహిత్యాలకు సంస్కృత భాషా సాహిత్యాలతో సమానంగా గౌరవాదరణలు చేకూరాయి. కాబట్టి నన్నయను తెలుగు సాహిత్యంలో పద్యకవితకు శ్రీకారం చుట్టిన విప్లవకవిగా చెప్పవచ్చు.

నన్నయ తర్వాత శివకవులు ప్రజల్లో శైవమత ప్రచారం చేయడం కోసం నన్నయమార్గ కవితా సంప్రదాయంపై తిరుగుబాటు చేసి ప్రజలు ఆదరించడానికి అలకించడానికి అనువైన దేశిపద్ధతిలో సాహిత్య రచనలు చేసిన విప్లవకవులని చెప్పవచ్చు. ఆ తర్వాత

సంప్రదాయ పద్య కావ్యరచన ముమ్మరంగా కొనసాగుతున్న కాలంలో పదకవిత అంటే పనికిరాని కవితగా, పామరులు పాడుకొనే కవితగా, ముదితవిటుల్ విధవలంజలు వంటి బూతు మాటలతో పండితులు నిరసించేవారు. పదకవితకు రాజాస్థానాల్లో గౌరవ సత్కారాలుండేవి కావు. అందువల్ల కవులు పదకవితారచనకు ఉద్యమించే వారుకారు. అయినా పద్యకవుల మహాకావ్యాల్లో అక్కడక్కడ పదాల పేర్లు మాత్రం ప్రస్తావించబడ్డాయి. నన్నయ్య శ్రీమదాంధ్ర మహాభారతం-ఆదిపర్వం-అష్టమాశ్వాసంలో, అర్జునుని తీర్థయాత్రా ఘట్టంలో నాగకన్య అయిన ఉలూచి గంగానదీ తీరంలో అర్జునుని చూసి మోహిస్తూ.

నీగుణములు దొల్లియునా
గీగీతము లందు విని తగిలియపుడు మనో
రాగమున జూడ గంటిని
భాగీరథి యందు నిన్ను బరహిత చరితా (8-131)

అని తనమనోరథాన్ని వ్యక్తం చేసే సమయంలో "నాగీ గీతాలు", గానానుకూలంగా ఉండే దేశి ఛందస్సులైన తరువోజ (ఆదిపర్వం 5-145, 6-250), మధ్యాక్కర (ఆదిపర్వం 4-103, 142) లు, నన్నయ తర్వాత పన్నెండవ శతాబ్దంలో నన్నెచోడుని కుమారసంభవంలో ఈశ్వర అంకమాలికలు (2-38), ఉవిదలింపుగపాడే ఉయ్యాల పాటలు (4-89), శబరకామినులు రోకటగొని దంచుపాటలు దండుపాటలు (ఇవే సువ్విపాటలు 6-87), నన్నెచోడుని తర్వాత పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్ర - పర్వత ప్రకరణంలో ఏలలు (పుట-433), తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర, నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల పదాలు (పుట-513) మొదలైనవి. బసవపురాణంలో కోలాటం, ఛాంగుభళా (పుట-22), జోలలు మొద

లైన దేశి గేయరీతులు (పుట-63), పదమూడవ శతాబ్దంలో నాచన సోమనాథుని వసంత విలాసములో నదిగా కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉత్తర హరివంశ పీఠికలో పేర్కొన్న—

వీణాగానము వెన్నెల తేట
రాణమీరగా రమణుల పాట
ప్రాణమైన పిన బ్రాహ్మణ వీట
జాణలు నేతురు జాజర పాట

(ఈ పాట ఒక్కటే నేటికి లక్ష్యోదాహరణంగా మిగిలింది), ఆతరువాత పదిహేనవ శతాబ్దంలో శ్రీనాథుని భీమేశ్వర పురాణంలో "కీర్తింతురెద్దాని కీర్తి గాంధర్వమున గాంధర్వులు యక్షగాన సరణి" (3-68), జాదుర జాదురంచు మృదుచరుని గీతులు (5-103), పోతన భాగవతంలో బాలునంకించు పాడేపాటలు (10-355), గోవిందు మీది పాటలు (10-505 ఎ) మొదలైనవి ప్రస్తావించబడ్డాయి.

పై ఆధారాలను బట్టి పద వాఙ్మయం ప్రజల వ్యవహారంలో ఉండేదని తెలుస్తుంది. ఈ విధంగా శిష్టసాహిత్యంలో కేవలం ప్రసక్తి మాత్రంగానే చోటుచేసుకున్న పదవాఙ్మయం అన్నమయ్యకాలంలో పట్టభద్ర స్థానంలో అలరారింది. అన్నమయ్య ప్రజల్లో వైష్ణవమత పునరుద్ధరణ కోసం వైష్ణవ మతాధిక్యాన్ని నిరూపించడం కోసం, విష్ణుదేవుని అవతార విశేషాలను, భక్తి ప్రపత్తులను ప్రజలలో వ్యాపింప చేయడం కోసం నీతి, జ్ఞాన, వైరాగ్య, మానవత్వ సద్గుణాలను, సాత్త్విక భావాలను పెంపొందించడం కోసం సంగీతాత్మకమైన సంకీర్తనా రచనే యోగ్యమయిందిగా భావించాడు. అన్నమయ్య అప్పని వరప్రసాది కాబట్టి ప్రేరణతో పరిజలను తరింప చేయడానికి అధ్యాత్మ సంకీర్తనలను, ప్రజలను రంజింపచేయడానికి శృంగార

సంకీర్తనలను రచించాడు. సంస్కృత పండితులను మెప్పించడానికి సంస్కృత భాషలో కూడా సంకీర్తనలు రచించాడు. సంకీర్తన లక్షణాల్ని తెలియజేసే లక్షణ గ్రంథాన్ని కూడా సంస్కృత భాషలో రచించాడు. అయితే ప్రస్తుతం ఇది అలభ్యం అన్నమయ్య రచించిన సంస్కృత సంకీర్తన లక్షణ గ్రంథాన్ని అన్నమయ్య మనుమడు చిన తిరుమలాచార్యుడు తెలుగులోకి అనువాదం చేశాడు. ఆ తెలుగు సంకీర్తన లక్షణంలో పదాల రకాలు వాటి లక్షణాలు, నిబంధ పద అంగాలు, పల్లవి, చరణ లక్షణాలు మొదలైనవి చెప్పబడ్డాయి. అన్నమయ్య నిబంధ పదలక్షణాలతో కూడిన ముప్పై రెండువేల సంకీర్తనలను శ్రీ వేంకటేశ్వరుని ముద్రాంకితంగా రచించాడు. ప్రతి సంకీర్తనకు యతులు, ప్రాసలు, మాత్రాగణాలు, మార్గదేశితాళాలు, ముద్ర అనేవి ప్రధాన లక్షణాలు. ప్రతి సంకీర్తనకు సాధారణంగా రెండు పాదాలతో కూడిన పల్లవి, నాలుగేసి పాదాలు కల్గిన మూడు చరణాలు ఉంటాయి.

అన్నమయ్య ఈ లక్షణాలతో లక్ష్యాలనురచించడానికి ముందు పదమూడవ శతాబ్దంలో కృష్ణమాచార్యులు సింహగిరి నరహరిపై చాతుర్లక్ష వచన సంకీర్తనలు, రామనామ నృసింహ నామాలను రచించివున్నాడు. కానీ అవి చాలా వరకు కాలగర్భంలో కలసి పోయాయి. లభ్యమైన కొన్ని వచనాలు పల్లవి చరణాలను పోలిన రాగ తాళయుక్తమైన సంకీర్తనలుగా శోభిల్లుతున్నాయి. వీటిలో కొంతవరకు ఛందో నిబద్ధత, శబ్దాలంకారాలు కూడా చోటు చేసుకున్నాయి.

"ఒకపరి మిమ్ము నెఱుంగుదుమయ్యా
ఒకపరి మిమ్ము నెఱుఁగమయ్యా

పుణ్యంబిది పాపంబిది - స్వర్గంబిది నరకంబిది
అనాచారమిది, యాచారం బిది - నిషేధమిది
యనిషేధంబిది"

అలాగే—

విష్ణుభక్తి లేని విద్వాంసు కంటెను
హరికీర్తనము సేయు నతడు కుంజుండు.

కృష్ణమాచార్యులు రచించిన వచనాలు పూర్తిగా అనిబద్ధ పదాలైనా కూడా ఈ విధమైన వచనాలను పరిశీలించి చూస్తే కృష్ణమాచార్యుని కాలంలోనే అన్నమయ్య కాలంనాటి సంకీర్తన రచనకు పునాది ఏర్పడివుండని చెప్పవచ్చు. అందుకే కృష్ణమాచార్యులు వచన కవితా పితామహుడని, పదకవితా ప్రపితామహుడని ప్రశస్తి కెక్కాడు. అన్నమయ్య సంకీర్తనా పరిశుద్ధిని ఏర్పాటుచడం కోసం సంకీర్తన లక్షణ గ్రంథాన్ని రచించి దానికి లక్ష్యాలుగా సంకీర్తనలు వెలయించి సంకీర్తనాచార్యుడుగా, పదకవితా పితామహుడుగా కీర్తి కెక్కాడు. సంకీర్తనకు పదం, కీర్తన, కృతి అనే పదాలు వాడుకలో ఉన్నాయి. కానీ కాలక్రమేణ భగవంతుని కీర్తించి పాడే వాటిని కీర్తనలని, శృంగారాత్మకమైన, అభినయాత్మకమైన రచనలను పదాలని, సంగీత ప్రధానమైన రచనలను కృతులని ప్రత్యేకార్థంలో వ్యవహరించడం జరుగుతోంది. అందుకే కేవలం అభినయాత్మకమైన క్షేత్రయ్య రచనలను పదాలని, వైరాగ్య భక్త్యాత్మకమైన రామదాసు రచనలను కీర్తనలని, సంగీత ప్రధానమైన త్యాగయ్య రచనలను కృతులని వ్యవహరిస్తారు. అన్నమయ్య అధ్యాత్మ పరంగాను, శృంగార పరంగాను రెండు విధాలైన రచనలను చేశాడు కాబట్టి అన్నమయ్య రచనలను సంకీర్తనలని, పదాలని వ్యవహరించడం జరుగుతోంది. అన్నమయ్యకాలంలో సంకీర్తన, పదం అనేవి ఒకే అర్థంలో

పాటబడినట్లు తెలుగు సంకీర్తన లక్షణంలోని 'సంకీర్తన నామక పద సాంప్రదాయం బెట్టెదనిన' అనే ఆధారాన్ని బట్టి చెప్పవచ్చు. అన్నమయ్య తరువాత అతని కుమారుడు పెద తిరుమలాచార్యులు, అతని మనుమడు చిన తిరుమలాచార్యులు, క్షేత్రయ్య, రామదాసు, త్యాగరాజు, సారంగపాణి, హనుమద్దాసు మొదలైన వాగ్గేయకారులు అన్నమయ్య ఏర్పరచిన పదకవితా మార్గంలో పయనించి వేలాదిగ ఆధ్యాత్మ సంకీర్తనలు, అభినయాత్మక శృంగార పదాలు రచించి ప్రజలను సంగీతపరంగా రంజింపజేస్తు, బుద్ధిగతంగా చైతన్యవంతుల్ని చేశారు.

ఇలా మలి వాగ్గేయకారులకు మార్గదర్శకుడై పద సాహిత్యాంబర వీధిలో తొలి వాగ్గేయకార శరశ్చంద్రుడై వెలగొందిన అన్నమయ్య సంకీర్తనల నిర్మాణంలో ఎంతో వైవిధ్యం, వైశిష్టం వ్యక్తమవుతుంది. సంకీర్తనా సౌధానికి పల్లవి సౌందర్యవంతమైన చంద్రశాల వంటిదైతే, చరణాలు ఆధార భూతమైన మూలస్తంభాల వంటివిగా స్ఫురిస్తాయి. ఒక పూర్ణ సంకీర్తనా స్వరూపాన్ని ఒక మానవుడుగా భావిస్తే మానవుడు నిలబడటానికి, నడవటానికి పాదాలు ఎంత ముఖ్యమో, సంకీర్తనా పరిపుష్టికి, గమనానికి కూడా చరణాలు అంత ముఖ్యమైనవి. అందుకే చరణాలు అనే పేరు వచ్చివుండవచ్చు. సంకీర్తనా చరణాల్నే పాదాలని, పదాలని కూడా వ్యవహరించడం వుంది. మానవునికి శిరస్సు ఎంత సర్వోత్కృష్టమయిందో సంకీర్తనకు పల్లవి కూడా అంత ముఖ్యమయింది. ఆ మానవునికి జీవం ఎలాంటిదో సంకీర్తనకు రాగం అలాంటిదని చెప్పవచ్చు. పల్లవిలో వాగ్గేయకారుడు చెప్పదలచిన ప్రధానమైన విషయం వ్యక్తమవుతుంది. పల్లవిలో చెప్పబడిన ప్రధానమైన విషయం చరణాలతో వివరణాత్మకంగా చెప్పబడుతుంది. ప్రతి చరణం తర్వాత పల్లవిని గూర్చి సంకీర్తన లక్షణంలో—

పదములయర్థము బల్లవి
పదలకయన్నిటికినేక వాక్యత జేరున్
గుది గ్రుచ్చినట్లు తగులై
పదములుతుదిన్ మఱియు మఱియు బల్లవియమరున్"

అని చెప్పబడింది. తెలుగు విశ్వవిద్యాలయం వైస్ - ఛాన్సలర్ ఆచార్య డా. సి. నారాయణరెడ్డిగారు చరణాలలో పాదాల విషయమై చర్చిస్తూ "చరణాల్లోని వాక్యాలను పాదాలు అని కాక పంక్తులు అనడంవల్ల అర్థం స్పష్టంగా తెలుస్తుందని, పాదాలు అనడం వల్ల చరణాలనే అర్థం కూడా స్ఫురిస్తుందని" తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు (5-3-1991 తేదీన రాజమండ్రి ప్రాంగణంలోని తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్య పీఠంలో పునశ్చరణ తరగతుల వీడ్కోలు సమావేశానికి వచ్చిన సందర్భంగా ధవళేశ్వరం అతిథి గృహంలో స్టాఫ్ మీటింగ్‌లో ముఖాముఖిచర్చ) కానీ పదసాహిత్యం చరణాల్లోని వాక్యాలను వచనంలోవలె పంక్తులని కాక "పాదాలు" అనే పేరుతోనే వ్యవహరించడం, వ్రాయడం జరుగుతోంది.

అన్నమయ్య సంకీర్తనలలో సాధారణంగా రెండు పాదాలు కలిగిన ఒక పల్లవి, నాలుగేసి పాదాలు కలిగిన మూడు చరణాలు ఉంటాయి కానీ అక్కడక్కడ పల్లవి పాదాలు సంఖ్యలోను, చరణాలు సంఖ్యలోను వైవిధ్యం కనిపిస్తుంది. దీనికి కారణం వాగ్గేయకారుడు తాను చెప్పేవిషయం తక్కువైనప్పుడు పాదాల సంఖ్య తగ్గివుండవచ్చు. అలాగే చెప్పేవిషయం అధికమైనప్పుడు పాదాల సంఖ్య కూడా అధికం అయివుండవచ్చు. అంతేగాక వాగ్గేయకారుని భక్త్యావేశం, భావోద్వేగం తన్మయీభావం ఉదాత్త అనుదాత్తాలుగా ఉన్నప్పుడు సంకీర్తనలోని పాదాల సంఖ్య, చరణాల సంఖ్య కూడా హెచ్చడం, తగ్గడం జరిగివుండవచ్చని భావించవచ్చు.

పల్లవిలో సంఖ్యా వైవిధ్యం: 1. అన్నమయ్య సంకీర్తనల్లో సాధారణంగా రెండుపాదాలుకలిగిన పల్లవులే ఎక్కువగా కనిపిస్తాయి 'పద సమాన పాదయుగ్మము కలది పల్లవి' అని సంకీర్తన లక్షణంలో వుంది.

"పారకుమీ వో మనసా పంతము విడువకుమీ మనసా
పారిన నీవే బడుగయ్యేవు చేరువనా డే
చెప్పెనె మనసా (1-188)

2. ఒకేపాదం కలిగిన పల్లవులు: అన్నమయ్య సంకీర్తనలలో ఒకేపాదం కలిగిన పల్లవులు చాలా అరుదుగా కనిపిస్తాయి. ఏకపాదచూళికమయింది శిఖాపదమని సంకీర్తనలక్షణంలో చెప్పబడింది. ఏకపాదం కలిగిన పల్లవిని శిఖాపదం అంటారు.

"జగమంతానీమయము సర్వేశ్వరవిష్ణుమయంబుగాన"(2-332)
అన్నమయ్య సంస్కృత సంకీర్తనలలో కూడా ఏకపాదంకలిగిన పల్లవి కనిపిస్తుంది.

"డోలాయాంచల డోలాయాం హరె డోలాయాం"
(2-374)

3. మూడు పాదాలు కలిగిన పల్లవులు: అన్నమయ్య సంకీర్తనలలో మూడు పాదాలు కలిగిన పల్లవులుకూడా కనిపిస్తాయి.

"కేంత మాయలుం కేకు నిం తేస్తి
పూంత సిగ్గులే భూమిలో వారికి
యింత వలపు చిత్తములోని నెవ్వరికైన దెలుసునే"
(12-85)

"మేడలెక్కి నిన్ను జూచి కూడేన నేబూసతోడ
వాడుదేరి వుసురందురా - వెంకటేశ
యాడ మంటి విందా కానురా" (13-223)

4. నాలుగు పాదాలు కలిగిన పల్లవులు : అన్నమయ్య సంకీర్తనలలో నాలుగు పాదాలు కలిగిన పల్లవులు కూడా అరుదుగానే కనిపిస్తాయి.

"నిత్యాత్ముడై యుండి నిత్యుడై వెలుగొందు
సత్యాత్ముడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యు డీతిరువేంకటాద్రి విభుడు (1- 5)

"చల్లనై కాయ గదో చందమామాని
వెల్లగా దిరు వేంకటేశునెదుర
మొల్లమిగ నమృతంపు వెల్లి గొల్చుచు లోక
మెల్లనిను గొనియాడ గాను (12-228)

చరణాల్లో సంఖ్యా వైవిధ్యం : సంకీర్తనలో నాలుగు పాదాలు కలిగిన ఒక చరణం కానీ అంతకుమించిన చరణాలు కానీ ఉండవచ్చని సంకీర్తన లక్షణాలలో చెప్పబడింది. అన్నమయ్య సంకీర్తనల్లో సాధారణంగా నాలుగేసి పాదాలుగల్గిన మూడుచరణాలతో కూడిన సంకీర్తనలే విస్తారంగా కనిపిస్తాయి. కానీ అక్కడక్కడ పాదల్లోను, చరణాలలోను సంఖ్యా వైవిధ్యం కనపిస్తుంది. దీన్ని పదమూడు విభాగాలుగా వర్గీకరించవచ్చు. ఇందులో సౌలభ్యంకోసం ఒక్కొక్క చరణాన్నే ఉదహరించడం జరిగింది.

1. ఒక పాదం పల్లవి, మూడు పాదాల మూడు చరణాలు :

జగమంతా నీమయము సర్వం విష్ణుమయంటుగాన
॥పల్లవి॥
ఎనయుచు నే గర్మమార్గముల నితర దేవతల
భజియించెదను

యని యపరాధం బెంచకుమీ అన్యమునీకంటె
మరిలేదు
పనివడి "మత్తః పరతరది"బని పలికితి విన్నయు
నీ యాజ్ఞలు (2-381)

2. రెండు పాదాల పల్లవి, రెండు పాదాల రెండు చరణాలు:

ఆదిదేవ పరమాత్మా

వేద వేదాంత వేద్య నమోనమో ॥పల్లవి॥

పరాత్పరా భక్త భవ భంజనా
చరాచర లోక జనక నమోనమో ॥ (1-289)

3 రెండు పాదాల పల్లవి, రెండు పాదాల పదకొండు చరణాలు :

నేనెందువోయె తానెందువోయీ
రానీలే రానీలే రానీలే ॥పల్లవి॥

మీఁవైన నాటి తనమిదుకెల్ల దిగవలె
కానీలే కానీలే కానోల ॥ (12-271)

4. రెండు పాదాల పల్లవి, నాలుగు పాదాల రెండు చరణాలు :

ఘోర దురితముల చేగుణవికారములచే
నీరీతి బడు నాకు నేది దెరువు ॥పల్లవి॥

హరి జగన్నాథు లోకారాధ్యు
నెరఁగ నేరని వానికేది దెరువు
పరమ పురుషుని జగద్భ్రుతునంత స్వామి
నిరవు కొలువని వానికేది దెరువు ॥ (3-52)

5. రెండు పాదాల పల్లవి, నాలుగు పాదాల నాలుగు చరణాలు :

ఆద్యో విశల్ప వాదులంతటా సిగ్గు పడరు
యీయెడ నెట్టు గలిగె నీ యసుర మతము ॥పల్లవి॥

నీ ముద్రలూ నొల్లరు నీదాసోహము నొల్లరు
కామించి నీ మీఁది భక్తి కడు నొల్లరు
నామ మంత్రము నొల్లర నామముండ వలెందురు
తాము వైష్ణవుల మంటా దక్కించుతురు (3-52)

6. రెండు పాదాల పల్లవి, నాలుగు పాదాల ఐదు చరణాలు :

అందరి బ్రదుకులు నాతనివే
కందువెల్ల శ్రీకాంతునిదే ॥

వేమరు జదివెడి విప్రుల వేదము
సోమక వైరి యశో విభవం
శ్రీమించు నమరుల జీవనమెల్లను
ధామథనుని సంత తకరుణే (1-335)

7. రెండు పాదాల పల్లవి, నాలుగుపాదాల ఏడు చరణాలు :

నీతశ పడుసుదోసిటి పాలమగఁడు
బాఁతి పడిన నగపడునటె వీఁడు ॥

మూఁడు గాళ్ళ పెద్ద ముసలి నవులు గొన్న
పాఁడి మేకలపాలపాశము
వేఁడి జట్టిన తల్లి వేఁకటిమై కన్న
వాఁడు వీఁడు శిన్న వాఁడటె వీఁడు ॥ (12-378)

8. రెండు పాదాల పల్లవి, నాలుగుపాదాల ఎనిమిది చరణాలు:

ఆహో సురత విహారో యం
సహజ పరాజయ శంకానాస్తి ॥

యమునా కూలే సుమల తాగృహే
విమలసైకత వివిధ స్థలే
రమణీ రమణౌ రమత స్తయో:
ప్రమదస్య పరాత్పరంనాస్త॥ (12-78)

9. రెండు పాదాల పల్లవి నాలుగు పాదాల పది చరణాలు:

వెట్టు లాల మీకు కీడుకుగలిగితేను
అట్టువంటి తరుకల్లంగ రాదా ॥

ముడిచి వేసిన పువ్వుముడువ యోగ్యముగాదు
కుడిచి వేసిన పుల్లెకుడువఁగా గాదు
బడినొకరు చెప్పిన బ్రితి చెప్పబోతేను
అడరి శ్రీహరి కది అరుహముగాదు ॥ (2-494)

10. రెండు పాదాల పల్లవి, నాలుగు పాదాల పదకొండు చరణాలు:

శరణని బ్రతుకరో జనులాల
గరిమ మెరసెనిదె కనకసింహము ॥

అహరహము బ్రహ్మాదుడు దొరకని
బహు విధముల హరిమహిమలు వొగడఁగ
కహ కహ హిరణ్యకసిపుడు నగివారి
సహజమేదియని చటచె గంభము ॥ (3-239)

11. రెండు పాదాల పల్లవి, నాలుగు పాదాల పదమూడు చరణాలు :

రాధామాధవరతి చరితమిది
బోధావహం శ్రుతి భూషణం ॥

గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహరత స్తదా విలసంతౌ
విహిత గృహాశౌ వివశౌతౌ ॥ (12-165)

12. నాలుగు పాదాల పల్లవి, ఎనిమిది పాదాల మూడు చరణాలు :

నిత్యాత్ముఁడై యుండి నిత్యుఁడై వెలుఁగొందు
సత్యాత్ముఁడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యుఁడీ తిరువేంకటాద్రి విభుఁడు ॥

ఏమూర్తి లోకంబు లెల్ల నేలెడు నాత
డేమూర్తి బ్రహ్మదులెల్ల వెదకెడు నాత
డేమూర్తి నిజమోక్షమియ్య జాలెడు నాత
డేమూర్తి లోకైక హితుఁడు
యేమూర్తి నిజమూర్తి యేమూర్తియును గాఁడు
యేమూర్తి త్రైమూర్తు లేకమైన యాత
డేమూర్తి సర్వాత్ము డేమూర్తి పరమాత్ము
డామూర్తి తిరువేంకటాద్రి విభుఁడు ॥ (1-75)

13. మూడు పాదాల పల్లవి, మూడు పాదాల ఇరవై ఐదు చరణాలు :

మేడలెక్కి నిన్ను జూచి - కూడేననే యాసతోడ
వాడుదేరి వుస్సురందురా - వెంకటేశ
యాడ నుంటి విందాకా నురా ॥

పిక్కటిల్లు చన్నులపై చొక్కపు నీవుంగరము
గక్కన నేనద్దు కొందురా - వెంకటేశ
లక్కవలె ముద్ర లంటెరా ॥ (13-223)

సంకీర్తనల్లో పాదాంతపదాల శిల్పచాతుర్యం : సాధారణంగా జానపద గేయ పాదాంతాల్లో మేలుకో, సువ్వి, అల్లో నేరళ్ళో, గొబ్బిలో, జాజర, తుమ్మెదా చందమామ, ఉయ్యాల, లాలి, జోజో, మంగళం వంటి పదాలు పునరావృత్తమవడం కనిపిస్తుంది. ఆ పాదాంత పదాల పేర్లతోనే ఆ గేయాలను కూడా మేలుకొలుపులని, సువ్వి పాటలని, అల్లో నేరళ్ళని పిలవడం జరుగుతోంది. అన్నమయ్య సంకీర్తనలలో కూడా మేలుకో, సువ్వి, అల్లో నేరళ్ళో, గొబ్బిళ్ళో, జాజర, చందమామ, ఛాంగుబళా, సాసముఖా, ఉయ్యాల, లాలి, జోజో మంగళం వంటి పదాలు పాదాంతాలలో ఉన్న జానపద గేయ రీతులు కనిపిస్తాయి. అన్నమయ్య సంకీర్తనలలో జానపద సంప్రదాయమైన పాదాంత పదాలే కాకుండా సాధారణమైన పదాలు కూడా పాదాంతాల్లో చోటు చేసుకున్నాయి! పల్లవి పాదాంతాల్లో పదాలే చరణాల్లోని పాదాంతాలలో కూడా పునరావృత్తి కావడం ప్రత్యేకంగా కనిపిస్తుంది. కొన్ని సంకీర్తనలలో పాదాది పదాలు, పాదమధ్య పదాలు కూడా పునరావృత్తి కావడం కనిపిస్తుంది. దీనివల్ల సంకీర్తనలు వినేవారికి, చదివేవారికి చెవులకు ఇంపు కలిగి తద్వారా మనస్సుకు ఆనందోత్సాహాలు కలుగుతాయి.

సహజకవి, పరమభక్తుడు అయిన పోతన తన ఆంధ్ర మహాభాగవతంలో వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస మొదలైన శబ్దాలంకారాలను ప్రయోగించి సహృదయ పాఠకుల శ్రవణేంద్రియాలకు స్వర సంబంధమైన మాధుర్యాన్ని చేకూర్చాడు. తాళ్ళపాక అన్నమయ్య పోతన పద్యాలలో శబ్దాలంకారాల వలె తాను కూడా విష్ణుభక్తి పరవశుడై ఒక్కొక్క సంకీర్తనకు ఒక్కొక్క రకమైన పదాన్ని గ్రహించి ఆ పదాన్నే సంకీర్తనలో పాదాంతంలోను పాదమధ్యంలోను, పాదాదిలోను పునరావృత్తం చేశాడు. సంకీర్తనా స్వరూపానికి అనితర సాధారణమైన వైవిధ్యాన్ని చేకూర్చాడు. కొన్ని సంకీర్తనల్లో ప్రసిద్ధమైన సంస్కృత వాక్యాలను యథాతథంగా ప్రయోగించి వినూత్న పంథాను అనుసరించాడు. దీనివల్ల అన్నమయ్య కున్న సంస్కృత భాషా పాండిత్యం వ్యక్తమవుతుంది. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వర భక్తిలో తాదాత్మ్యం చెంది కొన్ని సంకీర్తనలలో ధ్వన్యనుకరణ శబ్దాలను ప్రయోగించాడు. అన్నమయ్య సంకీర్తనలలో కనిపించే ఈ విధమైన చరణ శిల్ప వైవిధ్యాన్ని పందొమ్మిది రకాలుగా విభజించి ఉదహరించడం జరిగింది.

సంకీర్తనలోని అన్ని పాదాంతాల్లోను ఒకే పదం పునరావృత్తి కావడం :

ఇందుకా కోరి పుట్టి యిట్టి బదుకు
పొందుల శ్రీహరి తోడి పొత్తుల మా బదుకు (2-397)

ఈ సంకీర్తనలో మూడవ చరణం - మూడవ పాదంలో బదుకు అనే పదం పునరావృత్తం కాకపోవడానికి కారణం ఆపాదంలో శ్రీ వేంకటేశ్వర ముద్రవుంది. ఈ నియమమే అన్ని సంకీర్తనల్లోను కనిపిస్తుంది. సంకీర్తనలోని అన్ని పాదాంతాల్లోను పునరావృత్తమయ్యే మరికొన్ని పదాలను చూపించడం జరిగింది.

| | | | |
|---|---|---|---|
| కాపురమా | - 2-34 | చాలు | 1-114 |
| శరణు | - 3-384 | కలిగె | 1-129 |
| పాదము | - 1-191 | చేయి | 1-134 |
| సంసారము | - 1-199 | బాధ | 1-239 |
| దొంగ | - 1-322 | రూపము | 2-432 |
| హరి | - 1-420 | కర్మమా | 2-486 |
| ఈతఁడు | - 2-392, 1-351 | బోయనాయఁడు | 1-460 |
| చెలిమి | - 1-29 | తలఁపు | 1-356 |
| ఓ మనసా | - 1-188 | సంకీర్తనం | 1-243 |
| సుఖము | - 1-135 | పరమాత్ముఁడు | 1-410 |
| బ్రతుకు | - 1-348 | | |
| భూతము | - 1-109 | | |

2. సంకీర్తనలోని కొన్ని పదాల మధ్యలోను, పాదాంతాల్లోను ఒకే పదం పునరావృత్తం కావడం.

ఈతని మూలమెపోయిల గల ధనములు
యీతఁడు మాకు గలఁడు యెంత లేదు ధనము ॥

విరతి మాధనము విజ్ఞానమే ధనము
మరిగిన తత్త్వమే మా ధనము
పరము మాధనము సంకీర్తనే ధనము
కరిరాజ వరదుఁడే కైవల్య ధనము ॥ (2-457)

ఇలాగే తక్కిన రెండు చరణాలలోని పాదాంతాలలోను, 1, 3 పాదాల మధ్యలోను 'ధనము' అనే పదం పునరావృత్తమయింది. ఇలాంటిదే మరొక ఉదాహరణ

నీ మాయ కల్లగాదు నిజము దెలియరాదు
కామించి హరి నీ వొక్కడవే నిజము ॥

చచ్చేటి దొకమాయ సరి బుట్టేదొక మాయ(2-458)

ఇలాగే తక్కిన రెండుచరణాలుకూడా సాగుతాయి. ఈ కీర్తన నిర్మాణంలో ఒక ప్రత్యేకత వుంది. పల్లవి ఎత్తుగడలోని "మాయ" అనే పదం చరణాలలోని మూడు పాదాంతాలలోను మధ్యలోను పునరావృత్తమయింది. పల్లవిలోని రెండవ పాదాంతంలోని "నిజము" అనే పదం చరణాంతాలలో మాత్రమే పునరావృత్తమయింది.

ఇలాగే పల్లవి పాదాంతాలలోను పునరావృత్తమయిన పదమే చరణాలలోని కొన్ని పాదాల మధ్యలోను అన్ని పాదాంతాలలోను పునరావృత్తమయ్యే మరొక పదం రాఘవా (1-392)

3. పల్లవి మొదటి పాదాంతంలో తప్ప తక్కిన అన్ని పాదాంతాలలోను ఒకే పదం పునరావృత్తం కావడం.

ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు
నప్పడగు తిరువేంకటాద్రీశు గంటి ॥ (1-38)

ఈ కీర్తనలో "కంటి" అనే పదం సంకీర్తనలోని అన్ని పాదాంతాలలోను పునరావృత్తమయింది. ఇలాగే "ఒండె" అనే పదంకూడా పల్లవి మొదటి పాదాంతంలో తప్ప తక్కిన అన్ని పాదాంతాలలోను పునరావృత్తమయింది.

4. పల్లవి రెండు పాదాలలోని అంత్య పదమే చరణాలలోని కొన్ని పాదాంతాలలో పునరావృత్తమవడం.

మఱి యెందూగతి లేదు మనుపనీవే దిక్కు
జఱసి లక్ష్మీశ నీశరణమే దిక్కు. ॥

భవ సాగరములోఁ బడిమునిఁగిన నాకు
తివిరి నీ నామమును తేపయే దిక్కు (2-146)

ఇలాగే తక్కినవి.

ఈ విధమైన సంకీర్తనా నిర్మాణం కలిగిన మరికొన్ని ఉదాహరణలు చూపడం జరిగింది.

| | | | |
|---|---|---|---|
| మోక్షము | 2-505 | యోగి | 1-167 |
| దేవసింహమా | 2-363 | ఇందరు | 1-154 |
| నీవ్రాజ | 3-320 | మందు | 1-237 |
| దైవము | 1-422 | శరణు | 2-282 |
| మానిసిమెకము | 1-436 | హనుమంతా | 2-249 |
| హరిహరీ | 1-480 | ప్రమాణము | 2-412 |
| నీదాసులు | 1-493 | నాయపరాధము | 1-271 |
| కలియుగమా | 1-118 | | |

5. పల్లవి రెండవ పాదాంతంలోని పదమే చరణాలలోని అన్ని పాదాంతాలలోను పునరావృత్తం కావడం.

అరసి వేఁలోక వోముక్తడుగ గవలను
సారవు లౌకిక విమోచనమే ముక్తి ॥

మొగిఁ బుణ్యపాపవిముక్తియే ముక్తి
పెగటు బ్రిపంచపు విముక్తే ముక్తి
తగులు సంసార బంధవిముక్తే ముక్తి (2-370)

ఇలాగే తక్కిన రెండు చరణాలలోని పాదాంతాలలో కూడా "ముక్తి అనేపదం ఆవృత్తమయింది

ఇలాగే కొన్ని ఉదాహరణలు : తెలుపు 2-378
పాడి 2-559

6. పల్లవి మొదటి పాదాంత పదమే చరణాలలోని కొన్ని పాదాంతాలలో పునరావృత్తం కావడం :

ఇంత కంటే మరిలేదు యెవ్వరికి నుపాయము
యెంతైనా నిదియు నీ విచ్చితేనే కలుగు ॥

హరినీ చిత్తము వట్టే యందుకు నుపాయము
ధరనిన్ను బోధించే నీదాసులమాటే
దురితములన్నిటిని తొలగించే వుపాయము
నిరంతరము నీనామ జపమే ॥ (2-234)

ఇలాగే తక్కిన రెండు చరణాలు కూడా సాగాయి.

ఇలాంటి సంకీర్తన పోలిన మరికొన్ని ఉదాహరణలు :

సహజమే 1-491 వృథా వృథా 1-84

7. పల్లవిలోని మొదటి పాదాంతంలోని పదమే చరణాలలోని రెండవ పాదాంతంలోను, పల్లవి రెండవ పాదాంతంలోని పదమే చరణాంతాలలోను పునరావృత్తం కావడం :

గాలినే పోయ గల కాలము
తాలిమికి గొంతయు బొద్దులేదు ॥

అడుసు చొరనే పట్టె నటు నిటు కాళ్ళు
గడుగు కొననే పట్టె గలకాలము

ఒడలికి జీవునికొడయు డైన హరి
దడవ గా గొంతయు బొద్దు లేదు ॥ (1-14)

ఇలాగే తక్కిన రెండు చరణాలు కూడా సాగాయి. ఇలాంటిదే మరొక ఉదాహరణ :

నానాటి బదుకు నా టకము
కానక కన్నది కైవల్యము ॥

పుట్టుటయు నిజము పోవుటయు నిజము
నట్టనడిమి పని నాటకము
యెట్టనెదుట గలదీ ప్రపంచమును
కట్ట గడపటిది కైవల్యము ॥ (౩-5?6)

ఇలాగే తక్కిన రెండు చరణాలుకూడా సాగాయి.

ఇలాంటి సంకీర్తనా నిర్మాణం కలిగిన మరికొన్ని ఉదాహరణలు

"నా పాలి ఘన నిధానమవు నీవే నన్ను
నీపాల నిడు కొంటి నీవే నీవే ॥ (1-108)

నగు బాట్ల బడే నాజిహ్వ
పగటు నిదివో పావనమాయ" (1-56)

౩. పల్లవి మొదటి పాదమధ్యంలోను, పాదాంతంలోను ఉన్న పదమే చరణాలలోని మూడు పాదాల మధ్యలోను, పాదాంతాల్లోను రావడం, పల్లవి రెండవ పాదంలోని వాక్యభాగమే చరణాంతాలలోను పునరావృత్తం కావడం.

నారాయణాతేయ నమోనమో నానాత్మనే నమోనమో
యీ వచనలనే యెవ్వరు దలచిన యిహపర
మంత్రము లిందరికి ॥

గోవిందాయ నమోనమో గోపాయ నమోనమో
భావజగురవే నమోనమో ప్రణవాత్మనే నమోనమో
దేవేశాయ నమోనమో దివ్యగుణాయ నమోనమో
యీ వరుసలనే యెవ్వరు దలంచిన యి హావర
మంత్రములిందరికి ॥ (1-380)

ఈ విధంగానే తక్కిన రెండు చరణాలు కూడా సాగాయి.

9. పల్లవిలోని రెండవ పాదంత పదమే' చరణాల్లోని కొన్ని పాదాంతాలలో పునరావృత్తం కావడం :

ఎంతైన దొలగవై తేదైన నామతికి
వింత చవిసేతుగా విషయబుద్ధి ॥

ఎనసి జన్మములనేనెట్ల నుండిన బోక
వెనక దిరుగుదువుగా విషయ బుద్ధి
అనువైన యను భవనలను భవించగా జేసి
వెనక మఱపింతుగా విషయబుద్ధి ॥ (1-76)

ఇలాగే తక్కి వ రెండు చరణాలు కూడా సాగాయి.

ఇలాంటివే మఱికొన్ని ఉదాహరణలు ;

| | | | |
|---|---|---|---|
| కలిగె | 2-251 | దేహమా | 1-416 |
| ఇంతే | 2-263 | వెఱ్ఱివాఁడు | 1-413 |
| ఒక హింసా | 2- 16 | బ్రాహ్మలు | 1-365 |
| ప్రపన్నులు | 1-462 | మాసంధ్య | 1- 10 |
| | | పోదు | 1- 6 |

10. పల్లవిలోని రెండవ పాదాంత పదమే. చరణాంతాలలో మాత్రమే పునరావృత్తం కావడం.

దేహము దానస్థిరమట దేహి చిరం తనుడట
దేహపు మోహపు సేతలు తీరుట లెన్నఁడో కో॥

తన్నిక నెరుఁగుట లెన్నఁడు తలఁపులు దొలఁగుట
లెన్నఁడు
తిన్నని పరవశముల చే దిరుగుట లెన్నఁడో కో॥
(1-136)

ఇలాగే తక్కిన రెండు చరణాంతాలలో కూడా "ఎన్నఁడో కో" అనే పదం పునరావృత్తమయింది.

ఇలాంటి చరణ నిర్మాణం కలిగిన మరికొన్ని ఉదాహరణలు :

| | | | |
|---|---|---|---|
| వేసారితి | 1- 88 | పోయ గాలము | 1- 48 |
| బతుకు | 1- 90 | ఈ బాలుఁడు | 1- 57 |
| చాలు | 1- 93 | బాలుఁడా | 1- 58 |
| ప్రజలు | 1-101 | వైష్ణవుఁడు | 1- 59 |
| ఘను డు | 1-318 | జీవుడు | 2- 13 |
| మాగురు డు | 2-148 | విష్ణుఁడు | 2-417 |
| బడలికరము | 2-318 | బముకసీవయ్యా | 2-422 |
| పెద్దహనుమంతుడు | 2-350 | అది మూలము | 2-418 |
| చోటున్నదా | 2-410 | మావ్రితము | 2-512 |
| ఫలము | 2-406 | శరణనరే | 2-510 |
| ఆత్మ | 2-386 | వాయు నందనుడు | 2-216 |
| జడులు | 1- 12 | విట్ఠలుఁడు | 2-217 |
| సాసముఖా | 2-471 | ప్రపన్నులకు | ?-488 |
| హనుమంతుఁడు | ?-218 | దిక్కు | 2-356 |
| ఏమరుడు 2-264. | 1-415 | మా ప్రాణు | 2- 64 |

| | | | |
|---|---|---|---|
| సుఖము | 1-212 | దైవము | 2-372,1-172 |
| వైష్ణవుఁడొకఁడు | 1-144 | భాష్యకారులు | 1-162 |
| ఎటువంటి జాణే | 1-173 | తెలివి | 1-330 |
| మాయ | 1-130 | కాలము | 1-330 |
| జీవులకు | 1- 32 | పాషండము | 1-431 |
| బంటు | 1-279 | ఈదేహి | 1-419 |
| ప్రాణి | 1-159 | గుఱుతుగాదా | 1-404 |

ఈ విధమైన ఆ వృత్తి పదాలు కలిగిన చరణ శిల్పం సంస్కృత సంకీర్తనలలో కూడా కనిపిస్తుంది.

అస్మదాధీనాం అన్యేషాం
తస్మిన్ తస్మిన్ తత్రిచ పునశ్చ
సతతాధ్యయన నిష్ఠా పరాణంధ్రుథ
ప్రితినాంయతి నాం వనవాసినాం
గతి రిహాస్మ ర్తుంకా జగత్త్రాయం పర
స్థితిరియంకా విష్ణుసేవా పునశ్చ ॥

ఇలాగే తక్కిన రెండు చరణాంతాలలో కూడా "పునశ్చ" అనే పదం ఆవృత్తే అయింది. ఇలాగే కొన్ని ఉదాహరణలు :

నాస్తి 144 జగన్నాథా 1-323

11. పల్లవిలోని రెండు పాదాదులలోని పదాలే చరణ పాదాదులలో కూడా రావడం, పల్లవి పాదాంతాలలోను చరణాలలోని పాదాంతాలలోను ఒకే రకమైన అంత్యప్రాసలు రావడం :

ఈపాదమే కదా యిలయెల్ల గొలిచినది
ఈ పాదమే కదా ఇందిరా హస్తముల కితవైనది ॥

ఈ పాదమే కదా ఇందరును మ్రొక్కెడిది
ఈ పాదమేకదా యీ గగన గంగపుట్టినది (1-66)

ఇలాగే తక్కిన రెండు చరణాలలోని పాద నిర్మాణం కూడా అమరివుంది.

సకల సంగ్రహము సకల సంచయము
అకృత సుకృతి మిదిహరినామం ॥

సకల వేదశాస్త్రముల సారమిది
సకల మంత్ర రాజంబు నిది
సకల పురాణ రసముల మధురమిది
అకుటిల పావనం హరినామం ॥ (1-349)

అనే సంకీర్తనలో పల్లవిలోని మొదటి పాదాదిపదం చరణాల్లో మూడు పాదాదులలోను. రెండవ పాద మధ్యంలోని పదం చరణాల లోని మూడు పాదాంతాలలోను, పల్లవి అంతంలోని పదమే చరణాం తంలోనూ రావడం జరిగింది.

16. పల్లవిలోని అంత్యపదం కాకుండా చరణాంతలో వేరే పదాన్ని అంత్య పదాలుగా వాడటం :

అరుదునే చెరిత్రము హరినేనిదియే నిలుచుకొని
శరణంటి కావుమిదియు విన్నపము సరిలేరు నీకు ॥

సరగనీయ కారణ బంధుత్వము హల్యయందు గంటిమి
కరియందు నార్త రక్ష కత్వము మెరయుగ కంటిమి
అరవి ద్రౌపది యందు నాపదుద్ధారకత్వము గంటిమి
శరణంటె గాచుట ధర విభీషణు నందు గంటిమి ॥
(2-321)

ఇలాగే తక్కిన చరణాలలోని పాదాంతాల్లోకూడా "కంటిమి" అనే పదం పునరావృత్తమయింది.

ఇలాంటి సంకీర్తనా నిర్మాణంకలిగిన మరికొన్ని ఉదాహరణలు:

తలఁతు (1-324)　　నీవు (2-340)

13. పల్లవి పాదాంతాలలో అంత్యపదాలు లేకుండా మూడు చరణాలలో ఒక్కొక్క చరణాంతంలో ఒక్కొక్క అంత్య పదం పునరావృత్తం కావడం.

అదివో చూడరో అందరు మొక్కరో
గుదిగొనె బ్రహ్మము కోనేటి దరిని॥

రవి మండలమున రంజిల్లు తేజము
దివి జంద్రునిలో తేజము
..........................॥

క్షీరాంబుధిలో జెలఁగు సాకారము
సారెవైకుంఠపు సాకారము
..........................॥

పొలసిన యోగంబులలో ఫలమును
పలు తపములలో ఫలమును
..........................॥　　(2-98)

ఇలాంటి సంకీర్తనా నిర్మాణం కలిగిన మరొక ఉదాహరణ:

ఈతడే యీతఁడే నుండి యెంత యెంచి చూచినా
చేతనే వరాలిచ్చే శేషాచలేశుఁడు ॥

విశ్వరూపపు బ్రహ్మము విరాట్టయిన బ్రహ్మము
ఐశ్వర్య స్వరాట్టా సామ్రాట్టయిన బ్రహ్మము
శాశ్వత బ్రహ్మాండాలు శరీరమైన బ్రహ్మము
యీశ్వరుఁడై మహారాట్టై యిందరిలో బ్రహ్మము ॥
(2-137)

తక్కిన మూడు చరణాలలోని నాలుగేసి పాదాంతాలలో వరుసగా తేజము, మూరితి, దైవము అనే పదాలు పునరావృత్తమయ్యాయి.

14. పల్లవిలో లేకుండా కేవలం చరణ పాదాల మధ్యలో ఒకే పదం పునరావృత్తం కావడం :

మగడు విడిచినా మామ విడువనియట్లు
నగడిన నేమిసేయు నేనే రోయఁగాని ॥

నరకమును రోసి నరలోకాన విడిచె
నిరయము తోవరోసి నేనే విడువ గాని
పరగ యోనులు రోసి బట్టబాయిట వేసె
సారెది యోనుల రోసి చొరకనే మానగాని ॥ (2-476)

ఈ సంకీర్తనలోని తక్కిన రెండు చరణాలలో కొన్ని పాదాం పాదాంతాల్లో "రోసి" అనే పదం ఆవృత్తి అయింది.

15. పల్లవి చరణ పాదాంతాలలోను అంత్యాను ప్రాసలు రావడం :

పురుషుఁడు శ్రుతివొగడెనట ఆపురుషుఁడు నిరాకారమట
విరసవాక్యము లొండొంటికి నివి వింటేన సంబంధములు ॥

మొగమున బ్రహ్మలు మొలచిరట ఆమూరితి
అవయవ రహితు డట
తగు బాహువులను రాజులట ఆతత్వమే యెంచగ శూన్యమట
సగటున తొడలను వైశ్యులట ఆ బ్రహ్మము
దేహము బయలట
అగపడి పాదాల శూద్రులట అతని రూపము లేదట॥ (2-252)

ఆలాగే తక్కిన రెండు చరణాలలోని పాదాంతాలలో "అట" అనే మాట పునరావృత్త మయింది.

16. అర్థం ఒకటే అయి పల్లవి చరణ పాదాంతపదాలు వేరు వేరు కావడం :

దురిత దేహులే తొల్లియును (శ్రీ)
హరి భజించి నిత్యాధికులైరి

అనంత కోటి మహామునులు ఈ
సనకాదులు నిశ్చల యశులు
ఇనశశి నయనునీ నితనిని మును
గని భజించి గతకల్మషులైరి (1-21)

ఈ సంకీర్తనలో తక్కిన రెండు చరణాంతాల్లో ధన్యులైరి, సుఖాంచితులైరి అనే పదాలున్నాయి.

ఇలాంటివే మరికొన్ని ఉదాహరణలు :

"ఇందు కొరకై యిందరును నిట్లయిరి
కిందుపడి మఱి కాని గెలుఁపెరఁగరాదు ॥ (1-11)

అనే సంకీర్తనలోని చరణాంతాలలో కానరాదు. ఎఱుఁగరాదు, తెలియనేరాదు అనే పదాలున్నాయి.

"ఆలాగు పొందులును నటువంటి కూటములు
యీలాగు లౌట నేఁడిదె చూడనయితి" (1-30)

అనే సంకీర్తనలోని చరణాంతాలలో ఎఱుగలేనైతి, కానలేనైతి, పొందనైతి అనే పదాలున్నాయి.

"చిత్తములో నిన్ను చింతించ నేరక
మత్తుఁడనై పులు మానిసినైతి" (1-19)

అనే సంకీర్తనలోని చరణాంతాల్లో ఎఱుగలేనైతి, కానలేనైతి, పొందనైతి అనే పదాలున్నాయి.

ఏది చూచినా నీవే యిన్నియును మఱినీవే
వేద విరహితులకు వెఱతుమటుగాను ॥

ఇరువురొని రూపంబు లిన్నిటాను గల నిన్ను
బరికించవలె గాని భజియింపరాదు ॥ (1-60)

ఈ సంకీర్తనలో తక్కిన చరణాల్లోని రెండవ పాదాంతంలో కొలువరాదు, సేవింపరాదు అనే పదాలున్నాయి.

ఉన్న విచారము లేల వోహో సంసారులార
యిన్నిటికితండే రక్ష యిదే మీకు మనరో ॥ (1-441)

అనే సంకీర్తనలోని చరణాల్లోని రెండు, నాలుగు పాదాంతాల్లో ఈడేరరో, ఉండరో, పొదలరో, బ్రతుకరో అనే పదాలున్నాయి.

17. సంస్కృత వాక్య ప్రయోగాలు కలిగిన సంకీర్తనలు :

అదె శిరశ్చక్రము లేనట్టి దేవర లేదు
యిదె హరిముద్రాంకిత మిందే తెలియరో ॥

'అనాయుధాసో అసురా అదేవా' యని
వినోదముగ ఋగ్వేదము దెలిపెడి
సనాతనము విష్ణుచక్రధారణకును
అనాది ప్రమాణమందే తెలియరో ॥

'యచ్చయింద్రే' యని, "యచ్చ సూర్యే'యని
అచ్చుగ తుద కెక్కెనదే పొగడీ శ్రుతి
ముచ్చట గోవిందుని ముద్రాధారణకు
అచ్చమయిన ప్రమాణ మందే తెలియరో ॥

మును 'నేమినాత ప్తముద్రాంధారయే' త్తని
వెను వెంట శ్రుతి యదె వెల్లవిరిసేసీని
మొనసి (శ్రీ) వేంకటేశు ముద్రాధారణకు
అనువుగ బ్రమాణమందే తెలియరో ॥ (2-485)

ఇలాగే మరి కొన్ని ఉదాహరణలు :

గుండక్రియ

ధరలో నెద్భావం తద్భవతనె గాన
హరిమయమే జగమంతాను (2-425)

అనే సంకీర్తనలోని పల్లవిలో మాత్రం సంస్కృత వాక్య ప్రయోగం కనిపిస్తుంది. అన్నమయ్య 'యద్భావం' అనే సంస్కృత పదాన్ని కూడా వ్యావహారికంగా మార్చి "ఎద్భావం" అని ప్రయో

గించాడు. సంస్కృత శబ్దానికి తెలుగు పదానికి సంధిచేసి 'తద్భవతనె' అని ప్రయోగించాడు. అన్నమయ్య ప్రజాకవిగా ఇలాంటి నూత్న ప్రయోగాలను విరివిగా చేశాడు.

ఇలాగే తెలుగు, సంస్కృత భాషల సమ్మిశ్రితంగా చేసిన సంకీర్తనల ఉదాహరణలు :

"సకలోపాసకులకు నందును సగుణం బే ప్రమాణము"(2-412)

అనే సకీర్తనలో నిర్గుణాయ గుణాత్మనే, సోహం, దాసోహం అనే సంస్కృత పదాలున్నాయి!

గుజ్జరి

"జగమంతా నీ మయము సర్వం విష్ణుమయంబుగాన"(2-381)

అనే సంకీర్తనలో మత్తః పరతరం నైతేన విరాత్మణాగ్రమపి, త్వమేవ శరణం గతి అనే సంస్కృత వాక్యాలున్నాయి. పల్లవి పాదాదిలో లేకుండా చరణాలలోని పాదాదిలో ఒకేపదం పునరావృత్తం కావటం.

నీకథామృతము నిరతసేవనాకు
చేకొనుట సకల సంసేవనం బటుగాన ॥

ఇదియె మంత్ర రాజము నాకునే ప్రొద్దు
నిదియె వేద సంహిత పాఠము
యిదియె బహుశాస్త్ర నెల్ల జదువుట నాకు
నిదియె సంధ్య నాకీదియ జపమటుగాన ॥ (1-54)

అనే సంకీర్తనలో తక్కిన రెండు చరణాల నిర్మాణంకూడా ఇలాగే అమరి వుంది.

మరొక ఉదాహరణ :

నిత్యాత్ముడై యుండి నిత్యుడై వెలుగొందు
సత్యాత్ముడై యుండి సత్యమై తానుండు
ప్రత్యక్షమై యుండి బ్రహ్మమై యుండు సం
స్తుత్యుడీ తిరువేంకటాద్రి విభుడు॥

ఏమూర్తి లోకంబులెల్ల నేలెడు నాత
డేమూర్తి బ్రహ్మాదులెల్ల వెదకెడు నాత
డేమూర్తి నిజమోక్ష మియ్య జాలెడు నాత
డేమూర్తి లోకైక హితుడు

ఏ మూర్తి నిజమూర్తి యే మూర్తియును గాడు
యేమూర్తి త్రైమూర్తు లేక మైన యాత
డేమూర్తి సర్వాత్ముడే మూర్తి పరమాత్మ
డా మూర్తి తిరువేంకటాద్రి విభుడు॥ (1-75)

ఈ అష్టపది పోలిన సంకీర్తనలపై రెండవ చరణంలో "ఏ మూర్తి" అనే పదం, మూడవ చరణంలో "ఏవేల్పు" అనే పదం పాదాదుల్లో పునరావృత్తమయింది

19. ధ్వన్యను కరణ శబ్దాలతో కూడిన సంకీర్తన : అన్నమయ్య భక్త్యావేశంతో భజన పారవశ్యంతో పాడిన ఈ సంకీర్తనలో నాట్యం చేయడానికి అనుకూలమైన మృదంగ ధ్వనులనుపోలిన ధ్వన్యను కరణ శబ్దాలు ఇందులో కనిపిస్తాయి.

బాపు దైవమా మాపాలిధవమా
తీపురాకాసి నెత్తురుదీందోందోందోందోందోం॥

కాలనేమి వునుకిది కంచువలె లెస్స వాంగి
తాళమొత్తరే తత్త తతత్తతా
కాలమెల్ల మాభూత గణమెల్ల వీఁడెకాచె
నేలఁబడి నేఁడును ధీంధీంధీంధీంధీంధీంధీం ॥

పగగొని మాలికి పచ్చి నెత్తురెప్పుడును
తెగికొను దానె తిత్తి తిత్తితి త్తితి
తగు మహోదరు వీఁపు ధణధణ మని వాఁగీ
బిగియించలే తోలు భింభింభింభింభింభింభిం ॥

మురదనుజుని పెద్ద మొదలి యెముక దీసి
తురులూదరే తుత్తు తుత్తు తుత్తు తు
తిరువేంకటగిరి దేవుఁడు గెలిచినస
మరుమునను మమ్మ మమ్మ మమ్మ మమ్మ మ ॥
(1-120)

విష్ణుమూర్తి ముర అనే రాక్షసునితో యుద్ధం చేసి అతని సంహరించినప్పటి బీభత్సాన్ని అన్నమయ్య మనోనేత్రంతో దర్శించి వర్ణించిన విషయం అన్నమయ్య సంకీర్తనలలో కనిపించే ఈవిధమైన చరణ శిల్పాన్ని ప్రస్తుతం అధ్యాత్మ సంకీర్తనలలో మాత్రమే పరిశీలించడం జరిగింది. అన్నమయ్య చరణ శిల్ప వైశిష్ట్యాన్ని గూర్చి ప్రముఖ కవి పండిత విమర్శకులు, జ్ఞాన పీఠ్ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య డా. సి. నారాయణరెడ్డిగారు ప్రశంసిస్తూ 'అన్నమయ్య పదాలలోని చరణ శిల్ప సామ్యం పర్షియన్ భాషా గేయాలలో (ఉర్దూగజల్స్) కూడా

కనిపిస్తుందని తమ అభిప్రాయాన్ని ముఖాముఖిగా 5-3-91 నాటి సమావేశంలో వ్యక్తం చేశారు. అన్నమయ్యలో కనిపించే ఇంతటి విస్తృతమైన విభిన్నమైన చరణ శిల్ప వైవిధ్యం, ఆవృత్తి పదాల ప్రయోగం అన్నమయ్య తరువాత ఏ ఇతర వాగ్గేయకారుల పద రచనలలోనూ కనిపించడంలేదని నిస్సంశయంగా చెప్పవచ్చు.

పండిత భారతి

నవంబర్ - 1991



# అన్నమయ్య సంకీర్తనల్లో మానవ నైజోక్తులు

శ్రీవేంకటేశ్వరుని పరమభక్తుడైన అన్నమయ్య మానవ కల్యాణం కోసం భక్తి, జ్ఞాన, వైరాగ్య, శృంగారపూరితంగా ముప్పై రెండు వేల సంకీర్తనలు రచించాడు. అన్నమయ్య మానవజీవితంలోని అన్ని దశలను సునిశితంగా, సున్నితంగా పరిశీలించాడు. మానవుల్లో ఒకరికొకరికి మధ్య తెలివితేటల్లో అంతర్యాలున్నా ఆహార నిద్రాదులలోను, కొన్ని సహజ స్వభావాలలోను సమాన ధర్మాలు కనిపిస్తుంటాయి. అన్నమయ్య ఆ అంశాలను అత్యంత సూక్ష్మంగా గమనించి సూటిగా, స్పష్టంగా. సూక్తిప్రాయంగా సంకీర్తనలలో వ్యక్తం చేశాడు. ఇవి అచ్చ తెనుగు నుడికారపు సొంపు పెంపుతో అలరారుతున్నాయి. వీటిని అన్నమయ్య లోకజ్ఞతకు. మానవనైజ పరిశీలనకు, అల్పాక్షరాలలో అనల్పార్థ రచనకు తార్కాణాలుగా చెప్పవచ్చు.

ఆపరానిది వలపు అణచరానిది చూపు (24-200)
ఉడివోని యాసకు వూరట యెందూలేదు (22-60)
ఒక్కరు తలచినట్టు వొకరి తలపురాదు (2-247)
కచ్చుపెట్టి సరసాలు కాయములంటింపించు (24-45)
కాముకపు మనసునకు కడ మొదలు లేదు (2-234)
కొత్తయిన రతి కాంక్ష గుట్టుసేయదు (22-60)
కోపము దయ యెఱగదు కూటమి సిగ్గెఱగదు (25-459)
కోరికలు దఱచైతే కోపములు దఱచౌను (27-128)

చింతకాయ తొక్కు చూచితేనే నోరూరు (2-234)
చిత్తములో తమకము సిగ్గులకు వెలవదు (22-60)
జడిగొన్న వయసువేసట చూపకు (22-60)
తగవెరిగినవాడు దయదలచు (30-547)
తగులమిగలవాడు దండబాయకుండును (30-547)
తలత్తి చూడకుండితే తనివియు దీరదు (24-127)
తలపొక్కటైనవాడు దాటడు మాట (30-547)
తుంచరానిది యాస తొలగరానిది వావి (24-200)
దాపరానిది లోలో తమకము (24-200)
నసుపున బెనగక నాటదు ప్రేమ (24-127)
పచ్చిదేరేసిగ్గులే భావములు గరగించు (24-45)
పట్టరానిది వయసు పాయరానిది నేస్తము (24-200)
పాయము భీతెఱగదు పంతము తన్నెఱగదు (25-459)
పాయము మదములు గొబ్బున తతులకు దీసు (24-45)
భావమెంత చిక్కినాను పరవశములు మించు (27-288)
మట్టుపెట్టరానిది మనసులో తలపోత (24-200)
మనసొక్కటైతే చాలు మాటలు వేరే తోచవు (27-128)
మెచ్చుట నవ్వులే కడు మోహమునించు (24-45)
మొగమాట గలవాడు మోనాన నూరకుండు (30-547)
వదిసమరిదియనే వావులే యాసలు రేచు (24-45)
వలపు జ తెఱగదు వాసిసీతి యెఱగదు (25-459)

పీనుల మంచి మాటలు వింటేనే సంతోషమబ్బ
(2-234)

సన్న యెరిగినవాడు సరసుడై మెలగును (30-547)

సరసమాడితేగానీ చవులెల్లా రేగవు (24-127)

సారిది గూచుండక సొంపులు పుట్టదు (24-127)

ఈ నైజోక్తులు నిర్దేశపూర్వకంగానే కాక ఎదుటి వ్యక్తితనను తాను ఆలోచించుకొనే విధంగాను, ఎదుటి వ్యక్తితో స్నేహపూర్వకంగా ప్రశ్నించిన రీతిలోకూడా కనిపిస్తాయి.

చిగిరించిన వలపు చేగలెక్కకుండునా (24-2·6)

తగులైన పొందులు తప్పిపోవునా (24-29·)

నగిన చిరునవ్వులు నాము వారకుండునా (24-296)

మేనిమీది జవ్వనము మేరమీరకుండునా (24-296)

వలపుల జాజరకు వాసివంతులెంతురా (30-351)

వాడికైతే వలపులు వద్దంటే మానునా (30-351)

సిగ్గరివేడుకలు చిమ్మి రేచకుండునా (24-296)

ఈ విధంగా మానవ స్వభావాలకు చెందిన కామం, కోపం, చూపు, తలవు, తృప్తి, ప్రేమ, భావం, మనసు, యౌవనం, సరసం, సిగ్గు మొదలైన అంశాలకు సంబంధించిన ఇటువంటి ఉక్తులు అన్నమయ్య సంకీర్తనా పారావారంలో రత్నరాశుల్లా శోభిల్లుతున్నాయి. ఇవి ఆయా సందర్భాలలో, ఆయా వయస్సుల్లో ప్రతిఒక్కరి అనుభవానికి వచ్చి వుండవచ్చు. ఇవి అత్యంత సహజమయినవి, సత్యమైనవి. వీటినీ భాషావ్యవహారంలో సూక్తుల్లాగా, సామెతల్లాగా ప్రయోగించవచ్చు. అన్నమయ్య మానవ నైజాలను ఇంతటి రమ్యంగా,

సరళంగా వ్యక్తం చేసిన తీరును, వాక్యవిన్యాసనైపుణ్యాన్ని గమనిస్తే ఆశ్చర్యానందాలు కలుగుతాయి. ఈ సైజోక్తులు గుండెకు సూటిగా తాకే సుకుశరాల్లా ఒప్పారుతున్నాయి.

పండిత భారతి

మార్చి, 1995



# అన్నమయ్య సంకీర్తనల్లో మానవ మనస్తత్వం

తొలి తెలుగు వాగ్గేయ కారుడు, పరమభక్తుడు, అయిన అన్నమయ్య శ్రీవేంకటేశ్వర ముద్రాంకితంగా రచించిన శృంగార, అధ్యాత్మ సంకీర్తనలలో భాషలోను వస్తువులోను, రచనా విధానం లోను ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. అన్నమయ్య అధ్యాత్మ వాదులు మెచ్చే విధంగా అధ్యాత్మ సంకీర్తనలు శృంగార ప్రియులు అహ్లాదించే విధంగా శృంగార సంకీర్తనలు రచించాడు. వీటిలో పండితులు, పామరులు, శాస్త్రజ్ఞులు, కళాప్రియులు, స్త్రీలు, పురుషులు, బాలలు, వృత్తి జీవనులు, జానపదులు, గిరిజనులు మొదలైన వారందరో ఇష్టపడే అయారకాల సంకీర్తనలున్నాయి. అన్నిరకాల సంకీర్తనలలోను విష్ణుభక్తి, విష్ణులీలలు, అవతారవిశేషాలు, భక్తి నీతులు, జ్ఞానవైరాగ్యాలు, సామాజికాంశాలు మొదలైనవి చోటు చేసుకొని ఉన్నాయి. ప్రజలందరిని ఐహికంగా, ఆముష్మికంగా తరింపజేయడమే అన్నమయ్య సంకీర్తన రచనాలక్ష్యం.

అన్నమయ్య మనసావాచా కర్మణా శ్రీనివాసునికి అంకితమైనా తానుకూడా సమాజంలో ఒక వ్యక్తే కాబట్టి ప్రజలందరి స్వభావాన్ని లోతుగా పరిశీలించాడు. వారి మనస్తత్వాల్లో కనిపించిన లోటుపాట్లను గూర్చి ఎంతో ఆవేదన చెంది వాటిని భగవంతునికి నివేదించినట్లు వారిని చక్కబెట్టడానికి ప్రయత్నించినట్లు కొన్ని సంకీర్తనలలో కనిపిస్తుంది.

మానవులు సహజంగా పరుల అందచందాలపై ఆసక్తి చూపుతారు తన చక్కదనాన్ని గమనించుకోరు. ఎప్పుడూ యౌవనం విషయాలే చెప్పుకుంటారు. గానీ ఈ యౌవనం తాత్కాలికమయిందని తెలుసుకోలేరు. కఠినమైన నిందలన్ని భగవంతుడిపైనే వేస్తారు. కాని ఆత్మశోధన చేసుకొని తమతప్పులు తాము తెలుసుకోరు. ఊరు ప్రజల మాటలతోనే కాలం వెళ్ళబుచ్చుతారే కానీ తమ జన్మకథల్ని స్మరించరు ఎక్కడెక్కడో ధన నిధులకోసం తిరుగులాడుతారు కానీ తనలోని ఆత్మ ధనాన్ని గుర్తించరు అని ప్రజల న్యూనమైన మనస్తత్వానికి విచారిస్తూ ఇదంతాకూడా దైవకల్పనే అని దైవానికే నివేదించాడు.

సకలమైన వారికి సహజమిది
అకటాయెట్టు గల్పించి ఆడించేవు దేవుడా ॥

దారుపాషాణ బుద్ధులు దైవమూపై బెట్టు గాని
యీరీతినే తన దేహ మెంచుకోడు
వూరిలోని మాట లెల్లా వుగ్గడించ బోవు గాని
కారణపు తన జన్మ కథలు దడవడు ॥ (2-196)

మనుషులు తమకు సంతోషం కల్గితే అది తమ భాగ్యంగా భావిస్తారు. దుఃఖం కలిగితే భగవంతుని దూషిస్తారు. ఎన్నో పాపాలు చేసి ధనాన్ని సంపాదించేటప్పుడు ఎలా సంపాదిస్తున్నాము అని విచారించక నరకాని కెళ్ళినపుడు పుణ్యచింతన చేస్తారు. నిద్రపోయేటప్పుడు ఐహిక జీవితంపై ఆశలు వదలుకొన్న విరక్తుల వలె ఉంటారు. కానీ నిద్రనుంచి మేల్కొనగానే సంసార లంపటాల్ని మెడకు చుట్టుకొంటారు. ఇలాంటి మానవ మనస్తత్వాల్ని భగవంతుడే అనుగ్రహించి జ్ఞాన మార్గం వైపు మరల్చాలని తెలిపాడు.

కలకాల మిట్లాయ గాఁపుర మెల్లా
అలదైవ మెందున్నాఁడో అలకించ డుగా ॥

తనకే సంతసమైతే తన భాగ్యము వొగడు
తనకు జింతపుటితే దైవము దూరు
మనుజుని గుణమెల్లా మాపుదాఁకానిట్లాని
ఘనదైవ మెందున్నాఁడో కరుణఁ జూడడుగా॥ (3-77)

లోకంలో కొందరికి ఎంత జ్ఞాన బోధచేసినా వినరు. తమ బుద్ధి గతంగానే ప్రవర్తించి పతనమవుతుంటారు. అన్నమయ్య తన కాలంలో ఇలాంటి వ్యక్తుల్ని ఎందరినో చూసి ఉంటాడు. అందుకే తమ కర్మకు తమ కీడుకు ఎవరేమి చేయగలరు. ఇలాంటి వారికి బ్రహ్మానందం దొరకదని, వీరంతా బుద్ధి గలిగి దైవాన్ని ప్రార్థించే దెప్పుడు అని ప్రజల మనస్తత్వం పట్ల ఆవేదన వ్యక్తంచేశాడు.

లేదు బ్రహ్మ విద్యా మహా సుఖము తమ
కీడు తమ కర్మమేమి సేయ గవచ్చు ॥

నానా విధుల బొరలి నరుఁడు దానై వివిధ
మైన కర్మములే అనుభవించి
లేని లంపటములకు లోనై దురితా
దీనులై భ్రమ్మర దిరిగి పోవు టే కాని ॥ (1-254)

సాధారణంగా మానవ స్వభావం చపల మయింది. ఎప్పుడూ ఏ ఇద్దరి మధ్యా స్థిర సంబంధం ఉండదు. కాలాన్ని బట్టి, వయసును బట్టి, అవసరాన్ని బట్టి మనసు, అభిరుచులు మారుతుంటాయి. చివరికి ఎవరూ మిగలరు. మొదట మనిషికి సోదరులపై మమకారం ఉంటుంది. ఆ తర్వాత కొడుకులు పుట్టగానే సోదరులపై ప్రేమ తగ్గి

పోతుంది. అలాగే మొదట తల్లిమీద ప్రీతి ఉంటుంది ఆపైన అర్ధాంగి రాగానే తల్లిపై శ్రద్ధ తగ్గుతుంది. సంసారమాయలో పడకముందు మనిషి భగవంతునిపై భక్తి ప్రపత్తులు కలిగి ఉంటాడు. సంసార వలయంలో చిక్కుకొన్నాక భక్తి తగ్గిపోతుంది. అయినా ఇల్లు ముంగిలి ఒక్కరికి దాని ఉపయోగం మరొకరిది, చేతులొక దానిమీద మనసు మరోవానిమీద అనే సామెతల రీతిగా కాకుండా వారూ వీరూ అనే తేడాలేకుండా అందరి పట్లా సమతా భావంతో భగవంతుని పట్ల ఎల్లప్పుడూ భక్తికలిగి ఉండాలని అన్నమయ్య మానవ మనస్తత్త్వాన్ని ఆ మనస్తత్త్వాన్ని చక్కబెట్టుకోవలసిన అవసరాన్ని దాని మార్గాన్ని సూచించాడు.

ఇద్దరు దేహసమ్మంధ మిదివో మాయ
గద్దించి యాడవుఁడునో కడసారితాను ॥

తోఁడబుట్టిన మమత తొడఁగికొన్నాళ్లకు
వాడికె పుత్రుల మీఁద వలె నుండదు
పేడుక వారెవ్వరో వీరెవ్వరో కాని
కూడ పెట్టీ వీరికే కొట్లాడీ వారికే ॥ (2-92)

మానవులందరూ భౌతికంగా ఒకటే అయినా వారి మనస్తత్త్వాలు, ఆలోచనలు, విమర్శ ధోరణులు, గుణాలు, అభిరుచులు వేరు వేరుగా ఉంటాయి. ఇవి అన్నీ దైవ కల్పితాలే అనవచ్చు. ఇందులో వదలుకోగల్గినవి వదలుకో లేనివి ఏవో తెలియడం లేదు. ఒకరు వలచినట్లు మరొకరు వలచడం లేదు. ఒకరి చేష్టను మరొకరు ఇష్టపడటం లేదు. పేదవాని మాట భాగ్యవంతునికి నచ్చడం లేదు. ఇలా మానవ చర్యలు నానా విధాలుగా ఉన్నాయని, అన్నం ఒకటె అయినా తృప్తి చెందడమే వేరుగా ఉందని, శ్రీ వేంకటేశ్వరుడు ఒక్కడే

అయినా లోకాలే వేరని అన్నమయ్య లోక మనస్తత్వాన్ని విశ్వ సత్యాన్ని తెలియజేశాడు.

ఏనట్టయినా గాక హరి కల్పితములివి
మానేటి కేటికో మాననివేవో ॥

ఒక్కరు తలంచినట్టు వొకరి తలఁపు రాదు
ప్రక్కన నందరికి బహు భావాలు
అక్కడ మొదలొకటి అనలు గొనలు వేరు
యెక్కడని తగిలేది యేమి సేసేది ॥

పొరుగు వాని చేత ఆపొరుగు వాఁడు మెచ్చడు
నరుల కర్మములు నానా విధాలు (2-24)

భగవంతుని మాయకు లోబడిన మానవుడు హెచ్చు తగ్గులను నిజానిజాలనుగూర్చి ఆలోచించడు. పుట్టిన మానవులందరూ ఎప్పుడో ఒకప్పుడు చనిపోవడం చూస్తున్నా మళ్ళీ ఈ దేహ సంబంధాలకే మనసుపెట్టి పాకులాడుతాడని మానవ నైజాన్ని చిత్రీకరించాడు.

"అక్కటా నీమాయ కగపడి జీవుఁడు
యెక్కువ తక్కువలివి యేమిఁ దలపోయఁడు ॥

అప్పుడే దేహ సమ్మంధ పాలికే మనసుపెట్టు
తప్పి పోయిన వారల దలఁచఁడు ॥ (3-206)

లోకులు కళ్ళారా చూస్తూనే గుడ్డి వాళ్ళుగా, చెవులారా వింటూనే చెవిటి వాళ్ళుగా ప్రవర్తిస్తుంటారు. లోకం ఈ విధంగానే నడుస్తోంది. ఒకరోజులోనే సూర్యోదయ సూర్యాస్తమయాలు జరుగుతున్నాయి. ఈ విధంగానే ప్రతి జీవికి చావు పుట్టుకలు ఉంటా

యని మానవులు గమనించక తమ బ్రతుకులు శాశ్వతమని భ్రమి స్తున్నారు. కళ్ళు తెరచుకుంటే వెలుగు కళ్ళు మూసుకుంటే చీకటి. ఈ విధంగా చీకటి వెలుగులు కనుగొనలలోనే ఉన్నాయి కలలోని విషయం అసత్యం. ఈ సంసారం కూడా ఒక కలలాంటి విషయమే అయినా మనుషులు శ్రీ వేంకటేశ్వరుని మహిమల ఘనతను తెలుసు కోలేక పోతున్నారని అన్నమయ్య ఇలా మానవ మనస్తత్వాన్ని తెలియజేశాడు.

కనిగుడ్డును నదె విని చెవుడునునిదె
ననిచి జగత్తు నడచీనదివో ॥

వుదయాస్త మయము లోకదినమున నే
యెదుటనే వున్నవి యెంచినను
యిదివో జీవులు యెంచక తమ తమ
బ్రతుకులు సతమని భ్రమసెదరు ॥ (౩-185)

అన్నమయ్య సంకీర్తనలు ప్రజలందరికీ సులభంగా అర్థమయ్యే రీతిలో సాగాయి. ఇందులో మానవ మనస్తత్వానికి సంబంధించిన సంకీర్తనలు వ్యక్తిగతంగా, కుటుంబ పరంగా సామాజికంగా అన్న మయ్య పరిశీలనా దృష్టికి నిదర్శనాలు. భగవత్పరంగా ప్రవర్తిస్తే మానవ మనస్తత్వాల్ని అన్నమయ్య మనస్తత్వ వేత్తలా నిపుణంగా విశ్లేషించాడు.

నివేదనా నీరాజనం
బోధనైకాదశి వార్షికోత్సవ సంచిక
10-9-1995
ఆధ్యాత్మిక సంఘం
భీమవరం.

# అమ్మవారి పక్షాన అన్నమయ్య చమత్కృతి

నేడు ప్రపంచ వ్యాప్తంగా స్త్రీవాదం ఉద్యమరూపం దాల్చుతోంది. స్త్రీకూడా మనిషేనని, ఆమెకూ మనసు ఉంటుందని, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సర్వహక్కులు పురుషుడితోపాటు స్త్రీకి కూడా సమానంగా వర్తించాలని. కుటుంబంలోను స్త్రీకి ప్రాధాన్యం ఇవ్వాలని ఈ స్త్రీవాదం ముఖ్యోద్దేశం. ఆధునిక కాలంలో సంఘ సంస్కర్తలైన కందుకూరి, గురజాడ, చిలకమర్తి మొదలైనవారు మానవతా దృష్టితో మహిళాభ్యుదయం కోసం పోరాడారు. వీరందరి కన్నా ముందే పదిహేనవశతాబ్దంలోనే తాళ్ళపాక అన్నమయ్య తన శృంగార కీర్తనలలో స్త్రీవాద దృక్పథాన్ని పొందుపరచడం మనం గమనించవలసిన విషయం. అన్నమయ్య భార్యాద్వయానికి భర్త అయినా వారిపై పురుషాధిక్య అహంకృతి ప్రదర్శించక సానుకూలంగా ప్రవర్తించి వుంటాడు. అందుకే అంత నిజాయితీగా తన శృంగార సంకీర్తనలలో కూడా నాయిక అయిన అలమేల్మంగమ్మవారి పక్షం వహించి నాయకుడైన శ్రీనివాస అయ్యంగారికి హితబోధ చేస్తున్నాడు.

దేవుడు తన దేవేరిపై అలిగివున్నాడు, తప్పు ఎవరిదో అన్నమయ్య గ్రహించాడు. అందుకే తాను అమ్మవారి పక్షం వహించి అయ్యవారిదగ్గరకు రాయబారం వెళ్ళి అమ్మవారి గొప్పతనం గుర్తు చేస్తున్నాడు. నీకు ఆమె దొరకడం నీ అదృష్టం. ఆమెను ఇప్పుడే స్వీకరించి కాపురం చెయ్యి ఆమె నీతో మాట్లాడితే తేనెలు కారుతుంది. నవ్వితే అధరాంచలాలో వెన్నెల కాస్తుంది. పైకొని ఒరసితే

బంకారు పొడిరాలుతుంది. అలాంటి ఆమెను పూనుకొని వక్షస్థలంపై మోయడ ఔచిత్యవంతం. ఆమె మోహించిచూస్తే తామర రేకులు కప్పినట్లుంటుంది, ఒళ్లు చెమరిస్తే ముత్యాల దండలవలె ఉంటుంది. నీ సమక్షంలో నిలిస్తే యవ్వనం అతిశయిస్తుంది. అలాంటి ఆమెను పేరు నీ పేరుకన్నా ముందే ఉండదగింది ఆమెను ఇప్పుడే కౌగిలించుకొంటే ఇల్లంతా సంపదతో నిండిపోతుంది. ఆమెతో కాపురం చేస్తే నవరత్నాలు అధికమవుతాయి. అలాంటి ఆమెతో నీవు ఇల్లరికం చేయవలసిన వాడవు అని అన్నమయ్య తనకు సర్వస్వం అయిన దేవదేవోత్తమునికి—

నీకు నాపెగలుగట నీ భాగ్యమే
చేకొని కాఁపుర మెట్టిసేయ గదరయ్యా ॥

మగువనీతో నాడితే మాటల దేనెలుగారీ
నగితే సెలవుల వెన్నెల వెల్లీని
పగటున బొలసితే మంగారు పొండి చిందీని
మొగి నాపె నురమున మోవ దగునయ్యా ॥(30-226)

అనే సంకీర్తనలో చెలికాడుగా సలహా ఇవ్వడం గుర్తించవలసిన విషయం. అలాగే మరొకచోట నాయకుడు నాయికమ కోపంతో అరస్తుంటే అన్నమయ్య నాయకునితో-ఆమె ముందే నీకు మొక్కి-వేడుకొన్నది. ఇప్పుడెందుకు ఆమెతో పంతాలాడి అరుస్తున్నావు? సరిసమానంగా కలసి ఉండేచోట ఆడవాళ్ళైనా ఏమైనా అంటారు. పెనగులాడేటప్పుడు వాళ్ళుకూడా బిగుసుకుంటారు. పనులు చేసేటప్పుడు వాళ్ళపాదాలు నీచేతికి తగలవచ్చు అంతమాత్రానికే ఆడవాళ్ళను తప్పుపట్టకూడదు వదలకుండా చూస్తే ప్రేమ అతిశయిస్తుంది. నవ్వకూడలేలా నవ్వితే కొప్పు వీడుతుంది. కర్పూరం దుచి చూసేటప్పుడు

ఎంగిలి అంటుకుంటుంది అంతమాత్రానికి స్త్రీలను దూరం చేసుకో వడం న్యాయం కాదు వేడుక మాటలాడితే ఒక్కోసారి వ్యంగ్యా లుగా అనిపిస్తుంది కలిసే పానుపుపై సిగ్గులు చూపవచ్చు అంత మాత్రానికే ఇంకెప్పుడూ సతిని శ్రమపెట్టవద్దు అని బుద్ధులు గరప డం కనిపిస్తుంది.

వెనక నీకు మొక్కే వేడు కొని గాని చెలి
మునుప బాతములాడి మొఱయకువయ్యా ॥

యెనసివుండినచోట నేమాశైనా నాడుదురు
పెనగులాడే వేళ బిగుతురు
పనులు సేయగాను పాదములు చేయినో కు
వనితల నెగ్గు పట్టవలదయ్యా నీవు ॥ (30-239)

లోకంలో భార్యాభర్తల మధ్య లేక ప్రియసీ ప్రియులమధ్య, స్త్రీపురుషుల మధ్య అభిప్రాయ భేదాలువచ్చినా, సంఘర్షణవచ్చినా, సహజంగా అందరూ స్త్రీకే నీతిబోధ చేస్తారు. కానీ సమానత్వం, న్యాయం పాటించి పురుషునికి బోధించడానికి ఎందుకో వెనకాడు తారు. కానీ అన్నమయ్య మాత్రం ఆనాడే పురుషునికి నీతిబోధ చేశాడు. ఆయనసమానవతావాది. ఆయనదృష్టిలో స్త్రీపురుషులిద్దరూ సమానులే. ఆయనకు ఎవరి ఆదరణ ఎవరి గౌరవాలు అక్కర లేదు. ఎవరివల్ల భయభ్రాంతులు లేవు. ఆయన సత్యసంధుడు. అందుకే ఆయన న్యాయం, ధర్మం సమానత్వం పాటించాడు. భగవంతుడు సర్వజ్ఞుడు. ఆయనకు తనదేవేరిని ఎలా చూసుకోవాలో బాగా తెలుసు ఆయన ఇల్లరికపుటల్లుడు అన్నమయ్య పరమభక్తుడు, ఆయన శ్రీనివాసునికి బుద్ధులు నేర్పడమేమిటి? ఇవి మనకోసం చెప్పినవి. అన్నమయ్య తనకాలంలో పురుషులు స్త్రీలపట్ల చూపు

తున్న అసమానతలను, అన్యాయాన్ని బాగా గమనించి వాటిని తొలగించడం కోసం, స్త్రీలకు గౌరవ మర్యాదలివ్వడం కోసం అమ్మ వారికి ఆధిక్యం కలిగిస్తూ, అయ్యవారికి నీతులు బోధించాడు. వాటిని మనం సమన్వయించుకోవాలి, ఆచరించాలి, నేడు ఎక్కడ చూచినా స్త్రీల మానభంగాలూ, వరకట్న బలులు, కిరోసిన్‌తో కాల్చివేతలు, వంచనలూ, నయవంచనలు, హింసలు నిలయతాండవం చేస్తూ స్త్రీ ఉనికికే భద్రత లేకుండాపోతోంది. డబ్బుకే పట్టాభిషేకం చేస్తున్నారు కానీ స్త్రీ సౌశీల్యానికి, ప్రేమకు విలువనివ్వడం లేదు. క్రోధమే తప్ప కారుణ్యం కనబడటంలేదు. ఇలాంటి దుస్థితి ప్రబలిన ఈ రోజుల్లో అన్నమయ్య సంకీర్తనలు భక్తి, సంగీతాల పారవశ్యానికే గాక నడవడికి కూడా అత్యంత ఆవశ్యకం. స్త్రీ గుణగణాలకు, స్త్రీ స్వేచ్ఛకు అత్యంత ప్రాధాన్యమిచ్చిన అన్నమయ్య మానవ జాతి ఉన్నంతవరకు పురుషులకు ఆదర్శపురుషుడే. స్త్రీలకు ఆరాధ్యనీయుడే.

కోస్తావాణి
5-4-1993.



# అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో పురుష ధర్మాలు

తిరుమల తిరుపతిదేవస్థానం వారి మహాదాశయంవల్ల తొలి తెలుగు సంకీర్తనాచార్యుడైన అన్నమయ్య ఘనత ఒక్క ప్రాంతానికే కాక దేశదేశాలకు, ఖండఖండాంతరాలకు వ్యాపిస్తూంది. విశ్వవిభుడైన శ్రీవేంకటనాథుని దీప్తి దశదిశలా మహోజ్జ్వలంగా ప్రసరిస్తూంది. ఇంకా సాహిత్య కళాసంస్థలు, విద్యాలయాలు సంగీత సాహిత్య అభినయ కార్యక్రమాలద్వారా, విద్యాబోధన, పరిశోధనల ద్వారా అన్నమయ్య సంకీర్తనలను ప్రచారం చేస్తున్నాయి. స్వామి కార్యమే స్వకార్యంగా భావించుకొని అన్నమయ్య సంకీర్తనారాధన చేస్తున్న సంస్థలు ప్రశంసనీయమైనవి. వివిధరకాలైన దిన, వార, పక్షమాసపత్రికలు అన్నమయ్య సంకీర్తనా సాహిత్యాన్ని ప్రజలకు చేరువ చేయవలసిన అవసరం ఎంతైనావుంది. అన్నమయ్య సంకీర్తనా వాఙ్మయం అనేక దివ్యప్రపంచం. ఆ ప్రపంచంలో విహరించగలగడం మహాభాగ్యం.

అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో శ్రీవేంకటేశ్వరుని అవతార మహిమలు, భక్తిజ్ఞాన వైరాగ్య నీతిబోధలు, తాత్త్విక సామాజిక సంగీత నృత్య శాస్త్రాంశాలు మొదలైనవాటిని అనేకరకాల గేయరీతుల్లో రచించాడు. శృంగార సంకీర్తనలలో దివ్యదంపతులైన పద్మావతీ శ్రీనివాసుల్ని నాయికానాయకులుగాచేసి వారిప్రణయం, విరహం, సఖీజనహితవచనం, మధుర భక్తితత్త్వం, వాత్సల్యం మొదలైన అంశాల్ని పండితపామర జనరంజకంగా వర్ణించి చమత్కరించాడు. నాయిక పాత్రలోను, చెలికత్తె పాత్రలోను అన్నమయ్య

అంతర్లీనంగా వుంటాడు. కొన్ని సంకీర్తనలలో తానే నాయికగా, చెలికత్తెగా, వ్యవహరిస్తున్నట్లు స్ఫురిస్తుంది. మధురభక్తి తత్వంలో కవి లేక భక్తుడే తనను స్త్రీగా భావించుకొని పరమపురుషుడైన పరమాత్మకోసం తపనపడుతాడు, రాధ, గోపికలు, గోదాదేవి, మొల్ల, మీరా, తరిగొండ వెంకమాంబ మొదలైన భక్తురాండ్రు ఈ విధమైన భక్తిమార్గంలో పయనించి, ఆరాధించి స్వామి పాదారవిందాలను చేరుకున్నారు.

దైవసంకల్పం వల్ల ఆవిర్భవించిన మానవులు తమ భక్తి కొలది, శక్తికొలది తమకున్న వస్తువుల్ని, పదార్థాల్ని దైవానికి సమర్పించి దాన్ని ప్రసాదంగా కన్నులకు అద్దుకొని స్వీకరిస్తారు. అలాగే అన్నమయ్య మానవ సహజ ప్రవర్తనను, మనస్తత్వాన్ని ప్రేయసీ ప్రియధర్మాలను అలమేల్మంగా శ్రీవేంకటేశ్వరులకు ఆపాదించి తద్వారా ఇహలోక దంపతులకు, స్త్రీ పురుషులకు నీతిబోధ చేశాడు.

నాయిక నాయకునిమీద అలిగినప్పుడు చెలికత్తె ప్రవేశించి

"మానవే మానవే నీ మంకుతనము
మానరాని విభునితో మరి మేటి చలము'

అని అధిక్షేపిస్తుంది.

అలాగే నాయకుని చేష్టల్ని బయటపెట్టినప్పుడు "గుట్టుతో నుండుటే మేలు గుణవంతురాలికి" అని సౌమ్యంగా హెచ్చరిస్తుంది. ఈ విధంగా చెలికత్తె నాయికకు నీతిబోధచేసినట్టే నాయకునికి కూడా నీతి గరపడం కనిపిస్తుంది.

పురుషాధిక్య సమాజంలో సాధారణంగా లోకులు పురుషునిలో ఎన్ని దోషాలున్నా అతనికి బుద్ధులు చెప్పరు దోషాలు లేకపోయినా స్త్రీలకే అందరూ నీతులు చెప్పి సహించుకోవాలని ఉచిత సలహాలిస్తుంటారు. కానీ న్యాయవేత్త, సత్యవాది, మానవతావాది అయిన అన్నమయ్య పదిహేనవ శతాబ్దంలోనే స్త్రీకి పురుషునితో పాటు సమానత్వం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు కాంక్షించి—

"పొలంతు జీవులే పురుషులు జీవులే"

అనే సంకీర్తనలో స్త్రీ కూడా మనిషేనని, ఆమెను పరతంత్రగా చేయడం హీనమని, ఆమెకూ వ్యక్తిత్వం అవసరమని లోకానికి ఎలుగెత్తి చాటాడు. అన్నమయ్య వనితాభ్యుదయాభిలాషి. అందుకే అతని భార్య తాళ్ళపాక తిమ్మక్క తొలి తెలుగు కవయిత్రి కాగల్గింది. "అవనితో తాళ్ళపా కన్నయ్యగారి తరుణి తిమ్మక్క చెప్పె, సుభద్రా కల్యాణ మను పాట కడుమంచి తేట" అని ఆ విదుషీమణి పేర్కొనడంలో ఆ రచన వెనుక అన్నమయ్య సహకార ప్రోత్సాహాలు వ్యక్తమవుతాయి. లోకంలో వనితలందరు ప్రగతిపథంలో నడిచి, సుఖశాంతులతో, భక్తి ప్రపత్తులతో విరాజిల్లాలని అన్నమయ్య తపించాడు. కాబట్టి అన్నమయ్య తన శృంగార సంకీర్తనలలో నాయకుడు నాయికతో కలహించినప్పుడు, ఏదైనా తప్పిదం చేసినప్పుడు నాయికద్వారా గానీ లేక చెలికత్తె ద్వారా గానీ ధార్మిక ప్రబోధం చేయిస్తాడు.

శ్రీ వేంకటేశ్వరుడు శృంగారనాయకుడు. అనేక నాయికలను కలిగినవాడు. అందరి దగ్గరకు వెళ్ళి అర్ధరాత్రి వేళకు ఒక నాయిక యింటికి వెళ్ళినప్పుడు ఆమె అతనితో నిష్ఠూరంగా - నీకు, మాకు ఇంక సంబంధం ఎందుకు? అర్ధరాత్రిదాకా అక్కడ ఇక్కడ వుండి వచ్చావు. నీకు ఇంతగా ఇష్టం వుండీ లేని విధంగా వుంటే వద్దుపోరా!

కంటికి నిద్రలేకుండా నీకోసం వుండగలమా? విరహతాపం అధికమై సహించలేక వేడిపుట్టి కళ్ళు కనిపించక తిరుగుతున్నావు నీకు కోరికలు తీరడానికి చాలామందివున్నారు. అంగగాఢమైన శ్రీవేంకటేశా! అనేక గృహాలకు అతిథి వయ్యావు ఒక స్త్రీపై నీకు ప్రేమ వుందా! బాధ కలిగి చనువుతో మాటలాడాము గానీ ఈ మాత్రం గౌరవం ఎప్పుడూ ఉంటే చాలు అని సౌమ్యంగా అతని బహునాయికా సరసాలను ఎత్తి చూపుతూ, తన అవ్యాజ ప్రేమను కూడా వ్యక్తం చేయడం తెలుస్తుంది.

ఏవూరి కేవూరు యెక్కడికి నెక్కడ
నీవు మాకు నింకడేల నిజమైనాఁ జెప్పరా ॥

అర్ధమరాతిరిదాఁకా నందు నిందు నుండివచ్చి
వద్దువోరా నీకు నింత వలసి నొల్లములు
నిద్దుర గంటికి లేక నీకు నుండవారమా
వొద్దిక చాలని వారమున్నండి నానుండితిమి ॥ (12-1)

ఈ సంకీర్తనలో నాయిక లేక ప్రేయసి పలికిన 'నిజమైన చెప్పరా, వొద్దువోరా' వంటి ఆక్షేపాత్మక పదప్రయోగాలను గమనిస్తే స్త్రీకి పురుషుని నిలదీసి అడగడానికి, నీతి బోధించడానికి అన్నమయ్య ఒసగిన అధికారం, చనువు, స్వాతంత్ర్యం వ్యక్తమవుతుంది. అన్నమయ్య భావస్పష్టతకోసం 'ఏవూరి కేవూరు యెక్కడికి నెక్కడ' అనే సామెతను ప్రయోగించాడు.

మానవంతుడైన ఏమగవాడైనా తన ఇల్లాలు పరపురుష సాంగత్యం చేస్తే ఓర్చుకోడు. అలాగే మానవతి అయిన ఏ స్త్రీ అయినా తన భర్త పరస్త్రీ సాంగత్యం చేస్తే వూరుకోదు. అతని

లోని ఈ గుణాన్ని నిలదీసి నిందిస్తుంది. అలాగే అన్నమయ్య సంకీర్తనలలో కూడా దక్షిణ నాయకుడైన తన ప్రియుడు అనేక స్త్రీలతో సరసాలాడుతూ తనను సమీపించడానికి వచ్చినప్పుడు అతనికి నీతిబోధ చేస్తూ - ఛీ ! నీకు జ్ఞానంలేదు· నేర్పరిని అంటావు. బాంఢలిలో జాజిపువ్వుల్ని పలుమార్లు వేయిస్తున్నావు. ఒక జవరాలు నీకు తాంబూలం మడిచి ఇస్తుంటే, నీవు బంగారు తూగు మంచంపై వుంటూ, వుంగరాల వేళ్ళతో ఆమె మొలత్రాటి సమీపంలో చాచిన ఆ చేతితో నన్ను తాకుతున్నావు. ఒక వనిత నీకు పాదాలు ఒత్తుతుంటే కర్పూర పాన్పుపై నీవు వుంటూ మిక్కిలి మోహంతో నీవు ఎక్కడో మోపాలనుకున్న పాదాల్ని నాపై విసరచాచు తున్నావు. ప్రేమతో ఒక స్త్రీ తన వక్షస్థలాన్ని ప్రత్యక్షంగా చూపిస్తుంటే పచ్చరత్నాలు పొదిగిన మేడపై నీవు వుండి, నెచ్చని నీ శరీరంతో నన్ను కలసి, కౌగిటిలో నన్ను అలసట పెట్టావు అవి పరస్త్రీ సంగమం చేస్తున్నందుకు ఛీకొట్టి బుద్ధిగరపడం కనిపిస్తుంది.

**ఆహిరి**

సంగతెఱుగవు ఛీ జాణవందువు
మంగలాన జాజులు వేమారు వేచేవు ॥

అంగన వొకతె నీకు ఆకుమడిచియ్యఁగా
బంగారు తూఁగు మంచముపై నీవుండి
వుంగరాల వేళ్ళతో నువిద మొలనూళ్ళ
చెంగటఁ జాచిన అ చేత నన్నంటేవు ॥ (12-4)

అన్నమయ్య సంకీర్తనల్లో నాయికానాయకుల విరహం, అలుక వర్ణించబడిన సంకీర్తనలలో కూడా చివర్లో నాయికా నాయకుల

సమైక్యత కనిపిస్తుంది. దీనివల్ల జీవాత్మ పరమాత్మతో సంయోగం చెందవలసిన అవసరం వుందని, జీవాత్మ పరమాత్మతో కలసినప్పుడే చిత్తశాంతి పొందుతుందనే సత్యం గోచరిస్తుంది. అన్నమయ్య నాయికగా, తన ప్రియనాయకుడైన శ్రీవేంకటేశ్వరుని విరహాన్ని తాళలేక సంకీర్తనల్ని ఇలా సంయోగాంతంగా ముగిస్తుంటాడని కూడా చెప్పవచ్చు. ఈ సంకీర్తనలో నాయిక మానసక్లేశాన్ని వ్యక్తంచేయడానికి అర్థస్ఫూర్తికోసం "మంగలాన జాజులు వేమారు వేచేవు" అనే సామెతను అన్నమయ్య ప్రయోగించాడు. ఉవిద మర్మస్థానం అని సూటిగా చెప్పకుండా "ఉవిద మొలనూళ్ళ చెంగట" అని ధ్వన్యాత్మకంగా చెప్పడం అన్నమయ్య వాచక సౌకుమార్యం వ్యక్తమవుంది.

ప్రియునిపై అనేక కారణాలవల్ల కోపోద్రిక్తురాలైన ఒక అభిమానవతి విజృంభించి అతనితో - ఇంతగా మమ్మల్ని ఇలా సమీపించవద్దురా - ఓరీ ! నీ పంతాలన్నింటిని వెలికితీస్తాను. అహంకారంగా మాట్లాడవద్దురా ! ఓరీ ! ఏకాంతంగా వున్న నావల్ల నీవు మిక్కిలి నొచ్చుకుంటావు. ఇతరుల లాగా నను లెక్కించవద్దురా ! ఓరీ ! నీ బుద్ధిలో ప్రవేశించి నీ తనువును మరపిస్తాను. మితిమీరి అతిశయాలు చేయవద్దురా ! ఓరీ ! ఈ వాడిగోళ్ళతో నిన్ను అతిక్రమిస్తాను. బెదరింపు చూపులతో వైరాన్ని చాటవద్దురా ! ఓరీ ! ఎంతైనా నేను నిన్నింక పోనివ్వను. ఇతరుల స్నేహ సంబంధాల్ని తలచవద్దురా ! ఓరీ ! శ్రీవేంకటేశ ! నా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తాను, అంటూ అతను ఏమేమి చేయకూడదో ఆక్షేపిస్తూ, ఒకవేళ ఆపనులుచేస్తే తాను ఏయే చేష్టలు చేస్తుందో ధీరంగా వ్యక్తం చేయడం, మాటి మాటికీ 'రా, ఓరీ ! అనే కోపస్థితిలోని సంబోధనలతో పిలిచి నిలదీస్తుంది.

ఆహిరి

ఇంత మమ్మిట్లా నలయించకురా నీ
పంతములన్నియుఁ బారఁ బట్టింతునోరి ॥

అతిరాజసపు మాటలాడకురా యే
కతమైన నాచేతఁ గడు నొత్తువోరి
ఇతరులవలె నన్ను నెంచకురా నీ
మతి చొచ్చి నీమేను మఱపింతునోరి ॥ (12-10)

నాయకునిపై వున్న పరస్త్రీ సంగము గుర్తుల్ని చూసి నాయిక అతన్ని నిరసిస్తూ— తగినదంటూ వచ్చి విజృంభిస్తున్నావు. ముందు నుంచీ ఈ విధంగా ఎంతమందితో పెనగులాడేవో! అపలేని మోహంతో ఆశపడుతున్నాను గానీ ఇంతసేపు మాట్లాడటమెందుకురా? దాచుకోవడానికి వీలులేని మన్మథ ముద్రలు నీ శరీరంపై భ్రాంతితో ఎవ్వతె చేసినవో! మనసు వుండలేక నీ వద్దనే ఉసురుకుంటున్నాను కానీ ఇంతగా బాధ కలిగిస్తే ఈ ప్రాణమెందుకు రా! వుండు అన్యోన్యలాగా నా చిత్తాన్ని దుఃఖింపజేశావు నీవు నా సమీపంలో వుంటూనే ఎవ్వతెకు అమ్ముడు పోయావో! తృప్తితీరక నేను ఇంతగా దగ్గరకు రానిచ్చాను కానీ చనువుతో నిన్ను చేయి చాచనిస్తానా! గొప్పవాడవైన శ్రీ వేంకటేశ్వరా! మంచి వాసన కల్గిన ఈ పువ్వులు ముందు ఎవ్వతె నీపై ముడిచిందో అని తన బాధను, ప్రేమను వ్యక్తం చేస్తూనే నీతి బోధిస్తుంది.

చెల్లునంటూ వచ్చివచ్చి చెట్టవట్టేవు
తొల్లియు నెందరి నిట్టే దొమ్ములఁ బెట్టితివో ॥

ఆఁప రాని తమకాన నాసచేసీఁగాక యింత
మాఁపు దాఁకా నీతోడి మాటలేలరా
దాఁపరాని మదనముద్రలు మేననవె నీకు
నేఁపుచు భ్రమఁబెట్టి యెవ్వతె సేసినవో ॥ (12-229)

కొంతమంది పురుషులు తమ భార్యల వస్త్రాల్ని, నగల్ని తీసుకొనిపోయి పరస్త్రీల కిచ్చి వారిని సంతోషపెట్టుతూ ఆనందిస్తుంటారు. కొంతమంది స్త్రీలకు ఇలాంటి విషయాల్లో ప్రశ్నించే ధైర్యం, హక్కు లేకపోయినా మనసులోనే బాధపడుతుంటారు. కొంతమంది నిలదీసి ప్రశ్నిస్తుంటారు. అన్నమయ్య సంకీర్తనల్లో ఇలాంటి సన్నివేశాలు కూడా కనిపిస్తాయి. తన వస్తువుల్ని తీసుకెళ్ళి పరస్త్రీకి ఇచ్చిన భర్తను రోషం వున్న ఒక భార్య — ఇంక మాటిమాటికి నీకు చెప్పలేము, నీవు దాటితప్పి తిరుగుతున్నావు. ఇది నీకు న్యాయమేనా? ఓరీ! ఎంతో ప్రేమించిన కాడిఖాగా నాకొప్పులోని సవరాన్ని తీసుకొనిపోయి అప్పుడే ఒక్కతెకు ఇచ్చావు. ఓరీ! ఇదంతా నాతప్పు గానీ నీతప్పుకాదు. తుదలేని మోహం వున్నవాడిలాగ నా చీరను ఎవ్వతెకో ఇవ్వాలనుకొని నీవు వెనక చెక్కుకొని వేగంగా వెళ్లుతున్నావు ఓరీ! నన్ను ఇంత తొందర చేసి ఇలా చెయ్యాలా! ఓరీ! నా వ్రేలిలో వున్న నాకు ఇష్టమైన వుంగరాన్ని నీవు గొప్పగా తీసుకొనిపోయావు. ఒరీ! శ్రీవేంకటేశ! నీగుణాల్ని చక్కదిద్దలేము. నాకు అనుకూలంగావుంటూ నన్ను వదలకుండా వుండరా! అని రా, ఓరీ! అనే సంబోధనలతో తనప్రేమను, అధికారాన్ని వ్యక్తంచేస్తూ అతనిలోగల పరస్త్రీ వ్యామోహాన్ని ఖండిస్తుంది.

సారె సారె విన్నవించఁ జాలమిఁక నీవు
దారిదప్పఁ దిరిగేవు తగవా వోరి ॥

చెప్పరాదు కడు వలచిన వానివలె నా
కొప్పులోని సవరము కొంటఁ బోయి
అప్పుడే వొక్కటికిచ్చితటవోరి నా
తప్పుగాని నీవల్లఁ దప్పులేదువోరి ॥ (12-168)

సాధారణంగా ఎదుటిమనిషివల్ల తనకు బాధ అధికమైనప్పుడు "ఇదంతా నా తప్పేకానీ నీతప్పేమీ కాదని అంటూ ఊరట చెంద షం బాధలకు గురి అయిన మానవుల్లో కనిపిస్తునిది. ఇలాంటి మానవ సహజ స్వభావాల్ని, మాటలతీరును అన్నమయ్య సరళసుందరంగా చిత్రించాడు.

నాయకుడు మితిమీరి తన ఇష్టం వచ్చినట్లు తన శరీరంపై శృంగార చేష్టలు చేస్తున్నందులకు నాయిక నాయకుని అధిక్షేపిస్తూ- నీవు విజృంభించి నన్ను కూరాకులా నుగ్గు నుగ్గు చేస్తున్నావు. నేను నీ తలమీద వుండేస్త్రీని (నిమ్న అడుపులో వుంచుకొన్న స్త్రీని అని అర్థం కావచ్చు). నా శరీరాన్ని పెక్కుసార్లు పిసుకవద్దు. కందిపో తుంది. దీన్ని ఇంతగా సహించగల్గిన వనితను కాను. పలుమార్లు నలుప వద్దు. నా చెక్కు నొప్పిగా వుంది. నేను ముఖాన్ని నొక్కే స్త్రీని కాను. నిన్ను నిద్రపుచ్చినవారు అడుగడుగునా భూమిలో ఎంతమంది లేరు! నేనెవ్వతిని! అక్కడ ఇక్కడ నన్ను అదుముతూ నన్ను కౌగిట వేడిలో కందింపజేయవద్దు. లక్ష్మీనాథుడవైన శ్రీవేంకటేశా! నీ రతి క్రీడా పొందు నా మైమరపులకు స్థానమయింది. అని నీతులు చెప్తూ తూనే, అతని పొందువల్ల కలిగే పరమానందాన్ని వ్యక్తం చేయడం ః ః స్తుంది.

చెఁగి కూరాకుగాఁ జేసేవునీ
తల మీఁదనుండే తరుణిఁబో నేను ॥

పిసుకకు పలుమారు పసురువేసీనంత
వసివాడు కోర్చిన వనితఁ గాను
పసరేఁచి నీవింత పాలించు తొల్లిటి
నిసువయిన నీపెట్టుఁ జెట్టఁబోనేను ॥ (12-194)

నేటి ఆధునిక కాలంలో సంఘసంస్కర్తలుగావించిన సాంఘిక విప్లవాలవల్ల స్త్రీలు పురుషులతో సమానంగా చదువుకుంటున్నారు. అన్నిరంగాలలోనూ వుద్యోగాలు చేస్తున్నారు. అత్యంత వైభవంగా అభ్యుదయాన్ని సాధిస్తున్నారు. అయినా ఈ చైతన్యం, ఈఉజ్జీవనం అందరు స్త్రీలలోను రావసివుంది. నేటికీ తమకు జరుగుతున్న అన్యాయాల్ని, నయవంచనల్ని మనసువిప్పి చెప్పలేని వనితలు చాలా మంది వున్నారు. స్త్రీ స్వేచ్ఛకోసం రచనలుచేస్తూ జీవితాంతం స్త్రీ జీవితాన్ని గూర్చే ఆలోచిస్తూ ఆవేదనపడిన మహాశయుడు శ్రీ గుడిపాటి వెంకటాచలం ఆశించినట్లు "స్త్రీకి ఇంటా, బయటా అధికారం మాట అటుంచి తనమీద, తన శరీరం మీద, తన జీవితం మీద, తన మనసుమీద ముందుగా సంపూర్ణాధికారం కావాలి" అన్నట్లుగా ఆనాడే అన్నమయ్య సంకీర్తనలలో అలాంటి దృక్పథం కూడా కనిపిస్తుందనడానికి ఇలాంటి సంకీర్తనల్ని నిదర్శనంగా చెప్పవచ్చు. ఈ సంకీర్తనలలో నాయిక తన శరీరంపై పెత్తనం చేసి బాధ కలిగిస్తున్న నాయకుని ధైర్యంగా నిలదీసి ప్రశ్నిస్తూ అలా చేయవద్దని నీతి చెప్పడం కనిపిస్తుంది.

తన నాయకుని బహునాయకత్వాన్ని సహించలేక అలిగివున్న నాయికను నాయకుడు లాలిస్తుంటే ఆమె ఆతని చేష్టల్ని నిరసిస్తూ— ఎత్తి పొడుపుల మాటలు కల్గిన నీవు ఇప్పుడు పెద్దరికకతో మురిపాలు వెదజల్లుతున్నావు. వద్దన్నా మానడం లేదు. నేను నీకు ఎవ్వతెరా! నీ నిద్ర చూపుల్ని నాపై హారతి పట్టుతున్నట్లు ప్రసరింపజేస్తు

న్నావు. నీలోని బొంకుతనాలు కనిపిస్తున్నాయి రా. ఇప్పుడు ఈ ముద్దుమాటలు చెపుతూ ముఖం వంచుకుంటున్నావు. నేనింక నీ హృదయంలో ఎందుకు రా! నన్ను సమీపిస్తూ ఈ చేష్టలతో నన్ను విసిగిస్తున్నావు. నీకు కిందిచూపులు ఎక్కడ దొరికాయిరా! ఎర్ర తామరలాంటి చేతులతో నా పైటకొంగు పట్టుకుంటున్నావు. బిగువులు నీకు ఎవ్వతె నేర్పించింది రా! కుంకుమ పూతల్ని చెరగుతో తప్పుతున్నావు. ఇంక ఇవన్నీ ఎందుకు నీకు! శ్రీవేంకటేశ! వేడుకతో నా కౌగిటిలో కలశావు. అని నిష్ఠూరాలాడుతూ నీతులు చెప్పడం, చివరికి అతనితో కలసిపోతుంది.

అద్దిరా చిమ్ముల మాటలప్పటి నీకు
పెద్దరికాలనె మురిపెములే చిమ్మేవు॥
వద్దన్న మానవు నేనెవ్వెతెరా నీకు నీ
నిద్దుర చూపులు నాపై నివాళించేవు
బద్దులెల్ల నేడ నగపడెరా నీకు యీ
ముద్దుల మాటలాడుచు మోమేవంచేవు॥ (12-327)

లోకంలో కిందిచూపులు చూసేవాడిని 'దొంగలా కిందిచూపులు చూస్తాడు,అని అనడం పరిపాటి. ఈ సంకీర్తనలో "కిందిచూపులేడ దొరకెరా" అనే వాక్యంలో దొంగలా కిందిచూపులు చూస్తున్నావు అనే అర్థం స్ఫురిస్తుంది. ఇలాంటిచోట్ల అన్నమయ్య పద రాఘవాన్ని అల్పాక్షరాలలో అనల్పార్థ రచనను గమనించవచ్చు.

కొంతమందికి ఎన్నిసార్లు బుద్ధులు చెప్పినా తమ స్వభావాన్ని మార్చుకోరు. ఇలాంటివారిని గమనించే వేమన "ఎంత చదువు చదివి ఎన్ని విన్ననుగాని, హీనుడవ గుణంబు మానలేడు' అని నిర్ధారణ చేసి చెప్పాడు. అన్నమయ్య కూడా

భారమైన వేపమాను పాలుపోసి పెంచినాను
తీరని చేదేగాక తియ్యనుండీనా'

పాలుపోసి పెంచినా వేపచెట్టుకు దాని చేదుపోని విధంగా, ఎంత చెప్పినా మనిషిలోని సహజ దుర్గుణాలు పోవు అని తేల్చి చెప్పాడు.

ఇలాగే శృంగార సంకీర్తనలలో ఒక నాయిక తననాయకునికి నీతులు ఎన్నోసార్లు బోధించి ఫలితం లేకపోయేసరికి విసుగుచెంది అతనితో - జాజిపువ్వు జాజిపువ్వే అవుతుందికానీ దిరిశెన పువ్వు అవుతుందా! నీతత్వాన్ని నీవు ఎంతైనా మానుతావా! సంపెంగ పుష్పాల్ని మాటిమాటికీ వాసనచూసినా వాటి వాసనే ఉంటుంది కానీ అందులోని వేడిపోతుందా! కొంతమందికి అనురాగాలు కొంత మందికి ద్వేషాలు చూపుతున్నావు. నీ వైఖరిని నీవు వదలుతావా! పొగడపుష్పాల్ని ఎంత ఇష్టంగా వాసన చూసినా అందులోని వాసనే వుంటుంది కానీ దాని మదం (ఘాటు) పోతుందా! ఆవిధంగానే మితి మీరిన నీ చేష్టలు నీలాంటివారికేగాక తిరిగి నీ బుద్ధులు మంచివి అవుతాయా! ఆశపడి కలువల్ని కళ్ళకు అద్దుకొన్నాగానీ మన్మథ బాణాలు వేడిని వదలుకుంటాయా! ధీరుడవైన వేంకటేశా! వీడని బంధాల వసంతంలో మా కోరికల ఆశ మానుతుందా! అని కొన్ని సామెతల ద్వారా అతనికి నీతిగరపడం, తన ప్రేమను వ్యక్తం చేయడం కనిపిస్తుంది.

జాజు జాజే కాక దిరిశపుఁ బువ్వౌనా
నీ జాడెంతయిన నీవు మానేవా!

సంపెంగ పూవులలోన సారెకుఁ జూచిన తన
కంపే కాక తనకాఁక మానీనా

యింపులు గొందరికి యీరసాలు గొందరికి
జంపుల నీ గుణముల జాడమా నేవా ॥ (12-368)

ఇంతవరకు వివరించిన సంకీర్తనలలో నాయిక నాయకునికి హితోక్తులు చెప్పడం, అతనిలోని అవగుణాల్ని అధిక్షేపించడం, సహజసిద్ధమైన తన ప్రేమను వ్యక్తం చేయడం కనిపిస్తుంది. కొన్ని సంకీర్తనలలో నాయకుడు నాయికపై అలిగి వున్నప్పుడు చెలికత్తె ప్రవేశించి నాయకునికి సదుక్తులు చెప్పి అలుక పోగొట్టి నాయికపై అనురక్తి కలిగించడం కనిపిస్తుంది,

నాయికను మాటిమాటికి వలపులతో బాధపెట్టుతున్నావు. జగన్మోహిని అయిన ఆమెను బాధపెట్టడం నీకు పాడిగాదు. అంతకు ముందు మా మాటల్ని వినడానికి సమయం లేక ఇప్పుడు వచ్చావు. చెప్పడానికి అలవికాని వాటన్నిటిని చప్పర మంచంలో వున్న చక్కని కోమలాంగికి చెప్పి చూద్దువుగాని, నీవు అలసిపోయినందువల్ల మాకు మాటలు అనతివ్వడానికి సమయంలేక ఇప్పుడు యింతలోనే ఆసక్తితో వచ్చావు. ఇవి మాయమాటలు కావు. మేడపైన చెలులమీద ఒరిగివున్న మెరుగుల గుబ్బలాడి అయిన ఆమెను నీవే చూడు. విరహతాపం అనుభవిస్తున్న ఆ రమణిని చూచి వేగంగా రాలేక పోయావు. ఇంతటికీ నీ మనసు మాగిపోయింది. శ్రీవేంకటేశ ! నీవు వేగంగా వచ్చి దయచూపి ఆ మనోహరిని కౌగిటిలో చేర్చుకో అని నాయకునితో చెలికత్తె తక్కిన చెలికత్తెలందరిపక్షాన హితవచనాలు చెప్పి విరహవేదన చెందుతున్న నాయికను కనికరించమని వేడుకోవడం కనిపిస్తుంది.

పొద్దు వొద్దుకును వలపుల నేఁచేవు వద్దు
బుద్ధిగాదు నీకు నేఁప భువనమోహినిని ॥

అప్పుడు మా విన్నపము లాలకించఁ బొద్దులేక
యిప్పుడు విచ్చేసినాఁడ వింక నైనాను
చెప్పరాని వినియును చిత్తగించి చూతుగాని
చప్ప మంచములోని చక్కని కోమలిని ॥

అలసి మాతోడ మాటలాడనియ్య వేళగాక
యెలయించ వచ్చినాఁడ వింతలోననే
పొలపు మాటలు గావు చూడు నీవే మేడమీఁద
చెలులపై నొరగిన జిగి గుబ్బలాఁడిని ॥

వేఁగెడి రమణిఁ జూచి వేగినంతకు రావైతి
మాఁగెఁగా యింతట నీమనసైనాను
వేఁగు వచ్చినా నీకు వేంకటేశ కృపఁజూడు
కొఁగిట నవధరించు కన్నుల కలికిని ॥ (12-16)

ఇందులో "చెప్పరాని విన్నియును చిత్తగించి చూతుగాని" వంటి వాక్యాల్లోని శైలి, సంభాషణా తీరు సహజ రమ్యంగా వుంది.

నాయిక చేష్టల్ని చెలికత్తె నాయికునికి వివరిస్తూ - నీ చిత్తమే ఆమె అదృష్టం. ఇంక చెప్పడానికి మాకు వీలుకాదు నీ పాదాలపై ఒట్టు. వియోగ బాధలో వున్న నాయిక, వంటచేసే సతి భోజనం ఆరగించమని తొందరచేస్తూ ఎంతగా ప్రాధేయపడుతున్నాగానీ వీడని తత్పరతతో వుఁటూ అలసిపోయి తన ఇష్టసఖిపై ఒరగి వుంది. నీ పాదాలపై ఒట్టు. తాంబూలం ఇచ్చే సతి తాంబూలం తీసుకో మంటూ కర్పూరపు రేణువులు అందిస్తే కోపమో, మైచురపో గానీ తుది చూపులతో కూడా చూడకుండా వుంది. వీవెనలు విసరే అతివ లను వద్దు అని ఆక్షేపించదు. పైట సవరించుకోదు. వేంకటేశ! ఆమె ఏమవుతుందో! ఇప్పుడె వెంటనే నీవు ఆమెను ఆదరించకపోతే

నీ పాదాలపై ఒట్టు. అని అభ్యర్థిస్తూనే ధర్మబోధ చేయడం వ్యక్త మవుతుంది.

వసిత భాగ్యంబు దేవర చిత్తము - మాకుఁ
బనిగాదు యింక నీ పాదంబు లాన ॥

అడబాల సతి బోన మారగించు మటంచు
బడి బడిని కడు విన్నపము సేయఁగా
ఉడుగని పరాకుతో నుండి నెచ్చెలిమీఁద
బడలి వొరగినది నీ పాదంబులాన ॥ (12-23)

నాయికపై అలగివున్న నాయకునితో చెలికత్తె- పోనీ పోనీలె, నీతో కలయిక లెందుకు! అయ్యో నీ అలుకా! నీ ముఖం స్వేద మయం అయ్యింది. అమ్మ పాదాలపై ఒట్టు పెట్టితే వచ్చావు. కాని కానీలే, నీవు ఎక్కడికి పోయావో! అభిమానవతిపై ఇంకా బిగువులు మానవ ; నీ శరీరమంతా అలసిపోయింది. ఎందు కింకా అలుక ! బంగారు దుప్పటి కొంగు పట్టుకోగానే అంగడి వీధిలోనే పెనుగులాడుతావు. అవునులే, మరుగైన సతి కోపం నీవు ఇంకా తెలుసుకోలేదా ! నీ వాలిన రెప్పల నీటిలో నీ అలుక స్ఫురిస్తోంది. ఆమె నిన్ను అరగంటితో తిట్టగానే తెలివి మరుగై నీవు బిగుసు కున్నావు. మనసు కరిగి ఆమెను కలశావు. నీవు వేంకటగిరిపై నున్న ధీశాలి వయిన విట్లులుడవు. అని అతని అలుకను ప్రస్తావిస్తు అతని చేష్టల్ని, యుక్తిని పేర్కొంటూ సూక్ష్మంగా హితోక్తులు చెప్పడం కనిపిస్తుంది.

పోనీ పోనీలే నీ పొందు లేఁటికి నీ
యానవము చెమరించె నయ్యో నీ యలుకా ॥

ఆన వెట్టఁగా విచ్చేసే వమ్మ పాదాలమీఁదనే
కానీ కానీలే యెక్కడికో నీవు
మానవతితో బింకాలు మానవా యింకాను నీ
మేనెల్లా బడలెను యేమిటికి నీయలుక ॥ (12-27)

ఇందులో పోనీపోనీలే, కానీ కానీలే వంటి సహజసిద్ధమైన ప్రయోగాలు ఆయా మానసికావస్థల్లో వ్యక్తుల సంభాషణల్లో వెల్లడి అవుతుంటాయి. ప్రజల మనస్తత్వాలకు తగిన విధంగా అతి సన్నిహితంగా రచన చేయడానికి అన్నమయ్య ఇలాంటి పద ప్రయోగాలు చేశాడు.

స్వల్ప కారణాలకే నాయికపై కోపించి వున్న నాయకునికి చెలికత్తె ధర్మబోధ చేస్తూ— ఈ చంద్రముఖిపై ఎప్పుడూ నీవు ఈ విధంగా కోపగించుకోలేదు. ముఖమంతా ఇప్పుడు వివర్ణమై వింతగా వుంది. ఇంతమాత్రమైన పనికే ఎంత చేశావు! ఆమె నిన్నటి నుండి నిద్రపోలేదు. భోజనం వడ్డించే సతులందరూ చాలాసార్లు బలవంతం చేసినా ఆమె దిగులుతో పళ్ళెంపై చేయి కూడా చాచలేదు. ఏటు చేయాలనుకొని ఏమి చేశావో! వ్యాహ్యాళికి కూడా ఆమె రావ షం లేదు. దోమతెర మంచంపై కొప్పు వీడిపోగా తలనొప్పిగా వుందంటూ బద్ధకించి లెయ్యకుండా వుంది. ఎవ్వరిని దూషించవచ్చు. ఎవరున్నారింక! పూలబుట్టపై ఆమె శరీరం వేడెక్కిపోయింది. వేంకటగిరి రమణ! వేడుకతో ఆమె నీ కౌగిటిలో పవ్వళించి ఇంతలోనే పరవశించింది. అని వివరించడం వ్యక్తమవుతుంది.

ఎన్నఁడునుఁ గోపగించ విందుముఖి నీ విట్లా
విన్నని వదనమెల్లా వింతలాయ నిపుడు ॥

ఇంతలోని పనికిఁగా నెంత చేసినాఁడవు
కాంత నిన్నటినుండి కనుమాయ దాయను
బంతికూటి సతులెల్లాఁ బలుమారు నేఁపగా
చింతతోఁ బళ్ళెము మీఁద జెయి చాఁచ దాయెను ॥
(12-41)

ఈ విధంగా మధుర భక్తిపూరితమైన శృంగార సంకీర్తనల్లో దివ్యనాయకుని పరంగా వ్యక్తమయిన ధర్మాలు మానవలోకంలోని పురుషులందరికీ వర్తిస్తాయి. మానవతా దృష్టితో, అనుకూల్య చిత్తంతో మగువల మనసెరిగి పురుషుడు ప్రవర్తించాలనే పరమార్థాన్ని ఈ సంకీర్తనల ద్వారా గ్రహించవచ్చు. సంకీర్తనలలో మొదటినుంచీ విరహం, ఆగ్రహం వర్ణించబడినా ముగింపులో నాయికా నాయకుల సమైక్యత చెప్పబడి వుంటుంది. జీవాత్మ, పరమాత్మలు, భాగవత భగవంతులు, నాయికా నాయకులు అలా ఐక్యభావంతో వుండాలని అన్నమయ్య భావన కావచ్చు.

అన్నమయ్య సంకీర్తనా రచనా విధానంలోని తేటతెనుగు నుడికారపు సొంపు, జాతీయాల పెంపు, మధుధారలను పోలిన కవితాధార, వ్యావహారిక శైలీ రమ్యత. పాత్రల సంభాషణా చాతుర్యం హృదయానందకరంగా అత్యంత సహజసుందరంగా భాసిల్లుతున్నాయి. పాఠకులు నిశ్చల మనస్సుతో, జిజ్ఞాసతో అన్నమయ్య సంకీర్తనల్ని చదువుతున్నప్పుడు రంగస్థలంపై పాత్రలు ప్రవేశించి సంభాషిస్తున్నట్లు, ప్రత్యక్షంగా దర్శిస్తున్నట్లు రసానుభూతి కలుగుతుంది. కామ - క్రోధ - లోభ - మోహ - మద - మాత్సర్య పూరితమైన మలిన మనస్సులకు, సత్యదూరులకు, భక్తిహీనులకు అన్నమయ్య సంకీర్తనల అంతరార్థం అవగతం కాదు. సాత్విక సహృదయులకు

అన్నమయ్య సంకీర్తనా పఠనం దివ్యమైన ఒక దృశ్య వినోదం. ఆరని ఒక విజ్ఞానతేజం. అన్నమయ్య మనస్సును, అన్నమయ్య సంకీర్తనలను అర్థం చేసుకోవడం ఒక మహాతపస్సు.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో ఈ నాటి ఆధునిక స్త్రీ లోకం మెచ్చే చైతన్యం, తెలివితేటలు, ప్రత్యేక వ్యక్తిత్వం స్త్రీ పాత్రలకు అన్నమయ్య ఆరోపించడం, పురుషునికి ధర్మప్రబోధం చేయించడం గమనిస్తే ఈ నాటి అధునిక కాలపరిస్థితుల్ని అన్నమయ్య అనాడే ముందే వూహించిన కాలజ్ఞానిగా తోస్తుంది. ఇలాంటి సంకీర్తనల్ని మనసుపెట్టి చదివితే స్త్రీలు, స్త్రీవాదులే కాక మానవతావాదు లందరూ కూడా ఆశ్చర్యానందాలు పొంది అన్నమయ్యను చేయెత్తి జేకొట్టకుండా వుండలేరు· శిరసు వంచి నమస్కరించకుండా వుండలేరు.

"వలచినవాఁడు కైవసమయి మచ్చిక చేను
తలపోకకైనవాఁడు దాటడు మాట"

— అన్నమయ్య

(శ్రీ) అన్నమయ్య 588 వ జయంత్యుత్సవ సంచిక - 1995
అభినయ ఆర్ట్స్ అకాడమి
విశాఖపట్టణం.



# అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో భావ రమ్యత

నవరసాల్లో శృంగారం రసరాజంగా ప్రఖ్యాతి గాంచింది. సమస్త మానవులను ఈ శృంగారం సులభంగా ఆకర్షిస్తుంది. శృంగార భావాలు నాయికా నాయకులు, భార్యాభర్తలు, ప్రేయసీ ప్రియుల మధ్య ప్రవర్తిల్లు తుంటాయి. అన్నమయ్య శృంగార సకీర్తనల్లో దివ్యులైన పద్మావతీ - శ్రీ వేంకటేశ్వరులే నాయికా నాయకులు. వీరి మధ్య సంయోగ, విప్రలంభ శృంగారాలు రెండూ కనిపిస్తాయి. అయితే విప్రలంభ శృంగార సంకీర్తనలలో కూడా చివరి పాదాలలో ఐక్యత కనిపిస్తుంది. తాళ్ళపాక సంకీర్తనా కవులందరు ఈవిధమైన ప్రత్యేకతను పాటించారు. జీవాత్మ, పరమాత్మల ఐక్యాం చెప్పడం దీని అంతరార్థం కావచ్చు. సామాన్య మానవ దంపతుల మధ్య సాగే మనస్తత్వాలను దివ్య దంపతులకు ఆరోపించి తద్వారా మానవాళికి హితోపదేశం చేయడం కనిపిస్తుంది. భక్తుడు లేక జీవుడు పరమాత్మను ప్రేయసీ ప్రియ భావనతో ఆరాధించి, తదైక్యాం చెందడం మధుర భక్తి అంటారు. అన్ని సంకీర్తనలు బాహ్యంగా శృంగార భూయిష్ఠంగా వున్నా ఆంతరంగా అధ్యాత్మ తత్వంగా గోచరిస్తాయి. ఇందులో నాయికా నాయకుల అనుబంధం, ప్రణయ కోపం, చెలికత్తెల హితవచనం సవతుల నిష్ఠురం మొదలైన అంశాలు వ్యక్తమవుతాయి. అన్ని సంకీర్తనలలోను భాష, అచ్చ తెనుగు పదజాలంతోను, వ్యావహారిక రచనా శైలి హృదయరంజకం గాను, శృంగార భావాలు రమ్యంగాను సాగాయి. ఇవి లౌకిక శృంగారంవలె ఉద్వేగం కలిగించవు. జగన్నాయికా నాయకులైన

అలమేలుమంగా శ్రీనివాసులను ఇందులో పొందుపరచడం వల్ల సహృదయుల మనోభావాలు దివ్యంగానే ప్రసరిస్తాయి.

సాధారణంగా తమ పనులకు అడ్డువస్తారనుకుంటే చిన్నపిల్లలు పెద్దవాళ్ళనుగానీ, పెద్దవాళ్ళు చిన్నపిల్లలను గానీ కంటపడకుండా ఏమార్చి వెళ్ళివస్తుంటారు. ఇదే మన స్తత్వంతో నాయకుడు కూడా తనకు నచ్చిన మరో స్త్రీదగ్గరకు వెళ్ళదలచి తన దగ్గరున్న సతులకు కొన్ని పనులు చెబుతాడు. కానీ వారు అతని మనసు తెలుసుకొని అప్రమత్తంగా ఉంటారు. ఈ పరిస్థితిని గమనించిన ఒక నాయిక నాయకునితో —

నీవు మొదలి జాణవు నీకంటే జాణలు వారు
కావరవు నిన్నుఁ జూచి కన్నుల నవ్వేరు ॥

గట్టున నెవ్వతెనో కూడవలసి యందరి
నట్టే పనులు చెప్పి యంపేవు నీవు
నెట్టనఁ గొంద రిందులో నీ తఃఁపు తామెరిగి
చుట్టి చుట్టి నీ వద్దనే సుద్దులు చెప్పేరు ॥ (31-1)

నీవు ముందే జాణవు. నీకన్నా ముందే నీ సతులు జాణలు. మోహంతోవున్న నిన్ను చూచి కన్నులతోనే నవ్వుతున్నారు. రహస్యంగా నీవు ఏ స్త్రీనో పొందాలనుకొని అందరికీ పనులు చెప్పి పంపుతున్నావు. వారిలో కొంతమంది నీ ఉద్దేశ్యం తెలుసుకొని నీచుట్టే తిరుగుతూ నీకు మాటలు చెబుతున్నారు. ప్రొద్దున ఎవ్వరింటికో పోవాలనుకొని ఇంట్లోవున్న వారిని నిద్రపొమ్మంటున్నావు. తెలివైన కాంతలు ఈ సంగతి గ్రహించి ఒద్దికతో నీ పాదాలు వొత్తుతున్నారు. ఏ వనితతోనో సరసాలాడాలనుకొని అందరినీ వసంతాలాడమంటు న్నావు. శ్రీ వేంకటేశ ఈ విషయం నేను తెలుసుకొంటే ఇప్పుడే

నాతో కలశావు. విందుగా మాటలు చెప్పి కొంతమంది నిన్ను పొందారు అని అతని మనస్సు విప్పిచెప్పడం భావస్ఫోరకంగా, సహజ రమ్యంగా ఉంది.

మనస్సులో మరో నాయికపై వ్యామోహం కలిగి ఉంటూ, బాహ్యంగా తనపై ప్రేమ నటిస్తున్న దక్షిణ నాయకుడైన తన పతితో నాయిక నిష్ఠూరంగా, ఆవేదనగా- నీకేమీ తెలియదని ఎందుకు నాతో మాట్లాడుతావు! ఆమెను తప్పకుండా కలవాలనుకొంటే నేను వద్దన్నానా! బయట తిరుగుతున్న పావురాలను నాకుచూపిస్తూ, అటు వైపు ఆమెతో మాటలాడుతున్నావు. చెయ్యి నామీద వేసి మీదిక్కి వస్తూనే, వుండలేక ఆమె మీద పాదం చాపుతున్నావు. నీ చేతిలోని నిమ్మపండు నా ముందు వేసి, ఆమె చేతిలోవున్న తాంబూలం అందు కుంటున్నావు. నన్ను నమ్మించి నా ముఖం చూసి నవ్వుతూనే, సైగలుచేసి ఆమెను సమ్మతింప చేస్తున్నావు ఇటువైపు నన్ను కౌగిలించుకుంటూనే, తెరచాటున ఆమెను ఒద్దికగా కలుసుకుంటు న్నావు. శ్రీమంతుడైన శ్రీవేంకటేశ! నాపై అక్షతలు చల్లుతూనే, ఆమె మర్మాన్ని తాకుతున్నావు. అని అతని శృంగార చేష్టల్ని ఎత్తిచూపడం వ్యక్తమవుతుంది.

ఏలనన్ను మొరఁగేవు యెఱఁగనంటా నీవు
వాలాయ మాకెఁ గూడఁగా వద్దంటినా ॥

బాయిటఁ దిరిగేయట్టి పావురాల నాకుఁజూపి
ఆమెఁ నాకెతో మాటలాడేవు నీవు
చేయి నా మీఁదట వేసి చెనకి పైకొంటానే
పాయలేక యాకెమీఁదఁ బాదము చాఁచేవు ॥ (31-59)

సాంసారిక విషయాల్లో మానవ స్వభావం సర్వకాల సర్వావస్థల్లో ఒకేలాగా వుండదు. అలాగే స్త్రీ స్వభావం కూడా ఒక్కలాగే ఉండదు. భార్య కొన్ని సమయాల్లో తగినంత శక్తి, ఓపిక లేనప్పుడు పరస్త్రీ వ్యామోహం చెందిన భర్తను తన ఇష్టానికే వది లేసి ఆవేదన చెందుతుంది. కొన్ని సమయాల్లో సహించలేక ఎదురు ప్రశ్నలువేసి తన అభిమానాన్ని చాటుతుంది. ఇంట్లోవున్న నన్ను ఇంత మోసం చేశావు. సరిపోల్చిచూస్తే ఆమె నా సాటికి వస్తుందా! నన్ను రప్పించుకొని, నేను నిలిచివుండగా మంచంపై ఆమెతోనే మాట్లాడుతున్నావు. హెచ్చరికగా నేను పూలచెండు వేస్తే మధ్యలో ఆమె ఎందుకు అందుకుంటుంది! నాకు సైగచేయగా, నేను నీతో నవ్వితే ఆమెపై చేయి వేస్తున్నావు. ఇందుకు హెచ్చరికగా నీపై తామరతూడు వేస్తే మధ్యలో ఆమె ఎందుకు పట్టుకుంటూంది! నాకు కంకణం కట్టి నేను కౌగిటిలో ఉండగా, సందేహం లేకుండా ఆమె వైపు ఎందుకు చూస్తున్నావు! లెక్కప్రకారం తిరిగే అంకెల వేంక టేశ నేను అడ్డంగా తెరవేస్తే, మధ్యలో ఆమె ఎందుకు లోపలికి వస్తూంది! అని నాయిక పరస్త్రీని లేక సవతి చేరువను సహించలేక నాయకుని ప్రశ్నిస్తుంది.

ఇంత సేసితివి నీవే ఇంటిలోనున్న నన్ను
పంతమెంచి చూచితే నా పాటిదా ఆపె ॥

అంచెల నన్ను రప్పించి అట్టనే నిలుచుండఁగా
మంచముపై నాకెతోనే మాటలాడేవు
పొంచి యందుకుఁగా పువ్వుల చెండు వేసితే
కొంచక తానేల అందుకొనీ నీకె నడుమ ॥ (31-75)

కొంతమంది భార్యలు తమలో దోషాలు లేకపోయినా నా రకప్పులాడే భర్తలను చూస్తే పెద్దపులుల్ని చూసినట్లు భయపడి

పోతారు. ఇలాంటి స్వభావం కలిగిన ఒక సతి తన చెలితో - భర్తను ఏమీ అనలేక భయపడి వుంటున్నాను. అతను చురచుర పంతాలాడు తుంటే ఆశ్చర్యంగా వుంది. చెక్కులవెంట చెమట కారుతూవుంది. ముఖంలో సిగ్గులు వ్యక్తమవుతున్నాయి. ఇంక పతిని ఏమనేది! పెదవి ఎండి పక్కులు కట్టింది. కన్నులలో ఎఱ్ఱదనం అధికమయింది. ఇంక నాతో తాను ఏమంటాడు! కొప్పువీడిపోయింది. నిట్టూర్పులు వస్తు న్నాయి. వలపులు అధికమవుతున్నాయి. తానేమంటాడు! చిరు నవ్వులు అధికమయ్యాయి. మనస్సు పొంగుతూంది. అందమైన శ్రీ వేంక టేశ్వరుని ఏమనేది! నాతో పందెమాడాడు. నన్ను కౌగిటకి చేర్చు కున్నాడు, ఇంక తప్పుకోలేను. తానేమంటాడు! అని పతిపై తనకున్న వినయాన్ని సహజ సౌమ్యంగా, ముగ్ధప్రాయంగా వ్యక్తం చేస్తుంది.

వెరగంది వున్నదాన విభు నేమీనన లేక
చురచురఁ బంతాలాడీ చోద్యమయ్యానే॥

చెక్కులఁ జెమటగారె సిగ్గులు మోమునఁదీరె
యెక్కడి మాటలు పతి నేమనేనే
పక్కులు గట్టెను మోవి పైకొనఁగన్నులకావి
తక్కక నాతోఁనిక తానేమనీనే॥ (31-20)

కొంతమంది భార్యలు, భర్తలు ఎలాంటివారైనా, ఏమి చేసినా వినయంగానే మెలగుతారు. ఎంతచనువు, స్వేచ్ఛ ఇచ్చినా దాసీత్వం తోనే ప్రవర్తిస్తారు. ఒక సతి తన పతితో — నీ మనసు తెలిసి సేవలు చేయడం గాక, నీతో రచ్చచేసి బాధపెట్టడం న్యాయమా! నీవు ఎంత చనువు ఇచ్చినా నేను నీస్త్రీని అంతే. నీ పెదవిని ఎంగిలి చేయ వచ్చా! జారస్త్రీలు మోహావేశంతో ప్రవర్తించినా, నేను పది మందిలో రట్టు చేయడం భావ్యమా! నీవెంతగా గౌరవించినా నేను

నీ దాసినే, ఏమైనాకానీ నీపై నేను కాలువేయవచ్చా! నీ వక్షస్థలంలో ఎంతగావుండినా, అలమేలుమంగను అయిన నేను గట్టి చన్నులతో నిన్ను ఒత్తవచ్చా! నీకు ఎంతమందివున్నా నన్ను ఏలుకున్నావు శ్రీవేంకటేశ! నేను హద్దుమీరవచ్చా! అని తన సహజ ధర్మాన్ని, అణకువను వ్యక్తం చేస్తుంది.

చిత్తమెఱిఁగి సేవలు సేయుటగాక
హత్తిసీతోఁడఁ బెనఁగి అల ఇంచఁదగవా ॥

యెంతచనవరినైనా యింతి నింతె నీకు నేను
చెంత నీమోవి యెంగిలి సేయవచ్చునా
వింత సతు లెఱుఁగక లెక్కసానఁబై కొనినా
పంతమాడి ఇందరిలోఁ బచ్చి సేయఁదగవా ॥ (31-21)

ఒక సతి తన చెలితో తనపతి ఏమిచేసినా అతనిమాట తప్పనని, అతనిమనసు ప్రకారమే ప్రవర్తిస్తానని. తనభర్తే తనకు దిక్కని, పంతం వదిలేశానని, కానుకలిచ్చి తనను వేడుకున్నానని, తననే నమ్ముకొని వున్నానని, తనకు దగ్గరిబంధువునని. మేనరికమని, ఎప్పుడూ కోపగించనని, తనను ప్రశంసిస్తానని, తన మనసు, అతనిమనసు పెనవేసుకున్నాయని భర్తపై తనకున్న మమతానురాగాల్ని, వినయ విధేయతల్ని వ్యక్తం చేయడం కనిపిస్తుంది.

తప్పనేమిటాఁ, దనకు తన మనసు
యెప్పుడు తానే దిక్కు, యిఁకఁదనమనసు ॥

మానితి నాచలమెల్ల మాట చెప్పినట్టె వింటి
తానేమిసేసినాఁ దన మనసు
కానుక చేతికిచ్చితి కడుఁ దన్ను వేడుకొంటి
మానిని నింతే నేను మఱి తనమనసు ॥ (31-68)

నాయకుడు ఒక నాయికతో కలసి ఆనందంగా ఉంటే చూసి సంతోషిస్తున్న మరోనాయిక తన సఖులతో కలసి వారిద్దరితో-మేము మీ వినోదాల్ని చూశాము మీకు ఎంతటివలపులో ఇపుడు! మీరి ద్దరు కలసివుండటంవల్ల మాకందరికీ మనసు ఒక్కటిగావుంది ముందు వలె కాకుండా ఇప్పుడు మీ ముఖాల్లో కళలు పుట్టిపడితున్నాయి. అలుకలు వదలి ఆనందంగావున్న మిమ్మల్ని ఇప్పుడు చూచి మా చెలులందరికీ చిరునవ్వులు వస్తున్నాయి పంతాలతో కూడిన మీ ఒట్లు అన్నీ వీడిపోయి మోహం పెరిగింది. మీ తలపులు ఏ విధంగా నిరూపణ అయ్యాయో! వరుసగా రతి సలిపివచ్చిన మిమ్మల్ని చూచి సవతులకందరికీ ఆశ్చర్యమయింది అని తమ ఆనందాతిశయాన్ని వెల్ల డించడం తెలుస్తుంది.

కంటిమిగా యీ వేడుకలు నేమెల్లాను
నంటుర మీకెటువంటి ననువులో ఇపుడు ॥

మొనసియాకె నీవు నిద్దరు నుండఁగఁజూచి
మనసొక్కటాయ నేఁడు మా కెల్లాను
మునుపటివలెఁగాదు మొగములఁగళలుబ్బె
వనితకు నీకు నెటువంటి సంతోసములో॥ (31-17)

పతిపట్ల సతి అనురక్తిగా వుంది, అతనిదగ్గర ప్రేమాతిశ యాన్ని, గౌరవాన్ని పొందడంచూసి ఆనందాశ్చర్యాలతో సఖి ఆమెతో-ఇంక ఎక్కడిమాటలు! ఎవ్వరు ఏమిచెప్పుతారు! పతివద్ద కూర్చొని ఇంపు గొల్పేలా మాట్లాడి గొప్పదానివయ్యావు. నీవు కోరినవిధంగా అతడు నీసొమ్ము అయ్యాడు. నీవు చేసినట్లుగా నీకు చెల్లుతూంది, ప్రేమతో పాదాలొత్తి, మంచంమీదికెక్కి అతనికి అచ్చమైన ఇల్లాలు అయ్యావు. అతడు నీచేతచిక్కివున్నాడు. నీకు

అతనిపై వలపు కలసివచ్చింది. తాంబూలం ఇచ్చి మోహాన్ని పెంచి తెరవేసి వెంటనే అతని కౌగిటిలో చేరి దొరసానివయ్యావు. శ్రీవేంకటేశుడు ఒద్దికగా నిన్నుకలసి ఏలుకున్నాడు అని, వారి ఐక్యతను ప్రశంసిస్తుంది.

ఇంక నేడ సుద్దులు యెవ్వరు నేమిచెప్పేరు
వంకలొత్తి మాడిఁజొచ్చి వాత వెళ్ళివత్తునే ॥

వొల్లనేవద్దఁ గూచుండి వొనగూడ మాటలాడి
బల్లిదురాలవై తివే పతియెదుటను
అల్లన నీవు గోరినట్లాతఁడు నీసొమ్మాయ
చెల్లునే ఇంతటా నీకుఁ జేసినట్లెల్లాను ॥ (31-34)

నాయికానాయకు ఒకచోట కలసివుండి కూడా నాయిక పిలుస్తున్నా నాయకుడు మాట్లాడకపోవడం చూసి చెలులు అతనితో- ఇద్దరూ ఎదురెదురుగా కలసివున్నారు. ప్రతిదినమూ మీకు బోధించవలసివస్తుంది. ప్రియురాలు నిన్ను పిలుస్తోంది, "ఊ" కొట్టవచ్చు కదా. ఆమె ప్రక్కనే ఉంది. తలఎత్తి చూడవచ్చు కదా. ఆమెపంతం చూపుతుంది. నీవు దిట్టతనం చూపవచ్చు కదా. సఖులము కాబట్టి చెబుతున్నాము. ఆమె నవ్వుతూంది. నీవు మారుగా నవ్వవచ్చు కదా. నలినాక్షి అయిన ఆమె నిన్ను చూస్తోంది. ఆమె యౌవన శరీరాన్ని తాకవచ్చు కదా సమ్మతిస్తోంది. ఆమె దాగుకొని సరస మాడుతూంది. నీవు పువ్వులతో వేయవచ్చు కదా. పెండ్లి చేసుకో వచ్చు కదా. పానుపుమీద మీ తలపులు గ్రహించవచ్చు కదా శ్రీ వేంకటేశ! ప్రేమతో ఆమెను ఏలుకున్నావు. మిమ్మల్ని ఇద్దరినీ కలిపి లాలిస్తాము అని భావబంధురంగా, సరస మధురంగా హితవు చెప్పి ప్రోత్సహించడం తెలుస్తుంది.

ఇద్దరుఁ గడిసినారు యెదురు బడినున్నారు
పొద్దు వొద్దునకు మిమ్ము బోదించవలసె ॥

పిలిచీ నూఁకొనరాదా ప్రియురాలు నిన్ను నిట్టె
తలయెత్తి చూడరాదా దండనున్నది
బలిమిఁ బెనఁగరాదా పంతములే నెరపీని
చెలులము గన నేమి చెప్పకుండరాదు ॥ (31-5)

ఒక నాయిక నాయకునితో మరో వనిత తనను ఇష్టపడుతూం దని, ఆమెపట్ల అనురక్తితో ఉండమని చెబుతూ—

మాటలైనా నాడరాదా మనసిచ్చి
చోటిచ్చి పిలువరాదా చుట్టమైనవాఁడవు ॥

తఱితో నీవింతలోనే తలవంచుకుండ నేల
తెఱవనీకు మొక్కీ దీవించగాదా
యెఱుఁగునో నీ మర్మము లేమైనా నీకెత్తొల్లి
వెఱవనేఁటికి నీవు వేడుక కాఁడవు ॥ (31-25)

అనే సంకీర్తనలో- మనసిచ్చి మాట్లాడనైనా మాట్లాడ వచ్చుకదా. నీవు బంధువువి. చోటిచ్చి పిలువవచ్చుకదా. ఇంతలో నీవు తలవంచుకోవడం ఎందుకు! ఆమె నీకు మొక్కుతూంది. దీవించ వచ్చుకదా. పూర్వపు నీ మర్మాలు ఈమెకు తెలియవు. నీవు సంకో చించ నక్కరలేదు. నీవు వినోద పురుషుడివి. అన్యస్త్రీలున్నారని మోహాన్ని దాచడం ఎందుకు! ఆమె నీపై భక్తిచూపుతూంది. ఆమెకు చనువు ఇవ్వవచ్చుకదా. నీకేమైనా ఇప్పుడు సిగ్గుగా ఉందా. విచా రించడం ఎందుకు! నీవు ఐశ్వర్యంగలవాడివి. ఆలోచించి లోలోపలనే ప్రేమ అణచుకోవడం ఎందుకు! ఆమె పందెం వేస్తుంది, చెయ్యి చాచ

వచ్చుకదా అని తన సఖ్యతను, విశాలదృక్పథాన్ని, సాటి స్త్రీ కోసం ఆనందాన్ని వ్యక్తపరచడం కనిపిస్తుంది. ఈ సంకీర్తనలో నాయకుని వేడుకకాడవు, సిరిగలవాడవు, కతకారివాడవు అని పేర్కొనడం బట్టి అనేకసతులు, సిరిసంపదలు, మాయావినోదాలు కల్గిన శ్రీకృష్ణుడు స్ఫురిస్తున్నాడు.

నాయకుడు నాయికను పిలిపించుకొని ఆమెతో సరసంగా మాట్లాడకుండా మౌనంగా ఉండటం గమనించి చెలికత్తె అతన్ని హెచ్చరిస్తూ - నేను చెలికత్తెకాబట్టి చెప్పడం తప్పదు. వలపు కలవంటిది. దాన్ని వృథాచేయకూడదు. నీవు ఆమెను ఉత్సాహంగా పిలిపించి ఊరకుంటే ఆమె మిక్కిలి భయంగా నిలుచుకొనివుంది. ఎవ్వరు మాట్లాడిస్తారు! మీరిద్దరూ సిగ్గుపడుతున్నారు. యౌవనం పువ్వువంటిది, కాలం వృథాచేయవచ్చా! ఆమె పనిగట్టుకొని ఇంటికి వస్తే, నీవు పరాకుగా వుంటే చూసేవరకూ మంచందగ్గరేవుంది. మిమ్మల్ని హెచ్చరించేవారెవ్వరు! వేడుకగనివంటిది, దాన్ని కట్టిపెట్టవలసిన పనిలేదు. కాగిలికి చేయిచాచి చిరునవ్వుతోవుంటే, ఆమె నిన్ను తాకుతూ వుందీ. అని వారిని సరసక్రీడకు ప్రోత్సహించడం కనులకు కట్టినట్లు చిత్రించడం జరిగింది.

చెలికత్తెఁ గనక నేఁ జెప్పక పోదు
కలవంటిది వలపు కడమలు సేతురా ॥

పువ్విళ్లూరఁ బిలిపించి వూరకే నీవుండఁగాను
నివ్వెరగు తోఁడ నాపె నిలుచున్నది
యెవ్వరు మాటలాడించే రిద్దరు సిగ్గువడేరు
పువ్వువంటి జవ్వనము పొద్దుగడువుదురా ॥ (31-81)

భార్యతో కలయిక భాగ్యమని, ఆమెను పట్టుకొని సరసమాడి సిగ్గులో ముంచవచ్చు కదా అని, ఒక భర్తకు చెలికత్తె హితవు చెబుతూ- ఆమె కలువరేకులవంటి కన్నులతో తేటగాచూస్తూ, పార వశ్యంతో నీతో మాట్లాడుతూంది. ఆమెను పిలిచి ప్రక్కన కూర్చుండబెట్టుకొని కౌగిలించుకోవచ్చు కదా. ఎందుకు తపింపచేస్తావు! చిగురు తీగలవంటి చేతులతో నీకు మొక్కి, నవ్వీ నవ్వి నీపట్ల స్నేహం చూపుతూంది. ప్రక్క వదలకుండా నీవు దుప్పటి కప్పి సంధి కూర్చవచ్చుకదా. ఎందుకు జాగుచేస్తున్నావు! బంగారు కుండల వంటి స్తనాలతో నిన్ను రాపాడి నిట్టూర్పులలో సువాసనలు గుప్పి స్తూంది. అతిశయించి శ్రీ వేంకటేశ! ఇప్పుడే కలశావు. ఆమెకు వశమై వుండవచ్చుకదా, ఈ విధంగా ఎందుకు చేస్తున్నావు! అని వివ యంగా ఆదేశించి విశదంగా చెప్పడం తెలుస్తుంది.

భామతోడి పొందునీకు భాగ్యముగాదా
చేముట్టి సరసమాడి సిగ్గుదేర్చరాదా ॥

కలువరేకులవంటి కన్నులం దేలించి చూచి
మలసి సొలసి నీతో మాటలాడీని
పిలిచి వద్దఁ గూచుండఁ బెట్టుకొని కాఁగిట
కలయరాదా మేల కాఁక లు సేసేవు ॥ (31-91)

చెలికత్తె నాయకునితో- ఆమె వేడుకుంటూంది. ఇంకైనా రావయ్యా! నీవు ఎంత అధికుడవైనా ఇంత భేదం చూపవచ్చా! ఏకాంత సమయంలో సతీపతులు అతిశయించి నవ్వవచ్చు కానీ, వంత మాడకూడదు, ప్రక్కనుండి తన మాటను గౌరవించే వ్యక్తితో వ్యంగ్యంగా అయినా మాట్లాడవచ్చు కానీ పరభావంతో వుండ కూడదు. తనపై అనురక్తిగల వ్యక్తితో సిగ్గుపడకూడదు కానీ చిలి

పిగా బెదిరించవచ్చు. తనను మన్నించే గొప్ప నేర్పరితో మితి మీర కూడదు కానీ పెక్కుసార్లు కొసరవచ్చు. ఎక్కడా తప్పుపట్టని ప్రియునితో రట్టు కాకూడదు కానీ రతిలో పెనుగులాడవచ్చు. కోరిక పెంచి కలసే శ్రీ వేంకటేశ్వర! నీతో మాత్సర్యం పనికిరాదు కానీ మనసు కరగవచ్చు, అని వివరించి చెబుతూ ఆమెలో ఏ దోషం లేదని సూక్ష్మంగా ధ్వనింపజేస్తూ అతన్ని ఆమె దగ్గరకు రమ్మని పిలుస్తుంది.

రావయ్యా ఇంక నైనా రమణి వేడుకొనీని
వావిరి నీకెతో నింతవాసులెంచఁ దగునా ॥

పంతమూడరాదుగాని విచారించి నవ్వవచ్చు
మంతనాన సతికిని మగనితోను
వింతసేయ రాదు గాని వెంగెమైనా నాడవచ్చు
చెంతఁ దనమాట చెల్లించే వానితోను ॥ (31-24)

నాయికపై పరాకుగా ఉంటున్న నాయకునితో చెలికత్తె నాయిక అనురక్తిని గూర్చి చెబుతూ - నీవు నెరజాణవు. నీకు తెలియనివి లేవు. ఆమె చూపులలోనే పదివేల విన్నపాల గుర్తులన్నీ అందులోనే ఉన్నాయి. మమ్మల్ని అడగడం ఎందుకు! ఆమెను ఇప్పుడే కరుణించు. ఒక్కొక్కటే ఇంక వివరించి చెప్పాలా! ఆమె నవ్వులలోనే లక్షల మురిపాలు అందులోనే కనిపిస్తున్నాయి. ఇంక చెప్పడం ఎందుకు! ఆమెను గౌరవించు. అమూల్యమైన సిగ్గులన్నీ బట్టబయలు చేయాలా! ఆమె కౌగిలిలోనే కోట్లకొలది వినయాలు ఆలోచించి చూస్తే అందులోనే ఉన్నాయి శ్రీ వేంకటేశ! చేయి పట్టి నేటికీ ఆమెను ఏలుకో. ప్రేమపు రతుల్ని నీతో పేరుపెట్టి గుచ్చి చెప్పవలసిన పనిలేదు అని వివరించి అతనికి అనునయంగా హితవు చెబుతుంది.

నీ వెఱుఁగనివి లేవు నెరజాణవు
భావించి మా వలపులు పచారించవలెనా ॥

పదతి చూపులలోనే పదివేలు విన్నపాలు
అడియాలములన్నియు నందే వున్నవి
అడుగనేఁటికి మమ్ము ఆపెన్నిట్లై కరుణించు
విడిముడిగా నీకె విచ్చి చెప్పవలెనా॥ (31-97)

సతికి తన పతిపై వున్న అనురాగాన్ని చెలికత్తెలు అతనికి తెలియచేస్తూ, భార్యకు భర్తమీద ప్రేమ ఇలా వుండాలి అని ఆమెను మెచ్చుకొంటుంది.

పతిమీఁది మోహము పడఁతి కిట్టుఁడవద్దా
సతతము నీ హితవే సారెఁ గోరీఁ దాను

బలిమిఁ బయ్యెద కొంగు పట్టి నీవు దీసితేను
నెలఁత కొప్పువిరులు నీపై రాలెను
అలరి యందుకు మరుఁ డమ్ములు గురిసెనంటా
కలికి భ్రమసి నిన్ను కాఁగిలించుకొనెను ॥ (31-100)

అనే సంకీర్తనలో పతిమీఁద వ్యామోహం స్త్రీకి ఇలా వుండాలి· ఎల్లప్పుడూ నీమేలునే ఆమె కోరుతూంది. బలవంతంగా పైటకొంగు నీవు పట్టితీస్తే ఆమె కొప్పులోని పూలు నీపై రాలాయి. అందుకు మన్మథబాణాలు నీపై కురిశాయని ఆమె భ్రాంతిచెంది నిన్ను కౌగిలించుకున్నది. నీవు ఆమెను ఒరుసుకొని పెనగులాడితే ఆమె శరీరంలోని కర్పూరపు పొడి నీకు అంటుకొన్నది, అందుకు చంద్రుడు వెన్నెల పొడి చల్లాడని నిన్ను కౌగలించుకొన్నది. ప్రీతిగా నీవు, ఆమె కలుసుకోగా నీపై స్వేదబిందువులు నిండాయి· అందుకు అతడు

చల్లిన అక్షతలే పైకొన్నాయని, వెంటనే ఆశ్చర్యం చెంది నిన్ను కౌగలిగించుకొన్నది అని భావరమ్యంగా వ్యక్తం చేసింది. ఇందు అన్నమయ్య వర్ణనా చాతుర్యం విశదమవుతుంది.

చెలికత్తె నాయిక విషయంలో నాయకునికి హితోపదేశం చేసినట్లే నాయికకు కూడా నాయకుని విషయంలో హితోక్తులు చెప్పడం కనిపిస్తుంది. చెలికత్తె అలిగివున్న నాయికను - ఇప్పుడున్న కోపం మీకు ఇలాగే ఉంటుందా ! సమ్మతిగా అతడు, నీవు ఒక్కటే కదవే. గుట్టుగా నీ భర్త కొంగుపట్టి తీస్తే పెట్టకూడని ఒట్టులు పెట్టు తున్నావు ఎందుకు ! అనుబంధంతో తన ముచ్చట మాటలు చెబు తుంటే అనవసరంగా నేరాలు వేసి వాదిస్తారా ! వదలలేక నీపై అతడు అనురక్తిగా వుంటే చేయరాని చేష్టలు చేస్తున్నావెందుకు ! నీ దగ్గర చేరి మురిపాలు చూపుతుంటే మలకనగా చూసి కోప గిస్తారా ! (శ్రీ) వేంకటేశుడు నిను కలిస్తే నవ్వకూడని నవ్వులు నవ్వుతావెందుకు ! నీ కొప్పున పూలదండలు గొప్పగా చుట్టితే అరుస్తూ అతని శృంగారాన్ని బట్టబయలు చేస్తారా ! అని ప్రేమగా మందలిస్తుంది.

ఇప్పటి కోపము మీకిట్లైవుండేనా
వొప్పుగా నాతఁడు నీవు నొక్కటే కాదటవే॥

గుట్టుతోడ నీ విభుఁడు కొంగువట్టి తీసితేను
పెట్టరాని వొట్టులేల పెట్టేవే నీవు
చుట్టమై తన ముచ్చట సుద్దులు నీకుఁ జెప్పితే
వట్టితప్పులెల్లా వేసి వాదింతురటవే॥ (31-14)

సవతుల విషయంలో నాయకునిపై అలిగివున్న నాయికతో చెలికత్తె నేడు సవతుల్ని చూసి నీ కెందుకు బాధ! అతన్ని వశం

చేసుకున్న వారిదే గొప్పకాదా. ప్రియుడు నీకు ఎదురుగా నిలబడి వున్నాడు, ప్రియురాలవైన నీవు అతన్ని పిలిచి పీటవేయి. ముందే అతడు స్త్రీల సంబంధంవున్న పాత్రులమగడైతే మాత్రం ఏమిటి! వలపుతా వలచిన వారిదేకదా. అతడు మనసిచ్చి మాటలాడుతున్నాడు. ఆ మాటల్ని అనుసరించి "ఊ" కొట్టు. కలయికకు తాను వచ్చాడు. గుట్టుగా వుంటే ఏమి! వాటమైనచోటికే నీరు వస్తుందికదా. శ్రీ వేంకటేశ్వరుడు నిన్ను చేరడానికి వచ్చాడు, గౌరవించి అతని కౌగిలిలో కలువు. అనేక స్త్రీల సంబంధాల వారకపు రతిలో ఇతడు పరవశించే వాడైతే ఏమి! దృష్టాంతపరచినచోట మోహాతిశయం అవుతుంది కదా అని సముచిత రీతిలో సామెతలద్వారా సలహాలిస్తుంది.

నీకేలే వెఱపు నేఁడు సవతులఁ జూచి
కైకొని కన్నవారిదే కంటి గురుమగాదా ॥

నిలుచున్నాఁడదివో నీ యెదుట రమణుఁడు
పిలిచి పీఁటవెట్టవే ప్రియురాలవు
తొలుతనేఁ యీతఁడు పాత్రులమగఁడైతే నేమి
వలచిన వారిదే వలపింతే కాక ॥ (31-31)

భర్త సకాలానికి ఇంటికి రాకపోతే భార్యకు కోపం, విసుగు కలగడం సహజం. అందువల్ల అలస్యంగా వచ్చిన భర్తను కొంత బెట్టుచూపుతుంది. అలాగే పంతగించుకున్న ఒకనాయికకు చెలికత్తె- ఇతను ఈ వరకే రాలేదని ఎందుకు సాధిస్తున్నావు! ముందుగా ఇతనికి నీ అధరం అందించు. పతి పలికే కొలది బిగుసుకుంటున్నావు! సతికి వంతపుబుద్ధి ఎందుకు! చెక్కులపై చెమటలు కారుతుంటే అలసి పోతూ అవస్థపడుతున్న అతన్ని చూడవచ్చు కదా. అతను చూసే కొలది తెరలోపల జునుగుకుంటున్నావు. సతికి హద్దుమీరడం

ఎందుకు! అలసిపోయిన ముఖంతో వలపులు చల్లుతూ ఇక్కడే వున్నాడు, ఇతన్ని చూడవచ్చుకదా. ఆతను తాకేకోలది చనువు ఇవ్వకుండా ఉండటం ఎందుకు! నీ కౌగిటిలోతృప్తి చెంది తగిన విధంగా నిన్ను మెచ్చుకొని గొప్పగా గౌరవించిన ఇతన్ని చూడవచ్చుకదా అని సీతులు గరవుతుంది.

ఇందాఁకా రాఁడంటూ నేల సాదించేవు
ముందుగా నీ వితనికి మోవి ఇయ్యఁగదవే ॥

పిలువఁగఁ బిలువఁగ బిగిసేవు పతితోను
చలమరి తనమేలే సతికి
చెలపల చెమటయి చెక్కుల వడియఁగ
అలయుచుఁ బెనఁగీ నతనిఁ జూడఁగదె ॥ (31-38)

అలిగివున్న భార్యను పతిదగ్గరకు రమ్మని పిలుస్తూ చెలికత్తె- నీ భర్తతో భేదం కలిగించే మాట లెందుకు ఆడిస్తున్నావు! కోరికతో అతడున్న చోటికి రావచ్చుకదా. ప్రక్కనుంటే మోహం కలుగుతుంది కానీ చాటుకెళ్ళితే పొందు కలుగుతుందా! తరచుగా రావడం జరిగితే ప్రేమ కలుగుతుంది కానీ గర్వాతిశయంతో వుంటే మనసు కరుగుతుందా! మాట్లాడుతూ ఉంటేనే మర్మాలు కలుగుతాయి కానీ గర్వంగా, మౌనంగా వుంటే మోహం నిండుతుందా! కలయికకు పెనుగులాడితే రతి కొనసాగుతుంది కానీ అసంబద్ధంగా భయపడితే సంబంధం అమరుతుందా! పట్టుకొని కౌగిలించుకుంటే సిగ్గు తేటపడుతుంది కానీ గోప్యంగా ఎంత ఉన్నా కోరుకున్నట్లు అవుతుందా! ఇప్పుడే శ్రీ వేంకటేశుడు నిన్ను ఏలుకున్నాడు. కలసి వుండకపోతే రుచులు అధికమవుతాయా! అని లాలనగా సదుక్తులను ఉపదేశించటం వ్యక్తమవుతుంది.

ఏమే యెడమాట లేలాడించే వాతనితో
కామించి నీ పతియున్న కడకు రాఁగదవే ॥

దాకొని వద్ద నుంటేనే తగులాఁ గాక మోహము
ఆకడ తెరమాటైతే నందునా పొందు
రాక దరచైతే మొక దాకిరి గలుగుఁ గాక
చేకొని గర్వాన నుంటే చిత్తము గరఁగునా ॥ (31-51)

భర్త రానంతవరకు ఎదురుచూసి, వచ్చిన తర్వాత ఉద్రేకంతో మండిపడుతున్న భార్యతో ఒక చెలికత్తె– పతి పిలుస్తుంటే ప్రతిసారీ పెనుగులాడుతున్నావు, నీకు బలం ఎంతవుంది! ఇష్టపడి నిన్ను కలియగా తలవంచుకుంటున్నావు, పంతం ఎంతదాకా నీకు! అతడు ఏకాంతంగా నీ మర్మస్థానాలు తాకితే పంతాలాడుతారా! సంతోషంగా నీ మగడు సరసాలాడుతుంటే ఇంకా విచారించడం ఎందుకు చెలీ! అతను నీతో కలియగా కసురుతున్నావు ఆ సమయంలో నీకు వేడుక ఎంతవుంది! జతకూడి వుండగా పరవశించి మోహిస్తున్నావు. తప్పులు పట్టడం ఎందుకే! అని మృదువుగా నీతి చెప్పడం కనిపిస్తుంది.

ఈతఁ డిందాఁ కా రాఁడంటా నెదురులు చూచితివి
యేతులకు నిప్పుడేల యెగసక్కేలాడేవే ॥

పిలువఁగా బిగితోను పెనఁగేవు సారెకు నీ
బలిమెంత గలదే పడఁతీ
చెలరేఁగి నిన్నుఁ గూడఁగా శిరసు వంచుకొనేవు
చలమెందాఁ కానే నీకు సకియా ॥ (31-62)

నాయకుడు శృంగారచేష్టలు చేస్తుంటే అందుకు ప్రతిస్పందనగా సముచిత రీతిలో ప్రవర్తించిన నాయికను చెలికత్తె మెచ్చుకుంటూ

చాల్గా బాగుంది, నీ సతిని అందరూ మెచ్చారు. ఇలాంటి స్త్రీకి నీవే తగుదువు. అతను ప్రేమగా ఇలాగే చూస్తే యౌవనంలోని సిగ్గరి స్త్రీ తలవంచుకోవాలి. అతిశయించి తాకితే తెలివివున్న నేర్పరి అయిన స్త్రీ చిరునవ్వు నవ్వాలి. ఆనందంగా పైన చేయి వేస్తే గుట్టు కలిగిన స్త్రీ ఇష్టపడి వుండాలి. శ్రీ వేంకటేశ! నీ సతిని ఏలుకున్నావు. నీ దేవేరికి సౌభాగ్యసంపద స్థిరమయింది అని ప్రశంసించడం వ్యక్తమవుతుంది.

మేలు మేలు నీ సతిని మెచ్చిరిందరు
యీలాగు నీవే తగుదు విటువంటిదానికి ॥

తప్పకిట్టె చూచితేను తలవంచు కొనవద్దా
కప్పిన జవ్వనపు సిగ్గరి దానికి
చిప్పలఁ జెనకితేను చిరునవ్వు నవ్వవద్దా
నెప్పునఁ దెలివిగల నేరుపరి దానికి ॥ (31-83)

ప్రియునిపై అలిగివున్న ప్రియురాలితో చెలికత్తె భావుకతతో- అతనివల్ల నేరమేమిటో విచారించుకో వచ్చుకదా. సంతోషంగా ఇవన్నీ కూడా తార్కాణాలేకదా. అతడు వచ్చిపోకల్ని తీసుకొని వాటిని నీ గుబ్బలపై వేశాడని, కొసరి కొసరి నీవెందుకు కోపగిస్తావు! ముచ్చటగా నీ చన్నులు మొలచేటప్పుడు అచ్చంగా అవి పోకలంతే సివే కదా. తామరతూడుతో నీ చెయ్యి తాకించాడని అతన్ని ఎన్ని సార్లు వ్యంగ్యాలాడుతావు! ఇలపై నీ చేతుల్ని పోల్చిచూస్తే అవి వసంతకాలంయిటి తామరకాడల సొగసులేకదా. నీ మెడకు ముత్యాల దండ తగిలించాడని, నీకు మితిమీరిన సిగ్గులెందుకు! అతడు శ్రీ వేంకటేశ్వరుడు. నీవు అలమేలు మంగవు (అలరు మేల్ మంగై = పూవు మీది పడుచు-పద్మావతి), మీ రతి చెమట ముత్యాల రాసులేకదా

అని ఆమె అలుకపోవడానికి నిరూపణలు చెప్పడం హృద్యంగా వర్ణించబడింది.

తలఁచుకొనఁగదే యాతనివల్ల నేరమేది
యెలమిఁ దారుకాణలే ఇన్నియుఁ గావా ॥

పచ్చిపోఁ కఁగొని నీ గుబ్బలాతఁడు వేసెనంటా
కొచ్చి కొచ్చి నీవేల కోపగించేవే
ముచ్చటగా నీ చన్నులు మొలచేయప్పటివేళ
అచ్చముగా నా పోఁకలంతేసివే కావా ॥ (31-88)

సమాజంలో బహుభార్యత్వం ప్రవర్తిల్లుతున్న కాలంనాటి అన్నమయ్య సంకీర్తనల్లో కూడా ఒక నాయకునికి బహునాయికలు ఉండటం కనిపిస్తుంది. జగన్నాయకుడైన మహావిష్ణువు శ్రీకృష్ణావతారంలో పదహారు వేలమంది గోపికలతో, ఎనిమిదిమంది అష్టమహిషులతో శృంగార లీలా వినోదాలు ప్రదర్శించాడు. ఈ కలియుగంలో అలనాటి వేదవతి పద్మావతిగా, భూదేవి గోదాదేవిగా అవతరించి శ్రీనివాసునే వరించి పరిణయమాడారు. ఇంకా బీబీనాంచారు అనే మహమ్మదీయ యువతికూడా స్వామినే వరించి శ్రీ రామానుజుల అమృత హస్తాల మీదుగా పరిణయమాడింది. ఈ విధంగా భక్తుల, భక్తురాండ్ర కోరికలు తీర్చడం కోసం శ్రీ వేంకటేశ్వరుడు దక్షిణ నాయకుడయ్యాడు. అందుకే ఈ స్వామి శృంగార శ్రీనివాసుడుగా ప్రఖ్యాతి గాంచాడు. అంతేగాక వైష్ణవ మధుర భక్తిసంప్రదాయంలో విష్ణుమూర్తి ఒక్కడే పురుషుడు కాబట్టి సృష్టిలోని సమస్త జీవులు తమను తాము నాయికలుగా, భార్యలుగా భావించుకొని ఆరాధించడం కనిపిస్తుంది. అన్నమయ్య శృంగార సంకీర్తనల్ని ఆనాటి కాల పరిస్థితుల దృష్ట్యా, మధుర భక్తితత్వం దృష్ట్యా సానుకూల మనస్సుతో అర్థంచేసుకోవాలి.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో ప్రేయసీ ప్రియ శృంగార భావనలు, సమైక్యతలు ప్రణయపుటలుకలు, సఖీజన లాలనలు, సందేశాలు, ఆదేశాలు మనోహరంగా వర్ణించాడు. ఇందులోని ప్రబోధాలు సామాన్య భార్యా భర్తలకు, ప్రేయసీ ప్రియులకు అత్యంత సన్నిహితంగా, ఉపయోగకరంగా వున్నాయి. సాహిత్య పరమార్థమైన ఆనందం, ఉపదేశం రెండూ ఈ శృంగార సంకీర్తనల్లో ప్రస్ఫుటమవుతున్నాయి. పాత్రల మనస్తత్వాలు, ప్రవర్తనలు, మధుర భక్తి భావాలు సహృదయాకర్షకంగా, భావరమ్యంగా వెలుగొందుతున్నాయి.

సమాలోచన

**1-9-1995.**



# కాలహరణం కూడదని అన్నమయ్య ఆవేదన

కాలం ఎంతో విలువయింది. ఈ లోకంలో పోగొట్టుకొన్న ఏ వస్తువునైనా తిరిగి సంపాదించవచ్చు కానీ గడచిన కాలాన్ని మాత్రం తిరిగి సంపాదించలేము. దీనికి సంబంధించిన—

ధనము పోయిన గడియింప దగును మరల
గృహము పాడైన తిరిగి నిర్మింపవచ్చు
బంగరేదార పోయినం బడయవచ్చు
కడిచిపోయిన నిమిషముంబడయ లేము

అనే పద్యం లోక ప్రసిద్ధమయింది.

మానవుడు అమూల్యమైన కాలాన్ని ఐహిక, ఆముష్మిక తార్యకలాపాలకు, కర్తవ్యానికి సద్వినియోగం చేసుకోవాలి. జ్ఞానుల దృష్టిలో కాలాన్ని సద్వినియోగం చేసుకోవడం అంటే దైవాన్ని గూర్చి తెలుసుకోవడమే. అన్నమయ్య భక్తిజ్ఞాన వైరాగ్య సంపన్నుడు. ఈ పరమభక్తుని దృష్టిలో దేవుడంటే శ్రీమన్నారాయణుడే. అయన ఈనాటి తిరుమల శ్రీనివాసుడు. ఈ స్వామిపై అన్నమయ్య వ్రాసిన ముప్పైరెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనల్లో శోధించి వలసిన ఎన్నో అంశాలున్నాయి.

అన్నమయ్య తన జీవితానుభవలను, లోకానుభవాలను సంకీర్తనలలో పొందుపరచాడు. లోకుల బాధలను తన బాధలుగాభావించ వారితో మమైక్యం చెంది దైవానికి విన్నపించుకున్నాడు అన్నమయ్య వ్యక్తిగతంగా తాను పశ్చాత్తాపం చెందుతున్నట్లుగా మనకు

సంకీర్తనలలో కనిపించినా అది బుద్ధిపరిపక్వం చెందిన నాటి మానవుల పశ్చాత్తాపంగా కూడా మనం భావించవచ్చు.

మానవుడు అజ్ఞానంతో జీవితం కాలాన్నంతా ఐహిక లంపటాలకే వినియోగిస్తాడు. చివరికి ఇల్లు, ఇల్లాలు, పిల్లలు, సంపద, చదువులు పదవులు, పెత్తనాలు ఇవి ఏవీ తన వెంటరావు. అప్పుడు పశ్చాత్తాపం చెంది తనను తాను నిందించుకుంటాడు. దైవాన్ని గూర్చి తెలుసుకోకుండానే జీవితం గడచిపోయిందని చివరిరోజుల్లో బాధపడతాడు. ఈ విషయాన్నే అన్నమయ్య నాకెక్కడ జ్ఞానం! నాకెక్కడ తెలివి! కాలమంతా దైవాన్ని తెలుసుకోకనే బూడిదలో హోమమంలా, అగ్ని చెంతనున్న వెన్నలా, పొదచాటు మృగంలా, పుక్కిటి పురాణంలా వృథా అయి పోయిందని ప్రసిద్ధమైన సామెతలద్వారా అర్థస్ఫూర్తిని సులభంగా తెలియజేశాడు.

ఏడసుజ్ఞాన మేడ తెలివి నాకు
బూడిదలో హోమమై పోయఁగాలము ॥

ఇదె మేలయ్యీడి నాకదెమేలయ్యీడినని
కదిసిన యాసచే గడపలేక
యెదురు చూచి చూచి యెలయించి యెలయించి
పొదచాటు మృగమై పోయఁగాలము ॥ (1-48)

కాలం వృథా చేసిన తర్వాత మానవునికి కాలం విలువ తెలిసివస్తుంది. జ్ఞాని అయిన తర్వాతనే మానవుడు ఈ లోకంలో ఎవరు సత్యం! ఎవరు శాశ్వతం! ఎవరు నిజబంధువులు అని తెలుసుకుంటాడు. అప్పుడు ఆదైవం మీద తన మనసు ఎప్పుడు స్థిరం అవుతుందా అని విచారిస్తాడు. ఒకసారి తినగానే ఆకలి శశ్వతంగా తీరిపోదు. ఇలా తింటూనేవుంటే శరీరంలో మద వికారాలు కలుగుతూనే ఉంటాయి.

తినడం మానేదెప్పుడూ! ఈ కోర్కెలు తీరేదెప్పుడు! దైవ స్వరూపాన్ని తలచుకొనేదెప్పుడు! పుట్టింది మొదలుకొని చేతికి విశ్రాంతి లేకుండా తింటున్నా కూడా తృప్తి తీరడం లేదు. కాబట్టి నన్ను పవిత్రం చేసే నీ కరుణామృతాన్ని నాకిచ్చి నన్ను పాలించు అని శ్రీ వేంకటేశ్వరుని అన్నమయ్య వేడుకోవడం వ్యక్తమవుతుంది.

పోయంగాలము వృథయై పుట్టిన మొదలుంగటకట
నీయెడనామది నిజమై నిలుచుట యెన్నఁడొకో
కుడిచిన నాఁకలి దీరదు కుడువఁగఁగుడువఁగఁబై పై
కడు బొదలెడు దీపనమిది గడచుట యిఁక నెట్లు

కుడువకమానుట యెన్నఁడు కోరిక దీరుటయెన్నఁడు
తడయక నీరూపము నే దలఁచుట లెన్నఁడొకో॥

ఐహిక సంబంధమైన చుట్టాలు, బిడ్డలు, భార్యలు, స్నేహితులు వీరందరును భ్రమలు కలిగించేవారే కానీ వీరినే నిజమని నమ్మి శ్రీహరిని మనసులో ధ్యానించకుండా కాలాన్ని వృథాచేసి మోహామతి నయ్యాను, తల్లులు, తండ్రులు వీరందరు బాధపెట్టేవారే కానీ వీరి అనుబంధమే సుఖం అనుకొని అచ్యుతుని ఆత్మలో నిలపకుండా దిగులు పడుతున్నాను. అన్నలూ, తమ్ములూ తనకు మేలు చేసేవారు కారు. పేరు ప్రఖ్యాతులకు, పంతాలకు ప్రాకులాడేవారే. అంతరాత్మ యైన శ్రీనివాసుని సేవించకుండా సంసారంలోనే ఆయాసాలకు లోనయ్యాడు. అయ్యో కాలం, ప్రాయం అంతా వృథా అయిపోయిందే అని ఆవేదన చెందాడు.

అయ్యో పోయ బ్రాయము గాలము
ముయ్యంచు మనసున నే మోహామతినైతి॥

చుట్టంబులా తనకు సుతులు గాంతలు జెలులు
వట్టియాసల బెట్టువారేగాక
నెట్టుకొని వీరు గడు నిజమను చుహరినాత్మ
బెట్టనేరక వృథా పిరివీకులైతి॥ (1-1 9)

కాలం అడవికి కాచిన వెన్నెలల్లా వృథా అయిపోతుందని మానవులు మాయలోపడి చెడిపోకుండా శ్రీహరిని తలచుకోవాలని, మదనుడు ప్రవేశించకుండా మనసును చిక్కబట్టుకొని ఏకాగ్రతతో భగవంతుని తలచుకోవాలని. బూరుగుచెట్టును ఆశ్రయించిన చిలుక వలె ఇతరులను ఆశ్రయించిన మానవులు నిష్ప్రయోజకులవుతారని. మచ్చికతో తన గురువు, దైవం అయిన శ్రీనివాసుని పాదాలను ఆశ్రయించినవారికి భవబంధాలుండవని అన్నమయ్య ప్రజలకు జ్ఞాన బోధ చేశాడు.

పోయ గాలం బడవికి గాయు వెన్నెల కరణిని
శ్రీయుతు దలచు డీనరులు మాయ బడిచెడక ॥

చిత్తము చేకూరుచు కొని చిత్తైకాగ్రతను
చిత్తజ గురుని దలచుడీ చిత్తజు జొరనీక ॥

బూరుగు మాకున జెందిన కీరము చందమున
ఆరయ నిష్ఫలమగు మరి యన్యుల జేరిన ॥

కూరిమి మా తిరువేంకటగిరి గురు శ్రీపాదములు
చేరినవారికి భవములు చెందవెపుదు నటుగాన ॥

(1-194)

కాలమంతా పూటపూటకు వృథా అయిపోతుందని. చేయి, నోరు అపజయం చెందాయని, బ్రతుకుతెరువుకోసం తిప్పన, తొప్పన

మొదలైన నరులను పొగడి పొగడి పొగడి ఆశ్రయించినా కుప్పలు తెప్పలుగా నున్న కోరికలు హృదయం నుండి తొలగడం లేదని, ఇహపరాలు రెండూ లేక చెడిపోయామని, ఈ రోతలుగూర్చి ఇంక చెప్పలేమని, బుద్ధి గలిగి శ్రీవేంకటేశ్వరుని తలచలేక కుక్కకాటుకు చెప్పులాటలాగా ఈరోతలన్నీ కూడుకున్నాయని, మానవుల బ్రతుకు బాధలను గూర్చి, వారు కాలాన్ని వృథాపరచడాన్ని గూర్చి అన్నమయ్య ఎంతో ఆవేదన చెందాడు.

పోయఁబోయ గాలమెల్ల పూఁట పూఁటకు
చేయినోరు నోడాయ చెల్ల బోయీరోఁతలు ॥

తిప్పన తొప్పన కేతు దేవన బావన గన్న
పవ్వన బొప్పన గారి బాడిపాడి
కుప్పలు దెప్పలు నైన కోరికలు మతిలోన
యెప్పుడు బాయక పోయ నెన్ని లేవు రోఁతలు ॥

మానవుడు తనకు తానుగా కర్తవ్యోన్ముఖుడైతే మంచిదే. ఒకవేళ ఏమరుపాటు చెందితే జ్ఞానవంతుడు హెచ్చరిక చేసినప్పుడు తెలుసుకోవాలి. అలా కాకుండా అజ్ఞాన స్థితిలో ఉంటే అలాంటి వారిని ఎవరూ ఉద్ధరించలేరు. ఈ విషయాన్నే అన్నమయ్య తాటి చెట్టు ఎక్కేవాణ్ణి వదలకుండా ఎంతసేపు తోయగలం! మట్టి తినే దూడను మట్టి తినవద్దని తల మొత్తుకొని ఎంతసేపు కనిపెట్టుకొని ఉండగలం! నీచాన్ని తొక్కవద్దంటే కోరి దాన్నే తింటాననేవాడు చక్కబడకుంటే ఏమిచేయగలం! అలాగే చెడిపోయిన మనస్సు చిరకాలం నుంచి నిందలకు లోనై తృప్తిపడకుండా పోయింది. ఆశలపై వ్యామోహం చెందిన శరీరం కన్నపు కత్తుల చూపును కట్టరాకుండా పోయింది మత్తుచల్లినటుగా నా ఆత్మ శ్రీవేంకటపతిని వదలకుండా

ఆశ్రయించి భయాన్ని పోగొట్టుకొన్నది. కాబట్టి పూట పూటకు వృథా అయిపోతున్న కాలాన్ని పరమాత్మను ధ్యానించడం ద్వారా సార్థకం చేసుకోవాలి అని బోధించాడు.

పోయ బోయ గాలమెల్ల పూటకు
రోయని రోంతలు చూచి రుచి చూర బోయ ॥

తాడిమానెక్కేటి వాని తడియక పట్టి పట్టి
తోడ దోడనెందా కా దోయవచ్చును
కాడు వడ్డ చిత్తమిది కలకాలము నిట్టె
ఆడికెలకు లోనై తనియక పోయ ॥ (1-208)

మానవుడు తెలుసుకొని ఆచరించవలసిన ఎన్నో అంశాలను అన్నమయ్య తనసంకీర్తనల్లో తెలియజేశాడు. జటిలమైనవిషయాల్ని సరళంగా వ్యక్తం చేస్తాడు. ఆయన సంకీర్తనల లక్ష్యం సామాన్య ప్రజల చైతన్యం. భక్తి, నీతి, వైరాగ్యం, శృంగారం, యోగం మొదలైన ఎన్నో అంశాలను సులభశైలిలో అభివ్యక్తం చేశాడు. కాలాన్ని వృథా చేయకూడదని, పురుషోత్తముడైన శ్రీనివాసుని సేవించి కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలని తద్వారా మానవ జన్మను సార్థకపరచుకోవాలని అన్నమయ్య ఈ సంకీర్తనల్లో తెలియ జేశాడు.

సమాచారమ్ (దినపత్రిక)
18-9-1994.

శ్రీ అన్నమయ్య 586, 587 వ జయంత్యుత్సవ సంచిక
అభినయ ఆర్ట్స్ అకాడమి
విశాఖపట్నం.

# పదసాహిత్యం అన్నమయ్య నాటకీయత

తెలుగు సాహిత్యంలో సంగీతాత్మకమైన పదప్రక్రియకు ఓంకారనాదం వినిపించిన విశిష్ట వాగ్గేయకారుడు తాళ్ళపాక అన్నమయ్య. ఇతడు వేద-శాస్త్ర-పురాణ-రామాయణ-భారత-భాగవతాది పవిత్ర గ్రంథాల సారాంశాన్ని, వైష్ణవాధిక్యతను, భక్తి - జ్ఞాన - వైరాగ్య నీతులను సర్వజనులకు బోధించడానికి పదరచనను చేపట్టాడు. పదప్రక్రియకు నిర్దిష్ట లక్షణాలను తెలియజేస్తూ సంకీర్తన లక్షణ గ్రంథాన్ని రచించి తదనుగుణంగా ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనల్ని శ్రీ వేంకటేశ్వర ముద్రాంకితంగా రచించి పదకవితా పితామహుడుగా ఖ్యాతి గాంచాడు.

కావ్య స్రష్టలైన ఒక్కొక్క మహాకవికి ఒక్కొక్క కావ్య శైలి ఉంటుంది. అది ఆ కవుల ప్రత్యేకతను చాటుతుంది. నన్నయ్య కథాకథన శైలికి, ఎర్రన వర్ణనాత్మక శైలికి ఒరవడి అయితే నాటకీయశైలి అనగానే మనకు తిక్కన గుర్తుకు వస్తాడు. తిక్కన మహాభారతాన్ని కావ్యలక్షణాలతో కూడిన ప్రబంధంగా తీర్చిదిద్దడమే కాక నాటకీయంగా కూడా మలచాడు. "నాటకాంతంహి సాహిత్యం, కావ్యేషు నాటకం రమ్యమ్, అని ఆర్యోక్తి. తిక్కన రచించిన భారతాన్ని ముఖ్యంగా విరాట, ఉద్యోగ పర్వ ఘట్టాల్ని చదువుతుంటే కథ చదువుతున్నట్లు కాక నాటకంలోవలె పాత్రలే మన కళ్ళముందు నిలబడి సంభాషిస్తున్నట్లు, హావ భావవిలాస విభ్రమాదుల్ని ప్రదర్శిస్తున్నట్లు, ఆంగికాభినయం చేస్తున్నట్లు సహృదయ

పాఠకులకు అనుభూతి కలుగుతుంది. దీనినే నాటకీయత అంటారు. కథ సంవాద రూపంలో సాగితే దానిని నాటకీయతగా చెప్పవచ్చు.

సంవాదం నాటకీయతలో ఒక భాగం. నాటకీయతలో అత్యంత ముఖ్యమయింది పాత్ర సృష్టి. కవి తెరమరుగున వుండి విభిన్న మన స్తత్వాలు కల్గిన పాత్రల ద్వారా సందేశాన్ని వ్యక్తంచేస్తుంటాడు. అలా పాత్రల మనోభావాలను చిత్రించడంలో కవి నైపుణ్యం వ్యక్త మవుతుంది. శ్రవ్యకావ్యంలో నాటకీయతవల్ల పాఠకులకు రసానందం కలుగుతుంది. అన్నమయ్య రచించిన వేలాది సంకీర్తనల్లో అధిక మైనవి శృంగార సంకీర్తనలే. ఈ శృంగార సంకీర్తనలన్నీ ఇంచు మించు నాటకీయతను కలిగియున్నవనే చెప్పాలి. ఎందుకంటే కొన్ని సంకీర్తనల్లో పాత్రల సంవాదం కనిపించకపోయినా ఒక పాత్ర అలిగి మౌనంగా ఉండటం, ఆ పాత్రకు మరోపాత్ర ఏదో సందేశం చెబు తున్నట్లుగా అనుభూతి కలుగుతుంటుంది. కొన్ని సంకీర్తనల్లో మాత్రం పాత్రల సంభాషణ తద్వారా ఆ పాత్రలు తెలియజేస్తాయి.

అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో సంవాదధ్వని ముఖ్యంగా నాయికా నాయకులైన పద్మావతీ శ్రీనివాసుల మధ్య, చెంచితా కృష్ణుల మధ్య, గొల్లెతా గొల్లడుల మధ్య, అత్తా కోడళ్ళయిన లక్ష్మీ సరస్వతుల మధ్య, రుసరుసలాడే సపత్నుల మధ్య, సరస సల్లాపాలాడే బావా మరదళ్ళ మధ్య, ఒయ్యారం ఒలకబోసే చెలి కత్తెల మధ్య పొంగి పొరలు తుంటుంది. అది రస హృదయులను రాగరంజితం చేస్తుంటుంది.

నాటకీయత - బావామరదళ్ళు : బావామరదళ్ళ సరసం ఒక రసవత్తరమయింది.

"ఏలే యేలే మరదలా చాలు జాలు చాలును
చాలు నీతోడి సరసంబు బావ (12-123)

అనే సంకీర్తన బావామరదళ్ళ సంవాదం. ఇందులో బావ తనపై అలిగివున్న మరదల్ని "ఎందుకే" అని బుజ్జగించ పోతుంటే కొంటె మరదలు "చాలు చాల్లే నీతో సరసంపోబావ" అని కసురు కోవడం "బిగుసైన నీకుచాలు కదలిపోయేలా కులుకుతున్నావే, మాటలు నేర్చిన మరదలా" అని బావ సరస సల్లాపాలాడుతూ సమీపిస్తుంటే, ఆ చలాకీ మరదలు తన బావతో - అంతకూ ఇంతకూ నన్ను తాకుతున్నావు, ఈ వట్టి బూటకాలు మానుపో బావ అని ప్రేమ కోపం ప్రదర్శించడం మన కళ్ళముందు కనిపిస్తున్నట్లుగా శృంగార రసానుభూతి కలుగుతుంది.

నాటకీయత-అత్తాకోడళ్ళు : సృష్టిలోని సహజ వైరాలలో అత్తా-కోడళ్ళ వైరం ఒకటి. ఈ వైరం సామాన్య సంసారులకే గాక దేవతాస్త్రీలకు కూడా తప్పలేదు. గడుసరి అత్త అయిన లక్ష్మీదేవి తన కోడల్ని - రావే కోడల అంటే సొగసరి కోడలైన సరస్వతి ఏమన్నదో తెలుసా - పోవే పోవే అత్తయ్యా, చాలు చాల్లే నీతో స్నేహం అన్నది. రాజాస్థానాలలో రాజులకెదురుగా ఎగిరి గంతు లేస్తావే జంకు, భయమూలేని కోడలా, అని అత్త ఎత్తిపొడిస్తే, కోడలు - నీవు మాత్రం తక్కువైన దానివి కావులే అనుకొంటూ పద్మముఖి అయిన ఓ అత్త! ధనికులైనవారి ఇండ్లకు వరుస పెట్టి తిరుగుతుంటావే అని నిలదీసి అడుగుతుంది. అన్నమయ్య ఈ అత్తా కోడళ్ళ సంభాషణను—

"రావే కోడల రట్టడి కోడల
పోవే పోవే అత్తయ్యా, పొందులు నీతో జాలును ॥
(12-83)

అనే సంకీర్తనలో అత్యంత హృద్యంగా, మిక్కిలి ఉత్సుకతగా, క్రోధరస స్ఫోరకంగా అన్నమయ్య నాటకీయతను ప్రదర్శించాడు.

నాటకీయత-చెలికత్తె పాత్ర : ఒక నాటకాన్ని రంగస్థలంపై ప్రదర్శిస్తున్నప్పుడు కొన్ని సన్నివేశాలలో పాత్రల సంవాదం లేక పోయినా ఒకే పాత్ర సంభాషిస్తుండటం, మరో పాత్ర వింటుండటం చూసుంటాం. అలాగే అన్నమయ్య శృంగార సంకీర్తల్లో కొన్నింటిలో అలాంటి దృశ్యాల్ని చూస్తున్నట్లుగా రసానుభూతి కలుగుతుంటుంది.

"నామాట వినవయ్య నాటక మేల నీనీవు
వేమారు నింతేసి నీకు విన్నవించ గలమా॥ (26-415)

అనే సంకీర్తనలో చెలికత్తె పాత్ర, నాయక పాత్ర మనకు సాక్షాత్కరిస్తాయి, నాయికపై అలిగి మౌనం వహించిన నాయకుని దగ్గరకు చెలికత్తె సమీపించి – నామాట వినవయ్య, ఎందుకు నాటకాలాడతావు ? పలుమార్లు ఇంతగా నీకు చెప్పగలమా ! నీల తాంగిపై నీవు కోపగించుకోవడం మంచిదికాదు ఆమెపై తీపు మాటలు చల్లి ప్రేమించి తెచ్చుకున్నావు. ఆమె నిన్ను ఏమన్నా వకూడా అందుకు నవ్వాలికానీ ఓర్వనంటే చెల్లిపోతుందా ! నీవు మగవాడివి అని పురుష ధర్మాన్ని బోధిస్తోంది. అన్నమయ్య తాను పురుషుడైనా న్యాయ పక్షపాతి సామాన్యంగా లోకులు స్త్రీలకే నీతిబోధ చేస్తారు కానీ పురుషులకు నీతిబోధ చేయడానికి ఇచ్ఛగించరు. అన్నమయ్య సదసద్వివేకి కాబట్టి న్యాయవివక్షతో వ్యవహరిస్తుంటాడు. ఈ సంకీర్తనలో అన్నమయ్య చెలికత్తె పాత్రద్వారా పురుషునికి సందేశమిస్తున్నాడు. చెలికత్తె నాయకుని హితబోధ చేసినట్లే నాయికకు కూడా హితబోధ చేస్తుంది. ప్రియునిపై అలిగి మూలనాడుతూ ఇతర

స్త్రీలకు అతన్ని గూర్చి చెబుతున్న నాయికలను సమీపించి - ఏదో నవ్వులాటకు నాయకుడు నిన్నొకమాట అన్నందుకు పొరుగుస్త్రీలతో అతనిపై ఏమి చెబుతున్నాను! నీవు తగిన విధంగా ఆలోచించి చేస్తే, క్షణంలో నీవు చెప్పినట్లు చేయకుండా ఉంటాడా నీ ప్రియుడు నిన్ను చెయ్యిపట్టుకున్నందుకు వ్యర్థంగా అతన్ని ఎందుకు తిట్టడానికి చూస్తావు? నీవు పాన్పుపై పవ్వళించి ఏమిచేసినా నిన్ను గౌరవించి లోబడకుండా వుంటాడా? నీవు అతనికి ఏమి నేర్పించినా అతడు నిన్ను మెచ్చకుండా వుంటాడా? అని హితోక్తులు చెబుతున్న సన్నివేశం దృశ్యమానం అవుతోంది.

ఈ విషయం—

"మాన గదే ఇంతట నిమంతు విద్యలు
యీనెపాన నతన్ని నియ్యకొనడా॥ (26-484)

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది.

నాయికానాయకులు - నాటకీయత: నాయికా నాయకులు మనస్తాపం కలిగినప్పుడు వివాదాలాడటం, మనోల్లాసం కలిగినప్పుడు ఏకం కావడం సహజం. అన్నమయ్య సంకీర్తనలలో కూడా ఈ విధమైన మనస్తత్వ చిత్రీకరణ కనిపిస్తుంది. ఏదో సహించలేక నిన్ను తిట్టాను అంతేగాక వెగటుగా కలిసే కలయిక లెంకుకులే అనినాయిక అంటే. నీవు కోపగించుకున్నా ప్రేమతో వినయం చూపించే నా మాట నీకు ఇష్టమవుతుందా అని నాయకుడంటాడు! అందుకు సమాధానంగా నాయిక నీకు ప్రేమ ఎక్కడోవుండగా సంతాపమయ్యె ఈ కలయిక నీకు తగదు అని నిష్ఠూరాలాడుతుంది. నేను నిజాలు పల్కినా నీవు తప్పు లెంచుతుంటే శత్రుత్వమే అవుతుందిగానీ ప్రేమ అవుతుందా, అని నాయకుడు లాలనగా చెబుతుంటే, ఈరు తియ్యబోతే

పేనువచ్చిన రీతిగా ఒకటి మాట్లాడుతుంటే మరో అర్థం వస్తుంటే ఇంక మాటలెందుకులే నీ సారము మమ్మింక కదపవద్దు అని నాయిక సమాధానమిస్తుంది. అలాగే ప్రియునిపై సరాగంతో అలిగి అన్న మాట కోపం తెప్పించదు అని నాయకుడు అంటే నీవు గొప్పవాడివి, వేంకటరాయుడివి మనలోవున్న కోపాలన్నీ ఇప్పుడే గెలిచాయి అంటూ పద్మావతీ సతి శ్రీనివాసునితో ఏకంకావడం సజీవదృశ్యంగా కనిపిస్తుంది.

ఆఁపలేక నిను దూరేనంతేకాక
యేపుచు గూడేటి పొందులేలయ్య విభుఁడా ॥
(12-111)

ఇలాంటి సంకీర్తనలు అన్నమయ్య సంకీర్తనలరాశిలో చాలా కనిపిస్తాయి. వీటిని చదువుతుంటే ఆయా సన్నివేశాలలోని దృశ్యాలు మనకళ్ళముందు కనిపిస్తున్నట్లుగా ఆనందానుభూతి కలుగుతుంటుంది. అన్నమయ్య అన్ని వయస్సుల్లోని స్త్రీ పురుషుల మనస్తత్వాలను క్షుణ్ణంగా తెలుసుకున్న మనస్తత్వవేది. కాబట్టి శ్రుతి మధురమైన అలతి అలతి తేట తెనుగు మాటలను ప్రయోగించి లలితమైన మనో భావ లను, సామాజిక సందేశాన్ని ఆయా పాత్రల ద్వారా వ్యక్తం చేసి సంకీర్తనలలో నాటకీయతను అలవోకగా సాధించగల్గాడు. పరమభక్తుడు, సకలశాస్త్ర పారంగతుడు, సంకీర్తనాశిల్పి అయిన అన్నమయ్యకు అలవికాని భాషాభావాలు, శైలీ విన్యాసాలు ఏవీ లేవని, సమస్తం కరతలామలకమే అని ఆయన సంకీర్తనల్ని నిశితంగా పరిశీలిస్తే వ్యక్తమవుతుంది.

తెలుగు భాషాసాహిత్యపరిశోధన పద్ధతులు
యు. జి. సి. జాతీయ సదస్సు 2-12-1993
ఆంధ్ర విశ్వవిద్యాలయం.

# పదకవితా వైతాళికుడు - తాళ్ళపాక అన్నమాచార్యులు

పదిహేనవ శతాబ్దంలో తెలుగు పద్య కవితానందనవనంలో పదకవితా పారిజాతాన్ని పుష్పింపచేసిన తొలి తెలుగు వాగ్గేయ కారుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఇతడు 1408 క్రోధి నామ సంవత్సరంలో వైశాఖమాసం, విశాఖనక్షత్రంలో లక్కమాంబా నారాయణసూరులు అనే భక్త దంపతులకు జన్మించాడు. ఇతని జన్మ స్థలం నేటి రాయలసీమ కడపజిల్లాలోని తాళ్ళపాక అనే గ్రామం. ఈ గ్రామనామమే అన్నమయ్య ఇంటిపేరుగా వెలసింది. అన్నమయ్య మనుమడు తాళ్ళపాక చిన్నన్న ద్విపద ఛందస్సులో రచించిన "అన్నమాచార్య చరిత్రము" ఆధారంగా అన్నమయ్య జీవిత విశే షాలు తెలుస్తున్నాయి. బాల్యం నుంచీ మహాత్ముల జీవితాలు సామాన్యుల జీవితాలకన్నా భిన్నంగా విశిష్టంగా కనిపిస్తాయి.

అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుని నందకాంశంలో జన్మించడం వల్ల చిన్నప్పటినుంచి విశేష లక్షణాలను కనబరచాడు. ఇది తిరుమ లప్పని ప్రసాదమని చెప్పకుంటే ఉగ్గుపాలుకూడా త్రాగేవాడుకాడు. శ్రీనివాసుని పేరు వివరించి పాట పాడకుంటే ఏడుపుమానేవాడు కాడు. అన్నమయ్యకు చిన్నవయసునుంచి "ఆడినమాటెల్ల అమృత కావ్యముగ, పాడిన పాటెల్లబరమగానముగ" పరిణమించడంతో వేంకటపతిమీాద వింతవింతలుగ సంకీర్తనలు రచించాడు.

అన్నమయ్య ఇంటి బంధుజనులపై విసిగివేసారి తిరుమల చేరు కొని స్వామి దర్శనం చేసుకొని ఒక పంచెతిన్నెపై కూర్చొని వున్న

ప్పుడు ఘనవిష్ణువనే యతీంద్రుడు తనకు స్వామి స్వప్నంలో కనిపించి చెప్పినరీతిగా అన్నమయ్యకు వైష్ణవదీక్ష ఇచ్చి పంచ సంస్కారాలు గావించాడు. నాటినుండి అన్నమయ్య అన్నమాచార్యుడయ్యాడు, వైవాహిక జీవితంపై ఐహిక బాంధవులపై విముఖుడుగా ఉన్న అన్నమయ్య శ్రీనివాసుని ఆదేశం మేరకు తల్లితోపాటు తాళ్ళపాక చేరుకొని తిమ్మక్క, అక్కలమ్మ అనే ఇద్దరుకన్యలను వివాహమాడి గృహస్థాశ్రమాన్ని స్వీకరించాడు.

ఆనాడు కడప మండలాన్ని పరిపాలించిన విజయనగర ప్రభువైన సాళువ నరసింగరాయలు అన్నమయ్య సంకీర్తనల ప్రసిద్ధిని విని తన ఆస్థానానికి పిలిపించి సంకీర్తన పాడమనగా అన్నమయ్య రసరాగాలుట్టి పడేలా 'ఏమొకో చిగురుట ధరమున" అనే పాట పాడాడు. ఆ పాటలోని సరస శృంగార వర్ణనకు రాయలు ముగ్ధుడై అంతటి వర్ణనా చాతుర్యం కాళిదాసాది ప్రముఖ సంస్కృత కవుల్లో కూడా కానరాదని కొనియాడి అలాంటిదే తనపై పాడమని కోరగా అన్నమయ్య—

'నరహరికీర్తన నానిన జిహ్వ
ఒరుల నుతింపగ నోపదు జిహ్వ'

అని తన నాలుక శ్రీహరినే కీర్తిస్తుందని, ఇతరుల్ని కీర్తించదని భక్తి విశ్వాసాలు, దృఢ వ్యక్తిత్వం వున్న అన్నమయ్య తిరస్కరించాడు. రాజు ఆగ్రహించి సంకెళ్ళు బిగించి కారాగారంలో బంధించగా అన్నమయ్య స్వామిని ప్రార్థించి బంధ విముక్తుడయ్యాడు. పశ్చాత్తప్తుడైన రాజును అన్నమయ్య క్షమించి రాజుకు జ్ఞానాన్ని బోధించాడు. అతడు దివ్య దేశసంచారం చేస్తూ ఆయా వైష్ణవ దేవాలయాలలోని విష్ణుమూర్తులను స్తుతిస్తూ రోజుకొక్క సంకీర్తన

చొప్పున ముప్పై రెండు వేల శృంగార అధ్యాత్మ సంకీర్తనలు శ్రీ వేంకటేశ్వర ముద్రాంకితంగా రచించి ఆ స్వామికే అంకితమిచ్చాడు! నరసింహస్వామి భక్తుడైన శఠగోపమునిని, శ్రీరంగ విఠలుని భక్తుడైన పురందరదాసును కలుసుకొన్నాడు అందరూ ఒకరికొకరు సంభావించు కొన్నారు.

చిన్ననాటి నుంచి స్వామిని త్రికరణ శుద్ధిగా కీర్తించి నందువల్ల అన్నమయ్య మహిమాన్వితు డయ్యాడు. ఎవరో ఒక పేద బ్రాహ్మణుడు తన వివాహానికి కాసులు లేవని అన్నమయ్యకు విన్నవించగా అతని ఆశీర్వాదం వల్ల ఆ బ్రాహ్మణుని ఒక రాజు పిలిచి కావలసిన ధనం ఇచ్చి పంపాడు. అలాగే స్వామికి నైవేద్యంగా సమర్పించిన మామిడి పండ్లు పుల్లగా ఉండటంచే స్వామిని స్మరిస్తూ మామిడి చెట్టును స్పృశించడంచే ఆ పుల్ల మామిడిచెట్టు తియ్య మామిడి చెట్టుగా మారింది. పరమ పావనుడైన అన్నమయ్య 1503 దుందుభినామ సంవత్సరం ఫాల్గుణ బహుళ ద్వాదశినాడు తన ప్రియ దైవమైన వేంకటాచల నిలయునిలో లీనమయ్యాడు.

అన్నమయ్య సంకీర్తనలే కాక పన్నెండు శతకాలు, సంస్కృత వేంకటాచాల మహాత్మ్యం, సంస్కృత సంకీర్తన లక్షణం, ద్విపద రామాయణం, శృంగార మంజరి మొదలైన కృతులు రచించాడు. ఇందులో ప్రస్తుతం తిరుమల తిరుపతి దేవస్థానముల కృషివల్ల పదిహేను వేల సంకీర్తనలు, అలమేలు మంగపై శ్రీ వేంకటేశ్వర ముద్రతో రచించిన ఒక శతకం మాత్రం లభించాయి. అన్నమయ్య సంకీర్తనలు రెండు పాదాల పల్లవితో, నాలుగు పాదాల మూడేసి చరణాలతో యతి ప్రాసలు, మార్గదేశి తాళాలు, మాత్రాగణాలు, ముద్ర అనే ప్రధానలక్షణాలతో కూడుకొన్నవి. అక్కడక్కడ

పల్లవి చరణాల సంఖ్య, పాదాల సంఖ్య, హెచ్చుతగ్గులుగా కని పిస్తుంటాయి.

అన్నమయ్య రచించిన సంకీర్తనలను బట్టి ఆనాటి రాజకీయ నైతిక, సాంఘిక పరిస్థితులను కొంతవరకు తెలుసుకోవచ్చు.

తలిగాని యీ పాటు దైవమా విచారించవే
కతలాయ చెప్పనేడు కలికాల మహిమ ॥

తుట్టుములై భూసురుల తుండెములు మొండెములు
యిటువలె భూతములు యెట్టు మోచేనో
అటు బాలుల రొదలు ఆకాశ మెట్టిరిచెనో
కటకటా యిట్లాయ కలికాల మహిమ ॥

అంగలార్చె కామినుల యంగ భంగపు దోవు
వింగితాన మింట సూర్యుఁడెట్టు చూచెనో
పొంగు నానాజాతిచేత భువన మెట్లానెనో
కంగిలోక మిట్లాయెఁ గలికాలమహిమ ॥

అనే సంకీర్తనవల్ల ఆ కాలంలో శత్రురాజుల దండయాత్రలు, దౌర్జన్యం, హింసాకాండ, మానభంగాలు మొదలైన అత్యాచారాలు జరిగినట్లు ప్రజలు సుఖశాంతులు లేకుండా తల్లడిల్లినట్లు తెలుస్తుంది.

పట్టభద్రుఁడు గూర్చుండే బలు సింహాసనముపై
వెట్టిబంటుఁ బెట్టేవారు వెట్టులేకారా
కొంచక సింహముండేటి గుహ నుండవచ్చునా
పొంచి నక్కల కెల్ల బొక్కలే కాక ॥

అనే సంకీర్తనవల్ల అన్నమయ్య కాలంలో రాజ్యపాలనా నిర్వహణలో పంచాయితీ వ్యవస్థ ఉండేదని, సభ్యులను ప్రజలే ఎన్ను

కొనేవారని తెలుస్తుంది. ప్రజలచే ఎన్నుకోబడిన అసమర్థులైన సభ్యులను అన్నమయ్య నిరసించడం ఇందులో వ్యక్తమవుతుంది.

తావు లేలే రాజులకు దయకొంత పుట్టదాయ
కావరమే ఘనమాయ ॥

అనే సంకీర్తనవల్ల రాజులు ప్రజలపట్ల నిర్దయ ప్రవర్తించేవారని తెలుస్తుంది.

విజయనగర రాజుల కాలంలో 1472-74 సంవత్సరం మధ్యలో పెద్ద కరువు వచ్చింది. ఆ కరువులో ప్రజలు ఆకలిమంటలకు, సూర్యుని వేడిమికి స్రుక్కిపోయినట్లు అనేక రకాల కష్టాలకు గురి అయినట్లు తెలుస్తుంది.

"కడు నజ్ఞానపు కరువుకాలమిదె
వెడల దొబ్బి మా వెరపు దీర్చవె" ॥

చింతల చిగురులె చిచ్చులట
ఇంతటి తోనిక నేలాగే ॥

చక్కని మన్మథ సంవత్సరమున
చుక్కల రాజే సూరియుడై
యెక్కువ దినములు యెండగాయు నటు
యెక్కడిదింక బ్రతుకేలాగే ॥"

అన్నమయ్య కాలంలోని నాణేలలో రూక, మాడ, రువ్వ, తారము, కాసు మొదలైనవి ఉండేవని తెలుస్తుంది.

రూకలై మాడలై రువ్వలై తిరిగీని
దాకొని వున్న చోట దానుండ దిది లో
ప్రకటించి కనకమే భ్రమయించీని ॥

బంగారు నాణేలుకూడా వాడుకలో ఉండేవని తెలుస్తుంది.

ఎన్నగ సొర్ణాటంక మింతటాను జెల్లినట్లు
సన్నపుఁ దోలు బిళ్ళలు సరిగాఁ జెల్లునా ॥

విజయనగర చక్రవర్తులు విష్ణుభక్తులు. వీరి కాలంలో విష్ణుభక్తి, వైష్ణవమతం బాగా వ్యాప్తి చెందిరది. తిరుమల క్షేత్రం కలియుగ భూలోక వైకుంఠంగా సుప్రసిద్ధమయింది.

నానాభూములవారు నమ్మి శ్రీ వేంకటపతి
గానవచ్చి యేట నేట ఘనులయ్యేరు ॥

అనే సంకీర్తనవల్ల స్వామి దర్శనం కోసం నానాదిక్కుల నుండి భక్తులు వస్తుండే వారని తెలుస్తుంది. ఒకప్పుడు తిరుమలలో ఉన్న దైవం శివుడని, శక్తి అని విష్ణువు అని వాదించుకొనేవారు. సర్వోత్కృష్ట దైవం విష్ణువేనని, అతడే దేవాది దేవుడని శ్రీరామానుజులు చాటి చెప్పినా కొందరు అజ్ఞానంగా వాదించుకొనేవారని, ఇతర దైవాల కోసం ప్రాకులాడేవారని అన్నమయ్య ఆవేదన పడినట్లు తెలుస్తుంది.

తొల్లిటి పెద్దలెంచి దొడ్డవాఁడు హరియంటా పలికినను
యిల్లిదె నేఁటి పెద్దలు యెవ్వరో దైవములంటా
వెల్లివిరిగా నింకా వెదకేరు ॥

పాపము పాపము ప్రజలారా
పైపై నిటువలె పలుకకురో ॥

హరియందుఁ బుట్టిన జాఁడును శివుడును
హరితో సరి వీరను-ఓట్లు
పొరి గొండలందు బుట్టిన శిలలివి
సరస బెట్టితే సరియౌనా ॥

అనే సంకీర్తనవల్ల ఆనాటి ప్రజలు కొందరు ప్రధాన దైవమైన శ్రీ మహావిష్ణువును గుర్తించక అతనిలో పుట్టిన ఇతర దేవతల్ని అతనితో సమానంగా భావించేవారని, అది అసమంజసమని అన్నమయ్య వారికి తెలియజేయడం కనిపిస్తుంది.

ఇట్టి నాస్తికు మాట నేమని నమ్మేడి దింక
పట్టిసముల మంటా నే భక్తుల దూషింతురు
వేదములు చదువుతా విశ్వమెల్లాఁ గల్లనేరు
ఆ దెస తాము పుట్టుండి అదియును మాయనేరు ॥

అనే సంకీర్తనవల్ల ఆనాడు దైవమే లేదనే నాస్తికులు కూడా వుండేవారని, వారు భక్తుల్ని దూషించేవారని, వేదాలను చదువుతూ కూడా ఈ విశ్వమంతా అబద్ధం అని వితండా లాడేవారని తెలుస్తుంది.

అన్నమయ్య కాలంనాటి సమాజంలో ప్రజలకు కొన్ని విశ్వాసా లుండేవి.

నారాయణుఁడ నీ నామము మంత్రించి వేసి
పారేటి యీ జంతువుల భ్రమ విడిపించవే ॥

అనే సంకీర్తన వల్ల భూతాలు సోకిన వారికి మంత్రించి నయం చేసేవారని తెలుస్తుంది. ప్రజలు తమ కోరికలు తీర్చుకోవడం కోసం మహిమలు కల్గిన మహాత్ముల వెంట ప్రాకులాడేవారని తెలుస్తుంది.

మగఁడు విడిచినా మామ విడువనియట్లు
నగినా మనసు రోసినా లోకులు మానరు ॥

అన్నమయ్య సంకీర్తనల్లో ఆనాటి ప్రజల వృత్తులకు సంబంధించిన అంశాలు కూడా కనిపిస్తాయి.

కాపులము నేము కర్తవు నీవు
దాపుదండై మమ్ము నిట్టే దయఁజూడవయ్యా ॥

పంటల భాగ్యులు వీరా బహు వ్యవసాయము
అంటి ముట్టి యిట్లఁ గాపాడుదురు ఘనులు ॥

వంటి సంకీర్తనలవల్ల ఆనాటి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయమని తెలుస్తుంది.

కాంతల మానమనేటి కరపట్నాలకుదిగె
మంతనాన జీవుఁడనే మరకాఁడు ॥

అనే సంకీర్తనలో ఓడపై సరుకులు వేసుకొని మరకాడు తీరం చేరుకోవడం, తుఫాను గాలులు వీస్తున్నప్పుడు తెరచాపలెత్తి జాగ్రత్తగా ఓడ నడపడం మొదలైన అంశాలను వివరించడంచే ఆనాడు సముద్ర వ్యాపారం కూడా జరిగేదని తెలుస్తుంది.

వాడల వాడల వెంట వాఁడెవో వాఁడెవో
నీడనుండి చీరలమ్మే నేతబేహారి ॥

అనే సంకీర్తనలో వన్నెనూలు, గంజి పోయడం, కండెలు, పసిడినీరు చిలికించడం, పచ్చడాలుకుట్టడం, వాడ వాడలు తిరిగి చీరలమ్మడం మొదలైన అంశాలు ప్రస్తావించబడ్డాయి. దీన్నిబట్టి ఆనాటి నేతవృత్తిని గుర్తించవచ్చు, ఇలాగే కుమ్మరం, వైద్యం, చల్ల అమ్మకం మొదలైన వృత్తి వ్యాపారాలు, బొమ్మలతయారీ, పూతపని మొదలైన కుటీరపరిశ్రమలు అన్నమయ్య కాలంలో ఉండేవని ఆయన సంకీర్తనలవల్ల తెలుస్తుంది.

అట వారి గూడి తేరా
ఆటవారిగూడి అన్నిచోట్ల బొమ్మ
లాట లాడించ నధికుండ వైతి వి
తోలుబొమ్మలు దొరకొని గడియించి ॥

వాలుక చూపులు వాడంగ నాటక
శాలలోన నిను జవరాలు ॥

అనే సంకీర్తనలవల్ల ఆనాడు తోలుబొమ్మలాట ప్రదర్శన ఉండేవని, నాటకశాలలుండేవని తెలుస్తుంది.

బండివిరిచి పిన్నపాపలలో నాడీ
దుండగీఁడు వచ్చెదో బూచి ॥

అనే సంకీర్తనవల్ల చిన్నపిల్లలు బండి విరిచి ఆట ఆడేవారని

గురుతెరిగిన దొంగకూ గూగు వీడె
గుడిలోనె దాఁగీనికూగూగు ॥

అనే సంకీర్తనవల్ల బాలురు కోతికొమ్మంచులాటలాడేవారని తెలుస్తుంది. అలాగే పండుగదినాలలో స్త్రీపురుషులు కలసి ఆడే కోలాటం, స్త్రీలు మాత్రమే ఆడిపాడే గొబ్బిపాట, స్త్రీ పురుషులు వినోదంగా జరుపుకొనే వసంతోత్సవాలు. కాండవమునోము, గౌరి నోము, ముచ్చింతనోము, చిట్టిబొట్లనోము, మొలకనోము మొదలైన నోములు, దీపావళి, సంక్రాంతి, శ్రీరామనవమి, శ్రీకృష్ణజయంతి, హనుమజ్జయంతి, ఉట్లపండుగ మొదలైన పండుగలు. పర్వదినాలు కూడా ఆనాటి సమాజంలో జరుపుకొనే వారని అన్నమయ్య సంకీర్తనల వల్ల తెలుస్తుంది.

అన్నమయ్య ప్రజలను భక్తిజ్ఞాన సంపన్నులుగా, మానవతా మూర్తులుగా తీర్చిదిద్దడానికి సంకీర్తనలు వ్రాశాడు. వేదాలలో రామాయణ, భారత, భాగవతాది హిందూ ప్రామాణిక గ్రంథాలలో ప్రతిపాదించబడిన దేవుడు, ప్రతియుగంలోను శిష్టరక్షణ, దుష్టశిక్షణ కోసం భూమిపై అవతరించే భగవంతుడు విష్ణుమూర్తియే అని, ఆ స్వామికన్నా మించిన దైవం ఎవరూ లేరని సహేతుకంగా ఆధార పూర్వకంగా సంకీర్తనలలో నిరూపించాడు. కేవలం విష్ణుభక్తి ఒక్కటే కాక నీతి, దయవంటి సుగుణాల్ని పెంపొందించడంకోసం అనేక సంకీర్తనలు రచించాడు. సాహిత్యం ప్రయోజనం ఆనందోప దేశాలు ఇవి అన్నమయ్య సంకీర్తనలలో పరిపుష్టంగా కనిపిస్తాయి.

పరపీడన సేయుటకంటె పాపము మరెందు లేదు
పరోపకారముకంటె బహుపుణ్యము లేదు ।

అంటూ ప్రజలకు పరులను పీడంచకూడదని, పరోపకారం చేయాలని బోధించాడు. కామ, క్రోధ, లోభమోహాది అంతశ్శత్రు వుల్ని అణచుకోవడమే బుద్ధి అంటూ—

కొండవంటి తనలోని కోపము రేగవచ్చితే
అండనే హెచ్చరివ్వారకుండుటే బుద్ధి ॥

అనే సంకీర్తన రచించాడు. దేవతలకు జంతుబలుల్ని ఇవ్వ నవసరం లేదని భగవంతుడైన శ్రీహరికి ఒక్కసారి మ్రొక్కినీ వార మని శరణువేడితే చాలునని—

మొక్కరో మీరు మోసమోక
మీకు దిక్కుడైన ఆది దేవునికి ।

మారుచేతులీయవద్దు మారుగాళ్ళీయవద్దు

..............................

ఊరకేనీవారమని వున్నవారాలు ॥

అనే సంకీర్తనలో తెలియజేశాడు. ఆహార నిద్రాభయమైథు నాలు సృష్టిలోని సమస్త జీవులకు సమానమేనని, భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనే పంచభూతాలు అందరిపట్ల సమానంగా వర్తిస్తాయని. వాటికి కుల, మత వర్గ, స్త్రీ పురుష అనే తారతమ్యం లేదని, వాటికి లేని ఈ భేదాలు మానవులకు ఉండకూడదని

నిండార రాజు నిద్రించు నిద్రించు నిద్రయు నొకటె
అంటనేబంటు నిద్ర అదియు నొకటె ॥

అనే సంకీర్తనలో అన్నమయ్య ఆనాడే ఈనాటి ఆధునిక సామ్యవాద సిద్ధాంతాల్ని బోధించాడు. అలాగే స్త్రీ పురుషు లిద్దరూ పుట్టుకతో సమానమేనని, ఒకరు స్వాతంత్ర్యంగా, ఒకరు పరతంత్రంగా బ్రతకడం సమంజసం కాదని ఈనాటి స్త్రీవాద సిద్ధాంతానికి చెందిన—

పొలంతులు జీవులే పురుషులు జీవులే
తలపభావ భేధములేగాని
బలిమి స్వతంత్రము పరతంత్రమొకరికి
ఎలమినిందులో చెల్లే హీనాధికములే

అనే సంకీర్తన రచించాడు. ఇలాంటి వివిధరకాలైన హితబోధ సంకీర్తనలు అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో చాలా కనిపిస్తాయి.

అన్నమయ్య శృంగార సంకీర్తనలు మధురభక్తికి చెందినవి. భగవంతుని ప్రియునిగా భావించి తనను ప్రేయసిగా భావించుకొని

భక్తుడు ఆరాధించటం మధురభక్తి. అన్నమయ్య తాను హరిని వదలి బ్రతకలేనని చెలికత్తెకు తన విరహవేదనను చెబుతున్నట్లుగా—

తమ్ములాల అన్నలాల తల్లులాల నే
నెమ్మనపుహరి బాసి నిలువలేని కను ॥

అనే సంకీర్తన రచించాడు. అన్నమయ్య శృంగార సంకీర్తనలలో అనేక రకాలైన అద్భుత వర్ణనలు కనిపిస్తాయి, నాయిక అయిన పద్మావతి అందచందాలను వర్ణిస్తూ—

"ఇన్ని రాసుల యునికి యింతి చెలువపురాశి
కన్నె నీ రాశి కూటమి కలిగిన రాశి ॥

కలికి బొమ విండ్లు గల కాంతకును ధనురాశి
మెలయు మీనాక్షికిని మీనరాశి ॥

అనే సంకీర్తనలో నాయిక జ్యోతిషశాస్త్రంలోని పన్నెండు రాశులకు నెలవయిందని, ఆమె విల్లువంటి కనుబొమ్మలు ధనురాశి అని, చేపలవంటి కన్నులు మీనరాశి అని కుండలవంటి స్తనాలు కుంభరాశి అని, సింహం వంటి నడుము, సింహరాశి అని, మకర ముద్ర కల్గిన పైట చెరగు మకరరాశిఅని, లేబ్రాయపువయసు కన్నె రాశి అని, బంగారుతో తులతూగు శరీరం తులరాశిఅని, వాడి అయిన గోళ్ళు వృశ్చిక రాశి అని, మదవతిగా ఒప్పుటచే వృషభరాశి అని, గోప్యపు మాటలు కర్కాటరాశి అని, లేత చిగురాకువంటి పెదవి మేషరాశి అని, తన ప్రియుడైన శ్రీనివాసుని కలసినందుకు మిథున రాశి అని రమణీయంగా వర్ణించి తన శాస్త్రవైదుష్యాన్ని వర్ణనా విశిష్టతను తెలియజేశాడు.

ఇలాంటి సౌందర్య వర్ణనలు, ప్రణయవర్ణనలు అన్నమయ్య సంకీర్తనల్లో చిత్రవిచిత్రాలుగా కనిపిస్తాయి. అన్నమయ్య తన కాలంనాడు అత్యధిక జనసంఖ్య కల్గిన గ్రామీణ ప్రజలకు భక్తి, నీతి జ్ఞాన బోధలు చేయడానికి, వారిని అలరింపజేయడానికి—

'సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁగనియె'

వంటి సువ్విపాటలు, అలాగే లాలి, జోల, ఏల, జాజర' గొబ్బి, సోది, మేలుకొలుపు, సంవాదం, తాత్త్వికం మొదలైన అనేక రకాల జానపద గేయబాణీలలో సంకీర్తనలు రచించాడు. కొండకోనల్లో నివసించే చెంచులకు, బోయీలకు కూడా సులభంగా బోధపడటానికి కొన్ని సంకీర్తనలు రచించాడు.

పొడవైన శేషగిరి బోయనాయఁడు
విడువ కిందరిఁ గాచు పెడ బోయ నాయఁడు" ॥

"సింగార రాయనిఁ దిట్టి చెంచెత వేలి
వుంగరాల చేత నన్నొత్తుకు నీవనుచు ॥

గురువింద పొద మరగున నుండి బిగిసీని
సిరివరు నెదుటనే చెంచెత"

అనే సంకీర్తనలు రచించాడు. అయా సంకీర్తనల్లో 'అడుసు ద్రొక్కనేల కాలు కడుగనేల', 'వెన్న పెట్టుక నేయి వెదుకనేల' వంటి సామెతల్ని, వరదగలిపిన చింతపండు, అంబుధి గురిసిన వానలు వంటి జాతీయాలను, సుక్కురారము, చక్కురవర్తి, కానికె వంటి అవిద్యావంతుల ఉచ్చారణా పదాలను, ఆయ, పాయ, వచ్చీని, పోయీని, సాదించు, బుద్ధి వంటి లక్షణ విరుద్ధమైన పదాలను వాడి

ప్రజలకు అత్యంత సన్నిహితంగా పదాలు వ్రాసి విలక్షణతను సాధిం చాడు. అచ్చ తెనుగు నుడికారపు సొంపును జనరంజకంగా పొందిం చాడు. అన్నమయ్య జానపదగేయ ఫణితులనే కాక శిష్టుల్ని శిర సూపించడానికి "ఇందరికి నభయంబు లిచ్చు చేయి", అదివో అల్లదివో హరివాసము" వంటి శిష్టభాషా సంకీర్తనలు, సంస్కృత భాషా పండి తుల్ని మెప్పించడానికి "సకలం హే సఖి జానామి", నారాయణతే నమో నమో" వంటి సంస్కృత భాషా సంకీర్తనలు రచించారు. ఏ రకమైన సంకీర్తనలు వ్రాసినా అందులో విష్ణు భక్తి, విష్ణు మహిమ గోచరిస్తుంది. ఇంతటి వైవిధ్యంతో సంకీర్తనలు రచించిన అన్నమయ్య తరువాతి వాగ్గేయకారులైన క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య వంటి మహనీయులకు మార్గదర్శకు డయ్యాడు. పరమ భక్తుడుగా, నిశ్చల వ్యక్తిత్వపరుడుగా, సంకీర్తనాచార్యుడుగా, మహిమాన్వి తుడుగా, కవిగా పదప్రక్రియా లాక్షణికుడుగా, విశిష్టాద్వైత మత ప్రవర్తకుడుగా, సామాజిక చైతన్య ప్రబోధకుడుగా భాసించాడు.

ప్రజలకోసమే దైవాంశలో అవతరించి, వారికోసమే పదాలు రచించి సాహిత్యంలో పదప్రక్రియకు పద్య ప్రక్రియతో సమానమైన గౌరవాన్ని సంపాదించి పెట్టిన పదకవితా వైతాళికుడు అన్నమా చార్యులు. వీరి సంకీర్తనల్ని తిరుమల తిరుపతి దేవస్థానంవారు వ్యాప్తి లోకి తెచ్చారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం అన్నమయ్య సంకీర్తనలకు ప్రప్రథమంగా పాఠ్యాంశ బోధన, పరిశోధనా స్థాయిని కలిగించింది. నేడు భారత దేశంలోని అన్ని విశ్వ విద్యాలయాల్లోని తెలుగు శాఖల్లో అన్నమయ్య సంకీర్తనల్లోని వివిధాంశాలపై పరిశో ధనలు సాగుతున్నాయి. 1992లో తెలుగు విశ్వవిద్యాలయం, సాహిత్యపీఠంలో అన్నమయ్య సంకీర్తనల బోధన, పరిశోధన ప్రధా నోద్దేశ్యంగా అన్నమయ్య అధ్యయన సంస్థ నెలకొల్పబడింది. అన్న

మయ్య సంకీర్తనల గానం కచ్చేరీల ద్వారా, క్యాసెట్ల ద్వారా, నృత్యాభినయం ద్వారా దేశ విదేశాలలో విస్తృత ప్రచారం అవు తోంది. ఆబాల గోపాలాన్ని అలరించే అన్నమయ్య సంకీర్తనలు వేదాలవంటివని అన్నమయ్య మనుమడైన చిన తిరుమలయ్య—

"వేదంబులు పౌరాణిక ।
వాదంబులు వర కవిత్వ వాణీ వీణా ।
నాదంబులు కృత సుజనా
హ్లాదంబులు తాళ్ళపాక యన్నయ పదముల్"

అని, నన్నయ మహాభారతాన్ని "ధర్మతత్త్వజ్ఞులు ధర్మ శాస్త్రంబని" అంటూ సకల శాస్త్ర సమ్మిళితమని పేర్కొన్నట్లు అన్నమయ్య సంకీర్తనలు శ్రుతులుగా, శాస్త్రాలుగా, పురాణకథలుగా, సుజ్ఞాన సారాలుగా, సాధుజన విహార భూములుగా, వివిధ మంత్రార్థాలుగా, నీతులుగా, కృతులుగా, శ్రీ వేంకటాచలవాసుని రతిక్రీడా రహస్యాలుగా, స్తుతులుగా అనేక వినూత్న రీతులుగా ఒప్పారు తున్నాయని తన "తెలుగు సంకీర్తన లక్షణ గ్రంథంలో పేర్కొన్నాడు.

అన్నమయ్య సంకీర్తనల్ని పరిష్కరించిన వారిలో ఒకరైన సంగీత సాహిత్య విద్వాంసులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనతకృష్ణ శర్మగారు 'అవాక క్షీరసాగరం' అని, అన్నమయ్య సంకీర్తనలకు మొట్టమొదటగా విశ్వవిద్యాలయ స్థాయిలో పాఠ్యబోధన, పరిశోధన భాగ్యాన్ని కలిగించిన భాషాసాహిత్యవేత్త, తెలుగు అధ్యయన శాఖ మాజీ అధ్యక్షులు, మాజీ ఉపాధ్యక్షులు ఆచార్య జి యస్. రెడ్డిగారు- "అచ్చమైన, దేశీయమైన, సంగీత సాహిత్య భాషా సంపన్నమైన అన్నమయ్య వాఙ్మయం తెలుగు సాహిత్యంలో అద్వితీయం, భార

తీయ సాహిత్యంలో అపురూపం, ప్రపంచ సాహిత్యంలో అత్యద్భుతం. బహుముఖ ప్రజ్వలమై బహువిధ కాంతుల్ని నవనవోన్మేషంగా ప్రస రించే అన్నమయ్య కృతులు పరిశోధకుల పాలిట బంగారు గనులు' అని, జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ ఆచార్య సి. నారా యణరెడ్డిగారు "నర్సరీ రైమ్స్ మన కల్చర్ కాదు, అన్నమయ్య కృతే మన సంస్కృతి" అని, జానపద విజ్ఞానవేత్తగా పేరు గాంచిన ఆచార్య ఆర్వీయస్ సుందరంగారు "అన్నమయ్య ఒక విజ్ఞాన సర్వస్వం" అని, సుప్రసిద్ధ కవి, రచయిత, సాహితీ తపస్వి శ్రీ ఆరుద్ర గారు "అన్నమయ్య సాహిత్యం అష్టమ సముద్రం. అందులో ఈదు లాడగల్గడం ఒక అదృష్టం" అని ప్రశంసించారు.

ఈ విధంగా సాహిత్య విలువలు, భక్తి, జ్ఞాన, మానవతా, నీతిబోధలు సంపూర్ణంగా విరాజిల్లుతున్న అన్నమయ్య సంకీర్తనలు ఐదు వందల సంవత్సరాల క్రితం నాటివి అయినా అవి ఈ నాటికీ మానవజాతి వున్నంత వరకు నిత్యనూతనంగా వెలుగొందుతూనే వుంటాయి.

విశాలాంధ్ర (దినపత్రిక)
విజయవాడ
11-8-1994



# చిన తిరుమలయ్య అధ్యాత్మ సంకీర్తనల్లో సాహితీ విశేషాలు

చినతిరుమలయ్య పదకవితా పితామహుడు, సంకీర్తనాచార్యుడైన తాళ్ళపాక అన్నమయ్యకు మనుమడు. కవితార్కిక కేసరి, రామానుజమత సిద్ధాంత స్థాపనాచార్య శరణాగత వజ్రపంజర ఆయన పెదతిరుమలయ్యకు పెద్దకొడుకు. ఇతడు తన తాత తండ్రుల వలె శృంగార అధ్యాత్మ సంకీర్తనలు శ్రీవేంకట నాథ ముద్రాంకితంగా రచించాడు. వీటిని తిరుమల తిరుపతి దేవస్థానంవారు ముద్రించారు. వీటి పరిష్కర్త శ్రీ అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారు. వీటిలో అరవై అధ్యాత్మ సంకీర్తనలు, నూట పందొమ్మిది శృంగార సంకీర్తనలున్నాయి. చినతిరుమలయ్య శృంగార అధ్యాత్మ సంకీర్తనలే కాక అన్నమయ్య సంస్కృతంలో రచించిన సంకీర్తన లక్షణ గ్రంథాన్ని తెలుగులోనికి అనువదించాడు. సంస్కృత భాషతో పాటు షడ్విధ ప్రాకృతాలైన ప్రాకృత, శౌరసేనీ, మాగధీ పైశాచీ, ప్రాచీ, అవంతీ అనే భాషలను, సార్వదేశీ అనే నాగర భాషను జోడించి అష్టభాషల్లోను దండక రచన గావించాడు. దీనినే అష్టభాషా దండకం అంటారు. ఇతనికి అష్టభాషా కవి చక్రవర్తి అనే బిరుదు ప్రసిద్ధమయింది. ఇతడు 1562 సం॥ వరకు జీవించి వున్నాడని ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు తమ సిద్ధాంతంలో పేర్కొన్నారు.

చిన తిరుమలయ్యకు చిన తిమ్మయ్య, చిన తిమ్మ, చిన్న తిమ్మన్న, చిన్న తిరుమలయ్యంగారు, పినతిమ్మ దేశికులు, సిరుతిరుమలై అయ్యంగారు, తిరుమల వేంకటేశ దీక్షితులు అనే నామాంతరా

లున్నాయి. చిన తిరుమలయ్య తన తాత అన్నమయ్యను ఎంతో భక్తి శ్రద్ధలతో, వినయ సౌశీల్యాలతో ప్రస్తుతించాడు.

అన్నమయ్య శ్రీనివాసుని వరప్రసాది అని, నారాయణుని తన మనస్సులో నిలిపిన వాడని, సనక సనందనాది ఋషులంతటి వాడని, ఘనకేతనాలుగా శ్రీహరిపై అనేక సంకీర్తనలు రచించిన వాడని, విందు భోజనం వలె మనసుకు ఆహ్లాదంగా శ్రీ వేంకట నాథుని తమకు తెలియజేసినవాడని—

"అప్పని వర ప్రసాది అన్నమయ్య
అప్పనము మాకె కలడన్న మయా" (16-23)

అనే సంకీర్తనలో తెలియజేశాడు. అంతేగాక అన్నమయ్య తనకు దేవుడని, శ్రీహరిని తెలుసుకొనే మార్గం చెప్పాడని, గురువని, దుర్బుద్ధి అయిన తనకు బ్రహ్మోపదేశం చేసి చెడిపోకుండా కాపాడిన పరమ బంధువని, తనకు తల్లిగా తోడు నీడగా ఉండి చెడు మార్గాల్లో, చిల్లర చేష్టల్లో పడకుండా కాపాడిన వాడని, దాతగా ఉండి శ్రీ వేంక టేశ్వరుని తన తలపుల్లో నిలిపాడని, ఏ వైపు చూచినా తనకు ఏడుగడ అన్నమయ్యే అని తన నిండు మనస్సుతో అన్నమయ్యను తన సర్వ స్వంగా కీర్తించాడు.

'తాళ్ళపాక న్నమాచార్య దైవమవు నీవు మాకు
వేళమె శ్రీహరి గనే వెరవానితిచ్చితివి'

తల్లివై నసీవె సుమ్మీ తగిన విషయాలలో
పల్లదాన బడకుండా బ్రితికించితి
అల్లుకొని తోడు నీడవైనా నీవెసుమ్మీ
చిల్లర మాయలలోన జెడకుండా జేసితి।

దాతవు నీవె సుమ్మీ తగు శ్రీవేంకటనాథు
నాతల వులో సిలిపి నమ్మ జేసితి
యేతల జూచినా నాకు నేడు గడయూ నీవె
ఆతలసీతల నన్ను నాడు కొని కాచితి ॥ (16-33)

అంతటితో తనివితీరక చినతిరుమలయ్య అన్నమయ్యను గొప్ప హితోపదేశకుడని, పరమదయాళువని పచ్చితామసులైన తమను శుద్ధ సాత్వికులుగా చేశాడని, తమ కులంలో ఎప్పుడూ లేని వైష్ణవమతాన్ని అనుగ్రహించాడని, ఎన్నో పాతకృత్యాలు చేసిన తమను పుణ్యమూర్తులుగా మార్చాడని, ఏ జన్మలోను దొరకని సంకీర్తన పద్ధతిని సమయానికి ఉపదేశించాడని, అజ్ఞానులైన తమను వివేకవంతులుగా చేసి కష్టాలన్నీ పోగొట్టాడని, మధ్యలో ఎప్పుడూచూడని శ్రీవేంకటనాథుని గుర్తుగా తమకు ఇచ్చాడని ఇది ఎంతో చిత్రమని, చోద్యమని, అరుదు అని ఆశ్చర్యానందాలను వ్యక్తం చేయడం—

ఎట్టి హితోపదేశకు డైటువంటి దయాళువు
అట్టె తాళ్ళపాక న్నమాచార్యులు (16-52)

అనే సంకీర్తనవల్ల తెలుస్తుంది. ఈ సంకీర్తనలవల్ల చిన తిరుమలయ్య చిత్తశుద్ధి, కృతజ్ఞతా హృదయం, వినమ్రత. ఔదర్య వ్యక్తిత్వం వ్యక్తమవుతుంది. తనతాతే కదా అని చనువుచూపి నిర్లక్ష్యం చేయకుండా అన్నమయ్య పట్ల భక్తి ప్రపత్తులు. గౌరవాదరణాలు చూపి తనకు "ఏడుగడ" అని పేర్కొనటం మిక్కిలి కొనియాడదగిన విషయం. ఇది లోకానికి ఆదర్శమైన సుగుణం.

చిన తిరుమలయ్య సంకీర్తనలలో అన్నమయ్య సంకీర్తనల్లో వలె విష్ణుమూర్తి అవతార సంఘటనలుకూడా కనిపిస్తాయి. ఇతని సంకీ

ర్తనలు గాశిలో తక్కువైనా వాసిలో తనతాత తండ్రులైన అన్న మయ్య పెద తిరుమలయ్యల సంకీర్తనల సరసన నిలువగల్గినంత సాహిత్యపు విలువలు కల్గినవి.

రామాయణం ఆదికావ్యం. విశ్వజను లందరికీ ఆదర్శవంతం. శ్రీరామచంద్రుడు పద్మనయనుడు. లక్ష్మణ భరత శత్రుఘ్నులకు అగ్రజుడు. దశరథపుత్రుడు. ఈ శ్రీరాముడు బాల్యం మొదలు పట్టాభిషేకం వరకు సాధించిన ఘనకార్యాలన్నింటిని అంటే రామాయణ కథనంతా పద్నాలుగు పాదాల ఒక్క సంకీర్తనలో వర్ణించాడు. ఇది చినతిరుమలయ్య యొక్క అల్పాక్షరాలలో అనల్పార్థ రచనకు, పద లాఘవానికి తార్కాణంగా చెప్పవచ్చు. చిన్నారి పొన్నారి శిరసుకూ కట్ల వయసు దాటిన తర్వాత తాటకిని చంపాడు. విశ్వామిత్రయాగం సంరక్షించి శివధనుస్సు విరిచి వైభవంగా జనకుని గృహంలో సీతను వివాహమాడాడు. మాయా గృహంలోని మారీచుని సంహరించి, చుప్పనాతి అయిన శూర్పణఖ గర్వాన్ని అణచి, రాక్షసులను చంపాడు. వాలిని చంపి, సుగ్రీవుని ఘనంగా ఆదరించాడు. సముద్రానికి వ రధికట్టి లంకను సంహారించాడు. దేవతలు సంతోషి స్తుంపగా దేవేంద్రుని రథం ఎక్కి రావణాది రాక్షసులను చంపి విభీషణునికి రాజ్యాభిషేకం చేశాడు. అయోధ్యనగరానికి తిరిగివచ్చి పట్టాభిషక్తుడై రాజ్యమేలాడు. ఇలాంటి శ్రీరాముని రాఘవా, దశరథరాఘవా, కౌసల్యా నందనరాఘవా, అని స్తుతిస్తూ భజన సంకీర్తన రీతిలో రచించాడు.

రామ రామ చంద్ర రాఘవా రాజీవలోచన రాఘవా
సౌమిత్రి భరత శత్రుఘ్నులతోడ జయమందు
దశరథరాఘవా ।

శిరసు కూకటుల రాఘవా చిన్నారి పొన్నారి
రాఘవా
గరిమ నావయసున తాటకి జంపిన కౌసల్యానందన
రాఘవా
అరిది యజ్ఞముగాచి రాఘవా యట్టె హరుని విల్లు
విరిచిన రాఘవా
సిరులతో జనకుని యింట జానకి జెలగి పెండ్లాడిన
రాఘవా ॥ (16-1)

మహావిష్ణువు దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ సంస్థాపనకోసం భూమిపై అవతరిస్తుంటాడు. ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా జన్మించి బాల్యంలో అనేక సాహస సంఘటనలు చేశాడు. ఆ సాహస కృత్యాలను చినతిరుమలయ్య పేర్కొన్నాడు. ఈ పసి బిడ్డ బ్రహ్మను కన్నవాడు. తానే బ్రహ్మమైనవాడు. తనను చంపవచ్చిన పూతనను చంపినవాడు. తనమీదుగా పోవడానికి వచ్చిన బండిని అంటే శకటాసురిని చచ్చేలా తన్నినవాడు. ఆవులను రక్షించడం కోసం వేలితో కొండను ఎత్తినవాడు. మల్లయుద్ధంలో తనను ఎదుర్కోవడానికి వచ్చినవానిని చంపిన వాడు. తన మేనమామ కంసుని పట్టి చంపినవాడు. గొల్ల స్త్రీలను పొందినవాడు. ఆనాటి ఆ పసిబిడ్డే ఈనాటి శ్రీవేంకటనాథుడుగా వెలశాడని తెలిపాడు.

'బ్రహ్మ గన్నవాఁడు పసిబిడ్డ
బ్రహ్మమైనవాఁడు పసిబిడ్డ ॥

వగవులేక చంపవచ్చిన బూతకి
పగ సాధించిన వాఁడు పసిబిడ్డ
వగటున తనమీఁద బారవచ్చిన బండి
పగులదన్నిన వాఁడు పసిబిడ్డ ॥ (16-11)

శ్రీహరి పుట్టుక అనేక వ్యాధిని పోగొట్టే గొప్పవైద్యుడు. అందుకే 'వైద్యో నారాయణోహరిః' అని అంటారు. చక్కని బంగారు పక్షిని శుభ సూచకంగాగలవాడు. అంటే గరుత్మంతుని వాహనంగా గలవాడని చెప్పవచ్చు. తల్లిఅయిన యశోదకు నోటిలో సమస్తలోకాలను చూపిన ఇంద్రజాల విద్యగలవాడు. అంటే మహిమ గలవాడని అర్థం. కొండను చేతితో పట్టి ఎత్తిన బల్యాఢ్యుడు. సకల ప్రాణులకు ప్రభువై ఆ జీవుల మనస్సులను బాగా తెలిసిన మంత్రి వాడి. సముద్రంలో ఇంద్రునికి సంపదచూపించిన నల్లనివాడు. అంటే క్షీరసాగరం మథనంలో వెలువడిన కల్పవృక్షం, కామధేనవు ఐరావతం, ఉచ్చైశ్రవం మొదలైనవి ఇంద్రునికిచ్చాడని అర్థం. భయంకరమైన కాళింగుని పడగమీద నిలబడి దాని గర్వమడచిన పాముల వాడు. రాక్షసులను సంహరించి దేవతలను కాపాడే రక్షకుడు అని అవతారసంఘటనలను వివరించాడు.

భవరోగవైద్యుఁడైన బలువెజ్జు
సవరని పైఁడి పక్షి సకినగాఁలు ॥

తల్లివద్ద నోరిలోన తగలోకములు చూపి
వెల్ల విరినింద్ర జాల విద్యవాఁడు
చెల్లుబడి నొక్క కొండ చేతబట్టి యెత్తినాఁడు
బల్లిదుడు వాఁడివో బారి విద్యవాఁడు ॥ (16–22

చినతిరుమలయ్య శ్రీకృష్ణ జననాన్ని, తత్ప్రయోజనాన్ని లోకానికి తెలియజేస్తూ ఒక సంకీర్తన రచించాడు. శ్రీహరి నాలుగు చేతులవాడు. పుట్టినప్పుడే శంఖచక్రాలు చేతుల్లో కలిగివాడు. అర్థరాత్రి రోహిణి నక్షత్రంలో జన్మించాడు. ఇంక ప్రజలు బాధలు పడవలసిన పనిలేదు. పుట్టగానే ఆశ్చర్యకరమైన మాటలతో వసుదేవుని(

ఆజ్ఞాపించినవాడు. (తనను రేపల్లెలో యశోద ప్రక్కన చేర్చమని) దేవతలారా, మునులారా ఇంక మీకు దిగులెందుకు? ఈనాటి వేంకట నాథుడే ఆ శిశువు. అందరికీ కోరినవరాలిస్తూ, రక్షిస్తూ ఇక్కడే (తిరుమల) దిక్కై వెలశాడు. మీరు భయపడకండి అని ప్రబోధించాడు.

చిన్నవాఁడు నాలుగు చేతులతోనున్నాఁడు
కన్నప్పుడె జక్రిము జేత నున్నది ॥

నడురేయి రోహిణి నక్షత్రమున బుట్టె
వడి గృష్ణు డిదివో దేవతలందు
పడినమీ బాధలెల్ల ప్రజలాలయిప్పుడిట్టె
విడుగరాయ మీరు వెరవకు డి కను ॥ (15-82)

చినతిరుమలయ్య భాషానియమాల్ని పాటించడంలో తాత తండ్రుల స్వతంత్రతను అనుసరించాడు. సామాన్య ప్రజలకు సహితం సులభంగా అర్థం కావడానికి వారి వాడుక మాటలు ప్రజలాల. దేవతలాల, మునులాల, దాసులాల, సిసువు వంటి వాటిని వ్యాకరణ విరుద్ధంగా యథేచ్ఛగా ప్రయోగించాడు. కొన్ని చోట్ల సంస్కృతాంధ్ర పండితులకు ప్రీతిగా లాక్షణిక పద్ధతుల్ని కూడా పాటించాడు.

చినతిరుమలయ్య రామ, కృష్ణావతార సంఘటనలే కాక నృసింహావతార వర్ణనకూడా చేశాడు. విష్ణువు హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని రక్షించడానికి స్తంభంలో వెలశాడు. ఈ విషయాల్ని చినతిరుమలయ్య ఒక సంకీర్తనలో వ్యక్తం చేశాడు, తిరుమలయ్య తాత తండ్రులవలె రాయలసీమ, గుంటూరు, నెల్లూరు ప్రాంతాలలోని వైష్ణవదేవాలయాల్ని దర్శించి ఆయా క్షేత్రమూర్తులపై సంకీర్తనలు వెలయించాడు. కదిరిలో వెలసిన నృసింహస్వామిని దర్శించి ఆ స్వామి నిర్వహించిన సంఘటల్ని వర్ణించాడు.

శ్రీహరి తన దాసుని రక్షించడంకోసం ఈ రూపాన్ని ధరించాడు. రోజురోజుకూ అతిశయమైన ఆనందంతో ఉన్నాడు. బలవంతుడైన రాక్షసుని ఒడిసిపట్టి తొడపై పెట్టుకొని విజృంభించి కొనగోళ్ళతో చీల్చివేశాడు. పంతంతో అతని పేగుల్ని జంధ్యాలుగా వేసుకున్నాడు. ఈ కదిరి నరసింహుడు తెలివైనవాడు. ఆ రాక్షసుని రక్తాన్ని వసంతాలవలె చల్లాడు. అతని చర్మాన్ని ఒలిచి శరీరంపై ధీరత్వంలో కప్పాడు. అందమైన లక్ష్మి, ప్రహ్లాదుడు ప్రస్తుతించగా ఆనందంగా వెలశాడని తెలిపాడు.

తన దాసుని కొరకు ధరియించె నీరూపము
దినదిన వేడుక గదిరి నారసింహు॥

బలురక్కసు నొడిసి పట్టి తొంకలపై బెట్టి
చెలఁగి కొనగోళ్ల జించి నాఁడు
చలపట్టి పేగుల జంధ్యాల తొడుతను
తెలివై వున్నాఁడు కదిరి నారసింహుఁడు ॥(16–37)

చినతిరుమలయ్య విష్ణుమూర్తి అవతార సంఘటనలనే కాక మానవాళికి ఉపయోగపడే భక్తి జ్ఞాన మానవతా ప్రబోధాలను కూడా అధ్యాత్మ సంకీర్తనలలో చొప్పించాడు.

మానవుడు మాత్సర్యాన్ని, కపటాన్ని వదలుకొన్నప్పుడే కోర్కెలను జయించగలడు. చంచలమైన మనసు మంచిదైనప్పుడే, త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ అనే పంచేంద్రియాల బాధ పోతుంది. హీనపరచే కోపాన్ని కోసివేసినప్పుడే పాపాలనుంచి కడతేర వచ్చు. ఉద్వేగాన్ని సహించినప్పుడే జిహ్వా చాపల్యాన్ని అణచవచ్చు. సుఖభోగాల్లో చిక్కకోనప్పుడే లోభాన్ని జయించవచ్చు. సంపూర్ణంగా విష్ణుభక్తి నిలకడ అయినప్పుడే శ్రీ వేంకటనాథుని చేరు

కోవచ్చు. అని చినతిరుమలయ్య కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలను త్యజించమని లోకులకు బోధించాడు.

మచ్చరములు గపటంబులు మానినంత మరికదా
ఇచ్ఛలవిడి నాయాసలవీఁగ దోలనోపుటా ॥

చంచలమగు నామనసిది మంచిదై నమరికదా
పంచేంద్రియముల పోరున బడక మానుటా
కొంచెపరచు నా కోపము గోసివేసి మరికదా
కంచపు బాపంబులలో గడతేరుటా ॥ (16-4)

కామాన్ని మించిన వ్యాధి లేదని, క్రోధానికి మించిన అగ్ని లేదని, మోహానికి మించిన శత్రువు లేదని, జ్ఞానానికి మించిన సుఖం లేదని ఋగ్వేదంలో

నాస్తి కామ సమోవ్యాధిః
నాస్తి క్రోధ సమోవహ్నిః
నాస్తి మోహసమోరిపుః
నాస్తి జ్ఞానాత్ పరం సుఖమ్

అని చెప్పబడింది.

ఈ వేదార్థాలనే చినతిరుమలయ్య కొంతమార్పు చేసి సంకీర్తనగా వెలయించాడు.

జ్ఞానులు ఇతరులకు నీతి బోధచేయడానికే తమ జీవిత కాలాన్నంతా వినియోగిస్తారు. ఎంత చెప్పినా వినని వాళ్ళకైనా కొన్ని సమయాలలో విరక్తి కలుగుతుంది. అందుకే భర్తృహరి కూడా ఇసుకలో నూనెను తీయవచ్చు, ఎండమావుల్లో నీటిని త్రాగవచ్చు, కుందేటికి కొమ్మును సాధించవచ్చు. కానీ మూర్ఖుల మనస్సును

మార్చలేమని "తివిరి యిసుమున" అనే పద్యంలో మూర్ఖుల మనస్సు రంజింపరాదు అని ఉద్ఘాటించాడు. వేమన "ఎంత చదువు చదివి, ఎన్ని విన్నను గాని హీనుడవగుణంబు మానలేడు" అని, అన్నమయ్య

"సారమైన చదువులు సారెసారె చదివినా
కోరపు దుష్టునికి కోపమేల మాను"

అని నీచులు, దుష్టులు, మూర్ఖులు ఎప్పటికీ మారరు అని వారిపై విసుగు చెంది అన్నట్లుగానే చినతిరుమయ్య కూడా వ్యక్తం చేశాడు. చపల బుద్ధిగలవారికి ఉత్తమధర్మాలు తెలియవు. వారికి మంచం నీడలాగా అనేక మార్గాలు తోచుతాయి. మిణుగురు పురుగుల వల్ల చీకటిపోని విధంగా కేవలం పొట్టకూటి చదువులవల్ల తెలివి కలుగుతుందా! పైపైన కనిపించే ప్రాకృత దృష్టికి భ్రమలుకలుగు తాయి కాని పరలోక ప్రాప్తి కలుగుతుందా! జ్ఞానమేకలుగుతుంది కానీ సద్గుణం కలుగుతుందా! బాగా కామోద్రేకం పట్టిన వాడికి ఎండమావులవలెనే తోస్తుంది కానీ సత్యం తెలుస్తుందా! అక్షయ పుణ్యం నీడవలె తనను అంటివుంటుంది కానీ సమసిపోదు. గొప్ప వాడైన మానవుడు శ్రీవేంకటనాథుని దర్శించి సానపట్టిన రత్నంలా ప్రకాశిస్తాడని చినతిరుమలయ్య కొన్ని పోలికలద్వారా, జాతీయపద బంధాల ద్వారా సద్గుణ బోధచేయడం కనిపిస్తుంది.

చంచల మతులకు దెలియున సాత్విక ధర్మములు
మంచము నీడవలె బహు మార్గములై తోచు ॥

తీపుల అల్పపు చదువుల తెలివేలాకలుగు
కాపై మిడుగురు బురువుల గడచునె చీకట్లు

పైపై ప్రాకృత దృష్టికి పరమేలా కలుగు
పాపము కనుమాయలవలె భ్రమయించు గాక ॥

(16-15)

ఇలాగే మరో సంకీర్తనలో సహజగుణాలు ఎప్పటికీ పోవని సామెతలద్వారా సుబోధకం చేశాడు. అన్నలారా! అల్లము బెల్లమవుతుందా. కొండపై నున్న నీరు నేలమీదికి పారుతుంది కాని నేల మీది నీరు పైకి ఎక్కదు. ఆవిధంగా నశించిపోయే ప్రకృతితోనే సంబంధం వున్నవాడికి నిజమైన జ్ఞానం ఎలా వస్తుంది? కాచిన స్వచ్ఛమైన పాలకు తోడుపెట్టితేనే పెరుగు అవుతుందికానీ ఎంత చేసినా పెరుగు పాలుకాదు. ఆవిధంగానే ఏమీ తెలియని వానికి తెలుపవచ్చుకానీ మూర్ఖుని ఎలాగుణవంతుని చేసేది? చందనవృక్షాల సౌరభం ప్రక్కనున్న చెట్లకు కూడా అంటుకొంటుంది. కానీ వాటి వాసన చందన వృక్షాలకు అంటదు ఆ ప్రకారంగానీ శ్రీ వేంకటనాథుని దాసులు ఎక్కడున్నా వారికి అన్యచింతలు ఉండవని తెలిపాడు.

"అల్లము బెల్లమౌనా అన్నలాల
యెల్ల కాలమున గుణమేల మానీనయ్యా ॥

నిక్కముగొండలనీరు నేలకు వేగమెపారు
యెక్కువ నేలపై నీరు యెక్కదుందుకు
మిక్కిలి ప్రకృతిలోన మెలఁగేటి వానికి
చొక్కమైన జ్ఞాన మెట్టు సొగసీనయ్యా ॥ (16-16)

ఈ సంకీర్తనలు తిరుమలయ్య లోకజ్ఞతకు, ప్రకృతి పరిశోధనకు లోకశ్రేయసుకు, సూక్ష్మ దృష్టికి, అన్వయ కౌశల్యానికి నిదర్శనాలని చెప్పవచ్చు. మనసు చంచలమయింది. రకరకాలవిషయాలపై

పారుతూ ఉంటుంది. దీన్ని చిక్కపట్టుకోవడం సామాన్యంకాదు. పుత్రమిత్రాదులు, విషయ సుఖాలు, ధనధాన్యాలు, ఘనమైన కోరికలు, ఆకలి దప్పులు ఇవి అన్నీ మనిషినివ్యామోహం చేస్తాయన్ని మిక్కిలి బలీయమని, ఇవి ఉండగా వైరాగ్యం, జ్ఞానం, ఓర్పు ఆట పాటల్లాగా సులభంగాలభించవని, అయినా అలాంటివాటిని పారద్రోలడం సాధ్యమవుతుందా అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూనే ఇలాంటి మనసువశమైన తర్వాతనే తన శరీరంలోని శ్రీహరి దయగలి ఆ తర్వాత పనులన్నీ చక్కబడుతాయని శ్రీవేంకటనాథుడేతల్లి, తండ్రి అయ్యి రక్షిస్తే తప్పులు పోతాయని చినతిరుమలయ్య లోకానికి జ్ఞాన బోధ చేయడం కనిపిస్తుంది.

మనసె వశమైతే గా మరిమీ.దటి పనులు
తనువు లోపలి హరిదయ యింతె కాకా ॥

వొద్దనె పుత్ర మిత్రాదులు వ్యామోహించ కాను
అద్దో వైరాగ్యమేమి ఆటపాటలా
కొద్దిలేని విషయాలు గుంపుగూడు కుండ గాను
వద్దని కడకదోయు వశమవునా ॥ (16-21)

ఇలా మరో సంకీర్తనలో సతులు, సుతులు బంధువులు, ధన ధాన్యాలు, కామ క్రోధాలు, పంచేంద్రియాలు, ఇల్లు వాకిళ్ళు మొదలైనవి శక్తివంతమైనవని, ఆకర్షణీయమైనవని, అవి ఎంతటి నియమవ్రతులనైనా, యుతులనైనా, పిన్నలనైనా, విరక్తులనైనా, మునులనైనా, ఋషులనైనా వశం చేసుకొంటాయని, పైకి ఉపకారులవలె కనిపిస్తూనే చివరికి పతనం చేస్తాయని, ఇలాంటి వాటితో పొందు సులభం కాదని అంటే ప్రమాదకరమని సూచిస్తూ వాటితో ప్రత్యక్ష సంభాషణంగావిస్తూ రచించాడు.

చలమె చెల్లించుకొన్న సతులాల
సులభమా మీతో పొందు సుతులాల॥

పతినైన యతినైన వలల మాటలు బెట్టి
బతిమి చెరుతురుగా బాధువులాల
హితవరులు వలెనె యింత నంత నెలయించి
తతి గొందురుగా ధనధాన్యములాల॥ (16-28)

ఇలాంటి ఐహిక బంధాలనుంచి విముక్తి కావడానికి ఆచార్యులు తనకు ప్రేమతో వేంకటనాథుని పాదాలుచూపించారని ఆచార్య భక్తిని ప్రకటించాడు. లోకంలో ప్రసిద్ధమైన —

"అర్థంనాస్తి గృహంనాస్తి నాస్తి బంధు సహోదరః
నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం ధర్మసంగ్రహః"

అనే శ్లోకార్థమే పై సంకీర్తనలో సూచించబడింది, బ్రతికి నంతకాలం తనవి అనుకున్నవి చివరికి తనతో రావని శ్రీహరే శాశ్వత దిక్కు అని చినతిరుమలయ్య ఈ సంకీర్తనల ద్వారా లోకానికి హితబోధ చేశాడు.

మానవుడు తప్పులు చేసి ఆపైన బాధపడుతుంటాడు. ఇలాంటి వారిని గమనించి చినతిరుమలయ్య - బాధను సహించలేని వాడు పాపం ఎందుకు చేయాలి? ముందే ఎందుకు బుద్ధి లేకపోయింది! సాధుత్వంతో ఉంటే భగవంతుడే కష్టాలన్నీ పోగొట్టి రక్షించడా! దండనలకు ఓర్వలేనివాడు తప్పు లెందుకు చేయాలి? కొండలాంటి ఆశతో కోరకుండా ఉంటే ఈ లంపటాలు చుట్టుకుంటాయా! చలికి ఓర్వలేనివాడు ఊట నీటిలో ఎందుకుండాలి? ఎల్లప్పుడు శ్రీవేంకట నాథుని సేవిస్తే అభయమిచ్చి రక్షించలేడా? అని సానునయంగా తెలియజేశాడు.

బండించితే కలుగునా పరమాత్ముని దాస్యము
నిండుమతి నుండితేను నెరవేరుగాక ॥

బాధకు నోపనివాఁడు పాపము చేయనేల
పోదిచేయ దోలుతేమి బుద్ధిలేదా
సాధువలె నుండితేను సర్వేశ్వరుఁడె తన్ను
వాదులాట లెల్ల మాన్పి సహించుకోలేఁడా ॥

లోకులు తమలోని దైవాన్ని చూడలేక ఎంతో ప్రయాసపడి సుదూర క్షేత్రాలకు వెళ్ళి రకరకాల మార్గాలను అనుసరిస్తూంటారు. అవి అన్నీ అక్కరలేదని తరించే మార్గం తనలోనే ఉందని సులభోపాయాలను రూపకాలంకారం ద్వారా అన్వయించి చెప్పాడు. మనస్సు అనే పెద్ద విల్లుతో మాయ అనే లక్ష్యంపై జ్ఞానం అనే బాణం వేస్తే పూర్వజన్మ దుష్కర్మలన్నీ వేళ్ళతో సహా కూలిపోయి సమస్తం తనకు గోచరిస్తుంది. మంత్రార్థం అనే మందరగిరిచే సంసారం అనే సముద్రాన్ని పట్టుదలతో మథిస్తే హరిభక్తి అనే అమృతం పుట్టితే జనన మరణాలు సమసిపోతాయి జీవుడనే పాదులో చాలా కాలంగా మొలచిన (శ్రీ) వేంకటనాథుడనే వృక్షంలో దయ అనే పండు పండితే కామితార్థాలు తన కైవశమవుతాయని, ఇహపర స్వర్గాలు చేకూరుతాయని ప్రతిభా పాండిత్యా స్ఫోరకంగా కల్పనాచాతుర్యంతో రమణీయంగా తెలిపాడు.

దవ్వుల తెరువు మరేఁటికి తడబాటులు మరి యేటికి
యెవ్వరు దలచిన నిదియె యిహపరముల నొసగు ॥

మనసనియెడు పెను వింటను మాయాలక్ష్యముపైని
పనివడి జ్ఞానం బనియెడి బాణం వేసినను

వెనకటి దుష్కర్మంబులు వేళ్ళతోఁ బెకలిన
తనయంతనె సకలంబును తప్పక కానగు ॥ (16-38)

మానవుడు ఈ శరీరాన్ని సొమ్ములను, పరిజనాన్ని తనవి అని అనుకుంటాడు. ఇలా అనుకునే స్వతంత్రం మానవునికి లేదని, అన్నీ శ్రీహరివే అని భావిస్తే విచారం ఉండదని, నిశ్చింతుడవుతాడని, శ్రీ వేంకటనాథుని సేవిస్తే గొప్పవాడవుతాడని చినతిరుమలయ్య సందేశమిచ్చాడు.

జగదీశ్వరుని లీలాచక్రము లోపలనుండి
మగుడ దాసుఁడు గాక మాయ దాఁట వసమా ॥

తనువు నాదెయనఁగ తనకు స్వతంత్రమేది
తనువులో తాను హరి తనువె కాన
మనసులో యీ సుద్ది మరినమ్మితే జాలు
వెనక ముందరలకు విచారమే లేదు ॥ (16-47)

చినతిరుమలయ్య సృష్టి సహజగుణాల్ని, మానవ మనస్తత్వ నైజాలను సకలవస్తువులను నిశితంగా పరిశీలించాడు. తాను (మనిషి) తనశరీరం, తనవారు ఎక్కడ! వీరిని వదలివుండలేననే మనసు ఎక్కడ! అని తాత్విక చింతన చేశాడు. చెట్టుపై నోరూరించే కాయలు, పండ్లు పక్వం తప్పితే ముందు కోరుకున్నవారి ఆశలు ఎక్కడుంటాయో. స్త్రీలను ప్రేమించి పులకించిన పురుషులు, ఆ స్త్రీలు ముసలివారైతే వారి వ్యామోహం ఎక్కడుంటుందో, కొత్త మెరుగులచే ఆకర్షణీయమైన వస్త్రాలు పాతబడితే ముందు అనురక్తి అవికావాలని కొన్నటువంటి వారి భ్రమలు ఎక్కడుంటాయో యౌవనంలో కొప్పును, తీర్చిదిద్దిన సింగారాలు పత్తివలె తెల్లనై బట్టగట్టినప్పుడు ఆ భావం ఎక్కడుంటుందో పరిమళాలతో మత్తు

గోల్పే పువ్వులు వాడిన తర్వాత వాటిలోని పస ఎక్కడుంటుందో శ్రీ వేంకటనాథుడు కాపాడుతాడు కాబట్టి చెల్లుతుంది. లేకపోతే ముందు తాను అనుభవించినది అత్యంత వేగంగా మరుసటిరోజు చూడగా అవి ఏవిధమై ఉంటాయో అంటూ పేర్కొన్నారు.

తానేడ వారేడ తను వేడ మరి తక్కినవెల్లానేడ
మానలే ననుచు తరితీపు సేసీ మనసేడ నుండునో ॥

కందువమాని పై నోరూరించెడి కాయలు బండ్లు పక్వము దప్పిన
అందమగు మున్న గోరినట్టివారి యాస లెందుండునో
పొందున వలచి పులకించినట్టి పురుషులు సతులట్టె ముదిసితె
ముందర వెనక నెరఁగనియ్యని మోహా మెందుండునో ॥
(16-50)

ఈ జగన్నాటకంలో శ్రీహరిసూత్రధారి. జీవులు ఆటబొమ్మలు. లోకంలోని జీవులు భగవంతుడు ఎలాకదిలిస్తే అలా కదులుతుంటారు. ఈ విషయాన్నే చిన తిరుమలయ్య ఉపమాన పూర్వకంగా విశదీకరించాడు. భగవంతుడే అన్నీ కల్పిస్తూవుండగా ఇంక తన కోరికలెందుకు! అద్దం చూసుకొనే వ్యక్తి నవ్వితే అద్దంలోపలి నీడకూడా (ప్రతిబింబం) ఆ విధంగానే నవ్వుతుంది. అలాగే శ్రీవిభుని సంకల్పం వల్లనే లోక విషయాలు, సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. నాటకాలాడించే వ్యక్తి నేర్పుగా కదలిస్తే నాటకంలోని బొమ్మలు అనేక విధాలుగా కదలుతాయి. అలాగే చైతన్యాత్మకుడైన దైవం వల్లనే పాపపుణ్యాలు బహువిధాలుగా కలుగుతాయి. రథాన్ని నడిపే సారథి పగ్గాలు పట్టుకొని అటు ఇటు నడిపినట్లుగా రథం, గుఱ్ఱాలు ఆ మార్గాల వెంట కదులుతాయి. అలాగే శ్రీ వేంకటనాథుడు నరులను ప్రేరేపించడం వల్ల కలిమి లేములు కలుగుతాయి అని తెలిపాడు.

తనకోరిక లేటికి నాత జేయున్నియు గల్పించ గ
అనువుగ నిందుకు యిద్దరి యత్నంబులు వలెనా ॥

అద్దము చూచేటి యాతఁడలరు చునవ్విన నవ్వును
అద్దములోపలినీడయు నారీతినె కాదా
దద్దరి యగు శ్రీవిభు సంకల్పంబుననె జగముల
సుద్దులు దుఃఖము సుఖమును సూటిఁబడె గానా ॥
(16-17)

మానవులు తమకు రకరకాల బాధలు, కష్టాలు, నష్టాలు, వ్యాధులు కలిగినప్పుడు రకరకాల దైవాలను పూజించి, గ్రహశాంతులు చేయిస్తుంటారు. అలాంటివి ఏవీ అక్కర లేదని శ్రీహరినామాన్ని స్తుతిస్తే సర్వగ్రహాలు శాంతిస్తాయని తెలియజేశాడు. సందేహం లేకుండా స్మరించిన బుద్ధిమంతులకు సంకీర్తనమే సర్వశాంతి. పుట్టుక లేకుండా చేసే శ్రీపతి నామమే జన్మశాంతి హరి పూజ చేయడమే ఈ భూమిపై గృహ శాంతి. ధ్రువ వరదా అని అంటేనే సర్వగ్రహ శాంతి సూర్యచంద్ర నేత్రుని తెలుసుకోవడమే నక్షత్రశాంతి. అనంతుని గూర్చి పలకడమే కాలశాంతి. శ్రీ వేంకటనాథుని చేరుకోవడమే దేవమానవులకు దేహశాంతి అని పేర్కొన్నాడు.

సంకెలేక తలఁచిన జాణలకు
సంకీర్తనమే పో సర్వశాంతి ॥

భవహరమగు శ్రీపతినామమే
జవకట్టితల చితే జన్మశాంతి
తవిలి హరిపూజతా జేయుటె
కువలయమున నిదిగో గృహశాంతి ॥ (16-20)

మానవుడు ఐహిక భోగాలు ఎన్ని అనుభవించినా, ఎన్ని కష్టాలు పడినా తిరిగి సంసారాన్నే కోరుకుంటాడు. ఈ విషయాన్నే చినతిరుమలయ్య ఇలాంటివి వద్దు సుమా, వలలో పడవద్దు. తెలివిగా భగవంతుని పేరును స్మరించరాదా! దుర్భరమైన సంసారంలోనే వదల కుండా తిరుగుతున్నావు. ఇంకా సిగ్గుగా లేదా! ఇదంతా ఎందుకు ముందు వెనక కష్టాలు! భగవంతుని తలచుకోరాదా. వెయ్యి అయినా విసుగులేకుండా కోరుతావు. అయ్యో ఇంకా దీనికి ఆశపడుతున్నావా మెల్లగా వెనకటి జన్మలను గూర్చి ఒక్కొక్కటె గమనించి మధుర మైన విష్ణుభక్తిని తెలుసుకోరాదా. ప్రీతితో ఐహికాలపై మమకా రాలు పెంచుకొంటున్నావు. ఇంకా రోత పుట్టడం లేదా! చేపట్టి సంరక్షించే శ్రీవేంకటనాథుడె దగ్గరై వున్నాడు. దర్శించరాదా అంటూ అనునయంగా విష్ణుభక్తిని ప్రబోధించాడు.

వద్దు సుమ్మీ చెప్పితిని వలల బడఁగవద్దు
పెద్దరికాన దేవుని బేరుకొనరాదా ॥

పల్లదపు సంసారాన బాయలేక తిరిగేవు
చెల్లబో జీవుడ యింకాసిగ్గుగాదుగా
వెల్లవిరి నింత యాల వెనక ముందరిపాటు
దళ్లాలి తనము మాని తలచుకోరాదా ॥ (16-31)

మానవులు అశాశ్వతమైన తన బంధువులను, ఐశ్వర్యాన్ని, రాజులనునమ్ముకొని చివర్లో మోసపోతుంటారు. ఇలాంటివారిని గమనించి చిన తిరుమలయ్య హితబోధ చేశాడు. ఈ మాయలో మున గడ మెందుకు? మమకారాలెందుకు? భగవంతుడు ఈ మాత్రం చేయలేడా! శరీర సంబంధానికి ఆశపడే జీవులారా, విశ్వవ్యాప కుడై నిలిచివున్న దేవుడు బంధుమిత్రులు చేసిన పాటి మేలుచేయ

లేదా! ధనధాన్యాలను సమకూర్చుకొనే శరీరధారులారా, విసుగు లేకుండా విష్ణుభక్తిని వెదకకూడదా! ఇంతమందినీ రక్షించే దేవుడు ధనరాశులపాటి కాపాడలేడా! రాజులను స్తోత్రించేసి దీవించే ప్రజలాలా, శ్రీవేంకటనాథుని కనుగొనకూడదా! అని విష్ణుదేవునిపై భక్తి కలిగి వుండమని సానునయంగా తెలియజేయడం కనిపిస్తుంది.

మాయలో మునుగనేల మమతలేల
చేయరా దేవుడీపాటి సేయనోపడా ॥

అట్టె దేహసమ్మంధ మాసపడే జీవులాల
పట్టి హరిసమ్మంధాన బదుకరాదా
నెట్టన సర్వాంతరాత్మై నిలుచున్న దేవుడిట్టె
చుట్టాల పక్కాలపాటి శుభమియ్య నోపడా ॥

చినతిరుమలయ్యకు తనతాత అన్నమయ్యే గురువు, దైవం, సర్వస్వం అని అనేక సంకీర్తనలవల్ల తెలుస్తుంది. అన్నమయ్య శ్రీవేంకటేశ్వరుడే దైవమనీ, ఆ స్వామి అనుగ్రహం ఉంటే అన్నీ ఉన్నట్లే అని గురూపదేశం చేశాడు. ఆ విషయాలను అత్యంత భక్తి శ్రద్ధలతో, వినయ వివేకాలతో చినతిరుమలయ్య

నీవు గలిగిన జాలు నిక్కము అన్నీ గలవు
ఆవల మాయాచార్యుడానతిచ్చెనయ్యా ॥

యేలోకమున నున్న యెడయని సొమ్ము నీవె
తాలిమి నెందు బోని ధనము నీవె
కాలము కడా తరగని ధాన్యమునీవని
ఆలించి మాగురు డిట్టె ఆనతిచ్చెనయ్యా ॥ (16-46)

చిన్నతిరుమలయ్య శ్రీ వేంకటనాథునితో ప్రత్యక్షంగా తన భక్తిని, అన్నమయ్య తనకు చేసిన ఉపదేశాన్ని విన్నవించుకుంటున్నట్లుంది. నీవు కలిగివుంటే నిజంగా అన్నీ కలిగినట్లే అని మా ఆచార్యుడు ఆనతిచ్చాడు. ఏ లోకంలో ఉన్నా వదలని సొమ్ము నీవే. ఎక్కడెక్కడ తిరిగినా ప్రభువువి, నిందలేని తోడునీడ, ఇల్లువాకిళ్లు, ఎప్పటికీ దొరకని హితుడవు, ఎల్లప్పుడూ ఉండేవంట నీవేనని మా గురువు, దేశికుడు అయిన తాళ్ళపాక అన్నమయ్య ఆనతిచ్చారు. అని ఇందులో పేర్కొన్నాడు. ఈ సంకీర్తనవల్ల భగవంతునే సర్వస్వంగా భావించి నమ్ముకోవాలని వ్యక్తమవుతుంది.

చినతిరుమలయ్య తన సంకీర్తనలలో భావస్ఫూర్తికోసం, అర్థస్పష్టతకోసం ప్రజా సన్నిహితమైన సామెతలను పొందుపరచాడు. ఒక పొరపాటు చేసి బాధపడి, మరలా చక్కదిద్దుకొనేటప్పుడు ఈపని ఎందుకు చేయాలి. ఈశ్రమ ఎందుకుపడాలి అనడానికి అడుసుదొక్కనేల కాలు కడుగనేలవంటి సామెతల ప్రయోగం విరివిగా కనిపిస్తుంది చినతిరుమలయ్యకూడా భక్తిజ్ఞాన ప్రబోధాలు చేయడానికి సామెతల్ని మిక్కుటంగా వాడారు. రక్షకుడైన శ్రీహరిని ఎందుకు మరచిపోవాలి, ఎందుకు విఫలమవ్వాలి ? ఇరుకుమాను సందులో ఎందుకు దూరాలి ? తిరుగలేక ఎందుకు చిక్కుపడాలి ? తనకు చెందని విషయాలలో ఎందుకు జోక్యం చేసుకోవాలి, పనికిమాలిన పాపాలు ఎందుకు పొందాలి . ఉరులలో మెడ ఎందుకుదూర్చాలి, దాన్ని తగిలించుకొని ఎందుకు బాధపడాలి ? కోరరాని కోర్కెలను ఎందుకు కోరాలి, వీడని బంధాల్లో ఎందుకు చిక్కుకోవ లి ? కదులుతున్న బండికింది పాదం ఎందుకుచాచాలి, జారిపడి ఎందుకు భయపడాలి ? శ్రీ వేంకటనాథుని ఆనందంగా సేవించి సుఖంగా ఉండక ఎందుకు దుఃఖించాలి ? అని ఆత్మీయంగా ప్రశ్నిస్తూ శ్రీహరిని మరవకూడదనే సందేశం చేశాడు,

ఏలికైన హరిసేల మరవ గవలె
పొలుమాలి మరియాల భంగపడపలెను ॥

యిరుకుమాని సందినేటికి జొరవలె
తిరుగలేక యేల తినుకవలె
యెరవుల విషయాల నేల పొరలవలె
కొరగాని పాపాల గొడవేల వలెను ॥ (16-49)

పూర్వకాలాల్లో వ్యాధుల్ని నాటుమందులద్వారా పోగొట్టుకునేవారు. అవి చాలా ఘాటుగాను, చేదుగాను ఉంటాయి. ఆ వేర్లు ఆకులు, ఔషధాలు మొదలైనవాటికోసం వాగుల్లో కొండకోనల్లో, చెట్లు పుట్లల్లో వెతుకులాడేవారు. గడపార, గునపాల తో త్రవ్వి కష్టపడేవారు. ఇంతచేసి సంపాదించిన వాటితో మందులు తయారుచేసి పుచ్చుకున్నా అవి తాత్కాలికమే, వ్యాధులు శరీరం వున్నంతవరకు వస్తూనే ఉంటాయి. కాబట్టి ఏ శ్రమ లేకుండా, ఏ ఖర్చు లేకుండా శాశ్వతమైన సంజీవి వుందని, ఆ సంజీవి తిరుమలకొండపై వెలసిన వేంకటనాదుడని చినతిరుమలయ్య తన తాత అన్నమయ్య భావాన్నే పెంచిపోషిస్తూ లోకానికి "వైద్యో నారాయణోహరిః" అనే ఆర్యోక్తి రీతిగా సందేశమిచ్చాడు.

నూరవద్దు తాగవద్దు నోరు చేఁదుగావద్దు
చేరువనొకచోట సంజీవి వున్న దిదివో ॥

పొలమెల్లా దిరిగాడివోడి బడనె వద్దు
తలఁకక గడ్డపార దవ్వవద్దు
పలవనివాగుల వంకల వెదకవద్దు
చెలఁగి వొకచోట సంజీవి వున్న దిదివో ॥ (16-54)

భగవంతుడైన మహావిష్ణువు మానవులకు ఆప్తబంధువు. జ్ఞానం ఉండి ఆలోచిస్తే ఆయనే అందరికీ చివరి దిక్కు. అలాంటి దైవాన్ని ఒక్క నిమిషమైనా వదలి ఉండకూడదని చినతిరుమలయ్య ప్రజలకు భక్తిబోధ చేశాడు. ఒకరి సొమ్ము తిని మరొకరి గుఱ్ఱాల వెంబడి అహంకారంతో పారాడి కొలవడం సముచితమేనా మనల్ని పుట్టించి, పెంచి సంరక్షించే దేవుడు సమీపంలో ఉండగా వారినీ వీరిని ఆశించ వచ్చా ! తాను ఒకరికి పుట్టి జంకులేక పూర్వంలో వారిని ఆనందంగా అయ్యలు, అమ్మలు అనకోవడం ఉచితమేనా, పనిగట్టుకొని సర్వ విధాలైన బంధువు విష్ణువుండగా మానవ చుట్టాలకు వ్యామోహి తులు కావడం చెల్లుతుందా! ఎటువైపునో, దేన్నో ఈ మానవుడు స్తుతించి విందులాగా భ్రమింప చేయడం ఎందుకు, గురి ఆయన శ్రీ వేంకటనాథుడు రక్షిస్తుండగా అల్పమైన కోరికల్లో అలసట చెందడం చెల్లుతుందా ? అని సౌమ్యంగా ప్రశ్నించి భక్తి బోధచేశాడు.

ఎఱుక గలిగి తేను యీతఁడె దిక్కు
మఱి నిమిషమీతని మానివుండ దగునా ॥

యెవ్వరి సొమ్ము గుడిచి యెవ్వరి గుఱ్ఱాల వెంట
కొవ్వుదీర బారాడి కొలిచేది
యివ్వల బుట్టించి పెంచి యేలిన దేవు డుండ
అవ్వలి వ్వలివారిని ఆసపడ గదగునా ॥ (16-55)

చినతిరుమలయ్య ప్రజలను సజ్జనులుగా సద్భక్తులుగా ముము క్షువులుగా తీర్చదిద్దడానికి ఇలాంటి భక్తిజ్ఞాన వైరాగ్యదాయకమైన వివిధ విషయాలను సంకీర్తనలతో పొందుపరచాడు. చెప్పదలచిన

విషయాలు సుబోధకం కావడానికి పరిజ్ఞానసన్నిహిత భావాలను భాషా పదజాలాన్ని స్వీకరించి తేటతెనుగు నుడికారపు సొంపుతో, హృదయ రంజకంగా సంకీర్తనా రచన సాగించాడు. చినతిరుమలయ్య సంకీర్త నలు సంగీత సాహిత్య సౌరభాలను నిత్య నూతనంగా విరజిమ్మే వాడని సుమాలు.

కోస్తావాణి
16-2-1989.



# చినతిరుమలయ్య సంకీర్తనల్లో అనునయం

చినతిరుమలయ్య తన తాత అన్నమయ్యలాగే సంకీర్తనల్ని శృంగార, అధ్యాత్మ అనే రెండు భాగాలుగా విభజించాడు. శృంగార సంకీర్తనలు మధురభక్తికి ప్రతీకలు కాగా, అధ్యాత్మ సంకీర్తనలు భక్తి జ్ఞాన వైరాగ్య బోధనలకు పతాకలు. చినతిరుమలయ్య అధ్యాత్మ సంకీర్తనలలో అన్నమయ్య అధ్యాత్మ సంకీర్తనలలో లాగే విష్ణుభక్తి లీలలతో పాటు అక్కడక్కడ దీనజనుల ఓదార్పు కూడా కనిపిస్తుంది. ఈ ఓదార్పు సంకీర్తనలు చదువుతుంటే నాలుగు శతాబ్దాల వెనకటి చినతిరుమలయ్య సశరీరంగా వచ్చి ప్రక్కన కూర్చొని అనునయిస్తున్నట్లు సహృదయ పాఠకుల కెవ్వరికైనా అనుభూతి కలుగుతుంది. సాహిత్యం యొక్క పరమావధి ఇదేకదా.

సాగరాన్ని అయినా ఈదవచ్చేమో కానీ సంసారమనే సాగరాన్ని మాత్రం ఈదడం అసాధ్యం. మానవులు, కామ, క్రోధ, లోభ, మోహాది అంత శ్శతువుల వలయంలోపడి మాయామోహితులై కొట్టుమిట్టాడుతుంటారు. బిడ్డలున్న వాళ్ళు సంపదలేక, సంపద ఉన్న వాళ్లు బిడ్డలు లేక, ఆరోగ్యం ఉన్న వాళ్ళు అన్నం లేక, అన్నీ ఉన్న వాళ్ళు ఆరోగ్యంలేక ఇలా సంసారులకు ఆత్మ శాంతిలేక ఎన్నో విధాలుగా బాధలు పడుతుంటారు. ఇలాంటివారికి సాటి మానవుని ఓదార్పువల్ల సమస్యలు పరిష్కారం కాకపోయినా కొంత ఊరట, ధైర్యం కలుగుతుంది. కానీ సాటిమానవులు తల్లి దండ్రులైనా, తోబుట్టువులైనా, ఆత్మీయులైనా, ఇరుగుపొరుగువారైనా ఎంత వరకు ఓదార్చగలరు! అందరూ అన్ని వేళలా అందుబాటులో ఉండక

పోవచ్చు. అందరికీ వారి వారికి తగిన బాధలు, బాధ్యతలు ఉంటాయి. కాబట్టి ఈ సామాన్యలౌకిక బాంధవులను నమ్ముకోవడంకన్నా సర్వకాలాలలోను అంటిపెట్టుకొని కాపాడే సారసాక్షునిపై మనసు నిలిపి ఆతనికే బాధల్ని విన్నవించుకోవడం సర్వోత్తమం అని అనుభవజ్ఞానులంటారు. చినతిరుమలయ్య భక్తిజ్ఞాన వైరాగ్యసంపన్నుడు. ఈయన కూడా తమ బాధల్ని శ్రీహరికే మొరపెట్టుకుంటే మంచిదని, ఎంత కాలం ఇలా బాధపడతారు! అని దుఃఖితులను ఓదార్చాడు.

హరికి మొరవెట్టితె అన్నిపనులు లెస్సవును
సరవి నెన్నాళ్ళని జాలిబడవచ్చును ॥

యేమి సేయునీ జీవుఁడీయరి వర్గాలతోడ
బూమెల నెన్నాళ్ళని పోరాడీని
చూమరలఁ జూడఁ జూడఁ జుట్టాలవలనెవుండి
దోమటి పంచేంద్రియాలు దొడుగాకపోయను ॥(16-6)

జీవుడు ఎంతకాలమని ఈ అరిషడ్వర్గాలతో పోరాడుతాడు ఒకప్పటికి మనది అనుకొనే పంచేంద్రియాలతో కూడిన ఈ శరీరం మనది కాకుండా పోతుంది. జీవుడు కర్మల ఋణబంధాలవల్ల ఎక్కడెక్కడో పుట్టి అనేక సమస్యల పీకులాటతో సతమతమవుతుంటాడు. ఇలాంటి ఈ జీవుడు ఎంతదాక ఈ సంసార సముద్రాన్ని ఈదగలడు! ఇతనికి ఎవరు దిక్కు? అని సాటిమానవుని బాధల్ని గూర్చి చినతిరుమలయ్య ఆవేదన చెందుతూ సంసార సాగరాన్ని దాటే ఉపాయం శ్రీ వేంకట నాథునికి మొరపెట్టుకోవడమే అని జనులకు సూచించాడు.

ఈ కలికాలం ప్రారంభం నుంచీ దుష్టులు, దుర్మార్గులు, వంచకులు, పీడకులు నానాటికీ పెరిగిపోతున్నారు. మంచి చేసేవాళ్ళు, మంచి చెప్పేవాళ్లు నానాటికీ తరిగిపోతున్నారు. ఇలాంటికాలంలో మానసికశాంతిని, మానసిక ఉల్లాసాన్ని సమకూర్చేది సత్సాంగత్యం, సత్సాహిత్యం, హితవచనం, ఓదార్పు సాహిత్యంవల్ల కలుగుతోందంటే ఆ సాహిత్య రచయితలు చెబుతున్నారని అర్థం. చినతిరుమలయ్య హితుడు, సన్నిహితుడు. ఈయన నిజమైన హితం అంటే ఏమిటో చెబుతూ శ్రీ మహావిష్ణువును ఎల్లప్పుడూ స్తుతించమని, రకరకాల రుచుల్ని కోరవద్దని, చెడ్డవైన కామాదుల్ని చేరవద్దని, ముందుచేసిన చిల్లర చేష్టల్ని విడిచిపెట్టమని సర్వరక్షకుడైన శ్రీ వేంకటనాథుని విడువకుమని లోకానికి వివరించాడు.

హితవిదె తెలుసుకొమ్మీ
సతతముఁ జాటెతిని ॥

సెయవోయి జిహ్వయీయా శ్రీహరి నుతియెపుడూ
రోయవోయి నీవు యీా రుచులయందలి వేడుకా॥
(16-9)

అలాగే మరో సంకీర్తనలో—

నిండుగా సంరక్షించే దేవుడుండగా ఊరకే ఎందుకు విచారిస్తారు? ఎందుకీ దుర్భరమైన చింతలు? అంటూ తాను ముందే బుద్ధి గలిగి నడుచుకొంటే తప్పులెందుకు వస్తాయి? పాపాలెందుకు కలుగుతాయి? అయినా ఇకనైనా బుద్ధి తెచ్చుకొని భగవంతుని ప్రార్థిస్తే ఆ భగవంతుడే కాపాడుతాడు అని లోకులను హెచ్చరికతో అనునయించాడు.

వట్టి విచారములేల వలవని చింతలేల
దిట్టతనాన రక్షించ దేవుఁడుండఁగాను ॥

తానె బుద్దొఁగితే తప్పులేల వచ్చీని
మానక యేలిక లెస్స మన్నించుఁగాక
మేనిలోఁ బాపము లేక మించిన భయమేఁటికి
అనుకొని రక్షించ శ్రీహరియుండఁగాను ॥ (16-25)

ఈ విధంగానే మరోకీర్తనలో కూడా చినతిరుమలయ్య మంచి విశ్వాసంతో శ్రీహరిని చేరడానికి నేర్వాలిగానీ ఈ పనికిమాలిన విచారాలు, బాధలు ఎందుకు? అంటూ కాలం, కర్మం ఏమీ చేయవని, భక్త శిఖామణులైన ధ్రువుని, అజామిళుని కాలకర్మలతో నిమిత్తం లేకుండా శ్రీనాథుడే రక్షించాడని అలాగే పాపం, పగ ఏమీ చేయవని, ఘంటా కర్ణుని, ప్రహ్లాదుని ఇవి ఏమీ చేయలేదని, కులం, గుణం కూడా ఏమీ చేయవని వాల్మీకిని, అహల్యను ఇవి ఏమీ చేయలేదని కాబట్టి ఎవ్వరూ దేనికోసం భయాందోళనలు చెందనవసరంలేదని, దిగులు పడనక్కరలేదని, విష్ణుమూర్తిపై భక్తి కలిగి ఉండమని సాటిమానవులకు ఓదార్పు చెప్పాడు.

వట్టి విచారములేల పగపులేల
నెట్టన శ్రీహరిఁజేర నేరవలెఁగాక ॥

కాలమేమి సేసీని కర్మమేమి సేసీని
యేలిన శ్రీరమణుఁడె యెదనుండఁగా
ఆలించిన ధ్రువునిని అజామిళునిని
కాలమేమి సేసెనయ్య కర్మమేమి సేసెను ॥ (16-43)

లోకంలో ఎటుచూసినా హింస, అసత్యం, అన్యాయం, దౌర్జన్యంతో క్రిక్కిరిసిపోతున్న ఈరోజుల్లో సజ్జనుల జీవన స్రవంతులు అడుగడుగునా అణువణువునా ఆవేదనా సుడిగుండాలుగా సాగుతున్నాయి. దీని నివారణకు ఏకైక మార్గం దుష్టశిక్షకుడైన శ్రీహరికి శరణాగతి చేయడమే. చినతిరుమలయ్య రచించిన ఈ అనునయాత్మకమైన సంకీర్తనలు అందుకు ఉద్దీపనం కలిగిస్తాయి.

కోస్తావాణి
5-9-1993



# చినతిరుమలయ్య వినయసంపత్తి

మనిషికి రూపవిద్యా ఐశ్వర్యాదులు, పదవులు ఎన్ని ఉన్నా వినయసంపత్తితో కూడిన సద్గుణాలు లేకుంటే ఆవ్యక్తి రాణించడు. పెద్దలపట్ల వినయ గౌరవాలు, మేలుచేసిన ఉపకారులపట్ల కృతజ్ఞత కలిగివుండటం కనీస మానవధర్మం. కానీ నేడు ఈ సుగుణాలున్న మానవులు అరుదుగానే కనిపిస్తారు. అందువల్ల మానసిక వికాసం కోసం, పరివర్తనకోసం ఆదర్శ పురుషుల నడవడిని పరామర్శించుకో వలసిన అవసరం ఉన్నది.

పదకవితా పితామహుడు, పద్మనేత్రుని పరమభక్తుడు అయిన తాళ్ళపాక అన్నమాచార్యులు చినతిరుమలయ్యకు పితామహుడు. అన్నమయ్యలోని సకల సద్గుణాలు, సకల విద్యలు చినతిరుమల య్యలో రాశీభూతమయ్యాయి. తనకు వైష్ణవ దీక్ష ఇచ్చి జ్ఞాన వంతుని చేసిన ఘనవిష్ణువనే గురువుపై అన్నమయ్య ఎంతటి శ్రద్ధా భక్తులు చూపాడో చినతిరుమలయ్య కూడా తన గురువైన పితా మహునిపై అంతటి శ్రద్ధాభక్తులు, వినయ గౌరవాలు ప్రదర్శించాడు చినతిరుమలయ్య తాను శ్రీవేంకటనాథుని ముద్రాంకితంగా రచించిన అధ్యాత్మ సంకీర్తనలలో అన్నమయ్యను పరిపరి విధాలుగా ప్రస్తు తించాడు తనకు బ్రహ్మోపదేశం చేసి భక్తి జ్ఞాన మార్గాలను ప్రబో ధించిన గురువు తన తాతగారే కదా అని సామాన్య వ్యక్తిలా నిర్ల క్ష్యం చేయకుండా చినతిరుమలయ్య వినమ్ర హృదయుడై, వివేక వంతుడై, విశుద్ధమనస్కుడై తన తాతగారిని స్తుతించడం కొని యాడ దగిన విషయం.

చిన తిరుమలయ్య తన తాత తిరుమలప్పని వరప్రసాదం వల్ల జన్మించినవాడని, ఈ సృష్టికంతటికీ దొర అయిన ఆదినారాయణ మూర్తిని తన అంతరంగంలో నిలుపుతున్నాడని, సనక సనందనాది యోగీశ్వరులంతటి విఖ్యాత భక్తుడని ఆ శ్రీహరిపై మహోన్నతమైన కీర్తి ధ్వజాలుగా అనేక సంకీర్తనలు రచించాడని, శ్రేష్ఠమైన రామానుజ మతాన్ని స్వీకరించి వెలుగొందినవాడని, శ్రీవేంకటనాథుని తమకు విందు భోజనంలా అందించాడని తాతగారి ఔన్నత్యాన్ని, అతను తమకు చేసిన మహోపకారాన్ని వ్యక్తం చేసినాడు.

అప్పని వరప్రసాది అన్నమయ్య
అప్పనము మాకెకల దన్నమయ్య॥

అంతటికినేలికైన ఆదినారాయణు దన
యంతరంగాన నిలిపే నన్నమయ్య
సంతసాన వెలువొందె సనకసనందనాదు
లంతటివాడు తాళ్ళ పాకన్నమయ్య॥ (16-23)

తనకు బ్రహ్మోపదేశం చేసి చెడుదారిలో పడకుండా తప్పించి శ్రీవేంకటనాథుని మనస్సులో నిలిపిన తన తాతగారే తనకు దైవం, గురువు, బంధువు, తల్లి, తోడు నీడ, దాత, తనకు ఏడుగడ అని తాతగారిపై తన నిర్మల భక్తిని వెల్లడీకరించాడు.

తాళ్ళపాకన్నమాచార్య దైవమవు నీవుమాకు
వేళమె శ్రీహరి గనే వెరవానతిచ్చితివి॥

జగద్రక్షకుడైన భగవంతుని కలిగి వుంటే అన్నీ అమరినట్లే అని, ఏ లోకంలో ఉన్నా వదలని సొమ్ము, తరగని ధనం దైవమే అని, ఎక్కడెక్కడ తిరిగినా కాపాడేవాడు, నిందలేని తోడు నీడ

ముందు వెనకల ఇల్లు, వాకిలి, అపూర్వమైన హితుడు ఎల్లకాలం ఉండే పంట, రక్షించే వేంకటనాథుడు నీవేనని తన గురువు, తాత అయిన అన్నమయ్య బోధించాడని చినతిరుమలయ్య శ్రీనివాసునికి విన్నవించుకోవడం వ్యక్తమవుతుంది. దీన్నిబట్టి చినతిరుమలయ్య తాతగారికిచ్చిన ప్రాధాన్యం ఎంతటిదో తెలుస్తుంది.

నీవు గలిగిన జాలు నిక్కము అన్నీ గలవు
ఆవల మాయాచార్యు డానతిచ్చెనయ్యా ॥ (16-46)

తనకు జ్ఞానబోధ చేసి మహోపకారం చేసిన అన్నమయ్య దయాగుణానికి ఆశ్చర్యచకితుడై అతన్ని స్తుతిస్తూ వ్రాసిన—

ఎట్టి హితోపదేశ కుండెటువంటి దయాళువు
అట్టి తాళ్ళపాకన్నమాచార్యులు ॥

పచ్చి తామసులమమ్ము బరమ సాత్వికులు గా
యిచ్చటనె సేసినాఁడు యెంత చిత్తము
యిచ్చగించి మాకులాన నెన్నడు లేని వైష్ణవ
మచ్చముగా కృపసేసె నన్నమాచార్యుఁడు ॥(16-12)

అనే సంకీర్తనలో చిన తిరుమలయ్య తమకు అన్నమయ్య ఎంతో హితోపదేశం చేశాడని, ఎంతో కరుణకలిగినవాడని, శక్తులను ఉపాసించి బలి పూజలు చేసే తామసులైన తమను పరమ సాత్త్వికులుగా మార్చి వైష్ణవ మతాన్ని ప్రసాదించాడని, ఎన్నో పాప కర్మలు చేసిన తమను పుణ్యులుగా చేశాడని ఎప్పుడూ తెలియని సంకీర్తనా భక్తి మార్గాన్ని తమకు ఉపదేశించాడని, మూర్ఖులైన తమను జ్ఞానవంతులుగా చేసి తమ కష్టాలనన్నింటినీ పోగొట్టాడని, ఎప్పుడూ చూడని శ్రీవేంకటనాథుని తమకు ప్రమాణంగా ఇచ్చాడని

తన తాతాగారి ఔదార్యానికి ముగ్ధుడు కావడం విశదమవుతోంది. పెరట్లో చెట్టు మందుగాదనే లోకోక్తిగా కొంతమంది తమ కుటుంబం లోని పరిజ్ఞానాన్ని, తమకు సన్నిహితులైనవారి విద్యా వైశిష్ట్యాన్ని కించపరుస్తూ నిర్లక్ష్యం చేస్తుంటారు. పొరుగింటి పుల్లకూర రీతిగా పరుల విద్యా విజ్ఞానాలకోసం ప్రాకులాడుతుంటారు. అలాంటివారికి చిన తిరుమలయ్య ఒక హెచ్చరిక అన్నమయ్యపై ఒకవైపు మనుమడుగా ప్రేమాభిమానాలు చూపుతూ మరోవైపు శిష్యుడుగా గురుభక్తిని, వినయ సంపత్తిని, కృతజ్ఞతా భావాన్ని సంకీర్తనల్లో ప్రదర్శించిన చిన తిరుమలయ్య ఆదర్శవంతుడు.

కోస్తావాణి

3-10-1993.



# చిన తిరుమలయ్య శృంగార సంకీర్తనల్లో సాహితీ మాధురిమ

చినతిరుమలయ్య తన తాత తండ్రులైన అన్నమయ్య, పెద తిరుమలయ్యలవలె అధ్యాత్మ సంకీర్తనలతోపాటు శృంగార సంకీర్తనలు కూడా వెలయించాడు. ఈయన సంకీర్తనలలో కూడా పద్మావతీ శ్రీనివాసులే నాయికా నాయకులు. వీరే భార్యా భర్తలుగా. ప్రేయసీ ప్రియులుగా, జీవాత్మ పరమాత్మలుగా కొన్ని కొన్ని సంకీర్తనలలో ప్రవర్తిల్లుతుంటారు. ప్రేయసీప్రియ బాంధవ్యాన్ని దివ్య నాయికానాయకులకు లేదా భక్తునికి, భగవంతునికి అరోపించి మధుర భక్తి రీతిలో సంకీర్తనలు వెలయించడంవల్ల సమస్త ప్రజలు ఆకర్షింపబడి చివరికి పరమాత్మపై అనురక్తి పెంచుకుంటారు. ఈ ఉద్దేశ్యంతోనే తాళ్ళపాక కవులు శృంగార సంకీర్తనలు రచించివుంటారు. చిన చినతిరుమలయ్య సంకీర్తనలలో అన్నమయ్య పెదతిరుమలయ్య సంకీర్తనలలోవలె నాయికా నాయక అనురాగ వర్ణనలు, విరహవేదనలు, కలయికలు, చెలికత్తెల ఊరడింపులు, హితబోధలు, సవతులవిచారం, ప్రేయసి అవ్యాజప్రేమ, ప్రేయసీ ప్రియుల సంవాదం, కోలాటగేయ రీతులు, క్షేత్రముద్రితో కూడిన స్వామి శృంగార చేష్టలు, దక్షిణ నాయకత్వం మొదలైన అంశాలు కనిపిస్తాయి.

మహావిష్ణువు శ్రీకృష్ణావతారం దాల్చినప్పుడు గోపికలతో మాయావినోదంతో సరసచేష్టలు చేశాడు. చినతిరుమలయ్యకృష్ణుడు, గోపికలు అనేపేరు లేకనే ధ్వనాంత్మకంగా కృష్ణుని శృంగారచేష్టల్ని సూచించాడు. తాను తలఎత్తిచూస్తే అతన్ని చూశానని కలియడానికి వస్తున్నాడు. సఖులతో సైగచేస్తే తాను దగ్గరకువస్తున్నాడు.

ఆమెను పిలిస్తే జంకులేకుండా తాను పలుకుతున్నాడు. నా చెలిపై చేయివేస్తే తాను చెయ్యిచూపుతున్నాడు. ఎదురుగానున్న ఆమెతో రహస్యం చెప్పడానికిపోతే అతను నన్ను కౌగిలించుకొన్నాడు. నన్ను కలసి నాహృదయాన్ని పీడకుండా ఉన్నాడు. ఎలాంటి వాడే వీడు. ఈ విధంగా దగ్గరవుతున్నాడు అని ఆశ్చర్యానందాలతో ఒక స్త్రీ మరో స్త్రీతో చెబుతున్నట్లుంది.

ఎటువంటివాఁడె యీతఁడు
యిటువలె దగ్గరీ నీతఁడు॥

తలయెత్తి చూచితే తను జూచితి నంటా
యెలయించవచ్చీ నీతఁడు
చెలులతోడ నే జేసన్న సేసితే
యెలమి దగ్గర వచ్చీ నీతఁడు॥ (16-15)

భగవంతుడు భక్తునిపైపై తిరుగుతుండగాడని ఈ సంకీర్తనవల్ల తెలుస్తుంది.

శ్రీవేంకటేశ్వరునికే తిరువెంగళప్ప అనేపేరుకూడా ఉంది. శ్రీ వేంకటేశ్వరుడు శృంగారపురుషుడు, దక్షిణ నాయకుడు. ఆయనకు ప్రసిద్ధులైన దేవేరులు శ్రీలక్ష్మి అలవేలుమంగలు. ఈస్వామి శృంగార చేష్టల్ని తిరుమలయ్య మధుర మనోహరంగా వర్ణించాడు. ప్రసన్నమూర్తి అయిన తిరువెంగళప్ప వేలాది చేష్టలుగల దేవుడు. ఇద్దరు దేవేరులు ఇరుప్రక్కల నిలిచి సేవలు చేస్తుంటే చిలిపి చూపులతో మనసు కరగిస్తూ తీర్చిదిద్దిన గోళ్ళతో (వేళ్ళతో) అవయవాలు తాకుతున్నాడు. యావనవతులు నలువైపుల కలసి సేవలు చేస్తుంటే మంచిమాటలతో ఆశలు కల్పిస్తూ ధీరంగా తుంటరిచేష్టలు చేస్తున్నాడు. అలమేలుమంగ తనకు తాంబూలం అందిస్తుంటే సల్లాపా

లతో మోహింపచేస్తూ కలిశాడు. ఇతడు తెల్లని కన్నులవాడు అని తెలిపాడు.

వేవేలు చేతలవాఁడు వీఁడె వీఁడె
దేవుఁడుగదె ప్రసన్న తిరువెంగళప్పఁడు ॥

యిద్దరు సతులు తన యిరువంకల గొలువ
గద్దెన చూఁపునని కరగింపుచు
అద్దరిపాటు వేసి ఆయములు ముట్టీని
దిద్దిన గోళ్ళ ప్రసన్న తిరువెంగళప్పడు ॥ (16-29)

మహావిష్ణువు జగన్మోహనాకారుడు. ఆయన రూపం, ఆయన విలాసం సమస్త జీవులను ఆనందసాగరంలో ముంచి తేల్చుతుంది. అలాంటి ఆస్వామి శృంగార వైభవాన్ని గూర్చి నాయిక తన చెలితో వాడు వలపుల కలకంప మన్మథుని కన్నతండ్రి, అలవాటు ప్రకారం ఎలాంటి స్త్రీని అయినా వలపించేవాఁడని వాసవపువ్వు ఎవ్వరికీ భయపడడు. ఎంతమందికైనా సమాధానం చెబుతాడు. ఊరు స్త్రీలకు విందుభోజనంవంటి వాడు. ఎక్కడైనా తన అవసరం చూసుకొనే వగలమారి మగతుమ్మెద. తగిన రీతిగా అందరితో ముచ్చటలాడె అల్లారుముద్దులవాడు. ఎక్కడైనా స్నేహమే చేసుకొనే చేసుకోనే వనితలపాలిట పెన్నిధి. వానికేమి గొప్పవాడు అలాంటి వెంకటనాథుడు నన్ను కలశాడు. అని ఆనందోత్సాహాలతో తెలియ జేయడం మనోహరంగావుంది.

వలపులకలగంప వాఁకేమె
వఁరాజు గన్నతండ్రి వానికేమె ॥

వాడికగా దాని యెవ్వతెనైనా వలపించు
వాఁడనివాసనపువ్వు వానికేమి
వోఁడ డెందరికినైనా వుత్తరువె చెప్పీని
వాఁడమగువలవిందు వానితేమి॥ (13-31)

ఇందులో స్వామిని వర్ణించేవారు పైకి చెలికత్తెగా, ఒక స్త్రీ మూర్తిగా, ఒక గోపికగా, ఒక ప్రేయసిగా వ్యక్తమైనా అంతర్గతంగా చిన తిరుమలయ్యే అలా తాదాత్మ్యం చెందుతున్నట్లు మనం భావించవచ్చు.

స్త్రీజనం వల్లనే నాయకుడు అన్నింటిలోను గొప్పవాడయ్యాడని సఖులు సంభాషించడం మిక్కిలి చమత్కారంగా కనిపిస్తుంది. మగువలందరు కలసి నిన్ను మాకోసం భయము, మరపులేని విధంగా తీర్చిదిద్దారు. చూపులతోనే మోహించే కాంతలు ఉంటటంవల్ల చిన్నప్పుడే నీవు గుణాల్లో పెద్దవయ్యావు. వనితల అధరాల మాధుర్యం వల్ల నీమాటలకు తియ్యదనం వచ్చింది. ప్రేమతో అలంకరించే స్త్రీలు ఉండటంవల్ల ఇంత అందగాడవయ్యావు. అనురాగంతో నిన్ను కోరి వచ్చినందువల్ల నీవు ఎల్లప్పుడూ వేణుగాన చతురుడవయ్యావు. తరుణులు నీతో నేర్పరితనంగా మాట్లాడటంవల్ల గడుసుతనంతో మాటకారివయ్యావు. వారందరు నిన్ను కలియడంవల్ల ప్రాయపు రతిలో నీవు ఓడనివాడవయ్యావు అని ముచ్చటిస్తున్న విషయం హృద్యంగావుంది.

తెలవ లందరు గూడి తిద్దిరిగా నిన్నును
మఱపు వెఱపు లేక మాకొరకు గాన॥

కన్నులనె వలపించే కాంతలు గలుగగా
చిన్ననాఁడె గుణముల బెద్దవైతివి

మున్నిటివారి యధరముల తేనె సోఁకగా
తిన్నని నీమాటలకు తీపు లెకేరును ॥ (16-86)

సుందర స్వరూపుడైన నాయకుని చూచి ఒక కామిని తనకు మనసిచ్చి మాట్లాడమని వెనకాడవలసిన పనిలేదని, ఇది దోషం కాదని ప్రాధేయపడటం హృదయంగమంగా చిత్రించబడింది.

మోమాటం లేకుండా పిలిచినా మౌనంగా ఉన్నావు. నామాటలకు సిగ్గుపడుతున్నావా! మాలాంటివాళ్ళతో మాట్లాడవద్దని పెదవిపై ఏ స్త్రీ అయినా ముద్రిపెట్టిందా! తాకుతుంటే మెల్లమెల్లగా వరవశిస్తున్నావు. నా చేష్టలు కళలంటుతున్నాయా! మాతో సరసాలాడవద్దని చేతులపై ఏ స్త్రీ అయినా గుర్తుపెట్టిందా! వూనుకొని నేనే నిన్ను కలియగా నాకొంగు కప్పుకొంటున్నావు, వెనకటి రోజులో ఏస్త్రీ అయిన వక్షస్థలంపై గుర్తుపెట్టిందా అని వివరించి అడగడం వ్యక్తమవుతుంది.

తమకపడ నేటికి దాని కేమి దోసమా
అమర మన సిచ్చి మాటాడవయ్య విభుఁడా॥

మోపనాడి పిలిచినా మోనాన సున్నాఁడవు
చేవల నామాటలకు సిగ్గాయనో
మావంటివారితోఁడ మాటాడవలదని
మోవిమీఁద నెవ్వరైనా ముద్రి వెట్టెనో॥ (16-83)

ఇందులో నాయకుడు సిగ్గరిగా భాసిస్తున్నాడు. మనసులోని మోహం తనువుద్వారా వ్యక్తమవుతుంటే వాటిని గూర్చి ఇతరులకు చెప్పవద్దంటున్న నాయికతో చెలి సరస సంభాషణ చేయడం మిక్కిలి హృద్యంగా వర్ణించబడింది.

నీ ఒంటిపై నున్న చెమటలే వ్యక్తంచేస్తుంటే నేను ఇతరులకు చెప్పకున్నా దాగుతుందా! నీ ప్రేమాతిశయాన్ని చెలితో చెప్పబోతుంటే అంగడి కెక్కించవద్దని ఒట్టు పెట్టుతున్నావు గజ్జెల్ని దొంగిలించిఅవతల పెట్టబోతే వెర్రితనమేగానీ ఎవ్వరూ శబ్దం వినకుండా వుంటారా! నీ విరహాన్ని ఆమెతో చెప్పబోతుంటే వ్యక్తం చేయవద్దని కన్నుగీటుతున్నావు. ప్రయత్నంతో కళ్ళుమూసుకొని పాలు త్రాగబోతే ఇంటి మనుషులు చూడకుండా ఉంటారా! ప్రియుని తోడ్కొని రమ్మని సఖులతో చెప్పబోతుంటే అగడు చేయవద్దని ఒట్టు పెట్టుతున్నావు నవ్వుతూ శ్రీ వేంకటేశ్వరుడె నిన్ను కలియగా చిగురించిన కోరికల చేష్ట దాగుతుందా అని ముచ్చటించడం కనిపిస్తుంది.

వెలఁది నీ చెమటలె వెల్లి వేయఁగా
తలఁగి నే జెప్పకుంటే దాఁగ బోయ్యీనా ॥

సంగతి నీమోహ మెల్లా సకితో జెప్పఁగ బోతే
అంగడి బెట్టకు మని ఆనవెట్టేవే
దొంగిల గజ్జెల పేరు తొలఁగ బెట్టగ బోతె
వెంగలితనమె కాక వినక మానేరా ॥ (16-45)

తాళ్ళపాక కవులందరి సంకీర్తనల్లోను నాయికా నాయకుల విరహవేదన, అలుక వర్ణించబడిన సంకీర్తనల్లో కూడా చివరి చరణం పాదాల్లో నాయికా నాయక ఐక్యత వర్ణించబడటం విశేషం. దీనివల్ల ఎప్పటికైనా పరమాత్మ సంయోగంతోనే జీవాత్మ శాంతిస్తుందని తెలుస్తుంది.

చినతిరుమలయ్య నాయిక విరహ వర్ణనను భావస్ఫోరకంగా, కల్పనాచాతుర్యంగా వర్ణించాడు. విరహవేదనవల్ల నాయిక శరీ

రంపై పొడమిన సాత్త్విక భావాలను చెలికత్తె సాటి చెలులతో ముచ్చటించడం—

తెలిసినమాట తేటతెల్లమిగా జెప్పేను
తలిరు బోణి విభునిదండ నుండవలెనా ॥

ముదిత మేని పులక మొలకలు పన్నీటి
పదనునఁ దీగెలువారీ జుండి
కదిసి వోచెలులాల గందవొడి పొదిచేత
అదన నవియు బొదలయ్యీ జుండి ॥ (16-46)

ఈమె తనువుపై నున్న పులకాంకురాలు పన్నీరు పారడంవల్ల తీగలు వారాయి. ఓ చెలులారా గంధంపొడివల్ల అవి పొదలయ్యాయి సుమా! నాయిక స్తనగిరులపై స్వేదధారలు పుష్ప మకరందంలా కాలువలయ్యాయి. మోహాతిశయంవల్ల కళ్ళల్లో నీరు క్రమ్ముకోగా భూమిపై మన్మథుని పేరుతో ఏరులయ్యాయి. ఆమె తన భర్తను మనస్సులో మెల్లమెల్లగా తలచుకోవడంవల్ల అంతటా అతడే కనిపించాడు. శ్రీవేంకటేశ్వరుడు కలియగానే ఆమెకు తాపం పోయింది అని ఇందులో వ్యక్తం చేయబడింది.

ఒక చెలికత్తె సతి విరహవేదనకు ఆవేదన చెంది అతడు ఆమెకు దూరమైనవాడు కాడు, ఆమెకు ప్రాణనాథుడు. నీతిగా అతన్ని ఆమెకు చేర్చి ఆమెను కాపాడండి అంటూ చేసిన హితవు—

ఆతడేమి దవ్వుగాడు అతివ ప్రాణనాథుఁడె
నీతితోడ వాని గూర్చి నెలఁత గావ గదరే ॥

చల్లనైన గాలిచేత జాలి రేచె వలపు
పిల్లగోవి వట్టె వాఁడు పెచ్చురే చేసె

పొల్లవోని పూవులపు ప్పాడి పోదినేసెసే
వొల్లనన్ను బోదు దీని కోమరమ్మ చెలులు ।(16-44)

ఆమె వలపు చల్లనిగాలివల్ల అధికమవుతుంది. పిల్లనగ్రోవి పట్టుకొని అతడు అతిశయింపజేస్తున్నాడు. వెన్నెలలు నిప్పురవ్వల్లా మోహాన్ని రాపాడుతున్నాయి. నవ్వీనవ్వీ అతనిచూపు మోహాన్ని పెంచుతూంది. గండుకోయిలల కూతవల్ల ఇంకా అధికమయ్యింది. మన్మథుని సుమబాణం తగిలి మితిమీరింది. అని వ్యక్తం చేయబడింది. ఈ సంకీర్తన చివరి చరణంలో చివరికి ఆమె భర్త ఆమెను కలసినందు వల్ల ఆమెలో కళలు పొడసూపాయని. ఆమె చెదరని ఆనందంతో చెలరేగిందని నాయికానాయకుల ఐక్యం చెప్పబడింది.

చెలికత్తె నాయిక రూప సౌందర్యాన్ని సాటి సఖులతో ముచ్చటించడం వర్ణించబడింది.

ఇంతిచక్కదన మిక నేమని కొనాడదము
చెంత నాతఁడును నీపె చే తలకె భ్రమసె ॥

మొలక నవ్వుల చెలిమోము చూచి విభుఁడు
తొలఁక వెన్నెలల చందురు డని భ్రమసె
మలయు జంకెనల బొమ్మలఁ జూచి రమణుఁడు
వెలయఁగ మదనుని విండ్లని భ్రమసె ॥ (16-8)

నాయిక చక్కదనాన్ని ఏమని కొనియాడగలం! ఆమె చేష్టలకే ఆమె విభుడు భ్రాంతి చెందాడు. లేత నవ్వుల చెలిమోముచూసి వెన్నెలలు చిలికించే చంద్రుడని, అందమైన కనుబొమ్మలు చూసి మన్మథ ధనుస్సులని, ఒయ్యారపు చెలి చూపును కసిగా మన్మథుడు వేసిన బాణమని, ఆమెది కోయిల పలుకని, తనను కౌగిలించిన సతిని

నిశ్చలమైన మెరుపుతీగ అని భ్రమచెందాతని ఇందులో వర్ణించ బడింది. ఇది భ్రాంతి మదలంకారంతో సాగిన సంకీర్తన.

ప్రియసిపై తనకున్న ప్రేమానురాగాల్ని ప్రియుడు ప్రేయసికి వ్యక్తం చేయడం—

శంకరాభరణం

తగు నీకు నాకును దయ్యమె కూరిచినాఁడు
నగవుల సరసాలె నయమాయ మనకు ॥

జూటు జూపులనె నన్ను జూచేటి వోజవరాల
సూటి నామనసు నీపైఁజోటు గైకొని
నాటుకొన్న తమకము నాకు నీకు నొక్కపాటె
యేటలమాయల యెరవేఁటి కింక మనకు ॥ (16-17)

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది. తగిన విధంగా దైవమే నిన్ను నన్ను కలిపాడు. ఓరచూపులతో నన్ను చూసే ఓ జవరాలా, సూటిగా నామనసు నీపై చోటుచేసుకున్నది. నెలకొన్న మోహం నీకు ఒక్కటే. ఇంకెందుకు మనమధ్య ఎడబాటు ఎందుకు! ఇంపైన మాటలతో నన్ను అదరగొట్టే ఓ స్త్రీ ఘనంగా నామోహం నీతో వావిగలసింది. మన్మథుని తాపం ఇద్దరికి ఒక్కటె అసంబంధమైన జగడాల్లో మనం బాధపడటం ఎందుకు? వలపులు చల్లి నన్ను వంచుకొనే ఓ కాంత, నీతో నేను స్నేహం చేశాను. అందమైన శ్రీవేంకట నాథుడనైన నేను నిన్ను కలసి నిశ్చలంగా ఉన్నాను అని హృదయ రంజకంగా తన వలపును వ్యక్తం చేశాడు.

పరస్త్రీ సంగంచేసి వచ్చిన పురుషుని శరీరంపై వస్త్రాలపై కనిపించే గుర్తులను చూచి మానవతి అయిన ఏస్త్రీ సహించదు. తాను

ఎన్ని అబద్ధాలు చెప్పినా విసే అమాయక స్థితిలో ఉంపదు. నిలదీసి ప్రశ్నించి నిజం రాబట్టుతుంది. చిన తిరుమలయ్య సంకీర్తనల్లో ఇలాంటి సంకీర్తనలు కూడా కనిపిస్తాయి. నాయిక నాయకునితో ఇంక నీవు నాతో అబద్దాలు చెప్పడం మానరా! నిన్ను పోనివ్వను. ఆమె శరీరంపై వున్న కుంకుమపువ్వు నీ శరీరంపై మెఱుస్తుంది. ఎందుకురా! మెరుస్తున్న నీ శరీరంపై ఎఱ్ఱదనం ఎందుకు వచ్చింది? మాయమర్మాలతో నీవు నాతో బొంకవద్దు. ఆమె పాదంపైవున్న లత్తుక నీనొసటి మీాది ఎలా వచ్చింది తొందరగా చెప్పరా! ఆమె పుక్కిటిలోని కర్పూరతాంబూలం నీకు ఎందుకు వచ్చిం! ఆమె నీ శరీరంపై స్పష్టంగా తెలిసేలా ఉంచిన వాడి గోళ్ళ జాడ లేమిటివి, శ్రీవేంకట నాథ ప్రూనుకొని నన్ను కలిశావు ఆమె మాటను నాదగ్గర బొంక వద్దు అని పరస్త్రీ సంబంధాన్ని ఖండించడం—

పాడి

మానరా నాతో (తో) నింక మరఁగులు
పోనీ నెంతైనా నిన్ను బొంకకు నాతోను॥

గుఱుతైన యూకె మేని కుంకుమపరిమళము
మెఱయనే టికిరా నీమేనియందును
మెఱుఁగు నీమేనిమీాఁద మించిన కెంపేలవచ్చె
పొఱపొచ్చముల నీవు బొంకకు నాతోను॥ (16-4)

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది. తాళ్ళపాక కవులశృంగార సంకీర్తన లన్నింటిలోను నాయిక నాయకుని ప్రశ్నిస్తున్నప్పుడు చెప్పరా ఏటికిరా వంటి పద ప్రయోగం కనిపిస్తుంది. దీన్నిబట్టి తాళ్ళపాక కవులు స్త్రీకి స్వేచ్ఛ, సమానత్వం, వ్యక్తిత్వం వంటి ఆధునిక ధర్మాలు ఆనాడే కోరుకున్నారని తెలుస్తుంది. అంతేగాక

భార్యాభర్తలు హెచ్చుతగ్గులుగాకాక స్నేహంగా మసలుకోవాలనీ, స్త్రీకూడా భావస్వాతంత్ర్యాన్ని ప్రకటించాలని వారు ఆశించినట్లు తెలుస్తుంది.

కొంతమంది పురుషులు "పొరుగింటి పుల్లకూర తియ్యన" అన్న సామెత రీతిగా తన భార్య ఎంత అనురక్తురాలై వుండినా ఇష్టపడక పరస్త్రీ సాంగత్యం కోసం ఉవ్విళ్ళూరుతుంటారు. ఈ విషయాన్నే ఒక ఇల్లాలు తన భర్తతో నిష్ఠూరంగా వ్యంగ్యంగా అంటుంది. నీ గుణాలు చాలా బాగున్నాయి. మెచ్చుకోవచ్చు. పోల్చి చూస్తే నీ చేష్టలు పూటపూట కొత్తకదా. ఏస్త్రీ అయినా గర్వంగా తిట్టినా నవ్వుకొనే నీవు నేను ఎలా పొగడినా ఇష్టపడవు. అంతలోనె మోహించే వారు ఏమన్నా చెల్లుతుందిగానీ నేను ఊరకున్నా నీకు అది తప్పేకదా. ఏస్త్రీ అయినా తన్నినా నవ్వే నీవు ఇక్కడ నేను మ్రొక్కినా అసహ్యించుకొంటావు. నీకు నచ్చిన వారి చేష్టలె నీకు ఇష్టమవుతాయి. కాని నామోహమైనా నీకు చప్పనే కదా. నిన్ను ఏస్త్రీ అయినా స్వీకరించకపోయినా నవ్వే నీవు నేను ప్రత్యక్షంగా ఉన్నా నాముఖం ఇటువైపు చూడవు శ్రీవేంకటనాథ నన్ను కలిసి నాహృదయం పీడవాడవయ్యావు ఇది మంచిదె కదా. అని తెలియజేయడం కనిపిస్తుంది.

పాడి

మేలురా యీ నీగుణము మెచ్చవచ్చును
పోలించ నీచేఁత పూఁట పూఁట కొత్తకాదా॥

దిట్టయై యెవ్వతెయైనా దిట్టినా నవ్వేటి నీవు
యెట్టు నే బొగడినాను యీరసించేవు
యిట్టె వలపించేవా రేమనినాఁ జెల్లుఁగాక
నెట్టన నే నూరకున్నా నీకు నెగ్గేకాదా॥ (16-5)

తన భర్త పరస్త్రీపై వ్యామోహం చెందినప్పుడు భర్తకు ఎంత చెప్పినా ఉపయోగం లేదని తెలిసి భార్య ఆ స్త్రీ దగ్గరకు వెళ్ళి తన బాధను వ్యక్తంచేసి నిష్ఠూరంగా మాట్లాడటం లోకంలో కనిపిస్తుంది. ఈ విధమైన మనస్థితిని చినతిరుమలయ్య దివ్యులైన సతీపతులకు ఆపాదించి రచన చేయడం కనిపిస్తుంది.

నీవేమి సేతువు నానేరమోయమ్మా
చేప నీయిచ్చ రాజ్యము సేయవోయమ్మా॥

వలపించి రమణు ని వాకిలి వెళ్ళనీవు
కలికిచే తలనె కదవమ్మా
చలమున నావిభుని జంకించి నాఁడు నాఁడె
నెలవై నే నింతేసి నేరనై తినమ్మా॥ (16-9)

అనే సంకీర్తనలో భార్య పరస్త్రీ దగ్గరకు వెళ్లి నీవేమి చేస్తావులే. ఇదంతా నేను నేర్వలేకపోవడం వల్ల వచ్చింది. నేర్పుగా నీ ఇష్టారాజ్యంగా చెయ్యి. నా భర్తను మోహించి వాకిలి దాటనివ్వక పోవడం నీ ఒయ్యారి చేష్టల వల్లనే కదమ్మా నా భర్తను ఆనాడే పంతంతో బెదిరించి ఆపడానికి నేను నేర్వలేక పోతినమ్మా తెలివిగా నా పతిని నా ఇంటికి రానివ్వకుండా కట్టడి చేశావు కదా పదవమ్మా. ముందే అతనితో ప్రమాణం చేయించుకొని సాధించలేక పోతినమ్మా నా భర్తను వదలిపెట్టక నన్ను ఈ విధంగా బాధపెట్టావు కదమ్మా. చాతుర్యంతో శ్రీ వేంకటనాథుడు మన ఇద్దరిని ఈ విధంగా సమానంగా ఆదరించాడు కదమ్మా. అని వ్యంగ్య ధోరణిలో దీనంగా మాట్లాడటం చివరికి ఇద్దరూ కలసిపోవడం కనిపిస్తుంది. సంకీర్తన ప్రారంభంలో విరహమైనా, అలుక అయినా సవతి పోరైనా చివర్లో ఐక్యత చెప్పడం తాళ్ళపాక కవుల ప్రత్యేకత. దీనికి ఇలాంటి సంకీర్తనల్ని ఉదాహరణగా చెప్పవచ్చు.

చనువు, ప్రేమ ఉన్న దంపతులమధ్య, ప్రేయసీ ప్రియుల మధ్య అప్పుడప్పుడు అలుకలుకూడా వస్తుంటాయి. ప్రియుడు ఏదైనా నచ్చని పని చేసినప్పుడు అతని పట్ల అనురక్తి చూపించక అలుక వహిస్తే ప్రియుడు ఆమెను ప్రాధేయపడుతాడు. అప్పుడు ఆమె బిగువు చేస్తుంది.—

చాలు జాలు నే నెరంగనా నాఁడు నాఁడె
అలరి నీసుద్దు లెల్ల నన్నీ గఁటిని ॥

సారె సారె నన్ను నేల పిలిచేవు
యేరా నీ వలపు నే నెర గనిదా
వూరకె యింకా నేలరా మాటలనే
దూరేవు నీ సుద్దు లెల్ల తొల్లి కంటిమి ॥ (16-7)

అనే సంకీర్తనలో చాలు చాలు నాడే నాకు తెలియవా నీ బుద్ధులన్నీ చూశాను. మాటి మాటికి నన్నెందుకు పిలుస్తావు! ఏమిరా నీ వలపు నాకు తెలియదా, ఊరకే ఇంకా ఎందుకు వట్టి మాటలు చెబుతావు ముందే అన్నీ తెలుసుకున్నాను. సైగలు చేస్తా వెందుకురా, చిన్నప్పుడె నీ చేష్టలన్నీ తెలుసు! నా వక్షస్థలాన్ని తాకు తావెందుకురా నీ బుద్ధులన్ని నిన్ననె చూశాను, దగ్గరకు వచ్చి ఎప్పుడూ చేయి పట్టుకుంటావు నీ నేర్పంతా నాకు తెలియదా శ్రీ వేంకటనాథ! ప్రేమతో కవపలో నన్ను కలసినప్పుడు నీ భావమంతా తెలుసుకున్నాను. అని సామాన్య సహజధోరణిలో అలక మనస్తత్వం వ్యక్తమయింది.—

చాలు నాతో నింతేసి జంపు లేలా
అలరి నీచేత లెవ్వరితోనైన జేయరా ॥

రాకా బోకా నాతో నింతేసి రంతులేలా
నీకు నీకె చుట్టరికములు నెరపేవు
నాకు నీకు నేమి వోదు నన్ను నవ్వుతాన
యేకమైన మాటలనె నన్ను యెలయించేవు ॥(16-14)

అనే సంకీర్తనలో ఇకచాలు నాతో వాదనలెందుకు నీ చేష్టలు ఇంకెవ్వరితోనైనా చెయ్యిరా. వస్తూ పోతూ నాతో ఈ విధమైన కపటాలెందుకు, నీకు నీవే సంబంధాలు చేస్తూన్నావు. నీకు నాకు ఏమీ సరిపోదు, నవ్వుతూనే ఒకే మాటతో నన్ను మెప్పిస్తున్నావు. మాటిమాటికి ఈ విధమైన మోసాలెందుకు? ఊరకే నీ వరుసలు తెలిపి నన్ను ఒరుసుకుంటున్నావు. తార్కాణపు మాటలతో నన్ను తాక డానికి వస్తున్నావు. హద్దుమీరి ఒట్టులు పెట్టుతూ విజృంభిస్తున్నావు. పొగడి పొగడి నాతో సంబంధం ఎందుకు? మచ్చిక చేసి చేసి నన్ను పొందాలని చూస్తున్నావు. నీ ఇష్టం వచ్చినట్లు నన్ను కూడావు. ఇంకా తేట తెల్లముగా నన్ను సమ్మతింపచేస్తున్నావు. అని సహజ రమ్యంగా నాయిక అలుక విశదీకరించడం జరిగింది.

కొన్ని సంకీర్తనల్లో అలిగిన (స్త్రీ) నీ గుణాలు నాకు ముందే తెలుసు అని తన భర్తతో అంటే మరికొన్ని సంకీర్తనల్లో నీ గుణాలు నీకే తెలుసు అని ఎత్తిచూపటం కనిపిస్తుంది. —

నేడు నీ చేత లెల్లా నీ వెరగవా
నీడ నుండె యలసేవు నీ వెరగవా ॥

వేమారు నా చేత వెళ్లనాడించ నేటికి
నీ మనసులోని కల్ల నీ వెరుగవా
దీమసాన పెక్కిండ్లు దిరిగి వచ్చేవాడవు
నేమపు నీ గుణములు నీ వెరగవా ॥ (16-25)

అనే సంకీర్తనలో ఈనాటి నీ చేష్టలన్నీ నాకు తెలియవా! నీవలో వుండే అలసిపోతావు నీకు తెలియదా! పలుమార్లు నా చేత మాట్లాడించడం ఎందుకు, నీ మనసులోని అసత్యం నీకు తెలియదా. ధైర్యంగా చాలా ఇళ్లకు తిరిగి వచ్చేవాడివి, నీ గుణాలు నీకు తెలియవా! పదిలంగా ఉండకుండా నాకు కోపం కల్గించడం ఎందుకు, నీ ప్రవర్తన నీకు తెలియదా! చుట్టాల సురభి (బంధువులకు కామధేనువు లేక ప్రియమైన) నీకు తెలియదా! నిజాలు ఇక్కడ ప్రదర్శించడం ఎందుకు, నిన్నటి నీ నీతులన్నీ నీకే తెలియవా! శ్రీ వేంకటనాథా! ఇంతలో నన్ను కలసి నన్ను మెచ్చావు నీకు తెలియదా అని అలిగిన సతి తన పతిచేష్టల్ని వివరించి తనకు తాను ఆలోచించుకోనేలా చేయడం కనిపిస్తుంది.

తనకు అత్యంత ప్రియమైనవాడు ఎదురుపడగా మైమరపువల్ల ప్రేయసి తన తనువు మీదున్న వస్త్రాలు, ఆభరణాలు చెదరడం కూడా గమనించుకోదు. ఇది సహజమైన విషయం. ఆ సమయంలో ప్రియుడు గమనించి వాటిని ఎత్తిచూపి సవరించుకోమంటే ఆమె సరసపు కోపాన్ని అభినయిస్తుంది. అప్పుడు ప్రియుడు అంత కోపగించు కొనే ఆమె మనసులోని విషయం వెల్లడి చేస్తాడు. ఈ విధమైన భావనలు—

మేలు మేలె నిన్ను నీవె మెచ్చుకోన నే
కోలుముందైన పనులకు కొంక దగునా ॥

పచ్చిగా గుబ్బలమీద పయ్యెద జారినందుకు
యెచ్చరించితే గోపించే వేమాయనే
కచ్చు పెట్టి యింత వాసి గలదానవు నీవు
మెచ్చి మెచ్చి నన్ను జూచి మెయి మరవ దగునా ॥
(16.26)

అనే సంకీర్తనలో హృద్యంగా వ్యక్తం చేయబడ్డాయి. మంచిదే నిన్ను నీవే మెచ్చుకోవే. స్పష్టంగా తెలుస్తున్న బయలకు కోపగించుకోవచ్చా. నీ ఎదమీద పైట జారిందని హెచ్చరించినందుకు కోపగిస్తున్నావు ఏమయింది! ఇంత గొప్పదానివి పొగడిపొగడి నన్ను చూసి తన్మయత్వం చెందవచ్చా! మోహాతిశయంతో అర్ధనిమీలిత నేత్రాలతో ఉన్నందుకు నిన్ను తాకితే కోపగిస్తున్నావు ఏమయింది! మనసులో ఇంత సిగ్గుగల దానివి ఇంత త్వరగా నా ఎదుట కరగవచ్చా! దగ్గరగా వచ్చి నాముఖం చూసి పులకించినందుకు ఎంత చేసినా అందుకు ఏమయింది! శ్రీవేంకటనాథుడైన నేను మన్మథకేళిలో నిన్ను గూడినందుకు నీకింతగా పరవశం కావచ్చా అని ప్రియుడు మిక్కిలి చతుర్యంగా సరసంగా ప్రేయసిని ప్రశ్నించడం మనోహరంగా ఉంది. విరహ వేదనలో ఉన్న స్త్రీ పురుషులకు చంద్రుడు, చలిగాలి, వాసనపువ్వులు, తుమ్మెదలు శత్రువుల్లా కనిపిస్తాయి. వీటివల్ల మదనావేశం ఎక్కువవుతుందని ప్రాచీనకాలం నుంచీ కవులు వర్ణిస్తూనే ఉన్నారు. ఇది వాస్తవ విషయం. తనభర్త అలిగి దూరంగా ఉన్నాడు. తనసఖి విరహతాపం చూడలేక చెలికత్తెలు మలయానిల చంద్రదూషణంచేస్తూన్నారు. అప్పుడు ప్రేయసి చెలులతో వాటినెందుకు దూషిస్తారు. ఈ అలుక లేనప్పుడు అవి అన్నీ హితమైనవే కదా. కాబట్టి వాటిని దూషించలేక అతన్నే దూషించండి అని చెలులను ఆదేశించడం కనిపిస్తుంది.

అతనినె దూరరమ్మ అలుగ కుండిన నాఁడు
యీతల నాతల నివి యితవుగా కుండెనా ॥

పున్నమ చందురుఁడు దప్పులు రేచ బగవాఁడ
ఇన్నిటా నా విభుఁడె గురింతె కాక

సన్నపు జల్లనిగాలి జాలి రేచ బగవాఁడ
మన్నమగఁడు సేసిన మతకము గాక ॥ (16-49)

పూర్ణిమనాటి చంద్రుడు తప్పులు కలిగించడానికి అతను శత్రువా! ఇంతటికీ నాభర్తే కారణం. మెల్లనైన చల్లనిగాలి జాధ కల్గించడానికి, అతను శత్రువా! నామగడుచేసిన మాయే కారణం. కమ్మని పువ్వులు శరీరతాపాన్ని పెంచడం దానికి వైరం ఉన్నా నా భర్త చేష్టలే దానికి కారణం. తుమ్మెదలు విజృంభించి రొద చేయడం అవి శత్రువులా, నమ్మించి మాటతప్పిన భర్తే కారణం. మన్మధుడు అతిశయించి తాపంలో ముంచడానికి అతను చెడ్డవాడా! ప్రాణేశుడే కారణం. ప్రేమమీరగ శ్రీవేంకటనాధుడు కలిశాడు. ఆయా చేష్టలన్నీ అతనివే కదా. అని వ్యక్తం చేయడంలో చిన తిరుమలయ్య కల్పనాచాతుర్యం, అపూర్వ భావ సౌందర్యం వ్యక్తమవుతూంది.

చెలికత్తె నాయిక విరహవేదనను గూర్చి నాయకునితో ఆమె నీపై ఆశపెట్టుకొనే బ్రతికిఉంది. ఆమెను వదలక నీవింక ఎలాగైనా చెయ్యి. ఎదపై పైటవేసుకోదు. నిండైన మోహంతో నిన్నుతలచుకొని గర్వోక్తిఅయిన మన్మధునివల్ల తాపం అధికమై విరహాతిశయాన్ని ఆపలేక ఉంది. శరీరంపై కస్తూరి పూయడానికి ఇష్టపడటం లేదు, నిశ్చలమైన వలపుతో నిన్ను తలచుకొని కలువపువ్వుల బాగాలను కూడా పట్టుకోలేకపోతూంది. అధికమైన పరితాపాల్లో మునిగివుంది, నీవు కలియగా ఆమె సంతోషించింది. శ్రీవేంకటనాథా సముచితమైన ప్రాయం నేడు నిన్ను కూడింది. నిన్ను కలసి ఎల్లప్పుడు చల్లగా ఉంది అని రమ్యమైన భావస్ఫోరకంగా వ్యక్తం చేయడం—

పడఁతి నీయాసనె బతికున్నది
వొడయక నీవింక నెట్టయినా జేయుమీ ॥

గుబ్బలమీఁదఁజెలి కొంగు వేయదు
నిబ్బరపు మోహమును నిన్ను దలఁచి
గబ్బియైన మరునిచే। కాఁకలు బెట్టు
అబ్బురపు విరహమూ నా పలేక వున్నది॥ (16-16)

అనే సంకీర్తనవల్ల తెలుస్తుంది. నాయిక అనుభవిస్తున్న విరహవేదనచూసి చెలికత్తె బాధపడి విరహతాపాన్ని పోషిస్తున్న చంద్ర మలయానిల, తుమ్మెదలను నాయిక చూచి సంతాపాన్ని పెంచవద్దని వాటిపై ఆవేదనతో ఆవేశంతో వేడుకుంటూ ఒట్టుపెట్టడం వ్యక్తమవుతుంది.

ఎంచి మీ చుట్టరికము లిందులో దెలుసు గా
మించి నడచితిరైన మీకు మీ యాన॥

యేలా చల్లనిగాలియింతి నేచ నేఁటికి
జాతి రేఁచితైన నీకు చందన మాన
మేలిమి తుమ్మెదలాల మెలుఁత వోరువ లేదు
కోలుముందై కూసిన మీకులము నాన॥ (16-43)

మీ బాంధవ్యాలేమిటో తెలుసు మీరు మీ పరిధులు దాటి ప్రవర్తించారు. మీకు మీపైనే ఒట్టు. చల్లగాలి! ఎందుకు సఖిని బాధ పెట్టుతావు. ఇంక నొప్పిస్తే నీకు చందనం ఒట్టే. గండుతుమ్మెద లారా! ఆమె సహించజాలదు. బిగ్గరగా ఝుంకారం చేస్తే మీకులంపై ఒట్టు. మన్మధుడా! చెలిపై కోపం మానవయ్యా. విజృంభిస్తే అర విందం, అశోకం, చూతం. నవమల్లిక, నీలోత్పలం ఈ పంచ పుష్పా లతో కూడిన బాణంపై ఒట్టు. చందమామ! నిండువెన్నెల కాసి అతి శయిస్తే కలువపై ఒట్టు. అందమైన కోయిలలారా, యువతి సహించ

జాలదు చిక్కని స్వరం ఆలపిస్తే చిగురాకులపై ఒట్టు. తటాలున శ్రీ వేంకటనాథుడే ఆమెను కలిశాడు. ఇంక ఇందరిపై ఒట్టు పెట్టడం మానివేశాను. అని చెప్పడంలో చినతిరుమలయ్య అపూర్వమైన, అద్భుతమైన వర్ణనా చాతుర్యం వెల్లడి అవుతుంది.

నాయిక విరహానికి సంబంధించిన ఇలాంటి సంకీర్తనలు చాల కనిపిస్తాయి. చెలికత్తె నాయిక విరహాన్ని నాయకుని తెలియజేసే మరొక సంకీర్తన—

ఆపె యెరుఁగును నీ వన్నియూ నెరు గుదువు
రేవు మాపు నే నెచ్చరించేనా విభుఁడ ॥

చిలుకచే మాటలు చెప్పించి మరు
చిలుఁకలపాలుఁగ జేయనేల
కలగని లేచి లేకలు వ్రాసి కా
కల బొరలుచునె నీకడ కంపె జెలియా ॥ (16-47)

ఇందులో చెలికత్తె నాయకునితో ఆమెకు, నీకు అన్నీ తెలుసు రేపు, మాపు, నేను హెచ్చరించేనా! చిలుకచేత మాటలు చెప్పించి ఇప్పుడు ఆమెను మన్మధుని చిలుకల పాలుచేయడం ఎందుకు! ఆనా అమె నిన్ను కలగని కూర్చొని లేఖలు వ్రాసి విరహతాపంతో పొరలాడుతూ నీదగ్గరకు పంపించింది. ఎంతో త్వరగా నీవు ఉంగరం పంపి ఇప్పుడు మన్మధుని బాణాలలో ఆమెను తపింపచేయడంఎందుకు! ఇదిగో, విరహంలో పడలేక మా సఖి నీకు చిత్రపటం పంపించింది. విందుభోజనం వలె కర్పూరపు తాంబూలం ఇచ్చి గోవిందుడవయిన శ్రీ వేంకటనాథ సాటిలేని వేడుకతో కాంత తాంబూలం అందుకొని నిన్ను తాకి ఇప్పుడు కలిసింది. అని చెప్పడం రమణీయంగా ఉంది.

శ్రీ వేంకటేశ్వరుడు దక్షిణ నాయకుడు, ఆయనకు అనేక నాయికలున్నారు. కొందరు సత్యభామలా ఆత్మాభిమానంతో సవతి సాంగత్యాన్ని ఖండించేవారుగా కొందరు రుక్మిణీదేవిలా తన ఇష్ట ప్రకారమే వదిలేసి ప్రశాంతంగా ఉండేవారుగా కనిపిస్తుంటారు. ఒక నాయిక సతీత్వవిధేయంగా వినయంగా నాయకునితో ఎంత చేసినా నిన్నేమంటాను! నేను కొత్త దాననా అలిగి నిన్ను భయపెట్టడానికి! ఎక్కడైనా నిలబడి ఏ స్త్రీతోనైనా నీవు మాటలాడితే నిను నేను అదిలిస్తానా! ఇక్కడున్న నన్ను ఏ స్త్రీ పేరుపెట్టిపిలిచినా నిన్ను వెంటనే కోపపడతానా! మనోహరుడవైన నిన్ను ఏ స్త్రీ ఇంటిలో చూసినా నిన్ను పంతంతో సాధిస్తానా! ఏ స్త్రీ సొమ్ములనైనా నీవు ధరిస్తే ఒయ్యారిమాటలతో నిన్ను అతిక్రమిస్తానా! అందగాడా! ఏ స్త్రీ వాకిలిదగ్గర నీవున్నా నిన్ను సైగ చేసి మాటిమాటికి బెదిరిస్తానా! శ్రీ వేంకటనాథ నీవు ఇప్పుడే నన్ను కలసి కన్యనైన నామనసును కరిగించావు' అని ప్రేమాతిశయంతో పలకడం, సవతి వైరాన్ని వదలడం వ్యక్తమవుతుంది.

పాట

ఎంత సేసినాను నిన్నేమనేనురా
వింతదాననా యలిగి వెరపుచూపను ॥

యేడనైనా నిలిచి నీ వెవ్వతెతోనైన మాట
లాడుకొన్న నిన్ను నేనద్దలింతునా
యీడనుండె నన్ను నీ వెవ్వతె పేర బిలిచినాను
కోడెకాడ నిన్ను నిట్లే కోపగింతునా ॥ (16-10)

నాయకుడు తనపై చూపిస్తున్న ప్రేమకు నాయిక సంతోషిస్తూ ఇది ఇలాగే ఉంటే మంచిదే కానీ నీవు వలపించగలవూ, వేధిం

చనూ గలవు, ఈ ఉపద్రవానికి నేను తట్టుకోలేను. నీవు చేసినట్లే చేయి అని అన్నింటిలోను అతనికే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలిచ్చి విరక్తిభావంతో అశక్తతతో సంభాషించడం వ్యక్తమవుతుంది.

వలపించ నేరుతువు వడి నేచ నేరుతువు
సిలుగు కోప నీవు సేసినట్టె సేయరా ॥

ప్రియముతో డుత నన్ను బిలిచేవు యీా
నయమె యీాడేర నడపేవా
బయకారించే నీచే బడలితిని నీ
చెయి మీాదింతె నీవు సేసినట్లే సేయరా ॥ (16-13)

ప్రేమతో నన్ను పిలుస్తున్నావు, ఈ ప్రేమ ఇలాగే ఉండే విధంగా సాగిస్తావా! శృంగార చేష్టలు చేసే నీవల్ల అలసిపోయాను. నీ చెయ్యే ఎప్పుడూ పైన ఉంటుంది. నీవు చేసినట్లే చెయ్యిరా! నా పట్ల మంచితనంగా ఉంటున్నావు. దీన్ని ఇలాగే నిలుపుతావా! నీవల్ల ఎక్కువగా విసిగిపోయాను, నాకు ఏహ్యభావం లేదు నీవు చేసినట్టె చెయ్యిరా. శ్రీ వేంకటనాథా నీవు నన్ను కలిశావు. నీ భావనలో నాపైదయతప్పవు కదా! నీవు కూడుటవల్ల ఇంత దాన్ని అయ్యాను. నాపై స్నేహం కలిగి ఉన్నావు. నీవు చేసినట్టె చెయ్యిరా! అని నాయిక నాయకుని ఆంతరంగిక భావం తెలుసుకొని అతనికి అనుకూలంగా సాత్త్విక ధోరణిలో మాట్లాడటం ఇందులో వ్యక్తమవుతుంది.

తాను సహజంగా కోపిష్ఠి, గయ్యాళి, నిష్ఠూరి కానని, నీ అవగుణాలవల్ల నీవు చేసిన తప్పులవల్లనే నేర్పరిగా, పంతగత్తెగా మారి అలా కోపంగా మాట్లాడవలసి వచ్చిందని, లేకుంటే రచ్చకెక్కదాన్ని కానని, కయ్యానికి కాలు దువ్వేదాన్ని కానని, ఇదంతా నీ వల్లనే వచ్చిందని, ఆలోచించుకొని సరిదిద్దుకోవాలని పనిగట్టుకొని

నాలో తప్పులెంచవద్దని నీవు బలవంతంగా నన్ను కలిశావు. లక్క-లాగా కరిగిపోయాను అని వినయంగా మనవి చేసుకోవడం తెలుస్తుంది.

అన్నిటా నీ దిద్దుబడె అది విచారించవయ్యా
యెన్నుకొని నన్ను నేర మెంచెకుమీ అయ్యా ॥

నీవొళ్ళి నేరము లెంచి సరవాది నైతి గాక
కావించి నే దొల్లేమి కతకారినా
కోవరపు నీ గుణాలు కోపము రేచె గాక
కావలసి నే దొల్లి గయ్యాళినా ॥ (16-37)

నాయిక చెలికత్తెలతో తన నాయకునివదలి ఒక్క- నిమిషం కూడా సహించలేను. విరహవేదనలతోనే పొద్దుగడపడం ఎలా! శూరుడైన మన్మథుని బాణాలకు మోమాటం లేదు. ఓ చెలులారా! నా మోహాతిశయాన్ని మీరు తెలుసుకోవడం లేదు, ఏమనేది! తల మునకలుగా ఉన్న విరహాన్ని ఎలా భరించేది. తలమునక నా వలపు తెలుసుకోని మీరైనా అతన్ని పిలుచుకొనిరారు ఏమనేది! అలిగి వెళ్ళిన అతన్ని విడిచి ఒక్క-నిమిషంకూడా ఓర్చుకోగలనా! కవచంలా కప్పివేసే పుష్పబాణాలకు దయ ఉంటుందా! ఈదరాని ఈ మోహంతో గట్టెక్కే-ది ఎలా! అధికమైన నా తాపాన్ని గూర్చి తెలిసికూడా మీరు ఊరకున్నారు. ఏమనేది! చివరికి శ్రీవేంకటనాథుడు నేడు నన్ను కలిశాడు. నిశ్చలంగా నా ఇంట్లో కాపురం ఉన్నాడు. ఇంక నాకు కొరతలువున్నాయా అని నాయకునిపై తనకున్న ప్రేమానుబంధాన్ని, తన విరహ వేదనను తెలియజేయడం కనిపిస్తుంది.

యెందరి దూరె యెవ్వరి వేడె యెంతని వేగించెనె
పొందుదల చుక వచ్చెనా వానిచే పుణ్యమింతే కాక॥

పుక్కిలించటి కాకలఁగోనె పొద్దువోవు వెల్లే
యెక్కువైన నామోహము చెలులూ నెరగరేమందునే
వొక్కనిమిషము వాని బాసి నే వోరువ గలనటే
మొక్కలీడయిన మరునమ్ములకు మొకమోటగలదా॥

(16-48)

ఇందులో స్త్రీ సహజమైన ప్రేమ, సున్నిత మనసు రమ్యంగా చిత్రించబడింది.

సంవాదాలు ప్రాచీన కాలంనుంచీ సాహిత్యంలో, సమాజంలో విశేష ప్రాచుర్యం వహించాయి. రామాంజనేయ సంవాదం, గంగా గౌరీ సంవాదం, శివకేశవ సంవాదం, కృష్ణార్జున సంవాదం, చెంచితా కృష్ణుల సంవాదం మొదలైన వాటికి ఉదాహరణలుగా చెప్పవచ్చు, జానపదుల్లో అత్తాకోడళ్ళ సంవాదం, బావామరదళ్ళ సంవాదం. ప్రేయసీ ప్రియుల సంవాదం ఒదినా మరుదుల సంవాదం మొదలైనవి బాగా ప్రసిద్ధమైనవి. ప్రజలకోసం సంకీర్తన రచనలు చేసిన తాళ్ళపాక కవులు సంవాదగేయ రీతులను కూడా విశేషంగా రచించారు. చినతిరుమలయ్య సంకీర్తనల్లో ప్రేయసీప్రియ సంవాదం కనిపిస్తుంది. స్నేహంగా మాట్లాడగల జాణవే అని ప్రియుడంటే స్నేహసంబంధం ఉంది కాబట్టి నేను ఎప్పుడూ జాణనే అని ప్రేయసి అంటుంది. ఎత్తైన నీ పైటలో ఉన్నది ఏమిటి అని అతడంటే, వలపు నింపే బంగారు కుండలని ఆమె అంటుంది. వాటిని మేడపై పెట్టవచ్చుకదా అని అతడంటే, నా దేహమే మేడ అని సమాధానమిస్తుంది. నీ శరీరంపై పులకాగ్రాలు ఎందుకు వచ్చాయి. అని అతడంటే, అవి ముచ్చటైన మోహము నోము మొలకలురా అంటుంది. వాటిని దేవునిమీద పెట్టవచ్చు కదా అతడంటే, వచ్చిన వరాలిచ్చే దేవుడు నీవె అని ఆమె అంటుంది. చెమటలు ఎక్కువవుతాన్నాయి. ఎందుకు

అని అతడంటె రతికేళిలో తృప్తితీరని కథలన్ని వెల్లడి అవుతున్నా యిరా అని ఆమె మనసు విప్పి సమాధానం చెబుతుంది. అయితే అనుకూలమైె తేలికయింది లే అని అతడంటే నన్ను గొప్పగా కలి శావు వెంకటానాథా అని ఆమె మెచ్చుకుంటుంది. ఈ విధంగా ప్రేయసీ ప్రియ సంవాదం సరసంగా చమత్కారంగా, ఉల్లాసంగా సాగడం వ్యక్తమవుతుంది.

సంగతిగా మాటలాడు జాణ వాడువె। ని।
సంగతి గలదు గాన జాణనె పోయెపుడు॥

యెక్కువ బయ్యెదలోని వేటివె యింతి అవి
పక్కన వలపునించే పైడి కుండలు
వెక్కువ మేడలమీద బెట్టవచ్చు బో నీవు
మిక్కిలి నెప్పుడు నుండె మేడవో నా దేహము॥

(16-41)

కోలాటపాటలు ప్రాచీనకాలం నుంచీ కూడా జనవ్యవహా రంలో ఉన్నట్లు పాల్కురికి సోమనాథుని బసవపురాణంవల్ల తెలు స్తుంది. కోలలతో ఆడుతూ పాడే పాటలను కోలాట పాటలంటారు. కోలాటాన్ని స్త్రీ పురుషులు ఇరువురూ కలసి ఆడుతారు. ఇవి శృంగార పూరితంగా, భక్తిపూరతంగాను గణనాథా, ఛాంగుభళా, కూడుదమా, చేయుదమా వంటి పదాలతోను. సంబోధనాంత పదా లతో చిన్నచిన్న పాదాలు సాగుతాయి. వీటిని పండుగదినాల్లోను, ఉత్సవవేడుకల్లోను ఆడుతారు. తాళ్ళపాక కవులు తమ సంకీర్తనలలో అన్నిరకాల జానపదగేయ నణితుల్ని పొందుపరచినట్లే కోలాట పాటలరీతులను కూడా సమకూర్చారు. చినతిరుమలయ్య సంకీర్తన లలో ఇలాంటి గేయరీతులు విస్తారంగా కనిపిస్తాయి.

చిన్ని కృష్ణుని చిలిపిచేష్టల్ని ఒక గోపిక మరోగోపికతో చెబుతున్న తీరు కోలాట పాట రీతిలో సాగింది. ఎంతవద్దనా పంతం చేస్తున్నాడు. తన తుంటరిచేష్టలు ఎంత చెప్పినామానడు నాతో విజృంభించి పరిహాసాలాడుతున్నాడు. పోమ్మన్నామానడు. నన్ను తాకి బలవంతం చేయడానికి పైపైనే వస్తున్నాడు. ఊరకేపోతున్న నన్ను మాటిమాటికి పేరుపెట్టి పిలిచి సైగచేయడానికి వస్తున్నాడు. భర్తలాగా ఎవ్వరున్నా లెక్కచేయడు. నాపై శబ్దం చేయటానికి వస్తున్నాడు. భార్యఉన్న శ్రీవేంటనాధుడు నన్ను ఇప్పుడె సొమ్ములివ్వకనే కలిశాడు అని తెలియజేయడం.

పాడి

ఒద్దన్న జలము సేసీ వోయమ్మ వీఁడు తన
వుద్దండా లెంతైన మాన డోయమ్మ వీఁడు॥

యేవుమీరి నాతోడ నగసక్కె లాడీని
పోపో పొమ్మన్న మానడోయమ్మ వీడు
పై పై నన్ను జెనకి బలిమి సేయవచ్చీ నే
నోపనన్నా గొంగుపట్టీ నోయమ్మ వీఁడు॥

అనే సంకీర్తన ద్వారా తెలుస్తుంది. ఓయమ్మా అనే సంబోధనతో చిన్నచిన్న పాదాలతో సరళంగాసాగింది.

శృంగార పురుషుడైన అందగాడా! ఇంతగా అతిశయించవచ్చా! ఊరకనే నీ నింపుతనాలు చూపిస్తూ చిరునవ్వు నవ్వుతున్నావు. నాకొంగుముట్టవద్దు· నిలువెల్ల మోహం నింపుకొని మాపై చూపులు ప్రసరిస్తున్నావు. మాటలతో కలుపుకోలుగా ఉంటూ నా చెక్కిలి నొక్కవద్దు. శ్రీవేంకటనాథా నీకౌగిటిలో చిక్కానుఅంటూ తనతో శృంగార చేష్టలుచేస్తూన్న నాయకునితో సంభాషించడం—

సింగారపు మేని చెలుపరి యింత
చెంగలింతురా చెలువరీ॥

నెఱతనా లూరకే నెరపుచు యిట్టె
చిరునవ్వు నవ్వేవు చెలువరీ
తఱినగి నగి వావి దగిలీని అంత
చెఱఁగు ముట్టకువోయి చెలువరీ॥ (16-21)

అనే సంకీర్తనలో తెలుస్తుంది. ఇందులో చెలువరీ అనే సంబో ధనాంతపదం ఆ వృత్తి అయింది నీవు దొరవు. నిన్నుచూచి అదిరి పడతానుగాని ఔను కాదు అని ఎదిరించలేను. నిమ్మపండుతో నీవు వేయగా నీవు నిజంగా వస్తావని నమ్మాను. నాచూపుల్లో చిక్కినట్టె వుండి, అమ్మరో! ఇంత (అన్యాయం) చేస్తావా! యాదవనారాయణా! నీవు పువ్వులు పంపిస్తే పులకించిపోయి సంతోషంగా నవ్వానే. దూరంగా వుండే నాకు దక్కినట్లే ఉండి యౌవనగర్వంతో ఇలా చేశావు. ఇప్పుడు నీవు ఇంటికిరాగా వెంటనే భ్రమచెందాను. అంటు కొన్న చూపుల యాదవ నారాయణా! వెంబడించి తిరిగి (శ్రీ) వేంకట నాథుడవై నన్ను కలశావు అని నాయిక భావరమ్యంగా మాట్లాడటం.

దొరవు నిన్నో గాఁదని దూరవచ్చునా
అదిరిపడేముగాక యాదవనారాయణా॥

నిమ్మపంట వేయగాను నిక్కము వచ్చే వని
నమ్మితి గా యాదవనారాయణా
చిమ్ముల నాచూపులకు చిక్కినట్టె వుండితివి
అమ్మరో యింత సేతురా యాదవనారాయణా॥
(16-22)

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది. ఇందులో యాదవనారాయణా అనే దైవ పాదాంత పదం ఆవృత్తి అయింది.

నీవు పదిమందిలో రచ్చకెక్కావు. బట్టబయలు అయ్యావు. గుట్టుగా ఉండే దొరవని ప్రేమగా కొసరి చూడగానే గట్టిగా నవ్వుతావు. మితిమీరిన మోహపు మాటలతో నీవలపును బట్టబయలు చేస్తావు. నీవున్న చోటికి రాగానే నన్ను రతి చేశావు. దిక్కైన శ్రీవేంకటనాథా! పతివై నన్ను కాపాడావు, అని నాయిక ప్రణయ కోపంతో వహించి నాయకునితో అతని శృంగార చేష్టల్ని ఎత్తి చూపడం—

రచ్చకెక్కితివి పండరంగివిఠలా
పచ్చిదేరే వింతలోనే పండరంగివిఠలా॥

తతి నీవున్న చోటికి దగ్గర వచ్చినంత నే
రతి గూడితివి పండరంగివిఠలా
గతియైన శ్రీవేంకటనాథ యేలితివి
పతివై కోవిలకుంట్ల పండరంగివిఠలా॥ (16-27)

అనే సంకీర్తనవల్ల తెలుస్తుంది. ఇందులో పండరంగి విఠలా! అనే దైవనామాంతపదం ఉంది. చివరలో కోవిల కుంట్ల పండరంగి విఠలా! అని క్షేత్రముద్రతో కూడిన స్వామి నామ ఉంది. తాళ్ళపాక సంకీర్తనలే కవులు రాయలసీమ, కర్నాటక, తమిళనాడు నెల్లూరు, గుంటూరు ప్రాంతాలలోని ఆయా వైష్ణవ క్షేత్రాలను దర్శించి ఆ స్వాములను కీర్తించేటప్పుడు కొన్ని చోట్ల ఆయా క్షేత్రాల పేర్లను కూడా పేర్కొన్నారు. చిన తిరుమలయ్య సంకీర్తనలలో ఇలాంటి క్షేత్రముద్రలోకూడిన సంకీర్తనలు చాలా ఉన్నాయి. ఇవి కూడా దైవనామాంత పదాలతో కోలాటం వేయడానికి అనువైన రీతిలో

గతులు సాగేవిధంగా ఉన్నాయి వీటన్నింటిలో శృంగార, భక్తి మేళవింపుగా మధురభక్తి సంప్రదాయం కనిపిస్తుంది.

నీవు చేసిన చేష్టలన్నీ కొల్లలుగా చెల్లాయి. చనువు వదల కుండా మాట్లాడుతున్నావు. నాకు నీవు వశమవుతావా! అందగాడివి. దట్టమైన వలపుల దిట్టమైన నిన్ను ఎందుకు కసరుతాను. నిందకు భయపడి నాతో సరసాలాడుతున్నావు గానీ నీవు నాకు కలుగుతావా గొప్పవాడివి. వదలని స్నేహాలతో విర్రవీగే నీకు అపవాదాలెందుకు! చేసిన ప్రతిజ్ఞకు భయపడి నన్ను ఏలుకున్నావుకానీ నాపై నీకు ఇష్టం వుందా ఇంత అందగాడివి రతులలో నీకు విసుగులేదు అంటూ నాయకుని శృంగారప్రవర్తనను ఎత్తి చూపుతూ తన పట్ల నిజమైన ప్రేమలేదని సత్కారమాడుతూ నాయిక సంభాషించడం—

చెల్లె నీవు నేసినట్టి చేఁత లెల్లాను
కొల్లలై కోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా॥

అసము దించక మాటలాడేవు గాక నాకు
వసమయ్యేవా యింతవన్నె కాఁడవు
కసిగాటువలపుల గట్టివైన నిన్ను నేల
కొసరే గోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా॥ (16-58)

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది. ఇందులో కోవిల కుంట్ల గోపాలకృష్ణుడా అనే క్షేత్రముద్ర దైవనామాంత పదం ఉంది. కోవిల కుంట్లలో కర్నూలు జిల్లాలో ఉంది.

జగడమో, బలవంతమో నీమనసును నాతో నవ్వు మొగంతో చెప్పరా నీవువద్దన్నా వదలవు, కోమటి మేనరిక మేలెందునా ఉందా! వాకిటిలో నున్న నన్ను వారం, వర్జ్యం అని లేకుండా పట్టుకుంటు

న్నావు, మావారు నీకు అప్పగించారా! కొంత కొంత కోపిస్తున్న కొంగుపట్టుకొని నాతో రతి చేస్తున్నావు, నీకు రాజపరాక్రమమా! నీ వరసకు, గొప్పకు నన్ను గట్టిగా బిలుస్తున్నావు, మావారు నీకు నన్ను శుల్కంగా ఇచ్చారా! కోపంతో అధిక్షేపిస్తే కన్నులతోనే మొక్కుతూ వెంటనే నన్ను కౌగిలిస్తున్నావు. అద్భుతమైన శ్రీవేంకటాద్రినాథ, సిగ్గుపోవడానికి నీకు పెండ్లి చేశారా! అని చతురంగా మాట్లాడటం, స్వామి సరసచేష్టల్ని ఎత్తి చూపడం—

తగవో బలిమో నీ తలపునాతో చెప్పర
నగుమోముతో కదిరి నాథ నీవు ॥

యేర వద్దన్నా మాన విల్లురికి నాతోను
మీరి నవ్వేవు కోమటి మేనరికమా
వారము వజ్జమనక వాకిట నన్ను నాగేవు
పోరచి మావారు నీకుఁ బోక వెట్టిరా ॥

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది. ఇందులో పల్లవిలో "కదరినాథ" అనే క్షేత్రముద్ర ఉంది. అంతపురం జిల్లాలో కదిరిలో నృసింహస్వామి వెలశాడు. ఇది ఆ స్వామిని ఉద్దేశించి వ్రాసిన సంకీర్తన కావచ్చు.

నారసింహా! నీకు ఆపశనాలెందుకోయి! నాలోనేనాకు నవ్వు వస్తుంది. దగ్గరగా ఉన్నానని ప్రియమైన మాటలు చెప్పి చెప్పినా మీద వలపు నారుపోస్తున్నావు. వాక్యచతురతతో ధారాశుద్ధిగా మాట్లాడి మన్మథ బాణాలు వేయుకు. నావెంట వెంటనే తిరిగి నాపైన ప్రేమవు మోవుగట్టుతున్నావు. కంటిచూపులతోనే వట్టితాపాన్ని కలిగించి మృదువైన చిగురుల్ని వాడిగా చేయావద్దు పొడవైన గోళ్ళతో నన్ను తాకుతూ నీపై ఒట్టుపెట్టడానికి వస్తున్నావు. సర

సంగా నన్ను కలిశావు ఓగుసూతుల నారసింహా అని స్వామితో నాయిక అతని సుకుమారమైన ప్రేమభావనల్ని వ్యక్తం చేయడం—

నాలితనా లేటికోయి నారసింహుఁడా
నాలోనె నవ్వు వచ్చీ నారసింహుడా॥

చేరువని ప్రియములుచెప్పి చెప్పినామీఁద
నారువోసేవు వలపు నారసింహుఁడా
దారాసుద్దపుమాఁటలు తొ కనాడి మదనుని
నారసాలు సేయకు నారసింహుడా॥ (16-18)

అనే సంకీర్తనలో కనిపిస్తుంది. ఇందులో వోగుసూతుల నర సింహుడా' అనే క్షేత్రముద్ర సంబోధనాంతపదం కనిపిస్తుంది. కడప జిల్లాలో చిన్న దాసరి పల్లికిదగ్గరలో కొండలోయలో ఓగు నూతులు గల ప్రదేశం ఉంది. దీన్నే వేనూతుల, వోనూతులకోన, వోగు నూతుల కోన అంటారు.

మిక్కిలి నేర్పరి మేలుమేలు ఎడతెగని వలపుల ఓ కోన చెన్నరాయా! గౌరవించి నామనసును కరిగించడానికి వస్తున్నావు. నీవు వారాల వలపుల దేవరవు కదా. అతిశయమైన ప్రియాలతో ప్రేమతో నన్ను కసరుతూన్నావు. పొగడి పొగడి నాకు నమ్మిక మైన మాటలు చెబుతున్నావు. పరిహాసపు వినయాల వాడివికదా. నీ నేర్పరితనాలు, మాయలు నామీద గుప్పిస్తున్నావు. మేలైన సరసా లతో నాకు ప్రియం చేకూర్చుతున్నావు. కన్నెవలపు వేడుకకాడవు కదా. నన్ను ఇప్పుడె కలిశావు శ్రీవేంకటనాథ, నీవు గొన్నది నీకు గొప్ప అని నాయకుని సరసచేష్టల్ని వ్యక్తం చేయడం—

మిక్కిలి నేరు పరివి మేలు మేలోయి
గుక్కని వలపుల వోకోన చెన్నరాయఁడా॥

గారవించి నామనసు కరగించ వచ్చేవు
వారకపు వలపుల దేవరవుగావా
పేరడి నీ పెనవుల ప్రియములనె నన్ను
కూరిమి గొసరేటివో కోన చెన్నరాయఁడా (16-19)

అనే సంకీర్తన ద్వారా తెలుస్తుంది ఇందులో "వారకపు వలపుల దేవర" అంటే బహునాయికా ప్రేమి సంగతులు కలవాడనిగానీ ఇష్టం ఉన్నప్పుడు వలచడం, లేకుంటే మానడం కానీ కావచ్చు. ఇందులో "కోన చెన్నరాయడా" అనే క్షేత్ర ముద్ర గల్గిన స్వామి నామాంతపదం ఆవృత్తి అయింది. కడప జిల్లాలో నంది మండలానికి దక్షిణంగా పాలకొండ కోనలో చక్కని ఊట ఉన్న ప్రదేశం ఉంది. అక్కడ చెన్నకేశవాలయం ఉంది. అక్కడ వెలసిన స్వామిపై వ్రాసిన శృంగార సంకీర్తన ఇది. చిలిపి చేష్టల చొక్కనాథుడు మనసులో నున్నవాడు. అర్ధరాత్రి వేళలో (పరస్త్రీ సంగమం చేసి) మైలపడి వచ్చి మాటలు చెప్పుతున్నాడు. ఇప్పుడు వద్దు పొమ్మని చెప్పు. రేపు వస్తాడుకానీ ఇప్పుడెందుకు దగ్గరకు వస్తున్నాడు! తాను ఎక్కడికో వెళ్ళి ఇప్పుడు వచ్చి మంచి మాటలు చెబుతున్నాడు. ఇన్ని మాటలెందుకు నేనే పిలిస్తే వచ్చాడు. ఇప్పుడు తాను ఏ స్త్రీనో కలసి వచ్చి వెంటనే నన్ను మలినం చేయడానికి వచ్చాడు. కర్పూరపు పెదవిగల (శ్రీ) వేంకటనాథుడు? కలశాడు అని నాయిక నాయకుని విలాస చేష్టల్ని గూర్చి చెలికత్తెకు చెప్పిన విధం—

చుల్లరవెట్టు జేతల చొక్కనాథుఁడు
వుల్లములో నీ నెల దలూరి చొక్క నాథుడు॥

అర్ధరాత్రిరికాడ నంటుపడి వచ్చి తాను
సుద్దు లేమి పచరించి చొక్కనాథుఁడు
వద్దు వోమ్మనవె రేపువచ్చు గాని యిప్పుడేల
వొద్దికి వచ్చి నెల దూరి చొక్కనాథుఁడు॥ (16-20)

అనే సంకీర్తనద్వారా వ్యక్తమవుతుంది. ఇందులో "నెల దలూరి చొక్కనాథుఁడు"అనే క్షేత్రముద్ర స్వామి నామాంతపదం ఆవృత్తి అయింది. కడపజిల్లాలో నందలూరు గ్రామంలో బాహునది (చెయ్యేరు) తీరంలో చొక్కనాథస్వామి వెలశాడు. ఆనందలూరు గ్రామమే వ్యవహారంలో నెలదలూరుగామారింది.

పొడవైన సంబటూరి చెన్నరాయా నాతో కాగీ కాగని మాయలు వద్దు. అమ్మమీద ఒట్టుపెట్టి ఆశకల్గేలాగా మాట్లాడి నమ్మించడానికి వస్తావు. ఇవి నాకు క్రొత్తకాదు. అనందంగా నీ ప్రేమసతుల దగ్గరకు పోయి ఇంపు కలిగించేవాళ్ళనే రంజింపచెయ్యి. అభిమానం కలిగించేలా మాట్లాడి ప్రేమతో ప్రతిజ్ఞచేయాలనుకుంటున్నావు, సాకులన్నీ నాకు తెలియనివా! గొప్ప వేడుకలతో నీ స్త్రీల దగ్గర నీ నేర్పరితనాలన్నీ ప్రదర్శించవయ్యా! కౌగిటిలోకి చేరదీసి కన్నులతో మొక్కుతున్నావు, నాకు తెలియదా! ప్రేమ మీరగా శ్రీవేంకటనాథ నన్ను కలిశావు మా యింటిలో ఉండవయ్యా, అని నాయిక శ్రీవేంకటేశ్వరుని లీలా వినోదాన్ని ఎత్తి చూపుతూ ఆ స్వామిని తన ఇంటిలోనే ఉండమని కాంక్షించడం—

వద్దు నాతో వెచ్చి వేవని మాయలు
వుద్దండపు వోసంబటూరి చెన్నరాయఁడా ॥

అమ్మమీద నానవెట్టి ఆసపుట్ట మాటలాడి
నమించ వచ్చేవు నాకు గొత్తలా

సమ్మతి నీ వలపుల సతులవద్దికె పోయి
యిమ్మలు నెరపే వారి నేలయించవయ్యా॥ (16-23)

అనే సంకీర్తనలో వ్యక్తమవుతుంది. ఇందులో నంబటూరి చెన్నరాయడా అనే క్షేత్రముద్రితో కూడిన స్వామి నామం చెప్ప బడింది. ఒయ్యారపు వూటుకూరి చెన్నరాయ! నీ తియ్యని మాట లతో తేలిస్తావు. చిన్ననాటినుంచి స్నేహం ఉన్నవాడులాగ ఉబలా టంగా ఊరకే పిలుస్తావు చల్లని సరసాలతో నాకు ఉలికిపాటు కలిగిం చకు చనువున్నవాడులాగా ముచ్చటపడుతూ వురకె తాకుతున్నావు. బలవంతంగాపట్టి మచ్చికలు నెరపుతున్నావు. పట్టుత్వంగా జత కూడాలని శ్రద్ధగా కోరుకుంటున్నావు. కొత్త కొత్తల శ్రీ వేంకట నాథ నన్ను వనితలందరిలో కలిశావు. అని నాయిక నాయకునితో చమత్కారంగా సరసపుటలకతో సంభాషించటం కనిపిస్తుంది.

తియ్యని మాటల దేలించేవూ
వొయ్యారపు వూటుకూరి చెన్నరాయ॥

పిలిచే వూరకె పిన్ననాటి పొందు
గలవానివలెనె యీ కటతోడ
చలిమినె నన్నింత సందడి సరసాల
పులకించకు వూటుకూరి చెన్నరాయ॥ (16-24)

కడపజిల్లా రాజంపేటతాలూకాలో ఊటుకూరు ఉంది. ఇది అక్కడ వెలసిన చెన్నకేశవ స్వామిపై వ్రాసిన శృంగార సంకీర్తన.

చినతిరుమలయ్య శ్రీ వేంకటనాథముద్రాంకితంగా అనేక విష్ణు స్వరూపాలను విష్ణుమహిమలను, విష్ణు లీలలను శృంగార, అధ్యాత్మ భావాలతో వివిధగేయ రీతులతో రచించాడు. అన్నిసంకీర్తనల్లోను

అచ్చ తెలుగునుడికారపు సొంపు అపూర్వమైన, అపురూపమైన పద బంధాలు మధురభావనలు గుబాళిస్తున్నాయి. అధ్యాత్మ సంకీర్తనల్లో తానే ప్రత్యేకంగా భక్తి, జ్ఞాన. నీతి మానవతా ధర్మాలను ప్రబోధించాడు. శృంగార సంకీర్తనలలో నాయికా నాయక పాత్రలను, చెలికత్తె పాత్రలను సృష్టించి తద్వారా మానవ సహజమైన మనస్తత్వాల్ని మధురభక్తి తత్వాన్ని భాషాచాతుర్యాన్ని వ్యక్తం చేశాడు. ఐహికంగా ఆముష్మికంగా మానవాభ్యుదయంకోసం సరస రీతిలో సరళశైలిలో రచించిన చినతిరుమలయ్య శృంగార సంకీర్తనలు సాహితీ విలువల్ని సాహితీ మాధుర్యాన్ని విశేషంగా కలిగి వున్నాయి.

గోస్తావాణి

15-1-1988

16-1-1988

17-1-1988



# చిన తిరుమలాచార్యుని సంకీర్తనా సౌరభం

తెలుగు సాహితీ నందనోద్యానవనంలో సంతతం సంకీర్తనా సుమ సౌరభాలలు వెదజల్లే కల్పవృక్షం తాళ్ళపాక కవివంశం. తాత తండ్రుల సద్గుణాలను, ప్రతిభా పాండిత్యాలను, భక్తి ప్రపత్తులను, సృజనాశక్తిని కొనసాగించే సత్సంతానం కలగడం ఆ కవి కుటుంబం చేసుకొన్న సుకృతం, మన తెలుగు జాతికి అందివచ్చిన అదృష్టం.

చినతిరుమలయ్య అన్నమయ్య కుమారుడైన పెదతిరుమలయ్యకు, తిరుమలాంబకు జన్మించిన ప్రథమ సుకృతి. ఇతనికి అన్నమయ్య బ్రహ్మోపదేశం (ఉపనయనం) చేసినట్లు చిన తిరుమలయ్య రచించిన

తాళ్ళపాకాన్నమాచార్యుడైవమవు నీవు మాకు
వేళమే శ్రీహరి గన వెరవాన తిచ్చితివి॥

గురుఁడవు నీవెసుమ్మీ కుమతినైన నాకు
సరవి బ్రహ్మోపదేశము సేసితి
వరమ బంధుడవైనా పరికింప నీవెసుమ్మీ
వరుసనే జెడకుండ వహించు కొంటివి॥

తల్లివైన నీవె సుమ్మీ తగిన విషయాలలో
పల్లదాన బడకుండా బ్రదికించితి
అల్లుకొని తోడు నీడవైనా నీవెసుమ్మీ
చిల్లర మాయలలోన జెడకుండా జేసితి॥

దాతవు నీవె సుమ్మీ మాతగు శ్రీవేంకటనాథు
నాతలఁపులో నిలిపి నమ్మ జేసితి
యేతల జూచినా నాకు నేడుగడయునీవె
ఆతల నీతల నన్ను నాడుకొని కాచితి॥ (16-39)

అనే సంకీర్తననుబట్టి తెలుస్తుంది. ఈ సంకీర్తనలో చినతిరుమలయ్య తనను మాయలలో పడకుండా కాపాడిన తల్లి, తండ్రి గురువు, బంధువు, దైవం, దాత, తోడు, నీడ. తన సర్వస్వం, తన ఏడుగడ అంతా తన తాతగారేనని వినయ విధేయతలతో అన్నమయ్యను ప్రస్తుతించాడు.

చినతిరుమలయ్య తన తాత తండ్రులవలె విష్ణు భక్తాగ్రేసరుడు, పరమ సాత్త్వికమైనే వైష్ణవ మతాన్ని ప్రజలలో వ్యాపింపజేయడానికి తాత తండ్రులవలె శృంగార అధ్యాత్మ సంకీర్తనలను శ్రీవేంకటనాథుని ముద్రాంకితంగా రచించాడు. భాషాభావశైలీ విన్యాసాలలో తాత తండ్రుల మార్గాన్నే అనుసరించాడు. ఇతడు రచించిన శృంగార సంకీర్తనా సుమాల్లోని మధురభక్తి సౌరభం ఎంతో ఆహ్లాదకరంగా ఉంటుంది. చినతిరుమలయ్య శృంగార సంకీర్తనలలో నాయికా నాయకులకు తాత తండ్రుల శృంగార సంకీర్తనలలోవలె పద్మావతీ శ్రీనివాసులే.

పద్మావతీ శ్రీనివాసులు రూపంలో, గుణంలో, చాకచక్యంలో సమతుల్యులు ఎవరూ ఎవరికీ తీసిపోరు. ఎవరూ ఎవరికి తగ్గరు. కానీ ఒక్కసారిగా ఇద్దరూ ఏకమవుతారు ఇదే ఈ దివ్య నాయికానాయకుల్లో కనిపించే ప్రత్యేకత శ్రీనివాసుడు పద్మావతితో - నీవు తెలివిగా మాట్లాడే జాణవు అంటే పద్మావతి ప్రియునితో - నీసాంగత్యం నాకున్నది కాబట్టి నేను జాణనే అని శ్లేషార్థంతో

మిక్కిలి చాతుర్యంగా సమాధానం చెబుతుంది. శ్రీనివాసుడు తనకు ఏమీ తెలియనట్లు అమాయకంగా నీపైట లోపల ఉండేవి ఏమిటి అని పద్మావతిని ప్రశ్నిస్తే ఆమె - అవి ప్రేమనింపే బంగారుకుండలు అని చెబుతుంది. అయితే వాటిని మేడపైన పెట్టవచ్చు కాదా అని అతడంటే ఆమె - నాశరీరమే ఒక మేడ అంటుంది. నీ తనువుపై పులకాగ్రాలెందుకు అని అతడంటే అవి ముచ్చటగొలిపే మోహపు నోము మొలకలు అని ఆమె అంటుంది. వాటిని దేవుడిపై పెట్టవచ్చు కదా అని అతడంటే ఆమె - నీవే నాకు వరాలిచ్చే దేవుడివి అంటుంది. చెనుట నీకు అధికమవుతోంది ఎందుకూ? అని అతడంటే ఆమె - రతి క్రీడలో తనివితీరని కళలన్నీ జలువారాయి అని చాక చక్యంగా సమాధానం చెబుతుంది. ఇలా ఒపిక ఉన్నంతవరకు వాదోపవాదాలు చేసుకొంటూ చివరికి ఇద్దరూ కలసిపోతారు చిన తిరుమలయ్య ఈ దివ్య ప్రేయసీ ప్రియుల సంవాదాన్ని—

సంగతిగా మాటలాడ జాణవౌదువె నీ
సంగతి గలదు గాన జాణవె యెపుడు॥ (16-42)

అనే సంకీర్తనలో మనోహరంగా వర్ణించాడు.

ప్రేయసిపై ప్రియునికున్న ప్రేమను వివరిస్తూ- ఆమె చెప్పితే నీవు ఎలాంటి పని అయినా చేస్తావు అంటూ చినతిరుమలయ్య స్వామిని పరిహాసం చేసే సంకీర్తనలో స్వామివారి పెనకటి దశావతారాల్ని వ్యంగ్యంగా సూచించడం రమ్యంగా వుంది. ఇది రాయలసీమలో కోసువాని పల్లెలో వెలసిన వేంకటనాథుని దర్శించినప్పుడు వ్రాసిన సంకీర్తన అని క్షేత్రముద్రను బట్టి చెప్పవచ్చు.

"మత్స్య కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చ బుద్ధ కల్కి రేవచ"

అని ప్రసిద్ధ దశావతార శ్లోకం.

ఆమె చెబితే చాలు సముద్రాన్ని అయినా ఈదేవు అనడంలో మీనావతారం, ఒద్దికగా కొండను మోయమన్నా మోస్తావు అనడంలో కూర్మావతారం, భూమినంతా తవ్వమన్నా తవ్వుతావు అనడంలో వరహావతారం, బహురూపాన వుండమన్నా వుంటావు అనడంలో నరసింహావతారం, తపస్సు చేయమన్నా చేస్తావు అనడంలో రామావతారం. తన పశువుల్ని పాలించడంలో బలరామావతారం, అబద్ధాలాడమన్నా ఆడుతావు అనడంలో బుద్ధావతారం (త్రిపురాసుర భార్యలకు మోహాన్ని కలిగించడం), గుఱ్ఱంపై స్వారీ చేయమన్నా చేస్తావు అనడంలో కల్కి అవతారం సమన్వయం అవుతాయి. అలాంటి దశావతారమూర్తి అయిన స్వామి రక్షకుడై కలసి వుండమన్నా తన ప్రేయసి కౌగిలిలో ఒదిగి వుంటాడని (భక్త ప్రియుడని) చిన తిరుమలయ్య సరసంగా చిత్రించాడు.

లోకంలో పురుషుడు తనకు ఏ స్త్రీ అయినా ప్రగాఢంగా నచ్చితే ఆమె దగ్గరకు వెళ్ళి- నీవు బావిలో దూకమన్నా దూకుతాను. మేడనుంచి దూకమన్నా దూకుతాను. నీవు విషమిచ్చినా తాగుతాను. అని ఆమెను ఆకట్టుకోవడానికి చెబుతాడు అలాంటి మనస్తత్వాన్ని స్వామికి ఆరోపించి అందులో దశావతారాల్ని నిక్షిప్తం చేయడం చిన తిరుమలయ్య వర్ణనా చాతుర్యానికి తార్కాణం.

ఈడేర వలచితే యే పని సేయఁగరాదు
యేడనైనా యెగ్గు సిగ్గు లెంచేరా భామిని ॥

వనిత చెప్పితేఁ జాలు వారిధైనా నీఁదేవు
అనువుగాఁ గొండ మోవుమన్నా మోఁచేవు

తనివోక బూమెల్లాఁ దవ్వుమన్నాఁ దవ్వేవు
వోనర బహు రూపాన నుండుమన్నా నుండేవు ॥
(16-75)

శ్రీనివాసుడు శ్రీరాముని వలె ఏకపత్నీ వ్రతుడు కాడు. కాలానుగుణంగా స్వామికూడా బహుపత్నీ ప్రియుడయ్యాడు. అందు వల్ల సతీమణికి సవతుల బాధ ఎక్కువయింది కానీ ఏమీ మాట్లాడలేక ఆ బాధను సహిస్తుంది. ఎంత సహించినా ఎప్పుడో ఒకప్పుడు మనసు లోని బాధను తన భర్తముందు వ్యక్తం చేస్తుంది. పైకి ప్రతిఘటించే శక్తి లేకపోయినా మానసికంగా నిరసిస్తుంది. ఇక్కడ నాయికకూడా నాయకునితో— నీవు ఇరువైపుల వాడి ఉన్న సూదిలాంటి వాడివని తెలిసి ఓర్చుకుంటాను కానీ ఇష్టపడి మనసిచ్చి నీతో మాట్లాడలేను. నీవు ఆమెతో సయ్యాటలు చాలిస్తేనే నీకు నాపై ప్రేమ ఉన్నదని నమ్ముతాను. నీవు ఆమెకోసం ఎదురుచూడకుండా ఉంటేనే నా ముచ్చటలన్నీ నీకు చెప్పుకుంటాను. ప్రేమ ఆమెమీద కాక ఇక్కడ ఉండే నీకు చేసిన ప్రతిజ్ఞలను నిలుపుకుంటాను. నీవు ఆమెతో ఐక్యాన్ని వదలుకొంటేనే నేను నీకు దగ్గరై నవ్వుతాను. పరిధిదాటక నా కౌగిలిలో ఉంటేనే నీతో రమిస్తాను - అని పరస్త్రీ సాంగత్యాన్ని ఖండిస్తూ తన ప్రేమను, అభిమానాన్ని ప్రకటిస్తుంది. మానవ మన స్తత్వాల్ని, నీతుల్ని భగవత్పరంగా జోడించి సంకీర్తనలు వ్రాయడం తాళ్ళపాక కవులకు కరతలామలకమే. చిన తిరుమలయ్యకూడా ఈ విధమైన రచనలో అందెవేసిన చేయి. అందుకే ఈ విషయాల్ని —

ఇరుమొన సూదివని యింపు సేసుకుందు గాని
మరిగినే మనసిచ్చి మాట లాడ జాలరా ॥

ఆపెతో బురుడు వెట్టి ఆడకవుండిన గదా
నాపైనీ వలపెల్ల నమ్ముకుందును

చూపుల నాపె కెదురు చూడక వుండితే గదా
చేపట్టి నా ముచ్చటెల్లా జెప్పుదు నీతోను ॥ (16-56)

అనే సంకీర్తనలో మిక్కిలి సహజంగా నాయిక మనస్తత్వాన్ని చిత్రీకరించాడు.

పద్మావతికి శ్రీనివాసునిపై విరహ వేదన పోవడానికి ఇతరమైన భౌతిక ఔషధాలు పనికిరావు. దానికి ఒకే ఒక్క మందు తన ప్రియుడు. ఆ ప్రియుని ఆమె దగ్గరకు చేర్చితే ఆమె బాధ తీరుతుంది. ఈ విషయాన్ని చెలికత్తెలు ఒకరినొకరు—

ఏమి మందు గద్దె యింతులాల! యీ
రామకు దిరుపతి రాముఁడే మందు ॥

వెలసెటి విరహాన వేఁగేటి యింతికి
చెలియలాల యేమి సేతమే
చలివేడి వలపుల చవిగన్న యీపెకు
వలపించిన తన వరుఁడే మందు ॥ (16-108)

అనే సంకీర్తనలో ముచ్చటించుకోవడం సహజ సుందరంగా ఉన్నది. జీవాత్మ పరమాత్మకోసం పడే ఆవేదనను, జీవాత్మ, పరమాత్మ కలయికతో పొందే సంతృప్తిని చిన తిరుమలయ్యని మధుర భక్తిభావనతో రమ్యంగా వర్ణించాడు.

చిన తిరుమలయ్య తన సంకీర్తనా సుమాలలో భక్తి సౌరభాలను గుబాళింప జేయడమేగాక తన తాతగారి సంస్కృత సంకీర్తన లక్షణాన్ని కూడా అంద్రీకరించాడు. సంస్కృతం, ప్రాకృతం శౌర

సేన, మాగధి, పైశాచీ, ప్రాచీ, అవంతీ, సార్వదేశీ (నాగర) ఈ అష్ట భాషలతో కూడిన అష్టభాషాదండకాన్ని వెలయించి తెలుగు సాహితీ సామ్రాజ్యంలో అష్టభాషా చక్రవర్తిగా ప్రఖ్యాతిగాంచాడు.

కోస్తావాణి
11-7-1993.



# పెదతిరుమలార్యుని పదమాధురి

తెలుగు సాహితీ లోకంలో ఏ కవి కుటుంబానికి లేని విశిష్ట స్థానం తాళ్ళపాక కవి కుటుంబానికి ఉన్నది. ఈ కుటుంబం పూర్వీకు లందరూ కవి పండితులే అయినా రచనలు చేపట్టిన వారిలో మూల పురుషుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఇతని తర్వాత మూడు తరాల వరకు ఇతని కుటుంబస్థులు, ఇతర సన్నిహిత బంధువులు అందరూ కవిపండిత వాగ్గేయకారులే. అందరూ వేంకటాచల శ్రీనివాసుని పరమ భక్తులే. సుభద్రా కళ్యాణమనే మంజరీ ద్విపద కావ్యాన్ని రచించిన తొలి తెలుగు కవయిత్రి కూడా అన్నమయ్య పెద్ద భార్యే కావడం విశేషం.

అన్నమయ్యకు తన రెండవ భార్య అయిన అక్కలమ్మకు జన్మించిన పుత్రరత్నమే పెదతిరుమలయ్య. ఇతడు లోకప్రచారంలో వున్న పండితపుత్రి న్యాయాన్ని కల్ల చేసి "పండితపుత్రశ్రేష్ఠ" అనే కొత్త సూత్రాన్ని ఋజువుచేశాడు. పెద తిరుమలయ్య తన తండ్రి ఏర్పరచిన బంగారు బాటలోనే పయనించి విష్ణుభక్తి ప్రచారం కోసం శృంగార ఆధ్యాత్మ సంకీర్తనలు రచించాడు. భాషలో, భావంలో, రచనా విధానంలో అన్నమయ్య మార్గాన్నే అనుసరించి సంకీర్తనలు రచించాడు. ఏవి తండ్రివో, ఏవి కొడుకువో మనం గుర్తించలేనంత సాదృశ్యంతో నిబద్ధతతో పద్మావతీ శ్రీనివాసులపై ఇతడు మృదుమధురంగా పద సుమమాలిక లల్లాడు. ఇతని పదాల లోని భావనాశక్తి సహృదయ పాఠకుల్ని ముగ్ధుల్ని చేస్తుంది. మానవ సోల్లాసాన్ని ఉద్దీపింపచేస్తుంది భక్తిని, రక్తిని ఇనుమడింపచేస్తుంది. మానవాదర్శాన్ని పురోగమింపజేస్తుంది.

పెదతిరుమలయ్య పదాలలో కూడా నాయికా నాయకులు పద్మావతీ శ్రీనివాసులు. వీరు అవిభాజ్యులు. అన్యోన్య దివ్య దంపతులు. వీరి అనురాగాన్ని చూచి పరవశిస్తున్న పెదతిరుమలయ్య తాను చెలికత్తెగా భావించుకొని దేవేరి అయిన పద్మావతితో- "ఓ రమణి, నీపై నీ విభుని కెంతో ప్రేమ. అందుకే నిన్ను తలాలున తన వక్షస్థలంలో ధరించాడు. ఆనాడు నీభర్త గజేంద్రుని ఎంతో ఆసక్తితో మొసలి బారినుంచి రక్షించాడు. ఎందుకో తెలుసా! ప్రియురాలివైన నీనడకలు గజగమనములవంటివని,అలాగే చక్రాన్ని ఎందుకు ధరించాడంటే నీ కటి ప్రదేశం చక్రంలా ఉన్నదని, అతను పద్మాన్ని ఎందుకు నాభియందు కలిగివున్నాడో తెలుసా నీవు పద్మాలయవని! అతడు శంఖాన్ని ధరించడానికి కారణం నీకంఠం శంఖాకారంగా ఉంటుందని, అతడు నల్లనివాడుగా ఎందుకయ్యాడంటేనీ శిరోజాలు నల్లనివని అలాగే అతడు వెంకటగిరిపై ఎందుకు వెలశాడంటే నీకుచాలు కొండలను పోలివున్నాయని, అని తెలియజేసి పద్మావతికి తన విభుడైన శ్రీనివాసునిపై ప్రేమను అతిశయింపజేశాడు. ఈ విధంగా విష్ణుమూర్తి చేసిన ఘనకార్యాలను, ఆయన ధరించిన ఆయుధాలను, ఆయన స్థితిగతులను అందులోని వాస్తవాన్ని కప్పిపుచ్చి ఇదంతా కేవలం తన ప్రియసతిపై నున్న మమకారంవల్లనే స్వామి ఇలా చేశాడు అని తన భావనా బలంతో ఆస్వామిపై తనకున్న చనువుతో ఇలా వర్ణించాడు.

ఎటువంటి మోహమో యింతి నీపైన తనికి
తలుకున నురమున ధరియించెనిన్నును॥

కామిని (స్త్రీ) నడవులు గజగమనములని
కామించి నీపతి కరిగాచెను

కోమలపు నీపిరుదు చక్రిభావమని
నేమమై చక్రము చేత నిలిపి నా డతఁడు॥ (23-1)

ప్రియునిపై ప్రసరించే ప్రియురాలి చూపులు, చేష్టలలోనే ప్రియునికి అన్ని రకాలకాలాలు అవగతమవుతున్నాయని, అవి మన్మథుడు చేసిన మాయలని పెదతిరుమలయ్య భావించాడు. ప్రేయసి ప్రియునిపై కాటుక కన్నుల చూపుల్ని చల్లినప్పుడు అది ప్రియునికి చీకటి కాలమని, నవ్వినప్పుడు వెన్నలకాలమని, అలిగినప్పుడు వేసవి కాలమని, ప్రేయసి ప్రియుని ఆదరించి దగ్గరకు చేరుకొన్నప్పుడు ఆమె చెమటలే అతనికి వర్షాకాలమని, ప్రేయసి ప్రియుని చెంత ఎప్పుడూ ఉంటే అది అతనికి మంచికాలమని అధరామృతాన్ని రుచి చూపినప్పుడు అది ప్రియునికి వసంతకాలమని చమత్కరిస్తూ పెద తిరుమలయ్య—

ఇంతేపో కలిగినది యేకాలము
కంతుడు సేసిన మాయ కలకాలము॥

కాటుక నీ కన్ను చూపు కలికిపై జల్లితేనే
గాటము విభునికి జీకటి కాలము
పాట పాట నవ్వు మోవి బాఉనటు నవ్వితేను
నీటున నీ పతికి వెన్నెల కాలము॥ (23-522)

అనే పదమకరందాన్ని జాలువార్చాడు. చూపులు నల్లగా ఉంటాయనటం కవి సమయం కాబట్టి పెదతిరుమలయ్య దీనిని చీకటి కాలమని వర్ణించాడు. నవ్వు తెల్లగా ఉంటుందనటం కవి సమయం కాబట్టి దీనిని వెన్నెలకాలమని వర్ణించాడు ఇలాగే అలుకను వేసవి కాలంగాను, చెమటల్ని వానకాలంగాను, మేపితేనెను వసంతకాలంగాను పెదతిరుమలయ్య వర్ణించటం ఔచిత్యంగా ఉన్నది.

పద్మావతీ శ్రీనివాసులు జగదేకసుందర స్వరూపులు, వారి అందచందాలను వర్ణించడంలో తాళ్ళపాక కవులు ఎవరికివారే సాటి ప్రేయసీ ప్రియులు ఎందుకో ఒకరిపై ఒకరు అలిగివున్నారు. ఆ జంటనుచూచి పెదతిరుమలయ్య ఆవేదన పడ్డాడు. చెలికత్తెలకు ఇలా హెచ్చరికలు చేస్తున్నాడు. వారిద్దరి సంబంధాలను సూక్ష్మంగా పరిశీలించి పోల్చి చెప్పండి మంచిమాటలతో వాళ్ళ ప్రేమ చక్కబడు తుంది ప్రేయసి ముఖాన్ని పూర్ణ చంద్రునితో పోల్చండి ప్రియుని ఆకన్నులు కలువల్లా ఒప్పుతాయి. ఆమె కొప్పును తుమ్మెదల గుంపుతో పోల్చండి, అతని పెదవిపై తేనె జాలువారుతుంది. ఆమె స్తనాల్ని తామరపువ్వులతో పోల్చబడి, అతని చూపులు తుమ్మె దలై గుంపుకూడుతాయి. ఆమె కటి ప్రదేశాన్ని ఇసుక దిబ్బగా పోల్చండి. అతని మనసనే హంస దానిపై వాలుతుంది. ఆమె పాదా లను తాబేళ్ళతో పోల్చండి. అతని చెమటలే చెరువు అవుతుంది. ఈ విధంగా వారిద్దరి అందచందాల్ని పోల్చండి, ఇద్దరూ ఒక్కటవుతారు. ఇలా పెదతిరుమలయ్య తన అద్భుతమైన భావనాశక్తితో ప్రేయసీ ప్రియుల అంగాంగాలలో తదనురూపమైన ఉపమలను జోడించి వర్ణిం చాడు.

ఇద్దరి చుట్టరికేలు యెంచి యెంచి పోలుచరే
సుద్దులనే మోహము సూటిపడు గాని॥

సతి వదనము పూర్ణచంద్రుని బోలుచరే
అతని కన్నుల గలువలలరుగాని
మితిలేని తరుము తుమ్మెదల బోలుచరే
తతి బతిమోవి దేనె దైలువారుగాని॥ (23-240)

మించు జనులే కెవి తామెరల బోలుచరే
ముంచి విభుచూపు దేంట్లు మూగు గాని

పెంచి యిసుక దిబ్బగా బిఱుదువోలుచరే
అంచల నీతని మనో హంసవాలు గాని॥

తక్కక యీకెపాదాలు తాబేళ్ల బోలుచరే
నిక్కితని చెమ కేరు నిండుగాని
అక్కున నలమేల్మంగ యట్టే శ్రీవేంకటేశుఁడు
చక్కదనాలు వోల్చరే సమములౌ గాని॥ (28-240)

పెదతిరుమలయ్య పదమాధుర్యం పేరెన్నికగన్నది. వికట కవిగా జగద్విఖ్యాతిగాంచి, శ్రీకృష్ణదేవరాయల భువన విజయాన్ని తన పరిహాస కవితా మాధురిచే ఉర్రూతలూగించిన తెనాలి రామ కృష్ణుడంతటి అధిక్షేప కవి పండితునిచే "పన్నగ పెదతిరుమలయ్య పదమున కెఱఁగున్"అని పొగడ్తకెక్కిన పద కవి పెద తిరుమలాచార్యుడు.

ఈ పెద తిరుమలయ్య శ్రీవేంకటేశ్వర ముద్రాంకితంగా పదాలనే కాక వివిధ సాహితీ ప్రక్రియలలో కావ్యరచనలు చేశాడు. వేంకటేశ్వర వచనాలు వేంకటేశ్వరోదాహరణం. వేంకటేశ్వర ప్రభాత స్తవము (ద్విపద), శృంగార దండకం, శృంగార వృత్త శతకం, నీతి సీస శతకం, చక్రవాళ మంజరి సుదర్శన రగడ, భగవద్గీత తెలుగు వచనం, రేఫఱకార నిర్ణయం (లక్షణ గ్రంథం) మొదలైన గ్రంథాలన్నీ రచించాడు. ఈ గ్రంథాలన్ని లభిస్తున్నాయి. తిరుమల తిరుపతి దేవస్థానం వారు వీటిని ప్రకటించారు. పెద తిరుమలయ్య ఈ గ్రంథాలే కాక ఆంధ్రవేదాంతం, ద్విపద హరివంశం సంకీర్తన లక్షణ వ్యాఖ్య మొదలైన గ్రంథాలుకూడా రచించినట్లుప్రతీతి, కానీ ఇవి లభించలేదు. ఈవిధంగా రచనలద్వారా స్వామిసేవ, సాహితీ సేవచేసి తరించిన భక్తిపద కవితాధురంధరుడు పెదతిరుమలాచార్యుడు. ఈ పరమ భక్తుడు శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య,

శ్రీరామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, వేదాంతాచార్య. కవితార్కిక కేసరి, శరణాగత వజ్రపంజర అనే బిరుదుతో అలరారిన చరితార్థుడు. తనతండ్రిగారి సంకీర్తనల మహిమాతిశయాన్ని గూర్చి చెబుతూ— దేవతలకు, మానవులకు వినేకొలదీ ఆశ్చర్యకరంగా వుంటాయి. చక్కెరలై రుచి చూపిస్తాయి. పరిమళపు చెట్లై సువాసనల్ని వెదజల్లుతాయి, అద్భుతమైన వాక్కులు వజ్రాలై మెరుస్తాయి. మరకలేని స్వచ్ఛమైన అద్దాలై మా నిలువు నీడలు చూపుతాయి (ఆత్మసాక్షాత్కారం కలిగిస్తాయనికావచ్చు). పన్నీరై తనువుపై పూస్తాయి. కర్పూరమై చల్లదనం కలిగిస్తాయి. మేలైన ముత్యాలై శరీరం నిండుతాయి. అంగరక్షకులై మా వెంటను తిరుగుతాయి. ఉపనిషత్తులై నిరంతరం దర్శనమిస్తాయి. పుట్టుకతోనే గురువులై బోధిస్తాయి. శాశ్వతమైన వరాలిచ్చే శ్రీవేంకటేశ్వరుని సులభంగా మెప్పించాయి అని కీర్తించిన పితృభక్తిపరాయణుడు, గుణగ్రహణపారీణుడు, విద్వాంసుడు పెదతిరుమలయ్య.

"సురలకు నరులకు సోరిది వినవిన
నరుదు తాళ్ళపాక అన్నమయ్య పదములు
చక్కెరై చవిచూపీ జాలై తావిచల్లీ
నక్కజపు మాతువజ్రాలై మెఱసీని
పన్నీరై పైబూసీఁగప్రంబై చలువరేఁచీ
వెన్నుబలములై మావెంట వెంటఁ దిరిగీని
పుట్టుతోనే గురువులై బోధించీని"

కోస్తావాణి
3-7-1993



# పెదతిరుమలయ్య పదాల్లో జానపదహేల

పదప్రక్రియలో ప్రఖ్యాతిగాంచిన పెదతిరుమలయ్య తనతండ్రి అన్నమయ్యలాగే అన్ని వర్గాల ప్రజల్లో విష్ణుభక్తిని పెంపొందించడం కోసం అనేకరకాల పదాలను రచించాడు. అన్నమయ్య పదాల్లో కనిపించినన్ని జానపదగేయ రీతులు పెదతిరుమలయ్య పదాల్లో కనిపించక పోయినా కొన్ని రకాలు మాత్రం కనిపిస్తాయి!

తిరుమలయ్య రాయలసీమ ప్రాంతంలో తాళ్ళపాక అనేపల్లెలో పుట్టి, ఆ పల్లెలోనే పెరిగిన వ్యక్తి కావడంవల్ల పల్లీయుల మనస్తత్వాల్ని గూర్చి, పల్లె పరిసరాల్ని గూర్చి అతనికి మంచి అవగాహన ఉంది. ఆనాడు పల్లీయులు ఎక్కువగా నిరక్షరాస్యులు కావడంవల్ల వారు వేదాలు, శాస్త్రాలు, పురాణాలు, కావ్యాలు చదువుకోలేరు. ఒకవేళ విద్యాగంధం ఉన్నా కూడా ఆ గ్రంథాల్ని తీరికగా కూర్చొని చదువుకొనే సమయం వారికి ఉండదు. అందువల్ల పెద తిరుమలయ్య వారు అనునిత్యం పాడుకొనే జానపద బాణీల్లో ఆ గ్రంథాల్లోని విష్ణుభక్తిని, విజ్ఞానాన్ని, మానవతా ధర్మాల్ని పొందుపరచి పదాల్ని రచించాడు. వీటిని ఎవరికి నచ్చిన రీతుల్లో వారు హేలగా, లీలగా పాడుకొని పరవశించవచ్చు. లేదా చదువుకొని ఆనందించవచ్చు.

పెండ్లి పాటలు :- జానపదులు వివాహ శుభకార్యంలో ఒక్కొక్క తంతుకు ఒక్కొక్క రకం పాట పాడుతారు. అవి నలుగు పాటలు, శోభనపు పాటలు, అప్పగింతల పాటలు, తలుపు దగ్గర పాటలు మొదలైనవి. ఈ పెండ్లిపాటల్లో వధూవరుల అందచందాలు

ఆచారాలు, అలంకరణలు, సందేశాలు, నీతులు మొదలైనవి పేర్కొనబడతాయి. తిరుమలయ్య పదాల్లో వధూ వరులు అన్నమయ్య పదాల్లో లాగే పద్మావతీ శ్రీనివాసులు. వీరి విలాస చేష్టల్ని, సుందరమైన అవయవాల్ని వివాహ సంబంధమైన అలంకరణ వస్తువులుగా పోల్చి చెబుతూ తిరుమలయ్య పెండ్లి పాటను రచించాడు.

లక్ష్మీ కల్యాణము లీలతోఁబాడేమిదేనేము
లక్ష్మీనారాయణులే లలనయు నీవును ॥

చూపులు చూపులు మీకు సూసకము బాసికము
పూపచన్ను గుబ్బలివి పూజకుండలు
తీపుల మోవి తేనెలు తీరని మధు పర్కము
దాపుగఁ బెండ్లియాడరయ్య తగుఁదగు మీకును ॥
(23-165)

అనే పాటలో ముత్తైదువలు లక్ష్మీకల్యాణపాటను మృదువుగా పాడుతున్నామని అంటూ పద్మావతీ శ్రీనివాసులతో— మీరు లక్ష్మీనారాయణులే. మీలో ఒకరి చూపులు సూసకం (తలపై ధరించే బిళ్ళ), ఇంకొకరి చూపులు బాసికం. ఆమె మొగ్గలవంటి చనుగుబ్బలే పూజకుంభలు. తియ్యని అధరామృతమే మధుపర్కం (పెండ్లి వస్త్రం), మాటలే మన్మథ మంత్రాలు, నవ్వులే తలంబ్రాలు. తను పులకలే కర్పూర వసంతాలు. కౌగిళ్ళే పెండ్లి చవికె. పెరిగిన కోరికలే పావుకోళ్ళు. మీరు ఒకరికొకరు తగి వున్నారు. పెండ్లాడండి అంటూ సరసంగా సంభాషించడం ఇందులో వ్యక్తమవుతుంది. ఇలాగే మరో సంకీర్తనలో పెద తిరుమలయ్య తనను పేరంటాలుగా భావించుకొని నేడే పెండ్లివేళ, నేడే నాగవల్లి, ఆడుతూ శోభనం పాట పాడమని చెలుల్ని హెచ్చరిస్తూ- శ్రీనివాసుడు బంగారు వస్త్రం కట్టినవాడు. ఆమె బంగారు పర్వతం వంటి కుచాలు కల్గింది. అతడు వనజ నాభుడు.

ఆమె వనజలోచన. వీరికి సంబంధం బాగా కుదిరింది. వీరికి కంకణం కట్టండి. అతడు నల్లనివాడు. ఆమె నీలవేణి అతడు శంఖాన్ని ధరించిన వాడు. ఆమె శంఖం వంటి కంఠం కల్గింది. వీరికి జంట తగివుంది. ఇలా భావించుకొని వీరికి హారతు లెత్తండి. అతడు సముద్రశయనుడు. ఆమె సముద్రరాజ తనయ. వీరిద్దరికి ఐక్యత కుదిరింది. వీరిని దీవించండి అని కాంక్షించడం వ్యక్తమవుతుంది.

నేడే పెండ్లివేళ నేఁడే నాగవల్లి
ఆడుచు సోబానఁ బాడు మనరే చెలులూ ॥

కనకాంబరుఁ డతఁడు కనక కుచగిరి యీకె
కొనబుగల యిద్దరికిఁ గూడెఁ బొంతనము
వనజనాభుఁ డతఁడు వనజ లోచన యీకె
ఘనమైన కంకణము గట్టరే చెలులు ॥ (23-537)

మంగళ గీతాలు :- ఉత్సవ సమయాల్లోను, పండుగ సమయాల్లోను పూజా కార్యక్రమాలు పూర్తి అయిన తర్వాత దేవతలకు మంగళ గీతాలు పాడుతారు. పెద తిరుమలయ్య వేంకటేశ్వరుని మాధవుడు, సజ్జన ప్రియుడు, మన్మథ జనకుడు, దుష్ట సంహారకుడు, తన మదిలోని హరి, చదువులమూర్తి, మహిమాధికుడు, తన ఇంటి భర్త అంటూ అనేక విధాలుగా కీర్తించాడు.

మాధవునకు మంగళము
సాధు ప్రియునకు జయ మంగళమూ ॥

మదన గురునకు మంగళమూ, మా
మదిలో హరికిని మంగళము

మదరిపుఁ హరునకు మంగళము
చదువుల మూర్తికి జయ మంగళమూ ॥ (23-287)

శృంగార గీతాలు : జానపదుల్లో బావా మరదళ్ళకు, ఒదినా మరదళ్ళకు సంబంధించిన సరస గీతాలు విశేషంగా ప్రచారంలో ఉన్నాయి. తిరుమలయ్య పద్మావతిని మరదలుగా, శ్రీనివాసుని వేంకటగిరి బావగా చేసి పద్మావతి ద్వారా బావ పాటను సరస వినోదంగా పాడించాడు. మరదలు తన బావతో- నా ఒడి పట్టుకుంటున్నా వెందుకు? ఇంత త్వరగా నాతో నవ్వాలా? నా ప్రక్కన కూర్చుంటా వెందుకు? నీ గొప్పలు మాను. నీ జాణతనాలు ప్రదర్శించకు నీ మాటలు నమ్మి మోహించాను. నీవు లోపలికి వచ్చి నా మనసును కరిగిస్తున్నావు. నన్నెందుకు బట్టబయలుచేస్తావు? ప్రేమతో నన్నేలుకున్నావు. ఎంత ఒట్టు పెట్టుకున్నా మానవు. ఇది మన ప్రేమను వ్యక్తంచేస్తుంది అని అంటున్న ఆమె మాటలను తిరుమలయ్య—

వొడి వట్టే వేమోయి వోబావ యింత
వడిగా మాతో నవ్వవలెఁగా వో బావ ॥

వొద్దఁ గూచుండే వేమోయి వోబావ నీ
వుద్దండాలు మానవుగా వో బావ
వొద్దు సుమీ జాణతనాలో బావ నీ
సుద్దు లెల్లా విని విని చొక్కితినో బావ ॥ (23-231)

అనే సంకీర్తనలో సులలితంగా, సుమధురంగా విశదీకరించాడు.

దైవనామాంత పదాలు : జానపదులు భజన సమయాల్లోను, కోలాట సమయాల్లోను దైవాల్ని స్తుతిస్తూ దైవనామాంత పదాల్ని పాడుతారు. జానపదుల వ్యవహారంలో కూడా రామనామాలు,

గోవిందనామాలు బాగా ప్రసిద్ధికెక్కాయి. పెదతిరుమలయ్య పదాల్లో ఉపేంద్రుడు (23-231), గోపాలకృష్ణ (23-233), కృష్ణరాయ (23-234), సంకరుషణ (23-235), కడపరాయ (23-296), కొండల రాయ (23-300), ఓబులేశ (23-395) మొదలైన విష్ణునామాంత పదాలు కనిపిస్తున్నాయి. ఈ పదాల్లో భగవంతుని మహిమలు, అవతార సంఘటనలు, భక్త వాత్సల్యం ప్రస్ఫుటమవుతుంది. వీటిని భజన గోష్ఠుల్లో, కోలాట వేళల్లో పాడుకోవచ్చు.

వొద్ది వారెల్లా సాక్షి ఉపేంద్రుఁడా మన
వొద్దిక నీ వెఱుఁగవా ఉపేంద్రుఁడా ॥

వుడివోని వేడుకల ఉపేంద్రుఁడా యింత
వొడఁబరచ వలెనా ఉపేంద్రుఁడా
వొడి గట్టితిమి నీకును పేంద్రుఁడా మా
వొడలిపై సొమ్ము నీవె ఉపేంద్రుఁడా ॥ (23-232)

అనే సంకీర్తనలో మధుర భక్తి తత్వం చెప్పబడింది. గోపికలు తమ ప్రియుడైన శ్రీకృష్ణునితో "మా శరీర భూషణాలు నీవే" అని తమ అవ్యాజ ప్రేమను వ్యక్తం చేసుకోవడం కనిపిస్తుంది. ఇందులో ఉపేంద్రుడు అంటే శ్రీకృష్ణుడు అని అర్థం. ఈ సంకీర్తన "ఉపేంద్రుడా" అనే నామాంత పదంతో సాగింది. అలాగే శ్రీకృష్ణావతార విశేషాల్ని పేర్కొంటు తిరుమలయ్య—

కేరక మా చీర లీవోయి కృష్ణరాయ మేని
గీరలేదవోయి నీకు కృష్ణరాయ ॥

కేలెత్తి మొక్కేమయ్య కృష్ణరాయ మా
కేలు నీ చేతనున్నది కృష్ణరాయ

గేలి సేసేవేల మమ్ముఁ గృష్ణరాయ నీకు
కేళికాయ మా సిగ్గులు కృష్ణరాయ॥ (23-234)

అనే సంకీర్తన రచించాడు. ఇందులో గోపికలు సరస చేష్టలు చేస్తున్న శ్రీకృష్ణుని తమ చీరలిమ్మని, పరిహాసం చేయవద్దని వేడు కోవడం కనిపిస్తుంది.

సంవాద గీతాలు : జానపదుల వాడుకలో సంవాద గీతాలు కూడా విస్తృతంగా ప్రచారంలో వున్నాయి. అత్తా కోడళ్ళ సంవాదం ప్రసిద్ధమయిందే. బావా మరదళ్ళ సంవాదం ప్రసిద్ధమయిందే, ప్రేమికుల సంవాదం, భార్యాభర్తల సంవాదం మొదలైనవి సరసంగా సాగిపోతుంటాయి. పౌరాణికమైన చెంచితా కృష్ణుల సంవాదం మనో హరంగా ఉంటుంది. సంవాదగేయాలు హాస్యంగా, శృంగారంగా చమత్కారంగా వుంటాయి. వాదోపవాదాలు చేసే వ్యక్తుల అభి మానం, జాణతనం వీటిలో వ్యక్తమవుతుంది. తిరుమలయ్య సంవాద గేయ రీతులలో కొన్ని సంకీర్తనలు రచించాడు. పెద తిరుమలయ్య పదాలలో ప్రేమికుల సంవాదం, నాయికా చెలికత్తెల సంవాదం కనిపిస్తుంది. వీరి పదాలలో పద్మావతీ శ్రీనివాసులే ప్రేయసీ ప్రియులు, భార్యా భర్తలు, నాయికా నాయకులు వీరి సరస సంభా షణ రమ్యంగా సాగుతుంది. సాధారణంగా లోకంలోకూడా ప్రేయసీ ప్రియులు అన్ని విషయాలలో సమానత్వం పాటిస్తారు. స్త్రీ పురుష వ్యత్యాసం చూపించరు. అందుకే ఈ సంవాద గేయాలలో స్త్రీ పురు షుని "ఒరీ" అని, పురుషుడు స్త్రీని "ఓసీ" అని చనవుగా సంభాషించు కోవడం కనిపిస్తుంది. ఈ గేయాలలోని పద్మావతిని ప్రకృతిగా, జీవాత్మగా, భక్తుడుగా, శ్రీనివాసుని పురుషుడుగా, పరమాత్మగా, భగవంతుడుగా భావించుకోవచ్చు. ఈ జీవాత్మ పరమాత్మల సంవా

దాన్ని తిరుమలయ్య అనేక విధాలుగా మననం చేసుకొని మధుర భక్తి రీతిలో సంకీర్తనలు రచించాడు.

ఇందుకుగాఁ గోపించ నేల నీకు
ముందుగల కోపమెల్లా ముగిసెఁ బోరా ॥

కొమ్మ నీకుచములివి కొన వాండ్లాయింత
యెమ్మె లేల నీకు నందు కేమి వోడురా
అమ్మ డు జక్కవలంటా నడిగితినే-వోరి
కమ్మర మానలునే మంగడి వారమా ॥ (23-75)

అనే సంకీర్తనలో- ఇంత మాత్రానికే ఎందుకు కోపగించు కుంటావు అని ప్రియుడంటే, నీకు ముందున్న కోపమంతా పోయి నట్లుందే అని ప్రేయసి అంటుంది. అలాగే నీ స్తనాలు ఇంత వాడి అయినవా అని అతడంటే, పరిహాసమెందుకు! దానితో పనేమిటి అని ఆమె అంటుంది. అవి అమ్మే జక్కవ పిట్టలా అని అతడంటే, మేము అంగడి వాళ్ళమా అని అభిమానంగా ఆమె ఎదురు ప్రశ్న వేస్తుంది. ఇలాగే తక్కిన చరణాలలో కూడా సరసోక్తుల సంభాషణ సాగుతుంది. ఇలాగే మరో సంకీర్తనలో—

ఎంతగట్టు వాయవే యేమే నీవు - వోరి
పంతాన నందులో పంచుకోరా సగము ॥

పట్టుకోవే కొంగుజారెఁ గామిని - నీకు
గట్టితమ్మ చెక్కులంటెఁగడుగుకోరా
తొట్టి పెంజెమటలు తుడుచుకోవే - నీవే
బెట్టాయ కెంపులతోడి పెదవి మానుకోరా ॥
(23-148)

అని ప్రేయసీ ప్రియుల సంవాదం మధురంగా సాగుతుంది. ఎంత మాటకారి దానవే నీవు అని ప్రియుడంటే, నీవు అందులో సగం పంచుకోరాదా అని ప్రియురాలు చమత్కారంగా అంటుంది. నీ కొంగు జారి పోతోంది పట్టుకోవే అని అతడంటే, తమలపాకు రసం నీ చెక్కిలి కంటుకొన్నది కడుక్కోరా అని ఆమె అంటుంది. అధికమైన నీ చెమటలు తుడుచుకోవే అని అతడంటే, బెట్టుచేస్తున్నావు కెంపులాంటి ఎఱ్ఱటి నీ పెదవి మూసుకోరా అని ఆమె అంటుంది. ఇలాగే తక్కిన చరణాలలోని సంభాషణ సాగుతుంది.

నిందలు వేసేవుగాక నిజమా యిది
అందుకేమి వోరి నీకు అయిన పాటిచాలదా ॥

చలివలపులు నాపైఁ జల్లేవదేమే-వోరి
వెలవెట్ట నీ వలపు వేడుక గాదా
పలుమారు నా మీఁద పయిఁజేయి వేయకువే
పిలిచి బిడ్డ నిచ్చితే బిగుతువా వోరి ॥ (23-325)

అనే సంకీర్తనలో తనమీద చొరవ చేసుకొని సరసాలాడుతున్న ఆమెతో అతడు - నాపై నిందలు వేయాలని ఇలా చేస్తున్నావుగాని ఈ ప్రేమ నిజమా అని అంటే, ఆమె - దానికేమిటి, నీకు అదైనా చాలదా అని గడుసుగా అంటుంది. నాపై చలి వలపులు చల్లుతున్నా వెందుకు అని అతడంటే - ఆమె లెక్కిస్తే నీ వలపు ఆనందం కాదా! అంటుంది. మాటి మాటికి నాపై చెయ్యి వేయవద్దు అని అతడంటే పిలచి బిడ్డ నిస్తానంటే బిగుసుకుంటా వేమిరా అని నేర్పుగా సమాధానమిస్తుంది.

పెదతిరుమలయ్య తన తండ్రి అన్నమయ్యలోని సంగీత సాహిత్యాల్ని, రచనా రీతుల్ని, భక్తి విశ్వాసాల్ని పుణికి పుచ్చుకున్న సుపుత్రుడు. ఆనాడు రాయలవారి భువన విజయంలో ఎంతటి ఉద్దండ కవి పండితులనైనా తృణప్రాయంగా పరిహాసించగల్గే వికటకవి తెనాలి రామకృష్ణునంతటి కవి దిగ్గజంచే "పన్నుగ పెదతిరుమలయ్య పదమున కెఱగున్" అని పొగడ్తకెక్కిన ఘనుడు పెదతిరుమలయ్య. సంకీర్తనల్ని జానపదబాణీల్లో, వారి మాండలిక భాషలో రచిస్తే జానపదులకు ఆ పదాలపై ప్రీతి, అభిమానం ఏర్పడుతుందని, మానసిక ఉల్లాసం, వికాసం కలుగుతుందని భావించి పెదతిరుమలయ్య తన పదాలలో జానపదాల్ని హేలగా రూపొందించాడు.

ఆకాశవాణి,
విశాఖపట్టణం కేంద్రం,
ప్రసారం : 6-7-1994.



# పెదతిరుమలయ్య వర్ణనా వైదుష్యం

పదసాహిత్యంలో పేరెన్నికగన్న పెదతిరుమలయ్య పదాలలో వర్ణనా నైపుణ్యం కనిపిస్తుంది. పెదతిరుమలయ్య తన తండ్రి అన్నమయ్యలాగే తిరుమల శ్రీనివాసుని పరమభక్తుడు. ఇతడు తన భావనా శక్తితో ఆ స్వామిని, అమ్మవారి వింతవింతలుగా వర్ణించి తృప్తి చెందాడు.

పద్మావతీ శ్రీనివాసులు అత్యద్భుత స్వరూపులు. వారి దివ్యసౌందర్యం అందరికీ ఆశ్చర్యంకలిగిస్తుంది. ఆనందం పొంగిస్తుంది. పెదతిరుమలయ్యకూడా స్వామి అందాలకు ఆశ్చర్యచకితుడై ఆస్వామి చక్కదనాన్ని ఏమని కొనియాడవచ్చు! అతని ముఖం చూస్తేనే పారవశ్యం కలుగుతుంది. అని తెలియజేస్తూ—మన్మథుని తండ్రి అయిన ఇతడు జలకమాడే వేళలో చేతులు, తానుదట్టంగా వ్యాపిస్తూ విశ్వమంతా తరంగాలతో కూడి అతిశయించిన సముద్రమే రూపం ధరించి ఎదురుగా నిలిచినట్లున్నాడని, కర్పూరపు పొడిని శరీరానికి అద్దుకొనే సమయంలో చూసేవారికి శరత్కాలంలోని తెల్లని మేఘంలా భాసిస్తున్నాడని, కస్తూరి పూసుకొని మిక్కిలి నల్లనైన స్వామి అలమేల్మంగను వక్షస్థలంలో పెట్టుకొనివుంటే రూపువాల్చిన ఇంద్రనీలగనిలా ఒప్పుతున్నాడని వర్ణించాడు.

ఏమని కొనాడవచ్చునితని చక్కదనము
మోము చూచినంతలోనే మోహింపించీ నితఁడు॥

మదన జనకు డిట్టే మజ్జన మాడేటివేళ
కదిసి హస్తాలు దానుగారు కమ్మిచు

చదలఁగడళ్ళతోడి సముద్రమె రూపై
యెదుట నిలుచున్నట్టు యిదె వున్నాఁడీతడు॥
(23-489)

మరో పదంలో స్వామివారు అన్ని సింగారాలకు అమరిన వాడని తెలియజేస్తూ—శ్రీనివాసుడు పద్మలోచనుడు కాబట్టి స్నాన మాడే సమయంలో పద్మాలకు నిలయమైన సరసువలె ఒప్పుతున్నాడని, యువతులు సిగ్గుపడుతూ అతన్ని కొలుస్తుండగా అతడు నిశ్చలంగా నిలుచుకొని వున్నాడని, స్వామి శంఖాన్ని చేతిలో ధరించిన వాడు కాబట్టి కర్పూరం పూసుకొనే వేళలో తన శరీరం నిధిలాగా ఉన్నదని, మదన కదన రంగంలో యుద్ధంచేసి వచ్చి ఇంపైన పుప్పొడిని పూసుకొని అలాగే వున్నాడని, శ్రీపతి నల్లనివాడు కాబట్టి కస్తూరి పూసుకొనేవేళ దానిని ధరించడానికి భరణిగా ఒప్పివున్నాడని. ఇంతటి శ్రీనివాసుడు అలమేల్మంగ మెడలో తాళిగా కట్టబడి లోలోపల ఉన్నాడని వర్ణించాడు.

అన్ని సింగారాలకు దా నమరినాఁడూ
వెన్నల బొడ్డొక చాయ డాయనీతఁడూ॥

జలజాక్షుడటుగాన జలకమాడేటి వేళ
జలజాకరమువలె సరిస్తున్నాఁడు
చలివాసి సిగ్గులతో జవ్వనులు గొలువఁగ
నిలిచున్నా డదివో నిచ్చలాన నీతడు॥ (23-490)

పెదతిరుమలయ్య నారాయణమూర్తిని వర్ణించినట్లే లక్ష్మీదేవిని కూడా మిక్కిలి చాతుర్యంగా వర్ణించాడు. లక్ష్మీదేవి నారాయణునికి కలిగివుండగా సంపదలకు కొదువలేదని పెదతిరుమలయ్య అమ్మవారితో ముచ్చటిస్తూ ఆమె శరీర సౌందర్యాన్ని గూర్చి ఇలా

ప్రస్తుతించాడు. నీ కొప్పు నీలమణులగని సొగసైన సన్నని నీశరీరం బంగారు గని. లేతనైన నీ కనుచూపులు ముత్యాలగని, నీ దంతాలు వజ్రాలగని, నీగోళ్ళు మాణిక్యాల గని, నీ కుచాలు గొప్పనిధి, నీ ఎర్రటి పెదవులు పగడాలగని ఇంపైన నీ కౌగిలి పాదరసగని. ఇలాంటి నిన్ను పొందిన ఆ స్వామి భాగ్యమే భాగ్యం అంటూ—

ఆదిమలక్ష్మి యతనికి గలుగ గ
యీదెస సంపదలిక నేమి చెప్పేదమ్మా

నెలంత నీతురుమిది నిండు నీలపు గని
పలచని నీ మేను పసిడిగని
మొలక నీ కనుచూపు ముత్యపు రాసులగని
యెలమి నీపతి కింక నేమి గడమమ్మా! (23-510)

దైవ సృష్టి ద్వంద్వయుక్తమయింది. పగలు-రాత్రి, మంచి-చెడు, చిన్న-పెద్ద, తక్కువ-ఎక్కువ, ఆడ-మగ, భార్య-భర్త అన్న-తమ్ముడు, అక్క-చెల్లెలు, సుఖం-దుఃఖం, సన్మానం-అవమానం ఇలా ద్వంద్వ భావంతో ప్రకృతి సాగుతుంటుంది. జగన్మాత అయిన శ్రీసతి ప్రకృతి స్వరూపం. ఆమె శరీరంలో హెచ్చుతగ్గులు పరస్పరం సమీపంలోనే ఉన్నాయని పెదతిరుమలయ్య మిక్కిలి నైపుణ్యంగా—

ఇలనట్లనే కదా యెక్కువలు దక్కువలు
కలవెల్ల, భువి నిందు ఘనతలే కలిగె॥

కొనచూపు దెలుపైన కొప్పు గడునలుపాయ
నినువు జీకటికి వెన్నెలకు సరియే
వనిత మోవియే చిగురు వజ్రాలే పలువరుస
ననిచి మృదువుకు వాడి నవ్వుచునే కలిగె॥ (23-514)

అనే పదంలో వర్ణించాడు. ఇందులో ఆమె నడుము సన్న మైతే ఆమెకటి స్థలం పెద్దదని ఆమె పాదాలు మెత్తనివైతే గోళ్లు గట్టివని, ఇది సాకుమార్యానికి, కాఠిన్యానికి సరిపోయిందని, ఆమె కొనచూపులు తెలుపైతే ఆమె కొప్పు మిక్కిలి నలుపని ఇది చీకటికి వెన్నెలకు సరిపోయిందని, ఆమె పెదవులు చిగురాకులని, దంతాలు వజ్రాలని, మృదుత్వం, వాడితనం నవ్వులోనే కలిగిందని, ఆమెకు మతిమరపు అయితే చేష్టలు అధికమయ్యాయని, ఇది కలయికకు వెల యికకు సరిపోయిందని, ఇలాంటి దివ్యస్త్రీని శ్రీవేంకటేశ్వరుడు కలసి నప్పుడు తలపు తలపునకు సంబంధం కలిగిందని పెద తిరుమలయ్య భావించాడు.

కవి తన భావనా పటిమతో ఉపమేయ వస్తువును అనేక రీతు లుగా ఉపమించి వర్ణన చేయడంవల్ల ఆ వస్తువుకు రమ్యత, ఉత్కృ ష్టత కలుగుతుంది. పాఠకుల హృదయాలలో వర్ణ్య వస్తువు స్థిర ముద్ర వేసుకొంటుంది. సాహిత్యం ఆలోచనామృతం కాబట్టి వర్ణ నలు వల్ల ఆ లక్ష్యం సిద్ధిస్తుంది. పెదతిరుమలయ్య పదాలలో వర్ణ్య వస్తువు పద్మావతీ శ్రీనివాసులే. పెద తిరుమలయ్య తన భావనా ప్రపంచంలో జగదేకపతి అయిన శ్రీనివాసుని, జగన్మాత అయిన పద్మావతిని అనేక విధాలుగా దర్శించి పదసాహిత్యంలో తనవర్ణనా వైదుష్యాన్ని ప్రకటించాడు.

కోస్తావాణి
3-8-1993



# పెద తిరుమలయ్య శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకుల ధర్మాలు

'పన్నుగ పెదతిరుమలయ్య పదమున కెఱుగున్' అని తెనాలి రామకృష్ణ కవిచే పొగడ్తకెక్కిన పెదతిరుమలయ్య పదకవిత్వంలో పేరు మోసిన కవిపండిత వాగ్గేయకారుడు. ఇతడు పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యులకు, అతని చిన్న భార్య అయిన తిరుమలాంబకు జన్మించాడు. ఇతనికాలం క్రీ. శ. 1458 నుంచి 1554 వరకు పెదతిరుమలయ్య వేంకటేశ్వర వచనాలు, వేంకటేశ్వరోదాహరణం. శ్రీవేంకటేశ్వర సుప్రభాతస్తవం అనే ద్విపదకావ్యం, శృంగారదండకం, శృంగారవృత్త శతకం, నీతి సీస శతకం, చక్రవాళమంజరి, సుదర్శనరగడ, రేఫఱకారనిర్ణయం అనే లక్షణగ్రంథం, భగవద్గీత తెలుగువచనం మొదలైన అనేక ప్రక్రియలు రచించాడు. ఇవి అన్నీ ప్రకటించబడ్డాయి. ఇతడు రచించిన ద్విపద హరి వంశం, సంకీర్తన లక్షణ వ్యాఖ్య అలభ్యాలు. ఇతడు శ్రీమద్వేద మార్గ ప్రతిష్ఠాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కిక కేసరి, శరణాగత వజ్రపంజర అనే బిరుదాలతో ప్రసిద్ధిగాంచాడు.

పెదతిరుమలయ్యకు పెదతిరుమలాచార్యులు, పెదతిరుమలయ్యంగారు, అన్నయ తిరుమలార్య, పెరియ తిరుమలయ్యంగారు, తిమ్మయ్య, తిమ్మయార్య, తిరుమల తిరుమలాచార్య, తిరుమల గురు, తిరుమల దేశికులు, వేంకటపతియోగి, తిరుమలయ్యగారు, తాళ్ళపాక తిరుమలయ్య, తిమ్మడు మొదలైన నామాంతరాలున్నాయి.

పెదతిరుమలయ్య తన తండ్రి ఆదేశం ప్రకారం రోజుకొక్క సంకీర్తన శ్రీపతిపై రచించాడు. తాను రచించిన శృంగార సంకీర్తనల్లో నాయికా నాయకులు అన్నమయ్య సంకీర్తనల్లో వలె దివ్యులైన పద్మావతీ వేంకటేశ్వరులు. వీరు లోక కళ్యాణ కారకులు. వీరినే సతీపతులుగా, ప్రేయసీ ప్రియులుగా, ప్రకృతీ పరమాత్మలుగా చిత్రించాడు. ప్రేయసీ ప్రియ ధర్మాన్ని జీవాత్మ పరమాత్మలకు ఆరోపించి మధురభక్తి ధోరణిలో శృంగార సంకీర్తనలు రచించాడు. వైష్ణవ సంప్రదాయం ప్రకారం పరమాత్మ ఒక్కడే పురుషుడు. తక్కిన జీవజాలమంతా స్త్రీప్రాయమే అవుతుంది. ఆ విధంగా భక్తుడు కూడా ఒక్కొక్కసారి తనను స్త్రీగా, ప్రేయసిగా భావించుకొని భగవంతుని కోసం విరహవేదన చెందడం కనిపిస్తుంది. రాధా, గోపికలు, మీరా, గోదాదేవి, తరిగొండ వెంకమాంబ మొదలైన భక్తురాండ్రు ఈ రకమైన మధురభక్తి ద్వారానే పరమాత్మను చేరుకున్నారు. ఈ శృంగార సంకీర్తనల్లో కనిపించే దివ్య నాయికా నాయకుల ప్రణయం, విరహం, లాలన, చెలికత్తెల హితవు, ఐక్యత మొదలైన అవస్థలన్నీ లౌకిక నాయికా నాయకుల ధర్మాలను పోలినట్లే ఉంటాయి. ప్రజా మనస్తత్వం బాగా ఆకళింపు చేసుకున్న అన్నమయ్య వలె తిరుమలయ్యకూడా శృంగార విషయాల ద్వారా ప్రజలను ఆకర్షించి చివరికి వారి మనస్సులను పరమాత్మ వైపు త్రిప్పడానికే ఈ విధమైన సంకీర్తనలను రచించాడని చెప్పవచ్చు.

విష్ణుమూర్తి లక్ష్మీదేవిని వక్షస్థలంలో దాచుకోవడానికి, గజేంద్రుని రక్షించడానికి, శంఖ చక్రాలను ధరించడానికి, పద్మాన్ని నాభియందు కలిగి వుండటానికి, శ్యామవర్ణం కలిగి వుండటానికి, వేంకటాచలానికి అధిపతి కావడానికి వాస్తవ కారణాలు లోక కళ్యాణం, భక్త రక్షణ అయినా పెదతిరుమలయ్య వాటిని కారణాలుగా కాక ఆ

స్వామికి తన సతిపై వున్న ప్రేమే కారణం అని చమత్కరించి వర్ణించాడు.

ఎటువంటి మోహమో యింతి నీపై నతనికి
తటు తన నురమున ధరియించె నిన్నును ॥

నెలత నీ నిలయము నీరజమనుచుఁ బ్రియ
మలరి జలజనాభుఁ డాయనతఁడు
కలిగి నీ గళము శంఖముఁ బోలునని తాఁ
దలఁచి పాంచ జన్య ధరుఁడాయ నతఁడు ॥

నిరతి నలమేల్మంగ నీ కురులు నలుపని
అరుదార నీలవర్ణుఁడాయ నతఁడు
గిరి కుచవని నిన్నుఁ గెరలి కౌఁగిటఁ గూడె
పరగ శ్రీ వేంకటపతియాయ నతఁడు ॥ (23-1)

శ్రీనివాసునికి తనపతిపై వున్న అపారమైన ప్రేమ వల్లనే ఆమెను వక్షస్థలంలో నిక్షిప్తం చేసుకొన్నాడు. ఆమె నడకలు గజ గమనాలని ప్రీతితో గజేంద్రుని రక్షించాడు. మృదువైన ఆమె కటి స్థలం చక్రింలా గుండ్రంగా ఉండటం వల్ల చక్రాన్ని చేతితో నిలువు కున్నాడు. ఆమెకు నివాసం పద్మమని అతడు పద్మనాభు డయ్యాడు. ఆమె కంఠం శంఖాన్ని పోలిందని తాను పాంచజన్యాన్ని ధరించాడు. ఆమె కేశాలు నల్లగా వున్నాయని అతడు నీలవర్ణు డయ్యాడు. ఆమె కొండలను పోలిన కుచాలు కలిగివుందని అతడు వేంకటగిరిపై నెలకొని వున్నాడని పెదతిరుమలయ్య అవ్యాజ ప్రేమను వ్యక్తంచేశాడు. ఇలాంటి సంకీర్తనలను చదివినప్పుడు పాఠకుని మనస్సు భగవంతునిపై నిమగ్నం కావడమేకాక తన స్త్రీపట్ల కూడా తాను అంతటి ప్రగాఢ మైన ప్రేమ కలిగి వుండాలనే సదాలోచన కూడా కలుగుతుంది.

మానవుడు ఇలా ఇహపర సాధకుడు కావడమే శృంగార సంకీర్తనల రచనా ధ్యేయం.

ఇలాగే మరికొన్ని సంకీర్తనలను వ్యాఖ్యానించవచ్చు తాను చూపించిన ప్రేమానురాగాలను అపార్థం చేసుకొని వాటిని తప్పులుగా చిత్రించి అలిగికూర్చున్న నాయకునితో నాయిక నీవు అన్నిటిలోనూ నేర్పరివి. ఇది మాత్రం తెలుసుకోలేకపోతున్నావు. ఈమాట విన్నవారంతా నవ్వుతున్నారు. నేను నీ దగ్గరికి రావడమే తప్పుగా భావించి కాలు తగిలిందని కోపగించావు. ఇలా చేయడం పెద్దరికం కాదు. అందరిలోను చిన్నతనంగా వుంది. నీతో మాట్లాడటమే అపరాధంగా తలచి నన్ను తిట్టావని ఒట్టులు పెట్టావు. సహించుకొని గోప్యంగా ఉండకుండా నలుగురికీ చెప్పావు. మెల్లగా నవ్వడమే ఒక నెపంగా చేసి తాంబూలంపై నీటితుంపరపడిందని ఆవేశపడ్డావు. ఈ విధంగా ఎందుకు పంతగించుకుంటావు. అని తన దోషాలు తాను తెలుసుకునే విధంగా ప్రశ్నిస్తూ పతిధర్మాన్ని బోధించాడు.

ఇన్నిటా నేరుపరివి యిదెఱుఁగవయితి॥
విన్నవారెల్లా నవ్వేరు విడువ నీమాటా॥

దగ్గరి వచ్చినదే తప్పుసేసి నీపునాతో
తగ్గికాలు దాఁకెనంటా గడియించేవు
వెగ్గనక అడుగోనేవిదొక పెద్దరికమా
సిగ్గుపడకిందరిలో ఛీ ఛీ యీమాటా॥ (23-7)

"లోకోభిన్నరుచి:" అన్నట్లు లోకంలో మానవుల మనస్తత్వాలు ఒక్కొక్కరికి ఒక్కొక్క రీతిగా ఉంటాయి. అలాగే స్త్రీల మనస్తత్వాలు కూడా భిన్నంగా ఉంటాయి. కొంతమంది స్త్రీలు పతుల దోషాలను ఎత్తిచూపి సవరించుకోమనిచెబుతారు. కొంతమంది స్త్రీలు మంచి చెడులను విచారించక అన్నింటిలోను వినయ విధేయ

తలతో ప్రవర్తిస్తారు. లాలనగా మాట్లాడుతూ ప్రశంసిస్తుంటారు. ఈ రకపు స్త్రీ ధర్మాలు కూడా పెదతిరుమలయ్య సంకీర్తనలలో కనిపిస్తాయి.

వలవవేరుతుఁగాని వాదించనేరరా
మెలఁగి నీ వెట్టుండినా మెచ్చకుండలేనురా॥

బిగిసినీవు రాకున్నా పిలువనేర్తుఁగాని
తెగినీతో నలిగి సాదించనేరరా
వొగి నిన్నుఁగానకున్నా వుసురననేర్తుఁగాని
వెగటై యెందుంటివని వెంగమాడనేరరా॥ (23-61)

అనే సంకీర్తనలో ఒక నాయిక నాయకునితో-నిన్ను ప్రేమించడం నేర్చాను కానీ, నీతో వాదించడం నేర్వను. నీవు ఎలావున్నా నిన్ను మెచ్చుకోకుండా వుండలేను. నీవు బిగువుతో నా దగ్గరకు రాకున్నా పిలవడానికి ప్రయత్నిస్తాను కానీ నీపై అలిగి నిన్ను సాధించనేర్వను. నీవు కనిపించకపోతే ఉస్సురంటూ దిగులు పడతాను కానీ ఎక్కడున్నావని విసుగుతో వ్యంగ్యంగా మాట్లాడనేర్వను. ఒకప్పటి నీ మాటలు తలచుకొని నవ్వుకోనడానికి ప్రయత్నిస్తాను కానీ నీతో సంబంధం వదలుకోలేను. నీవు నాపై చేయివేస్తే సిగ్గుపడతాను కానీ ముఖం చాటు వేయడానికి నేర్వను. నీవు నన్ను అన్నిఁటిలోను వ్రారడించావు. నిన్ను వదలి వుండలేను అని తన అనంతమైన ప్రేమను సామ్యంగా వ్యక్తం చేయడం తిరుమలయ్య రసార్ద్రంగా వ్యక్తం చేశాడు.

ప్రేయసీ ప్రియులమధ్యగానీ, స్నేహితుల మధ్యగానీ, భార్యాభర్తల మధ్యగానీ లేక నాయికా నాయకుల మధ్యగానీ చనువు వున్నప్పుడే ప్రేమ కొనసాగుతుంది. పంతాలు, పట్టింపులు ఉన్నప్పుడు పంతాలు, పట్టింపులు ఉన్నప్పుడు అనురాగం, ఆప్యాయత సన్నగిల్లు

తుంది. ఈ విషయాన్ని పెద తిరుమలయ్య నాయిక పాత్రద్వారా సూక్తుల రీతిలో వ్యక్తం చేశాడు.

అయ్యో యింకా నేలే అన్నియుఁగానవచ్చెను
నెయ్యములేని చోట నేరుపులు గలవా॥

వలపు గలుగుచోట వడిఁ గొసరుటగాక
చలము సాదించు చోట సలిగేఁటికే
పిలువనంపిన చోట బిగియవచ్చుగాక
వలసి నొల్లనిచోట వాసులెంచనేఁటికే॥ (23-28)

స్నేహం లేనిచోట చాకచక్యాలు పనికిరావు. ప్రేమవున్న చోట కసరి మాట్లాడవచ్చు కానీ పంతంవున్న చోట ఆప్యాయత అవసరంలేదు. తనను పిలవడానికి పంపినప్పుడు బిగుసుకోవచ్చు కానీ మెచ్చికలేనిచోట ఆధిక్యత చూపకూడదు. ఐక్యత వున్న చోట ఏమన్నా చెల్లుతుంది కానీ తప్పులు పట్టేచోట సాధించకూడదు. ఇద్దరిమధ్య రాకపోకలున్నప్పుడు ప్రణయం సిద్ధిస్తుందికానీ వ్యత్యాసాలుంటే సంబంధాలు పొసగవు నిర్మలమైన వ్యక్తితో ముచ్చటలాడవచ్చు కానీ దూషించే వ్యక్తితో అనుబంధం అక్కరలేదని, నాయికా నాయకులు తమ అభిప్రాయాలలో భేదసాదృశ్యాలున్నప్పుడు సంబంధం ఎలా పరిణమిస్తుందో తిరుమలయ్య సహజరమ్యంగా వివరించాడు.

నాయికా నాయకుల్లో రూపగుణాలు, శౌర్యవ్యక్తిత్వాలు ఎవరికి ఎక్కువగా ఉంటే వారికే లోకం ఆధిక్యత నిస్తుంది. అధికంగా గౌరవిస్తుంది. అలాగే తిరుమలయ్య తన శృంగార సంకీర్తనలలో కొన్నిచోట్ల నాయికకు ఆధిక్యత చూపి, చనువుతో జగత్పతి అయిన శ్రీనివాసుని కొంత తగ్గించి వర్ణించడం, చివరికి వారిద్దరు విడదీయరాని వెన్నెల చంద్రుడువలె ఒక్కరేనని సమైక్యపరచి చమత్కరించడం మనోహరంగావుంది.

ఈ పెత్తోడి సాటికి నీవేల పెనఁగేవు నేడు
మోపుదాఁకా గాజుగాజే మాణికము వేరే॥

అంటది గోపగించితే అంతానంతవలపే
తేటలు మగవానివి తేలిపొయ్యేవే
మేటి కస్తూరి నూరితే మిక్కిలి బరిమళించు
గాటాన బువ్వులు పిసుకఁగ బసురయ్యేదే॥ (22-21)

ఈమెతో సమానం కావడానికి నీవెందుకు పెనగులాడుతావు. గాజుగాజే అవుతుంది. మాణిక్యం మాణిక్యమే అవుతుంది. అవి రెండూ వేరువేరు అవుతాయిగానీ సమానం కావు. మంచి కస్తూరిని నూరితే అధికంగా సువాసనవచ్చినట్లు స్త్రీ కోపగిస్తే అంతకంతకు ప్రేమ ఎక్కువవుతుంది. పువ్వులను నలిపితే పసరు వచ్చేవిధంగా పురుషుని మాటలు తేలిపోతాయిగానీ ఇంపుగొల్పవు. బంగారు కరిగితే రంగు అధికమయ్యే విధంగా తరుణులు తిట్టితే తనువు పులకరిస్తుంది ఇత్తడి కరిగితే రంగు తగ్గేవిధంగా పురుషుని తిట్టుగాలికిపోయి వృథా అవుతుంది. మగవలు అలిగితే ప్రేమ అధికమవుతుంది. పురుషుడు అలిగితే అనురాగం తగ్గిపోతుంది. అని నాయికా నాయక ధర్మాలను వ్యక్తం చేశాడు.

ఈవిధంగా పెదతిరుమలయ్య నాయికా నాయకుల అఖండ ప్రేమను, నాయికా నాయకుల సహజధర్మాలను, సూక్తులను వ్యక్తం చేశాడు. వాటిలో ఎవరెవరి ధర్మాలను వారు పాటించడంలో ఉండే రామణీయకత ఆహ్లాదకరంగా సులభశైలిలో వర్ణించాడు.

కోస్తావాణి
2-8-1989.



సంకీర్తనా సాహిత్యపరిశోధనపై నాబాధ్యతను, బలాన్ని పెంపొందింపజేసి "సంకీర్తనాజ్యోతి" రచనకు శ్రీకారం చుట్టించిన ప్రతిస్పందన లేఖా సుమబాణాల్లో కొన్ని :

ఆరుద్ర (మద్రాసు) 24-6-1993

డా॥ లీలావతమ్మగారికి నమస్కారాలు.

మీరు దయతో పంపించిన పదకవితా వైజయంతి అనే మీ వ్యాస సంపుటి ప్రతి అందింది. ధన్యవాదాలు, సంప్రదాయాను సారంగా మనకు సప్తసముద్రాలే ఉన్నాయిగానీ అన్నమయ్య సంకీర్తనల సాహిత్యం అష్టమసముద్రం. అది అనుభవామృత సాగరం. అందులో ఈదులాడగలగడం ఒక అదృష్టం. మీరు పాఠకుల్ని అద్దాల జలాంతర్గామిలో కూర్చొబెట్టి వినోదయాత్రలో ఈవ్యాసాల ద్వారా తిప్పగలిగినందుకు సంతోషం. మీరు మీపోస్టు డాక్టరల్ వ్యాసంగంగా అన్నమయ్య పదప్రయోగ సూచికను చేపడితే బాగుం టుందని బావిస్తున్నాను. ఇది శ్రమతోకూడిన పనే అయినా ఈ శ్రమ నిష్ఫలమవ్వదు.

శుభాకాంక్షలతో

భవదీయుడు

ఆరుద్ర



పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డి 2-7-1993
జ్ఞానపీఠ్ పురస్కారగ్రహీత
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషాసాంస్కృతిక సలహాదారు
హైదరాబాదు

డా. శ్రీమతి లీలావతికి,

ఎంతో ఆప్యాయంగా మీరు పంపిన "పదకవితా వైజయంతి" అందింది. వివిధ సందర్భాల్లో రాసి పత్రికల్లో ప్రచురించిన పద సాహిత్య సంబంధి వ్యాసాలను ఒక సంపుటిగా కూర్చి ముద్రించినందుకు సంతోషం. అన్నమయ్య కృతులకు అంకితమైన మీరు అతని రచనలతో పాటు వివిధ పదకవుల కృతులను గురించి రచించిన వ్యాసాలను కూడా ఈ సంపుటిలో చేర్చడంవల్ల నిండుతనంవచ్చింది. మీ రచనాయాత్ర ఇలాగే నిరంతరం కొనసాగాలని ఆశిస్తున్నాను.

మీ
సినారె

---

ఆచార్య వి. రామచంద్రచౌదరి 1-8-1993
తెలుగుశాఖ, మద్రాసు విశ్వవిద్యాలయం

చి॥ పొన్నా లీలావతికి శుభాశీస్సులు.

మీరు అభిమానంతో పంపిన "పదకవితా వైజయంతి" అందుకొన్నాను. అన్నమాచార్యుల వ్యాసాలు ప్రాయశం, అంకిత బుద్ధితో మీరు చేసిన సమగ్రమైన కృషికి ఎత్తిన వైజయంతి అది. అందుకే మీ పుస్తకం పదకవితా వైజయంతి. మీకు నా హృదయపూర్వకమైన అభినందనలు.

శుభాకాంక్షలతో
వి, రామచంద్రచౌదరి

డా॥ ఆర్వీ యస్. సుందరం
తెలుగుశాఖ, ఐ.కె.ఎస్.
మైసూర్ విశ్వవిద్యాలయం
మానస గంగోత్రి, మైసూర్ – 570006

9-9-1993

డా. పొన్నా లీలావతిగారికి నమస్సులు.

మీ పుస్తకం గురించి మంచి అభిప్రాయాలు వస్తున్నందుకు సంతోషం. అన్నమయ్యను గురించి వైవిధ్యమయమైన సమాచారం అందించారు. అన్నమయ్య ఒక విజ్ఞాన సర్వస్వం. భాషాసాహిత్య సంగీతాల నిధి. ఆయనను గురించి ఎంత చెప్పినా ఇంకా చెప్పవలసి ఉంటుంది. మీరు ఆ పనికి చిత్తశుద్ధితో పూనుకున్నందుకు సంతోషం. సాహిత్యసేవకన్నా మనశ్శాంతి ఇచ్చే మరోమార్గం లేదు.

ఉంటాను
ఆర్వీయస్



ఆచార్య ఎన్. గోపి
తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు

15-6-1993

డా॥ పొన్నా లీలావతిగారికి నమస్కరించి

మీరిచ్చిన "పదకవితా వైజయంతి' చదివాను. అర్ధనూట వ్యాసాలతో అలరారే మీ వ్యాస సంపుటి వాసిలో రాసిలో గణనీయంగా ఉంది. అన్నమయ్యను మీరు అనేక కోణాల్లో అర్థం చేసుకున్న తీరు మీ కృషికి నిదర్శనంగా వుంది. మీ సాహితీ వ్యాసంగం మరింతలోతుగా, విస్తృతంగా సాగి సహృదయుల మన్నలుపొందాలని ఆకాంక్షిస్తూ

గోపి

డా. చిట్టిమల్లె శంకరయ్య (రుద్రశ్రీ)
తెలుగు శాఖ
ఎ. బి. వి. డిగ్రీ కళాశాల
జనగామ్ - 506 167
వరంగల్లు.

5-7-1993

సౌహార్ద్రిని, సౌజన్యమూర్తిని, సాహితీ బాంధవి డా. పి. లీలా వతమ్మగారికి ఎదలోతుల్లోనుండి సమర్పించే స్నేహాంజలి.

తాము పంపిన "పదకవితా వైజయంతి" అందింది. పన్నెండు సంవత్సరాల నిరంతర సాహితీకృషి, పట్టుదల, మీలోని పాండిత్యం ఈ గ్రంథంలో ద్యోతకమతోంది. ఇప్పుడే చదివిన ఫెమినిస్టుగా అన్నమయ్య, అన్నమయ్య సంకీర్తనల్లో అలరుల అభివర్ణన ఈ రెండు వ్యాసాలు చదివి ఎంతో ముగ్ధుడనయ్యాను. విషయ నవీనత, సరస మైన చక్కని శైలితో కూడిన ఈ గ్రంథం నిజంగా సరస్వతీదేవి కంఠంలో అలంకరించిన వైజయంతి. ఇంత ఉదాత్త వ్యాసగ్రంథాన్ని వ్రాసిన మీరు, అందులో పదకవితామూర్తిత్రయం వ్రాసిన పద కవితల గూర్చి మీరే వ్రాయగలిగారు.

50 వ్యాసాల బృహత్తర గ్రంథం (ఒక రచయిత వ్రాసింది) తెలుగు సాహిత్యచరిత్రలోనే ఇంతవరకు వెలువడలేదు. ఇంత చిన్న ప్రాయంలోనే ఎంతో ఉన్నత సాహిత్య కృషిచేసిన తాము ఎంతో అభినందనీయులు.

మీ ఈ బృహత్తర కృషివెనుక ఆ వేంకటేశ్వరుని, ఆస్వామికి పరమపావన భక్తుడైన అన్నమయ్య ఆశీస్సులు, వారి ప్రేరణలు న్నాయి. ఇది ముమ్మాటికీ నిజం, ఇంకా ఈలాంటి సాహిత్య కృషి భవితవ్యంలో ఎంతో చేస్తారని విశ్వసిస్తున్నాను. చేస్తారుకూడాను.

భవదీయ
రుద్రశ్రీ

10-7-1993

డా. పి. వి. నారాయణ
ఎం.ఎ.బి.ఇడి. పిహెచ్.డి
లెక్చరర్, తెలుగుశాఖ,
ఎస్.ఎస్.ఎన్. కళాశాల
నరసరావుపేట - 522 601
గుంటూరు జిల్లా

సాహితీ సోదరీమణి, శ్రీరామపదభక్తురాలు డా. పొన్నా లీలావతమ్మ గారికి అభినందనలు, మీ 'పదకవితా వైజయంతి మా యింట అడుగుపెట్టింది. మా సోదరి రెండవ సాహితీపుష్పం సరస్వతి దేవి కంఠాన్ని అలంకరింపజేసినందులకు సంతోషం. మీ కమనీయ కంఠంలో అన్నమయ్య పదాలు అమృతపు జల్లు కురిపిస్తుంటాయి. మా దృశులకు మరపురాకుండా చేస్తుంటాయి.

ఇట్లు
సాహితీ సోదరుడు
పి. వి. నారాయణ

---

9-3-92

డా. శ్రీమతి వాసా ప్రభావతి
లెక్చరర్, రచయిత్రి
హైదరాబాద్

సాహితీ మిత్రురాలు, సహృదయిని డా. పొన్నా లీలావతికి ఆశీస్సులు, అభినందనలు

ఆత్మీయతను అక్షరాల్లో పేర్చి రాసిన మీ లేఖ అందింది. మీ గ్రంథం చదవడం మొదలుపెట్టాను. ఎంతో హృద్యంగా ఉత్తమ సాహిత్యవాసనలతో గుబాళిస్తోన్న మీ గ్రంథం చదివాను అనడం కన్నా చదివించిందని చెప్పాలి. అన్నమయ్య అంతరాత్మ ప్రతి పేజీలోను తొంగిచూస్తోంది. అందుకే నా అభినందనలు.

సోదరి "ప్రభావతి".

ఆచార్య ఎల్. బి. శంకరరావు 6-12-95
తెలుగు శాఖ
మద్రాస్ ప్రెసిడెన్సీ కళాశాల

ప్రియమైన శ్రీమతి పొన్నా లీలావతికి దీవించి వ్రాయునది.

ఇప్పుడున్న స్త్రీలలో సాహిత్యానికి సంబంధించినంతవరకు అందులోను అన్నమయ్యపై నీవు సాధించింది చాలా ఎక్కువ. అన్నమయ్యపై నీకు గురి ఎక్కువగా ఉన్నట్లే అన్నమయ్యపై నీ పరిశోధనకూడా ఎక్కువ. ఇలాగే మీ కృషి కొనసాగాలని ఆశిస్తూ

ఇట్లు
శంకరరావు

---

డా. గుమ్మా సాంబశివరావు, ఎం.ఏ.,పి హెచ్.డి 11-12-1995
లెక్చరర్, తెలుగు శాఖ, ఆంధ్రలయోలా కళాశాల
విజయవాడ-520 008

సాహితీ బంధువులు, సాహిత్య సింధువులు డాక్టర్ పొన్నా లీలావతిగారికి నమస్సులు. మీరు పంపిన పుస్తకాలను అందు కొన్నాను. విరామాన్ని పాటించకుండా రచనలు సాగించే మీ దీక్షకు అభినందనలు. మీ కలం నుంచి మరెన్నో రచనలు వెలువడాలని, అందుకు ఆ ఏడుకొండల వేంకటనాథుడు మీకు అన్ని వేళలా అండగా ఉండాలని ఆకాంక్షిస్తూ—

తే. 'నూతనాంగ్ల వత్సరము వినూత్న రీతి
శక్తి నివ్వంగ గ్రంథాలు చాల వ్రాసి
సాగు మికమీద సాహిత్యజగతి; యశమె
ధనముగా నిల్వ లీలావతమ్మగారు'

ఇట్లు
గుమ్మా సాంబశివరావు

డా. శ్రీమతి శారద
లెక్చరర్, తెలుగు శాఖ
వి.ఎస్.ఆర్., ఎన్.వి.ఆర్. కళాశాల
తెనాలి, గుంటూరు జిల్లా

13-11-1993

ప్రియమైన సోదరి లీలావతికి శుభాకాంక్షలు.

మీ పుస్తకం చూచి చాలాచాలా ఆనందం కలిగింది. ఇంత వర్తు మీలో వుందని నాకు తెలుసు. అందుకే పూర్వపు ఫుత్తరాల్లో మీకు నేను రాశాను గుర్తుందా! మీరు చాలాచాలా సాధించాలి. వర్కు మొదలుపెట్టమని చెప్పానుకదా. ఇప్పుడు శ్రీరామచంద్ర మూర్తి కంకితమైన మీ పదకవితా వైజయంతి చేతుల్లో వుంది మీ పుత్రికను ఎత్తుకున్నట్లుగా వుంది.

పుస్తకం అందంగా ముద్రించారు. అభినందన మాలలు పెద్ద లందించారు కదా. త్వరత్వరగా మీ పుస్తకాలన్నీ వెలుగులోకి రావాలి.

అన్నమయ్య పరిచయం మీతోనే రాజమండ్రిలో ప్రారంభ మయింది. మీరు సంకీర్తనలు పాడి వినిపించిన తరువాత అన్నమయ్య కీర్తనలమీద ఆసక్తి కలిగింది. వైజయంతిలోని వ్యాసాలన్నీ అన్న మయ్యను అర్థంచేసుకోవడానికి దోహదపడే రచనలు. 'వైజయంతి' అని పేరుపెట్టడంలో మీ కాంక్ష భక్తి భావగోచరం. మనసారా భగ వంతుని నమ్మిన మీరె శ్రీనివాసుని మెడలో వైజయంతిలా కీర్తి ప్రతిష్ఠలతో ప్రకాశించగలరని, ప్రకాశిస్తారనీ నా ఆకాంక్ష.

అన్నమాచార్యుల పదాల్లోని వైశిష్ట్యం వ్యాసాలమాలకంగా సుబోధకం చేశారు. అన్నమయ్య కీర్తనలు సంగీతజ్ఞులు పాడుకునేవిగా తెలుస్తాయి కానీ ఆ కీర్తనల్లో సమస్త సాహిత్య ప్రక్రియలు దాగి

వున్నట్లుగ మీ వ్యాసాలు స్పష్టం చేశాయి. ప్రజా కవిగ అన్నమయ్య వేమనసరసన నిలబడటం, వేమనవలె చిన్న చిన్న పదాలతో, సామెతతో ఉదాహరణగా చెప్పటం, అన్నమయ్యలోకజ్ఞతకు నిదర్శనం. భక్తి తత్వాన్ని పరమార్థంగాభావిస్తూనే మానవతావాదాన్ని ఎలుగెత్తి చాటాడు. మార్గం మానవత్వం. గమ్యం భక్తి.

అన్నమయ్య భక్తిపదాల్లో పలురకాల వృత్తులవారిని పేర్కొవడం, గొబ్బి, ఏల, సువ్వి వంటి వివిధ జానపదగేయ రకాల వస్తువైవిధ్యంతో వ్రాయడం అన్నమయ్య ప్రత్యేకతగా తోస్తుంది.

చదువువల్ల కలిగే ఫలం సంశయమని, గుడ్డికుక్క సంతకుపోతే దెబ్బలుతప్ప దానికేమీ దొరకదని, ఇప్పటి చదువులు నాస్తికవాదానికి దారి చూపుతున్నాయని అన్నమయ్యబాధపడ్డాడు. వైద్యవృత్తి గూర్చి వివరిస్తూ శ్రీహరిపాదతీర్థమే చెడనిమందు అంటూ మోక్షం మార్గం సూచించాడు. అన్నమయ్య జాతీయాలు అందంగా వున్నాయి.

ఏటిలో పైరు - చాలా ప్రత్యేకంగావుంది
చీకటి దవ్వుకోను — కొత్తగా బాగుంది
కంచము కాలదన్ను - బుద్ధి చెప్పినట్లుగావుంది
పక్కెములో కూడు - కరతలామలకం

సామెతల్లో కొన్ని ప్రత్యేక ప్రయోగాలు బాగున్నాయి.

నీరువట్టుగొన్న వేళ నేయిమందుగాదెవుడు
మానీ పండ్లు మరి మానుకిందనే వుండు
ఎంగిలిబూరె కడుగనేల. ఏటి వంకలు దిద్దవసమా

మొదలైనవి బాగా నచ్చాయి. అలాగే దశావతారవర్ణన పదం జ్యోతిష శాస్త్రంలో చెప్పబడిన రాశుల వర్ణన అన్నమయ్య ప్రత్యేకతగా గోచరిస్తుంది. అన్నమయ్యనేకాకుండా మిగిలిన పదకవితా వాగ్గేయకారులను, త్యాగరాజు జయదేవులను పరిచయం చేయడంవల్ల ఈ వ్యాస పరంపర కొంతమందిని పరిచయం చేసే పీఠికలుగా ప్రకాశిస్తున్నాయి. అన్నమయ్య కీర్తనలతో మీకున్న అనుబంధాన్ని వ్యాసరూపంగా చెప్పడం బాగుంది. అన్నమయ్య కీర్తనలు అంటేనే పొన్నాల లీలావతి అన్న కీర్తి మీకు లభిస్తుందనడంలో అతిశయోక్తి లేదు, మీ పాటలు కూడా క్యాసెట్లుగా త్వరలో వచ్చేలా చూడండి. ఆ వేంకటేశ్వరుడు సదా మీ యందుండి మిమ్మల్ని నడిపిస్తాడు. మీ తరువాతి రచన కోసం ఆతృతగా ఎదురు చూస్తాను. మీ స్నేహభావాన్ని పదిలంగా మనసులో దాచుకుంటాను. మరీ ఎక్కువ శ్రమపడి అలసిపోవద్దు. చెల్లాయిలు మీకు సంపూర్ణ సహకారం అందిస్తున్నందుకు వారికి నా శుభాశీస్సులు.

ఎల్లప్పుడూ మా సోదరి ఇంకా ఇంకా మంచి రచనలు చేయాలని సాహితీ వైజయంతియై ఎనలేని కీర్తి ప్రతిష్ఠలు ఆర్జించాలని ఆ భగవంతుని ప్రార్థిస్తూ

సదా మీ శ్రేయోభిలాషి
ప్రేమతో
అక్క - "శారద"





కవయిత్రి : డా॥ పొన్నా లీలావతి

...నం : అగస్త్యుని ఆవిర్భవించిన తిరుపతి సమీప
పానకం గ్రామం.

...లు : శ్రీమతి అనసూయ, శ్రీ పొన్నా వేంకటరాయులు

...డు : స్థానిక సహజ సంగీత సాహిత్య నాటక కళావేత్త
శ్రీ పొన్నా కోదండరామ.

...లు : కృష్ణమూర్తి, పార్వతి, భారతి, వనజ [వాణి], కరుణ

...సం : తిరుచానూరు, తిరుపతి.

...త్తి : లెక్చరర్, దేశిసాహిత్యశాఖ, తెలుగు విశ్వ
విద్యాలయం, రాజమండ్రి ప్రాంగణం,
బొమ్మూరు - 533 124.

...త్తి : సత్సాహిత్య, సజ్జన సాంగత్యాలు.

...థాలు : అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయఫణితులు
- 1986.

పద కవితా వైజయంతి - 1993.
అన్నమయ్య శృంగార సంకీర్తనల్లో స్త్రీ ధర్మాలు
- 1994.

కరుణ కమలం - 1996.

# సంకీర్తనా జ్యోతి

డా॥ లీలావతి "అన్నమయ్య సర్వస్వం" అనదగిన ఈ గ్రంథాన్ని ప్రచురించినందుకు అభినందనయోగ్య.

— ఆచార్య నాయని కృష్ణకుమారి.

లోగడ అన్నమాచార్యులను గురించి, వివిధ సంకీర్తనాచార్యులను గురించి పరిశోధనచేసి చక్కని గ్రంథాలు రచించిన డా॥ పొన్నా లీలావతి వెలిగించిన సంకీర్తనాజ్యోతి ఇది.

— ఆచార్య సి. నారాయణ రెడ్డి.

డా॥ లీలావతి సిద్ధాంత గ్రంథ రచనలో పరిశోధన ఆగకుండా అన్నమయ్యను మరవకుండా "పదకవితా వైజయంతి" ని ప్రచురించి, అన్నమయ్య సంకీర్తనలకు అశేషమైన సేవచేసింది. ఇప్పుడు ఈ "సంకీర్తనా జ్యోతి"ని వెలిగించి ఆంధ్ర సాహిత్య లోకానికి అందిస్తోంది.

— ఆచార్య ఎల్. బి. శంకరరావు.

కడలేని కడలినుండి వ్యాసాల పాత్రలలో ఎంతగానో శ్రమపడి తాళ్ళపాక సంకీర్తనా సాహిత్య మాధుర్యాన్ని మన కందించారు మన లీలావతిగారు. ఇది ప్రశంసనీయ సాహితీసేవ. సంకీర్తనాజ్యోతి ఒక అవిస్మరణీయ సాహితీ నీరాజనం.

— శ్రీ సన్నిధానం నరసింహశర్మ

